# ఆంధ్రవేదకృతి.

ఆంధ్రదేశమునకును, ఆంధ్రభాషకును, ఆంధ్రులకును, ఆంధ్రపరిచితులకును, స్వభాష, పరభాషలు నేర్చినను, నేర్చుకొన్నను సర్వులకును, సర్వులలో లీనమైన సర్వేశ్వరునకును, సర్వజ్ఞానప్రబోధకరమగు ఈ **ఆంధ్రవేదములను** భక్తిపురస్సరముగా సమర్పణ మొనర్చుచున్నాము.

* * *

# కృష్ణయజుర్వేదకృతి.

తమ యిష్టదైవమగు బాలకోటీశ్వరస్వామిప్రీత్యర్థము "కృష్ణయజుర్వేద" ప్రచురణకై ఇరువదియైదు వందల రూప్యములర్పించుచున్న గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, గోవాడగ్రామకాపురస్థులును, సంపన్నగృహస్థులును, దానపరులునగు శ్రీయుత ఆలపాటి దేవయ్యగారికి కృష్ణయజుర్వేదముకృతినిచ్చుచున్నాము.

* * *

# మాలవీయాజీ మహదాశీర్వచనము

"వేదవేదాంగములను, ఉపనిషత్తులను ఆంధ్రభాషలోనికి అనువదించి ప్రకటించుటకు తాము చేయుకృషి ఎంతయు ఎన్నదగియున్నది. పరమేశ్వరుడు ఈ కార్యమునందు తమకు సాఫల్యము ప్రసాదించుగాక !"

భవదీయ,

(సం.) మదనమోహన మాలవీయ

౨౫—౮—౪౦

# పీ ఠి క

—*0*—

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదమునని నాల్గువేదములు. ఇవి భారతదేశమునఁగల సమస్తవాఙ్మయములోను మొట్టమొదటివి. వేదమునకుఁ బూర్వముండిన గ్రంథమేదియు లేదు. ఈ వేదములన్నియు గీర్వాణభాషలోనేయున్నవి. గీర్వాణభాషయనగా ప్రాచీనసంస్కృతమే. పాణిని మొదలయిన వ్యాకరణకర్తలు సంస్కరించినందున గీర్వాణభాషయే సంస్కృతభాషయనఁబడుచున్నది. ఇప్పటి సంస్కృతభాషచదువుకొన్నవారికి వేదభాష యర్థముకాదు. వేదమునకు నిప్పటి సంస్కృతభాషలో భాష్యములు వ్రాయఁబడియున్నవి. వాటినిజూచి యర్థముజేసి కొనవలసియున్నది. అందు విద్యారణ్యభాష్యము విపులముగాఁగలదు. దానిం బట్టియే వేదమునకుఁ దెనుగు వ్రాయఁబడుచున్నది.

భారతీయుల ప్రాచీనములయిన యాచారములు, అప్పటిదేశ పరిస్థితులు, వారియాధ్యాత్మికదృష్టి, మొదలగు విషయములు తెలిసికొనుటకు వేదార్థము తెలియుట ఆవసరము. పురాణములు చాలవరకుఁ దెనుగులయినవి. తెనుఁగువారు ఈ తెనుఁగు పురాణములలోని కథావిషయములు ఏ వేదమునుండి యే కథలెట్టి మార్పుతో వచ్చినవో యెందుకట్టి మార్పు చేసిరో విమర్శించుటకుఁగూడఁ దెనుఁగు వేదముపయోగించును.

ఋగ్యజుస్సామ వేదముల తెనుఁగు వ్రాత పూర్తియయినది. అచ్చులో రెండు సంపుటములు అయినవి. నాలుగువేదముల మంత్రభాగము అచ్చులోఁబడేను సంపుటములు కావచ్చును.

యజుర్వేదము మొదటిసంపుటము ఇప్పుడచ్చయినది. ఇది యారుసంపుటములు కావచ్చును. కృష్ణయజుర్వేదము నాల్గుసంపుటములు, శుక్లయజుర్వేదము రెండుసంపుటములు కావచ్చును.

వేదములలో మంత్రభాగములు వేరు. బ్రాహ్మణభాగములు వేరు. నాల్గు వేదమంత్రభాగములకు నాలుగు బ్రాహ్మణభాగములు వేఱువేఱుగలవు. మంత్రములే యిపుడు దెనిగింపఁబడినవి. మున్ముందు బ్రాహ్మణములుగూడ దెనిగింపఁబడును.

ప్రస్తుతయజుర్వేదమంత్రభాగమున బ్రాహ్మణము కలిసిపోయినది. తక్కిన వేదమంత్రభాగమున నిట్లు బ్రాహ్మణముకలియలేదు. బ్రాహ్మణము కలియని యజుర్వేదమంత్రపాఠము సత్యాషాఢశాఖవారి మంత్రపాఠమునుబట్టి తెలిసికొన వచ్చును. బ్రాహ్మణముతో కలిసిన యజుర్వేదపాఠమునకు సర్వత్రా లోకమున వ్యవహారముగలుగుటకుఁగారణముకూడఁగలదు. ఈదిగువవివరింపఁబడును.

యజుశ్శబ్దము యజధాతువునుండి పుట్టినది. యజ=దేవతలనారాధించుట. "యజుర్యజనా"త్తని విద్యారణ్యవాక్యము. అనఁగాయాగము నెరవేర్చునదియజుర్వేదమని తాత్పర్యము. ఇందలియాగము కేవలకర్మకలాపమే యనవలెను. తంత్రశాస్త్రమున అంతర్యాగమని బహిర్యాగమని ఉపపదముతో యాగశబ్దముపయోగింపఁబడి మానసిక వ్యాపారమునకుఁ, బూజాదిబహిర్వ్యాపారమునకును వేఱ్వేఱుక్రమముగా బ్రయోగముగలదు.

నిరుపపదకమయిన "యాగ" శబ్దమునకు కర్మయే యర్థము మానసికవ్యాపారమునకు జపమని, వాగ్వ్యాపారమునకు స్తుతియని వేఱునామములు కలవు. శ్రౌతకర్మలకు యాగమన్నశబ్దముతప్ప నింకొకటిలేదు. కావున యాగశబ్దమునకు శాలానిర్మాణాది అవభృథస్నానాన్త కర్మకలాపమె యర్థము. కావలను. కనుక యజనము వల్లనే యజుర్వేదనామము వచ్చెననుట సిద్ధము.

యజ్ఞములో ఋగ్వేద సామవేద మంత్రములు స్తుతిపాఠము గానము చేయుదురు. యజుర్వేదమునఁగల మంత్రములొక్కొక్క యాగమునకుఁ బ్రత్యేకముగా సమర్పఁబడిన పాఠముతోనున్నవి. ఆ మంత్రములచోటనే బ్రాహ్మణము కలిపి కర్మవిధులు కూర్పఁబడినవి. ఏ యాగమును కాని చేయించువాఁడు అధ్వర్యుఁడు. ఋగ్వేదమంత్రములతోఁ గర్మనడిపించువాఁడు హోతయనఁబడును. సామమంత్రగానము

చేయువాఁడు ఉద్గాతయనఁ బడును. వీరుకాక ఋత్విజులు మఱికొందఱు గలరు. యజ్ఞమందంతటి కర్మలను సరిగా సవరించుకొనుచు నడిపించువాఁడధ్వర్యుఁడే. అధ్వర్యుఁడు యజుర్వేదమును పాఠము చేయును. అధ్వర్యు వేదమనియు యజుర్వేదమునకుఁ బేరు. యాగమునడిపించు బాధ్యత యధ్వర్యునిది కనుకనే యాగముల విభాగముతో నాయాకర్మల విధులంజెప్పు బ్రాహ్మణభాగముతో మంత్రములంగూర్చినందున యజుర్వేదమంత్రభాగమున బ్రాహ్మణముకలసినపాఠము వచ్చుటకుఁగారణమనవలెను. బ్రాహ్మణమెట్టిదో తెలియుటకుదాహరణము లీదిగువఁజూపఁబడెను. మంత్రములో సూచించినకర్మను బోధించువాక్యగ్రంథమునకు బ్రాహ్మణమనిపేరు. ఉదా॥ "వాయవ్యం శ్వేతమాలభేత" = తెల్లనిపశువును వాయుదేవతకు ఆలంభనము చేయవలెను అన్నది విధివాక్యము. నిషేధవాక్యములుకూడ బ్రాహ్మణములోఁగలవు. "తస్మాన్మలవద్వాస సానసంవదేత నసహాసీత" = ముట్టుదానితోఁ మాటలాడరాదు, కలిసికూర్చొనరాదు. అన్నలాఁటివి నిషేధవాక్యములు. విధినిషేధవాక్యములున్నవి బ్రాహ్మణములన్నందుకుఁ బ్రమాణము "సర్వవేదగతాని బ్రాహ్మణానిస్వాభిహితేzర్థేదార్ఢ్యాయ ఋచమేవోదాహరన్తి" అని విద్యారణ్యభాష్యము. దాని యర్థము —మంత్రముల మొదళ్లుతీసికొని ఆ మంత్రములలోసూచించిన కర్మలను దార్ఢ్యముకొఱకు స్పష్టపరచువాక్యములు గలవి బ్రాహ్మణములుఅని, కనుకనే బ్రాహ్మణములకు వాక్యగ్రంథమనికూడ వ్యవహారముకలదు.

ఇట్టివి యజుర్వేదమంత్రభాగముననే కలవు. ఇతరవేదముల మంత్రభాగమున లేవు. యజుర్వేదమందు యాగక్రమమునఁ గర్మలవరుస, కర్మలవరుసననుసరించి మంత్రములవరుసయు నేర్పరుపఁబడినవి.

మంత్రభాగమునకు సంహితయనికూడ నామము. బ్రాహ్మణముకలిసిన యజుర్వేదమంత్రభాగమునకే న్యాయముగా సంహితయను నామము చెల్లును. ఋక్సామాథర్వమంత్రభాగములకు సంహితయను పేరు చెల్లదు. కాని ఋక్సంహిత; సామసంహితయని వాడుక మాత్రము లేకపోలేదు. కాని అదియజుస్సంహిత యొక్క వాడుకనుబట్టి వచ్చియుండును. సంహిత= సంధించఁబడినదియని యర్థము.

సం + ధా + త=సంహిత=కూర్పు॥ ఇదివరకు రెండు వేర్వేరువస్తువులుండి యా రెంటిని గూర్చినప్పుడే సంధానమనమని యాకూర్పునకుఁ బేరు. బ్రాహ్మణములు వేరుగా నున్నవి. మంత్రములు వేరుగానున్నవి. యజుర్వేదమంత్రభాగమున బ్రాహ్మణము కూడ సమకూర్పఁబడుటచేత సంహితయనుపేరు తగియున్నది. ఇతరవేదమంత్ర భాగములకా పేరువాడుటభ్రాంతిమూలకమని నాయభిప్రాయము.

బ్రాహ్మణమెట్టిదో మంత్రమెట్టిదో యెట్లు రెండునుకలిసినవో యన్నందు కుదాహరణము —

(క) అ॰ ప్రపాఠె అను॰ “ఉదుత్యంజాతవేదసం” సప్తత్వాహారితః; చిత్రం దేవానాముదగాదనీకమితి పిండాన్ప్రయచ్ఛతి॥ అనియజుర్వేద సంహిత. ఇదియు నింక మీఁద నుదహరించినవికూడ యజుస్సంహితలోనివేయని యెఱుంగనగును.

ఇందులో ఉదుత్యం, అన్నది యొకమంత్రమునకాది సప్తత్వాహారితం, అన్నది మఱొక మంత్రమునకాది. చిత్రందేవానా; మన్నది యింకొక మంత్రమునకాది. ప్రయచ్ఛతి = ఇవ్వవలెను అనికర్మవిధి యున్నది. ఈ మంత్రములు పూర్తిగాఁ బ్రథమాష్టకమున యజుస్సంహితలోనే వేఱుచోట్లఁగలవు. కర్మసంపుటితో మఱొక చోటనుంగలవు. ఇందుమంత్రముల మొదళ్లుమాత్రమేయుండి కర్మబోధింపఁ బడినది కనుకనిది బ్రాహ్మణభాగమని యెఱుంగనగును. ఇంకమీఁదనిచ్చు నుదాహరణములు వేదశైలి బోధించుటకును అందలి విషయ విమర్శనమునకు నుపయోగించును.

(ఖ) ఇంద్రోబలస్య బిలమపౌర్ణోత్స ఉత్తమః పశురాసీత్తం ... యః పశుకామస్స్యాత్స ఏతమైంద్ర మాలభేత” ౨వ అష్టకములోనేకలదు. =బలుఁడనురాక్షసుఁడు గుహలోఁ బశువులను దాఁచివేసినాఁడు. ఇంద్రుఁడు దానిమూఁతనూడగొట్టి యాపశువులను వెలువఱచెను. అందుత్తమ పశువుముందు నడచెను. దానివెనుక వేలకొలది పశువులు నడచినవి. అట్టియుత్తమ పశువును ఇంద్రునికొఱకాలంభనము చేయవలెను. యాగకర్తకుఁ బశుసమృద్ధికలుగును. ఇందుఁగూడ “ఆలభేత = ఆలంభనము చేయవలెను. అనికర్మవిధికలదు.

(గ) ౨అష్ట ౪ ప్రపా ౭అను "మారుతమసి మరుతామోజో పాంధారాంభిని" ఇత్యాది మంత్రము. అందులోనే ౭వ అనువాకములో మారుతమసి మరుతామోజ ఇతి కృష్ణం వాసః కృష్ణతూషం పరిధత్తే" ఇత్యాది కలదు. దానియర్థమిట్లు- నల్లని యంచుల నల్లవస్త్రమును యజమానుఁడు ఆమంత్రము జపించుచుఁ గప్పుకొనవలెను. అట్లుచేసినచో నల్లని మేఘములాకాశమునఁగప్పి వర్షముకురియును. అనికర్మయుఫల మునుజెప్పఁబడెను.

(ఘ) ౨అ. ౧ప్రపా ౭అనువాక- వషట్కారోవై గాయత్రియై శిరోఽచ్ఛినత్త స్యైరసః పరాపతత్తం బృహస్పతి రుపాగృహ్ణా త్సాశితిపృష్ఠావశా ఽభవద్యో ఇత్యాది = వషట్ అన్నపదము గాయత్రియొక్క శిరస్సును ఛేదించెను. అందునుండి రసముకారెను ఆ రసమును బృహస్పతి చేకొనెను. అదితెల్లని వీపుగల గొడ్డుటా వయ్యెను. రెండవమారు రసముకారెను. దానిని వరుణుఁడు పట్టెను. అది రెండు రంగుల యావయ్యెను. మూఁడవమారు రసముకారెను. దానిని విశ్వేదేవతలు గ్రహించిరి. అది అనేకరంగుల గోవయ్యెను. నాల్గవమారు రసముకారెను. ఆరసము భూమిమీఁదఁబడెను అది యాఁబోతయ్యెను. దానిని రుద్రుఁడు తన భోగమునకు (వాహనమేమో!) దీసికొనెను. బృహస్పతిదేవతకుఁ దెల్లని వీపుగల గోవును ఆలంభనము చేయువలెను. యాగకర్తకు బ్రహ్మవర్చస్సుకలుగును. ఇట్లే యితరదేవతల కితరపశువుల యాలంభనము ఫలము చెప్పఁబడెను. ఇట్టిదే బ్రాహ్మణము.

(జ) ౨అష్ట ౧ప్రపా ౪అను ౫పనస "వృత్రస్యశీర్ష్ణతో గావఉదాయన్ తావై దేహ్యోఽభవన్తా సాంవృష భోజఘనేఽనుదైత్ మిందోఽ చాయ"—— —— —— సఅగ్నేయం కృష్ణగ్రీవమాలభేత —— —— —— పాప్మానమపిదహాతి॥ = ఇంద్రుఁడు వృత్రుని శిరస్సును ఛేదించెను. ఆశిరస్సునుండి గోవులు బయలుదేరినవి. అవియనేక రంగులు గలవి. వాటివెనుకనొక వృషభము నడచెను. అగ్నిదేవతకొఱకు నల్లని మెడగల వృషభమును ఆలంభనముచేయువలెను. యాగకర్తకుఁ బాపము శాన్తించును. కర్మవిధి బ్రాహ్మణము.

(చ) ౨౫ ౧ప్రపా ౫అను —సువర్భానురాసురః సూర్యం తమసాఽఽవిధ్యత్తస్మై దేవాః ప్రాయశ్చిత్తిమైచ్ఛన్తస్య యత్ప్రథమం తమోఽపాఘ్నన్త్సా కృష్ణావిరభవత్ — తహార్యల్పా పృధివ్యాసీదజాతా ఓషధయస్తామవిం వశామాలభన్త తతో వా అప్రథత పృథివ్యజాయన్తౌషధయః —— వశామాదిత్యేభ్యః కామాయాఽఽలభేత॥ = సువర్భానుఁడను నసురుఁడు (రాహువని యర్ధము కలదు) సూర్యునావరించెను. చీఁకటితో సూర్యుఁడు కప్పఁబడెను. దేవతలాచీఁకటిని ఖండింపఁదలఁచిరి. మొదటి చీఁకటిని గొట్టఁగా దానినుండి నల్లగొఱ్ఱవచ్చెను. - అపుడు భూమి యల్పము నిస్సారము నై యుండెను. అగొఱ్ఱను వారు ఆలంభనము చేసిరి. ఓషధులు పుట్టెను. భూమి విస్తరించెను కనుక నాదిత్యులకొఱకు నల్లగొఱ్ఱె నాలంభనము చేయవలెను. అన్నికోర్కెలు ఫలించును- కర్మ; ఫలము; కలదు.

(ఛ) ౨౮ ౪ప్రపా ౧౨అను — హిరణ్యగర్భ; 1 ఉదుత్యం 2 చిత్రం సప్రత్నవన్నవీయసాగ్నేద్యుమ్నేనసంయతా — — ఆగ్నేయమష్టాకపాలం నిర్వపేత్సావిత్రం ద్వాదశకపాలం భూమ్యైచరుం, యః కామయేతహిరణ్యం విందేయహిరణ్యం మోపనమేదితి ॥ = మీఁదఁజెప్పినమంత్రాలతో చరువును (= ఒకవిధమయిసయన్నము) నిర్వాపము (=దేవతార్పణము) అగ్నిదేవతకొఱకుఁ జేయవలెను. అని హోమమునుజెప్పి బంగారముకావలెనన్న యాగకర్తకు బంగారము లభించునని ఫలము చెప్పఁబడెను. ఈకర్మ బంగారము దొంగలెత్తుకొనిపోయినప్పుడు కాని యెక్కడనోబంగారము పాఱవేసికొన్నప్పుడుకాని చేయవలసినదియని యెరుంగనగును.

విషయవిమర్శమునకును మున్ముందు కీయుదాహరణములు గుర్తించుకొననగును.

వేదోత్పత్తి:—

మంత్రభాగములే యన్నివేదములలోను బ్రహ్మవల్ల నుత్పన్నములైనవని, బ్రాహ్మణములు ఋషులు చేసినవని దయానంద సరస్వతిగారి మతము. బ్రాహ్మణ

మాకారణముచేత వేదమనఁబడదు. మంత్రమే వేదమని. వారిమతమునున్నందు విమర్శింతము. బ్రాహ్మమతమువారు మంత్రము, బ్రాహ్మణముగూడఁ బ్రమాణములుకావు ఉపనిషత్తే ప్రమాణమందురు. వైదికమతమున మూఁడును వేదమూలే.

ఐతరేయ బ్రాహ్మణమున "ఋగ్వేద ఏవాగ్నేరజాయత యజుర్వేదో వాయోస్సామవేద ఆదిత్యాత్" అని॥ మూఁడు వేదాలు వరుసగా నగ్ని వాయుసూర్యులవల్ల బుట్టినవనికలదు. విద్యారణ్యభాష్యమున "కాలాకాశాదివ దేవబ్రహ్మణస్సకాశా ద్వేదోత్పత్తి రామ్నాయతే" అనివ్రాయుచు "ఋచస్సామానిజజ్ఞిరే ఛందాగ్ంసి జజ్ఞిరేతస్మాత్" అన్నఋగ్వేద మంత్రమునుదాహరించిరి. కాలము ఆకాశము మొదలయిన నిత్యవస్తువులు సృజించినట్లే నిత్యమయిన వేదమును బ్రహ్మయే సృజించెనని విద్యారణ్యులవారి తాత్పర్యము.

అగ్న్యాదులవల్ల మూఁడు వేదములు పుట్టినవన్న ఐతరేయ బ్రాహ్మణమునకు బ్రహ్మవల్లఁ బుట్టెనన్న ఋగ్వేదమంత్రమునకుఁ బరస్పరవిరోధము కలదుగావున నేది ప్రమాణమని యందురేమో?

ప్రమాణ విచారమున తారతమ్యమటుంచి రెంటి తాత్పర్యమొకటే యగును అనవచ్చును. బ్రహ్మ వేదమునుత్పత్తి చేసి అగ్ని వాయ్వాదిత్యుల కుపదేశించెనని వారివల్ల లోకమున ఋషులకుఁ బ్రకటింపఁ బడెనని తాత్పర్యము చెప్పితే సమరసమగును. వేదసృష్టికిఁ గర్త బ్రహ్మయని, ప్రకటనకర్తలు అగ్న్యాదులని ఫలితాంశము.

అదిగాక "యుగాన్తేzంతర్హితాన్వేదాన్సేతిహాసాన్మహర్షయః లేభిరేతపసా పూర్వం అనుజ్ఞాతాస్స్వయంభువా" అని యితరసృష్టులలోగూడ నదివరకుఁ బ్రళయకాలములందు నంతరించిన వేదములను దపస్సువల్ల ఋషులు కనిపెట్టి లోకమునఁ బ్రకటించిరని కూడఁ బ్రమాణముకలదు ఆదిసృష్టిలో బ్రహ్మవేదమును సృజించెనని యితరసృష్టిలో దానినే తపస్సులో ఋషులు కనిపెట్టినారన్నందున వేదము నిత్యమే. వేదమునిత్యమన్నందుకుఁ బ్రమాణము. "వాచావిరూపనిత్యయా" అన్నశ్రుతికలదు.

వేదనిత్యత్వము సాధించుటకు వేదములో మంత్రమే ప్రమాణమెట్లు? ఆత్మాశ్రయదోషమువచ్చునని కొందఱాక్షేపింతురు. తనకాళ్లు భుజములమీద నుంచుకొని తానునడువలేనట్లు తననిత్యత్వమునుదాను (వేదము) నిరూపింపఁ జాలదని యుక్తిసిద్ధమాత్మాశ్రయదోషము.

దానిసమాధానము - ఆకాశాదిభూతములవలె వేదము సృజింపఁబడినదన్న విద్యారణ్యవాక్యమందు యుక్తికూడ సూచింపంబడినది ఆకాశశబ్దమువల్ల ధ్వనిసూచింపఁబడెను. ధ్వనిగుణముగాఁ గలదాకసము. "శబ్దగుణకమాకాశ"మ్మని న్యాయశాస్త్రము - వేదమన్నది పదముల సమూహమేకదా ! పదములంటే యక్షరముల మొత్తము అక్షరమన్నది ఆయాధ్వనులకు గుర్తులు. సృష్టిలోధ్వనిముందు బుట్టెనా? దానియాశ్రయమయిన యాకాశముముందుఁ బుట్టెనాయంటే చెప్పలేము. విత్తుముందా ? చెట్టుముందా? అంటేచెప్పలేనట్లే. వస్తువులు ముందుఁబుట్టినవి. వాటిపేర్లు తర్వాతవచ్చినవని యొకరన్నారు అదిసరియైన మాటకాదు. పనివాఁడు మొదట ఫలానా వస్తువును జేతునని సంకల్పించుకొనియే వస్తువును సృజించుట యనుభవసిద్ధము. కంచము చేతునను వాఁడు అందుకుఁ దగినసాధనముల సంగ్రహించుకొని వస్తువును జేయును. మంచము చేతుననిసంకల్పించుకొన్నవాఁడు దానికిఁదగిన పరికరములను సంగ్రహించుకొనును. "సఈక్షతలోకాన్నుసృజా ఇతి" = ఆబ్రహ్మ లోకములను సృజింతును అని మొదట సంకల్పించినతర్వాతనే లోకములను సృజించెనని శ్రుతిప్రమాణముకూడఁగలదు. లోకములని సృజ్యమాన వస్తువులకుఁబేరు. కనుక వస్తువు పేరు ముందు; వస్తువుతరువాత; వచ్చెననవలెను. పేరు అన్నది పదము పదమక్షరసమూహము- అక్షరము ధ్వనికి గుర్తు- ధ్వని ఆకాశగుణము. గుణము- వస్తువు నొకేమారువచ్చినవి. కనుకనాకాశాదివతు నిత్యధ్వనిరూపమయిన వేదవాక్కు ఆదిసృష్టిలోనిదేయని తాత్పర్యము.

వేదమంటే లక్షణము "అలౌకికోపాయ బోధకత్వం వేదత్వం" అన్నారు. లోక సామాన్యమునకుఁ దెలియని యుపాయములను వేదము చెప్పునని దాని తాత్పర్యము.

అప్రత్యక్షములైన స్వర్గాదిఫలముల కుపాయములగు కర్మలను వేదముబోధించుననియనుటవల్ల; నేకర్మలో నేమివిశేషమున్నదోయనియూహించుకొనవలసినదేకాని వస్తుగుణపరిశోధనమువల్లఁగాని యుక్తిచేతఁగాని మానవులకెఱుకపడని యుపాయము లే వేదమునఁగలవని యెఱుంగనగును.

వేదముయొక్క శైలి:—

తఱుచుగా వేదమునందు జెప్పఁదలఁచిన విషయమునకు మాఱుమాపిచ్చి (=విషయుని గరణముచేసి) వర్ణించుట దానిశైలి. కనుకనే వేద తాత్పర్యమును నిర్ణయించుట దుష్కరము. కనుకనే పూర్వ వ్యాఖ్యాతల ననుసరించియే తెలిగించితిమి. కాని యిదే దానియర్థమని మేము నిర్ణయింపలేదు. విమర్శపైని యింకొక తాత్పర్యమును దీనిలోఁ గనఁ బడవచ్చును. సకల వేదములు అవగతములు చేసికొన్న తర్వాతఁ బాఠకులలోని విమర్శకుశలులు తామే గ్రహింపఁ గలరు. మేమును గడపటి సంపుటమున మాతాత్పర్యము వెల్లడింతుము.

బ్రాహ్మణము కూడ వేదమగునా? కాదా? శ్రీదయానంద సరస్వతి గారు మంత్ర భాగమే వేదము, బ్రాహ్మణము వేద మనఁ బడదు, అనుచు- అందుకుఁ బ్రమాణములు మూఁడు చూపినారు. ౧ వ్యాకరణ భాష్యకారుఁడు వేదమునకుదాహరణము లిచ్చునపుడు, అగ్ని మీళే పురోహితం - ఇషేత్వోర్జేత్వా - అగ్న ఆయాహి - శన్నోదేవీర భీష్టయే- అని మంత్రభాగముల మొదళ్లే ఉదాహరించినారు కాని బ్రాహ్మణముల మొదళ్లుదాహరింప లేదు. బ్రాహ్మణములు కూడ వేద మయితే బ్రాహ్మణముల నుదాహరించి యుందురు. కనుక బ్రాహ్మణములు వేద మనఁ బడవు అని॥ ౨ న్యాయ భాష్య కారుఁడు బ్రాహ్మణ వాక్యములను లోక భాషోదాహరణముగా నిచ్చినాఁడు కాని వేది వాక్యముల క్రింద నుదాహరింపలేదనియు 3 వ్యాకరణ సూత్రకారుఁడు పాణిని- చతుర్థ్యర్థే బహుళం ఛందసి- అ ౨ పా3 సూ ౬౨ సూత్రములలోనికి "ద్వితీయా బ్రాహ్మణే" అ౨ పా3 సూ౬౦ లోనుండి, బ్రాహ్మణే, యన్న పదము అనువర్తించుచుండఁగా మఱల తర్వాతిసూత్రములో ఛందసి- అన్నపదమేల ప్రయోగింప వలెను. కనుక నాతని మతమున బ్రా

హ్మాణము ఛందస్సు కాదని దయానందులవారి విమర్శము. ఛందస్సని వేదమునకు బలుసార్లు పాణినీయములోఁ బ్రయోగములు కలవు. ఇందుఁ గడపటిదే దృఢమయిన యుక్తి. ౘ "పురాణ ప్రోక్తేషు బ్రాహ్మణ కల్పేషు" అ౩ పా సూ ౧౦౫ లో= పురాణ ఋషులచేఁ జెప్పఁబడిన పురాణ కల్పములందు॥ అని యీసూత్రార్థమును బట్టి బ్రాహ్మణములు ఋషులు రచించినవి కాని బ్రహ్మ చెప్పినవి కానందున వేదములు కానేరవని తా॥ అందుచే బ్రాహ్మణములు పౌరుషేయములని॥ ఈ విషయమున నాయభిప్రాయ మిట్లు:— బ్రాహ్మణములు మంత్రభాగమునకు వ్యాఖ్యానములని విద్యారణ్యుల వారి వ్రాతలో " సర్వవేదగతాని బ్రాహ్మణాని స్వాభిహితేzర్థే దార్ఢ్యాయ ఋచమేవోదాహరన్తి" అనుటచేత ; బ్రాహ్మణములు మంత్ర వ్యాఖ్యానము లనుట నిశ్చయమే.

కాని "మంత్ర బ్రాహ్మణ యోర్వేద నామ కత్వం" ఆని ఆపస్తంబ సూత్రకారుఁడు బ్రాహ్మణములను గూడ వేద మన్నాఁడు. వాడుకలోఁ గూడ వేదములనియే ప్రసిద్ధి గాఁగలదు. పాణిని యన్నట్లు బ్రాహ్మణము ఛందస్సు కాక పోనిండు. "ఋచమేవోదా హరన్తి"యని విద్యారణ్యులవారు అన్ని వేద మంత్రములకు ఋక్కు అన్న పేరు పెట్టి నందున బ్రాహ్మణములకు ఋక్కు లన్న పేరు లేకపోనిండు. బ్రాహ్మణమునకు వేద సంజ్ఞ వచ్చుటకు రాక పోవుటకును వేద పదము యొక్క యర్థము విమర్శింపవలసియున్నది.

వేదము— అన్న పదము విద—ధాతువునుండి పుట్టినది. విదజ్ఞానే అని పాణిని దానికి జ్ఞానమర్థము చెప్పినాఁడు. విదధాతువు ఇంకొకటి లాభార్థకము గలదు. కడపటి పక్షమున ఆఫలములకు అలౌకికోపాయలాభము వేదమువల్లనే కలుగునుగనుక వేదసంజ్ఞ రావచ్చునందును.

జ్ఞానమన్న మొదటిపక్షము సర్వసమ్మతము. మొదట బ్రహ్మవల్ల జ్ఞానరూపముగానే ఋషులకు వేదము గోచరించెనని ఋషులు తమభాషలో నాజ్ఞానమును లోకమునకుఁ బ్రకటించిరని యనవచ్చును. బ్రహ్మకు స్వంతభాషయొకటి లేదు. ఖురానులో మహమ్మదు ప్రవక్త (ఋషి) కూడఁ దనసమాధిలోఁ జెప్పినదే తాను

వ్రాయుచున్నానను. దనభాష యరబిక్కుగనుక ఖురాను అరబిగ్భాషలో వ్రాసినాఁడు. క్రీస్తుఋషి కూడ శబ్దమే దేవుఁడు అనితనభాషలో బైబిలు వ్రాసినాఁడు. అతనికిని దేవుఁడు జ్ఞానరూపమునఁ బ్రసాదించిన విషయమునే శిష్యులకు బోధించెను. కనుక ఋషి యేభాషవాఁడయితే ఆభాషలో వేదముండును. మనవేదఋషులు గీర్వాణభాషమాట్లాడువారు కనుక గీర్వాణభాషలో వేదమువచ్చినది. రానురాను ఆభాషమాఱి సంస్కృతభాషవచ్చి వేదభాష తెలియనికాలమున సంస్కృతములో దానియర్థము చెప్పవలసివచ్చెను. ఇపుడిదియు దూరమయినవారికి దేశభాషలోఁ బ్రకటింపఁబడుచున్నది. ఆంధ్రులకొఱకాంధ్రమున వేదము తర్జుమాచేయుచున్నాము.

ప్రకృతమనుసరింతము. భాషలువేఱయ్యును పదార్థము జ్ఞానరూపమే. అది యొకరీతిగానేయుండును. వృక్షము = చెట్టు = ట్రీ = పేడ్ = గాచ్ఛ్ ! ఇత్యాదిగాఁ బదములువేఱయ్యును పదార్థమొక్కటే. పదార్థము జ్ఞానరూపముగానే మనస్సున గోచరించును. తరువాత వస్తువు లోకమున గోచరించును. వస్తువే పదార్థముకాదా యందురేమో! వస్తువులు లోకమున ననంతములు అనఁగా- చెట్టు అన్న జ్ఞానమొకటే యయ్యును చెట్లు లోకములో ననేకములు. అనేకరూపములు. అనిత్యములును. శబ్దమును, అర్థమును నిత్యములు. పదములలోఁ బౌర్వాపర్యము (= ముందువెనుకలు) మారవచ్చునుగాని పదములోని యక్షరములు మారవు. కనుక పదము నిత్యము. దాని యర్థమును నిత్యము వాటిముందు వెనుకలు నిర్ధారింపఁజాలము. కనుక రెండును అనాదులే. నిత్యములు. ఇదియే శబ్దబ్రహ్మవాదము కూడను.

దీనింబట్టి బ్రాహ్మణములు ఛందస్సును, ఋక్కును గాకపోయినను వేదములని యేలపిలువఁబడవు ? అన్నవిషయము నిర్ధారించుటకు నావాదమిది.

బ్రాహ్మణములు తపస్సమాధిలో జ్ఞానరూపముగా గోచరింపలేదన్న నిర్ధారణ కుఁదగిన నిదర్శనములు లేవు. అదికాక కల్పసూత్రాదులకు వలెను గర్త ఫలానాయని వాటిలో నుల్లేఖము కానరాదు. కనుక పౌరుషేయమనుటకు సాధనము లేదు. జ్ఞానము బ్రహ్మస్వరూపముకనుక తద్రూపమున ఋషులకుఁ దపస్సులో గోచరించితే వేద

నామము చెల్లును. తపస్సులో గోచరింపక లౌకికజ్ఞానములో గోచరించి రచింపఁబడిన కల్పసూత్రాదులు పురాణములు, కావ్యములు పౌరుషేయములగును. పౌరుషేయములకు స్వతః ప్రామాణ్యము లేదు. బ్రాహ్మణము అపౌరుషేయము కావున స్వతః ప్రమాణమే.

అట్లుకాక బ్రాహ్మణము రచించినవారి పేరు పెట్టితే దానిగౌరవము పోవునని అపౌరుషేయ మనిపించు కొనవలెనని తలఁచి పూర్వఋషులు రచించి పేరుపెట్టక మోసము చేసినారందురేమో ? అట్లయినపుడు మంత్రభాగమయిన ఋక్సంహిత — యజుస్సంహిత - సామసంహిత అథర్వసంహితలు కూడనట్టివే యేలకారాదు ? బ్రహ్మవల్లనే సంహితలు వచ్చినట్లు ఇటీవలవారు పాణిని- న్యాయభాష్యకారులు- మహాభాష్యకారులు వ్రాసిన వ్రాతలనుబట్టి నిర్ణయింతుమంటే ఆపస్తంబుఁడు బ్రాహ్మణముకూడ వేదమేయని చెప్పినదేల నమ్మరాదు? అదికాకమంత్రములలోనే ఋక్సంహిత రెండవ మంత్రములో "అగ్నిఃపూర్వేభిఋషిభిరీడ్యో నూతనైరుత" అనుదానినిబట్టి యీమంత్రము బ్రహ్మ చెప్పినదికాదు. బ్రహ్మ ఆదిసృష్టిలోఁ జెప్పినదయితే బ్రహ్మకుఁ బూర్వ ఋషులెవరున్నారందురు? ఆదిసృష్టిలోది కాకున్నను తర్వాతిసృష్టిలో బ్రహ్మవల్ల వచ్చినదందురా ? అట్లయితే బ్రాహ్మణములు కూడ మంత్ర వ్యాఖ్యానములుగాఁ దర్వాతిసృష్టిలో బ్రహ్మప్రసాదించినవే యనుటకు బాధకమేమి ? కనుక దయానందులవారు చెప్పినట్లు బ్రాహ్మణము వేదముకాదను వాదము నేనంగీకరింపను.

నరమేధ—అశ్వమేధ—గోమేధాది హింసాబహుళములగు బ్రాహ్మణములు పశువధలను దూషించుకాలమునకు సరిపడలేదని బ్రాహ్మణములకుఁ బ్రామాణ్యము లేదని యభిప్రాయపడినారేమో?

వేదమంత్రమునకు మాత్రము సర్వదా ప్రామాణ్యముండునా? ఒకపుడు దానిక నుష్ఠాన ప్రామాణ్యము దేశకాలపరిస్థితులనుబట్టి నశించును. పునరుద్ధారమునందు చుండును.

ప్రామాణ్యము రెండువిధాలని కొందరు మీమాంసకులనుచున్నారు ఒకటి విధాయకతాప్రామాణ్యము. రెండవది అనుష్ఠాపకతాప్రామాణ్యము. మొదటి ప్రామాణ్యమట్లే యుండును. రెండవదానికి దేశకాలాదిపరిస్థితుల ప్రతిబంధము కలిగినపుడు అనుష్ఠానము నిలిచిపోవును. వేదములన్నియుఁ బ్రమాణము. లని యంగీకరించిన పెద్దలే కల్యారంభమున "అశ్వాలంభం—గవాలంభం—సన్యాసం పలపైతృకం"—ఇత్యాదిగా నశ్వమేధాదులను మానుమనిరి. వేదమందుఁ బ్రామాణ్యము లేకపోవుటచే నిలుపలేదు. అప్పటిసంఘమునకది యిష్టము లేదనియే. కనుక సంఘపరిస్థితియే మార్పులకుఁగారణమగును. సన్యాసము శంకరుఁడు పునరుద్ధరించెను.

సహగమనవిధి- స్త్రీపునర్వివాహవిధి- స్త్రీలకుపనయన వేదాధ్యయనవిధి యిట్లే పూర్వకాలంమందుండెడివి. ఇంకొకకాలమందాగినవి- మఱలనిపుడు స్త్రీపునర్వివాహము పునరుద్ధారముపొందినది. అట్లే పశుయాగములు బుద్ధునికాలమున నాగినవి. దేశకాలపరిస్థితులననుసరించి మార్పుచెందుటచే దానికిఁగల విధాయకత్వ ప్రామాణ్యము పోదు. అనుష్ఠాపకతాప్రామాణ్యమే పోవును

ధర్మమునకుఁ బరిపాలననుబట్టి యుగవ్యవస్థనిర్ణయము చేయుమని మనుస్మృతిలో "రాజాహియుగముచ్యతే" యని చెప్పఁబడినది. కనుక సూర్యసిద్ధాంతములోఁ జెప్పిన కృతత్రేతాదిప్రమాణవ్యవస్థ గ్రహనక్షత్రాది గణితమున కేయనవలెను. అట్లు కానపుడు ధర్మవ్యవస్థకు వేఱుగా ధర్మశాస్త్రమగు మనుస్మృతిలో "రాజు ఇట్లు పరిపాలనచేసితే కృతయుగము. ఇట్లయితే త్రేత. ఇట్లయితే ద్వాపరము" ఇత్యాదిగా రాజపరిపాలననుబట్టి యుగనిరూపణమేలచేయును ? పరిపాలనము పరమేశ్వరప్రేరణమునసరించి మారుచుండును. ధర్మము దానిననుసరించియే నడచుచుండును మనుస్మృతి ౧౨వ అధ్యాయముచూడండి.

ఒకప్పుడు ధర్మమయినదింకొకపుడు అధర్మమనఁబడును. అట్లగుట ధర్మప్రేరకమగు మనోభావము మారుటచేఁగాదు. బాహ్యక్రియలలో భేదముండుటచేతనే -పురా

ణములు పరిశీలించినచో నిందుకుఁజాలయుదాహరణములు దొరకును. దానివిమర్శ కిది తావుగాదు. నాదృష్టిలో మంత్రములలోఁగూడఁ బౌరుషేయములు కనఁబడు చున్న వందును.

అకారిత ఇంద్ర ఇత్యాది ౭౩౦ ఋగ్వేదాంధ్ర మంత్రమున కృఞ్ ధాతువుతో "అకారి" =చేయఁబడెను అన్నమాటరచనకే చెల్లును. మంత్రకర్తలేవారు. మంత్ర ద్రష్టలైతే "అదర్శి" అనియుండును. స్తుతిమాత్రమే చేయుటకా ధాతువందు రేమో? ౧౦౧౧ ఋకు-లో (ఆంధ్రవేద) ఇమంస్తోమ మర్హతే జాతవేదసే రథమివసంమ హేమా॥ అని రథమును జేసినట్లు చేయుచున్నామని అందుఁగలదు మహేమ అన్నపదమునకు నేచెప్పినదర్థముకాదని బాగుచేసి యలంకరించుటే యందు రేమో; అట్లయ్యును అం దుఁగొంతపురుష కార్యముగలదనుటకు సందియముండదు. ఇమాంతేవాచం వసూ యన్త ఆయవో రథం నధీరః స్వపా అతక్షుషుః॥ ౧౮౩౦ ఋక్కు— దీనియర్థముభాష్య మననుసరించి పుస్తకమున వ్రాసితిని॥ కానిదాని సరసమైన యర్థమిట్లు— బుద్ధిమం తుఁడు రథమునునిర్మించినట్లీస్తుతిని నీకొఱకుఋత్విజులు నిర్మించిరి. నీకొఱకునిర్మించిరి. త్వా = నీకొఱకు నని యే యర్థము ఒకవిభక్తికొకవిభక్తి వేదమునఁ బలుతావులఁ గలదు. అథవా నిన్నుగూర్చి చేసిరియనియు నర్థము చేయవచ్చును తక్ష= చెక్కుట. అవయవములన్నియు నెవరో చేసితే పనివాఁడుకూర్చుఁడు. అన్నిఁటినిజెక్కి తానేరథ ము నిర్మించును గావున స్వయముగానే ఋత్విజులు స్తుతిమంత్రమును నిర్మించినారన వలెను. కనుక పౌరుషేయమే ఆస్తుతిమంత్రమన వచ్చును.

౧౨౧ (ఆంధ్రవేదములు) సనస్తవాన ఆభరగాయత్రేణ నవీయసా॥ ఇఖపుట॥ ఓయగ్నీ! గాయత్రీ ఛందస్సుగల్గినది, క్రొత్తదియగు నీసూక్తముచేత స్తుతింపఁబడిన వాఁడవై యనియర్థము. క్రొత్తదనుటచేతఁ బూర్వమిా ఋక్కు లోకములో లేదనవ లెను. ఆదిసృష్టిలోనిదయ్యెనా నూతనశబ్దము చెల్లదు- ఇట్టివి పలుచోట్లఁ గలవు. కావున ఋషులుక్రొత్తగారచించిన మంత్రములుకూడ నున్నవని తోచుచున్నది. కనుక ఋషులకుఁ గ్రొత్తక్రొత్తగాఁ దపస్సులందు గోచరించినదికూడ వేదమేయన్నపుడు- బ్రాహ్మణములును వేదమనుటకు సందియములేదు. ఈ లాటివన్నియుఁ దపస్సమా ధిలోఁ గ్రొత్తగాఁగనిపెట్టినవంటే బ్రాహ్మణములును అట్టివేలకావు?

బ్రాహ్మణములలో పశువధలు చెప్పఁబడినవికదా ! హింసాప్రాయమయిన కర్మ పవిత్రవేదమునఁ బ్రతిపాదింపబడెననుట లజ్జాకరము అనికొందఱు వాదింతురు.

అవును. పశువధకలదు. బ్రాహ్మణములలోనేయేమి ? మంత్రములలో నా సూచన లేదా ? ౧౬౨౧౪ (ఆంధ్రఋగ్వేద) ౪౪౯ పుట॥ యేచార్వతేపచనం సంభరంతి- అని చంపిన యశ్వమును వండినట్లు కనఁబడుచున్నది ౧౬౨౦ యత్తే గాత్రాదగ్నినా పచ్యమానా- అని అశ్వమాంసము పచనముచేసినట్లుకలదు. ౧౬౨ గాత్రాణ్యసినామిధూకః- కత్తితో నశ్వావయవములు కోసినట్లు కలదు. కనుక మంత్రములుకూడ హింసాబహుళములుకనుక నవియు వేదముకాదనవచ్చునేమో ?

వేదము "నహింస్యాత్సర్వా భూతాని" అని అహింసావాదియై యున్నది. కనుక యాగములోహింస హింసఁగాఁబరిగణింపఁబడదని ప్రాచీనసిద్ధాంతము. అదికాక "అధ్వర" మని యాగమునకు నొకపదము తఱుచుగా వేదమునందుఁ బ్రయోగింపఁబడును- దానియర్థమునుభాష్యకర్తలు అధ్వరము = హింసలేనిది యని వ్రాసిరి.

కావున నొకప్పుడు విషమమృతమయినట్లు హింసయు నుపకారము కావచ్చును. ఒక వ్యక్తికి బాధకలిగినను సంఘమునకు దానివల్ల క్షేమముగలప్పుడు ఆహింస హింసక్రిందనెంచఁబడదు. తిమ్మిరిరోగము శరీరమున గలిగినపుడు అగ్నితోఁజురకలు వేతురు. అది నొప్పిని తత్కాలమునఁ గలిగించినను స్థిరమగు నారోగ్యమును శరీరమునకుఁ గలిగించుఁగాదా !

లోకకంటకులవధ పాతకముకాదని ధర్మసూక్ష్మములలోఁ జెప్పఁబడినది. కనుక నీ పశుహింసవల్ల లోకమునకేమి క్షేమముగలదో? లోకసామాన్యమునకుఁ దెలియని లోకక్షేమోపాయమును వేదము చెప్పవలెనికదా! వేదలక్షణము చెప్పఁబడెను.

కొందఱు పాశ్చాత్త్యులు ప్రాచ్యవిమర్శకులుం గూడ పూర్వము హిమప్రళయము ఉత్తర ధ్రువమునఁ గలిగినపుడు బ్రాహ్మణములు రచించినారు ఋషులనుచు మఱేచెట్లు, చేమలు, సస్యములు, లేనందుననపుడు మాంసాహారమే యలవడి యిట్లు కర్మలను విధించి దేవతా ప్రీతియని కల్పించినారందురు. దీనినివిమర్శింతిము—

ఉత్తరధ్రువమందుఁ బ్రళయము గలుగవచ్చును. ఆర్యులు మఱి యితరత్రా లేరు అన్నందుకుఁ బ్రమాణములేదు. మఱియు నా బ్రాహ్మణములలోనే యాగ వస్తువులలో సర్వధాన్యములు పురోడాశమునకుఁ జెప్పఁబడినవి. యజుర్వేదప్రథమ సంపుటమందే చదువరులుచూడగలరు. ధాన్యములపిండితోనే పురోడాశము చేతురు. పశువును గట్టుటకుఁ బలువిధముల స్తంభములుగూడఁ జెప్పఁబడెను. చెట్లులేనప్పుడు యూపస్తంభములెట్లు దొఱకెను?

కాక సోమపానముసూచించినట్లు, మాంసభక్షణము చేయుచున్నట్లు వేదమునఁ గనఁబడుదాక దేవతలకు సమర్పించి హోమము జరిపిరేకాని యాగపశువులను దినుట కుపయోగింపలేదందును.

ఇతర కాలములందు మాంసభక్షణమున్నట్లు స్మృతులందును బురాణములందును గలదు. శ్రాద్ధములందును గలదు. ప్రత్యక్షముగా లోకానుభవమును గలదు. ఆ మాంసమగ్నిలో హోమము చేయుటవల్ల జనించిన పొగవ్యాపించి లోకమునకేమి క్షేమమును గూర్చునో పరీక్షించి చూడవలసియున్నది. అదియును ఆమంత్రములతో నట్లు చేసిమఱియుఁ బరీక్షించ వలసియున్నది. అలౌకికోపాయబోధకమని వేదలక్షణముగదా!

ఇదిట్లుంచి యింకొకవిధముగాఁగూడ విమర్శింపవచ్చును. విషయవిమర్శమునకును వేదశైలికినిగాను వెనుకనుదాహరించిన మంత్రములను జూడుడు.

(క) ఇంద్రోబలస్య ఇత్యాదిలోఁ బశువులను రాక్షసుడు దాచినట్లు దానినింద్రుఁడు తెచ్చినట్లుఁగలదు.

(గ) గుర్తులో "మారుతమసి" నల్లవస్త్రముకప్పుకొని మంత్రము జపించితే వర్షము కురియునని ఫలము కలదు. ఇందుఁ బశువధ లేదు. వృష్టిఫలమున్నది. అపుడు వర్షము లేదందురా ?

(ఘ) గాయత్రి యన్నది ఒక ఛందస్సు. దానిశిరస్సు ఖండించునది వషట్టనుమాటయే. దానికి రసము కారుట. దానివల్ల పశువులుఁ పుట్టుట. ఆపశువు నాలంభనము చేయుట చెప్పఁబడెను. పాపశాన్తి గలుగునని యనఁబడెను. మనమును కొన్న పశువులుకాక వేదమెద్దానిని బశువులని వర్ణించెనో !

(జ) ఇంద్రుఁడు వృత్రునిశిరస్సు ఛేదించితే గోవులు పుట్టినవట ! వృత్రుఁడే రూపుఁడో ఆరూపము లే పశువులు కూడను. కోతకూడ గాయత్రీశిరస్సును ఛేదించిన దెట్టికత్తియో అట్టికత్తితోనే యేమో !

(చ) సువర్భానుఁడనే యసురుడు సూర్యునకుఁ జీఁకటి గలిగించినాఁడు. ఆ చీఁకటిలో నుండి పశువులు వచ్చినవి- అంటే చీఁకట్లనే యసురులని వర్ణించె నేమో! తిలక్ పండితు లట్లే యభిప్రాయ పడినారు. పశువులంటే చీఁకట్లో, మేఘాలో కావలెను. మేఘార్థము వృత్ర అన్న పదమునకు భాష్యకర్తలు వ్రాసియే యున్నారు. ఆ చీఁకటిలో నుండి నల్లగొఱ్ఱె పుట్టినదట! దీనింబట్టి గుహయన్నపుడు మేఘములు, చీఁకట్లు తాత్పర్యము చెప్పవచ్చును. గో శబ్దమునకు ఉదక బిందువులు, సూర్యకిరణములు అనుఅర్థము కలదు. దేవతలనఁగా సూర్య కిరణములకు అర్థము గలదు. ఇవి భాష్యకర్తలు వ్రాసిన యర్థములే! ఒకొక్కచోట నొకొక్కటిగ వ్రాసినారు. ఆయర్థమే సర్వత్రా చెప్పితే పశువధ వేద తాత్పర్యము కాకపోవునేమో యనియు నొక విధమైన విమర్శము. ఈ మతమున మాంస భక్షణము మానవులకు సహజము కాదు. దంతము లిచ్చిన దేవుఁడు శాకాహారమే విధించినాడు. పక్షులకు ఱెక్కలిచ్చినట్లు ఱెక్కలివ్వలేదు కనుక మానవుల కాకాశగమనము సహజము కాదు. పులులకు, సింహాదులకును గోరలు, గోళ్లు ఇచ్చినట్లు మానవులకు దేవుఁడివ్వలేదు గనుక మాంసాహారము మానవులకు సహజముకాదు.

దేశకాల వ్యవస్థ ననుసరించి మాంసాహారము వచ్చియుండును. సహజముకాని మాంసాహారము దేవుఁడిచ్చిన వేదము విధింపదు అని అను చున్నారు.

చివర సంపుటములో మాయభిప్రాయము స్పష్టీకరింతుము. వేదశైలి మాత్రము చెప్పవలసిన దానికి మాఱురూపిచ్చి చెప్పునన్నది మామతము.

ఇఁక ఆలభేత = చంపవలెను అని సర్వత్రా భాష్యములలో నర్థము కలదు. లభధాతువునకు లాభముకూడ నర్థము కలదు.

"వాయవ్యం శ్వేతమాలభేతపశుకామః" (౨అష్ట ౧ప్రపా ౧అనువా) అన్న భాష్యమున విద్యారణ్యులవారే ఆలభేత=స్పృశేత్ (=ముట్టుకొనవలెను.) అని స్పష్టార్థము వ్రాసినారు. కనుక అర్థములుకూడ సందర్భమునుబట్టి చెప్పుటకు వీలుబడును.

అయితే పశువులను జంపుపక్షమున భక్షణమునకుఁగాక యింకేమిలాభముందురేమో !

ఆమాంసము భూమిపైవేసితే సస్యములకు ఎరువగునేమో ! ఆరసమును సూర్యకిరణములు (=దేవతలు) భుజించితే లోకక్షేమముండునేమో ? అట్లనుటకుఁ బ్రమాణము.

౨అష్ట ౧ప్రపాఠ "సువర్ణానురాసురః" అన్న మంత్రములో "తర్హ్యల్పా పృథివ్యాసీత్" "అజాతాఓషధయః" "అజాయన్తౌషధయః" — అనుచోట పశుమాంసహోమమువల్ల భూమి విస్తరించి ఓషధులు పుట్టినవన్నందున నందేమిశక్తి పూర్వఋషులు కనిపెట్టినారోయనవలయును.

ఇదికాక మనము వార్తాపత్రములవల్ల నిపుడు ఈసామగ్రితో నింతస్థలమున కింతవర్షము కురిపించవచ్చును. అట్లుకురిపించినారు అని రసాయనశాస్త్రపరీక్షకులు పరీక్షించుచున్నట్లు వినుచున్నాము.

కనుక మంత్రసహితమయిన యాతంత్రసంపుటి కాఫలముండవచ్చును ఋషులేనిర్మించినవి కానిందు; మోసము చేయుట కవసరమువారి కేమిగలిగినది? మాంసములలో ఫలానామాంసములుతినవచ్చును. ఫలానావితినరాదు. అని ధర్మశాస్త్రములలో నిరాఘాటముగా ఋషులే వ్రాసియున్నారుకదా!

విమర్శాంతమును గలదు. పురుషసూక్తమును, మంత్రపుష్పమును వైదిక మతమునంజాల తఱచుగానందరును గృహ్యవ్రతాదులలో వాడుదురు. ఆపురుషసూక్తమున "దేవాయజ్ఞ మతన్వత వసన్తోఅస్యాసీదాజ్యం గ్రీష్మఇధ్మః శరద్ధవిః సప్తాస్యా సన్పరిధయః త్రిస్సప్తసమిధః కృతః దేవాయద్యజ్ఞం తన్వానా అబధ్నన్పురుషం పశుం తంయజ్ఞం బర్హిషిప్రౌక్ష్యన్ పురుషం జాతమగ్రతః తేనదేవాఅయజన్త సాధ్యాఋషయశ్చయే తస్మాద్యజ్ఞాత్సర్వహుతః...... పశూగ్ం స్తాగ్ంశ్చక్రే వాయవ్యాన్ ఆరణ్యాన్గ్రామ్యాం శ్చయే. = దేవతలు యజ్ఞము చేసిరి. వసన్తర్తువే నేయి. గీష్మర్తువే హోమమునకు సమిథలు(=పుల్లలు) శరదృతువే హావిస్సు. (అన్నగా చరుపురోడాశాది) — — తంయజ్ఞం ప్రావృషాప్రోక్ష్యన్ = వర్షర్తువుతోఁ దడిపిరి." (అధర్వవేదమున) "బర్హిషి" అన్నపాఠము లేదు. "ప్రావృషా" యన్నపాఠమున్నది, అదే సందర్భశుద్ధిగానున్నది. తమయెదుటఁబుట్టిన (విరాట్) పురుషుని (పశువుగాఁజేసి నీళ్లతో యజ్ఞపశువునుదడిపినట్లు తడిపిరని తా॥) ఇట్లు నరమేధమును. దానితోనే దేవతలు, సాధ్యులు, ఋషులు యజ్ఞము చేసిరి. అనిచెప్పుచు పశూగ్స్తాగ్ంశ్చక్రేవాయవ్యా నారణ్యాన్గ్రామ్యాంశ్చయే =వాయువ్యములు ఆరణ్యకములు, గ్రామ్యములగు పశువులను జేసిరి. అని దానియర్థము.

ఈ యజ్ఞముపూర్తియయిన తర్వాత నందలి పృషదాజ్యము( =మిగిలిన నేయి) తోఁబశువులను జేసిరన్నందువల్ల నీయాగము కాలమునకుఁ బశువులు లేవు. ఇట్టి యాగమే ఋషులు చేసినారు అన్నప్పుడు మాంసమేది? పుల్లలేవి? నేయియేది? అట్టి భావనా యజ్ఞమును వేద ముద్దేశించి యున్నదేమో యనవచ్చును. ;మఱియుఁ బశు తంత్రమున కల్ప సూత్రాదులలో ఆరణ్యకములు, గ్రామ్యములు నని పశువులను యాగమునకు రెండు తెగలనియే యుదాహరించిరి.

౨అష్ట ౮ప్రపా ౬అనువా ౨పనస భాష్యము చూడండి. యజుర్వేదభాష్యములో- వాయవ్యములన్న పశువుల నేలచెప్పలేదో! వేదతాత్పర్యము ఇటీవల శ్రౌత సూత్రములు వ్రాసిన వారికిఁ దెలియలేదేమో! పూర్వఋషు లెరింగి యట్లు చేసిరేమో? అనవచ్చును. వాయువులోఁ గూడఁ గొన్ని జీవజంతువులు కలవు. వాటివల్ల దేశోపద్రవము గలిగి నట్లు మశూచికము మొదలగు వ్యాధు లంకురించి నట్లు ఆశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు ఏహోమము ధూమము వల్ల నేజంతువులు వాయువులోనివి నశించునో మానవ సామాన్యమునకుఁ దెలియదుగాన దానికై వేదము హోమము లుపదేశించె ననవచ్చును. కొన్ని రోగముల యుపశమనము కొన్ని పొగల వల్లఁ జేయుట కలదు. వేపాకు, గుగ్గిలము మశూచిక వ్యాధికిఁ బొగవేతురు కదా!

ఇంతేకాదు. "పార్వా పిట్టంత మేఘముపదూళ్లకు వర్షించు" నన్న సామెత కలదు. మేఘమును బక్షి కుపమానించెను. వేదమునఁ జెప్పిన పశువులు మేఘములే యేమో మాఱు రూపుతో వర్ణింపఁ బడిన వనరాదా? పిల్లలాటలలో మేఘాల ననేక జంతువుల రూపమున వర్ణించుట లోకానుభవము. ఆ మేఘములకు వాయువులే కోతకత్తులు, ఇంద్రుడు యాగకర్త. గుహాలోని గోవులు మేఘములోని జలబిందువులు. గుహా మేఘము. అను తాత్పర్యమే నిజమేమో! నిఘంటులో యాస్కుండి యర్థముకూడ వ్రాసినాడు.

భాషప్రాచీనము, భాష్యకర్తలు నవీనులు. మనమేమనఁగలము? అందఱికిని యాస్కుఁడు వ్రాసిన నిరుక్తమే శరణ్యము. అది తెనిఁగించినతర్వాత నందఱును విమర్శింపవచ్చును. ఇపుడు తత్త్వమిదమిద్ధమని నిర్ణయించుట దుర్ఘటము.

ఇకనొకవిషయము విమర్శించి యుపోద్ఘాతము ముగింతును. వేదము తెనిగించి అచ్చువేయించి సర్వసులభము చేయుటవల్ల స్త్రీలు శూద్రులుఁగూడఁ జదువు దురుకదా! వారికి వేదాధికారము లేదుకదా! యని కొందరు ప్రశ్నించిరి. అందులో శూద్రులువింటే చెవిలో సీసము మరిగించి పోయుమని శిక్షకూడ విధించి యున్నారనుచున్నారు.

అందుకు నాసమాధానము:—

వింటే సీసము పోయమన్నారుగాని చదివితే పోయుమనలేదందురు. అదికాక వేదములో వారుచదువుటకూడదని యొక్క-వాక్యముతీసి యెవరయిన చూపితేనావాదము మార్చుకొందును. పౌరుషేయగ్రంథముల వ్రాతలు దేశకాలముల ననుసరించి యుండును. నమశ్శివాయ నమో నారాయణ అను మంత్రాలు వేదములోనివే. శివమతాచార్యులు, రామానుజమతాచార్యులు పంచములకుఁగూడ నుపదేశింపవచ్చునని, వారు జపించవచ్చునని యిదివరకెన్నిశతాబ్దములనుండియో సిద్ధాంతీకరించి చేయుచునేయున్నారు. కావునఁ దెనిగించిననేనుగాని, ప్రకటించిన వినయాశ్రమము వారుగాని తప్పుచేయలేదు.

కాక ఆంధ్రలోకమున మాసేవ విధివిహితము గూడనందును. ఏమన:—

పురాకల్పేతునారీణాం మౌంజీబంధనమిష్యతే। అధ్యాపనంచవేదానాంసావిత్రీ వచనంతథా॥ యని మాధవీయమందే శాతాతపవచనమున్నది. గోభిలగృహ్యమున దుహితామేపండితాజాయేత ఇత్యాదిగా స్త్రీయుపనయనవిధియున్నది. ఆశ్వలాయనగృహ్యసూత్రమున స్నాతకసంస్కారమున చందన లేపనమునందు స్త్రీలచందనసంస్కారము వేరుగానిరూపించినాడు. ఉపనయనమే లేకుంటేస్నాతకమెందుకు! ఇదంతయునాప్రకటించిన “వివాహతత్వ” మనుగ్రంథమున విపులముగా జర్చింతిని. ఇచట ఆవిమర్శకుఁ దావులేదు.

ఇఁకశూద్రుల విషయము:—

ధర్మశాస్త్రములలో శూద్రులకుపనయనము చెప్పనిమాట నిజమే. శూద్రశబ్దమునకు శోకముకలవాఁడు అనిలింగాభట్టీయము వ్యుత్పత్తి వ్రాసియున్నది. దానింబట్టి యిపుడెవరు శూద్రులో బ్రాహ్మణులు నిర్ధారించ నర్హులు. కాలానుసారము ధర్మశాస్త్రములున్న వంటినిగదా! నశూద్రాయమతింపద్యాన్నని జ్ఞానముశూద్రునకుపదేశింపవద్దని కొన్నిగ్రంథములుగలవు నమస్కారేణ మంత్రేణ పంచయజ్ఞాన్నహాపయేత్తనియాజ్ఞవల్క్యుఁడు- శూద్రులు నమస్కార మంత్రముతో పంచయజ్ఞములు

తప్పక చేయ వలెనన్నాఁడు. పంచయజ్ఞాలంటే- పాఠము- హోమము- అతిథిపూజ పిత్రాదితర్పణము- బలిహరణము, అనఁగా వైశ్వదేవము. ఇవి పరస్పర విరుద్ధములు. ఒకప్పుడు ధర్మములయిన నింకొకప్పుడధర్మములని పురాణములు చూచితే తెలియును.

ఇదిట్లుంచుఁడు- వేదము పఠించుటకుపనయనమవసరము. ఉపనీతుఁడు శిఖా యజ్ఞోప వీతములతోఁ బఠింపవలెనని వేదమందుఁగలదు అదిలేనివాఁడు పఠింపరాదని తాత్పర్యము అందువచ్చును.

గుణకర్మలనుబట్టి జాతినిర్ణయమా? జన్మమునుబట్టి జాతినిర్ణయమా? నిర్ధారించినతర్వాతకదా వీరుశూద్రులు వీరుద్విజులు అని నిర్ణయమగును! ఆనిర్ణయమునకిది తావుగాదు. ఇదంతయు నియమపూర్వకముగా వేదము పఠించు విషయమునఁజర్చ. తెనిగించినమాకు దీనితోఁబనిలేదు. అర్థజ్ఞానమున కందఱు నధికారులే.

శ్రీశంకరులవారు, శ్రీరామానుజులవారునుగూడదమసూత్రభాష్యములందు "అను శూద్రాధికరణము" లో వేదాధికారములేని వారికింగూడ ఉపనిషదర్థమును వేదముతెలిసిన యధికారులుపదేశింపవచ్చునన్నారు. కావున మావిధిమేము నెరవేర్చితిమి. "శ్రావయేచ్చతురోవర్ణాన్" అన్నవచనము నుదాహరించి ఇతిహాస పురాణములద్వారా శూద్రాదుల కధికారమున్నదని వారు వ్రాసినందున సంస్కృత గ్రంథములకే యధికారము శూద్రులకుఁగలప్పుడు మాయాంధ్రవేదమున కధికారముండకపోదు. కనుక పాఠకమహాశయులు నిస్సందేహముగాఁ జదువఁగోరుచున్నాము.

సర్వవిధేయుఁడు,

బం॥ మల్లయ్యశాస్త్రి.

నరసన్నపేట - సౌభాగ్యకుటీరము

ప్రాతగంజాం జిల్లా.

# ప్రకాశకుల తొలిపలుకు.

—*0*—

౧౯౧౮ లో బొంబాయిలో ఋగ్వేదమును ఆంగ్లములోనికిని, మహారాష్ట్రములోనికిని భాషాంతరీకరించి ప్రకటించుచుండిరి. గుంటూరులో నూతనోద్యమములకు ప్రోత్సాహకరుడుగానుండిన శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు మొదలగుస్నేహితులము వేదములనాల్గింటిని ఆంధ్రభాషలోనికి అనువదింపవలెనని తలంచితిమి. కాని అప్పుడే ఐరోపా మహాసంగ్రామము ప్రారంభమగుటచేతను, బళ్లారిలోని ప్రముఖులుకొందరు ఆంధ్రానువాదము ఆరంభించిరని తెలియుటచేతను, మేము విరమించితిమి. బళ్లారి వారిపని కొంతవరకుజరిగి ఆగిపోయెను. యుద్ధము నాలుగేండ్లు సాగెను. అదిముగిసినపిదప దీనినిసాగింప మరలసంకల్పము కలిగెను. గుంటూరునుండి భావపురికి (బాపట్ల) పోవు న్యాయస్థానముతోపోయి అచట యాకార్యమును నిర్వహింపవచ్చునని ఆశకలిగెను. ఆసమయముననే పూజనీయులగు మహాత్మాగాంధీగారు మోహన వేణుగానము పూరించి దేశీయ మహాజన సభతోపాటు భారతజాతినంతను స్వాతంత్ర్య సమరరంగమున కాకర్షించెను. అంతటితో రెండవసంకల్పము పీగిపోయెను. అసహాయోద్యమతీవ్ర ప్రచారముసాగుచుండగనే బ్రాహ్మణ బ్రాహ్మణేతర అసమానత్వమును తొలగించుటకు వేదవేదాంగములను ఆంధ్రీకరించి ఆంధ్రులకెల్లరకు హస్తగతమొనర్చుట భావ్యమని తెలుపుచుంటిమి. కాని ఆసమయమున సహాయమొనర్చుటకు పూనిన ఒకానొకస్నేహితుని పవిత్రసంకల్పము దురదృష్టవశమున కొనసాగదయ్యె. సాయమొనర్తుమనిన మరియొకరు అకాలమృత్యువాతబడిరి. స్వాతంత్ర్యోద్యమము నిమ్నోన్నతస్థాయిలలో నడుచుచుండెను. ఇంతలో వినయాశ్రమమును శ్రీముఖ సం॥ మార్గశిర బహుళసప్తమి స్థిరవారమున (౨౩—౧౨—33) మహాత్ములు ప్రారంభించిరి. ఆంధ్రవేదానువాదము ఆశ్రమోద్దేశములలో నొకటియై వరలుచుండెను. సత్యాగ్రహ సిద్ధాంతములోనిసర్వధర్మ సమానత్వమును ముఖ్యసూత్రమునకు సర్వమత గ్రంథములను సమానభక్తి గౌరవములతో స్వభాషలో సమకూర్చి, సమన్వయమొనర్చి సదాచరణతో

పవిత్రీల్లచేయుట పరమకర్తవ్యముగా ప్రత్యక్షమయ్యెను. తదుద్దేశ్యముతో ఆర్య, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయ మతోద్గ్రంథముల నాంధ్రీకరించుటకు పూనితిమి. జారుత్రుష్ణ, కన్‌ఫ్యూషియస్ ప్రవక్తల ప్రబోధ గ్రంథములనుగూడ ఆంధ్రీకరింప దలచితిమి. పశుధర్మమునుండి దైవధర్మమునకు పరిణామమందుచున్న మానవకోటి నుద్ధరి ప యుగయుగాంతరముల పరమేశ్వరుడు ప్రసాదించిన మహాప్రబోధములను సర్వజనసులభముగా లభింపజేయుట, విశ్వసందేశమని రూఢియయ్యెను

మతములలోనికెల్ల ఆది ఆర్యమతము. ఆర్యధర్మమునకు వేదము మూలము. వేదములు షడంగములతోసహా ప్రకటించుట జ్ఞానవిజ్ఞానములకు సాధనమార్గము. "ఆంధ్రావని మోదమున్‌బొరయ" ఆంధ్రవాఙ్మయము పరిపూర్ణతనొంద, ఆంధ్రుల జ్ఞానవైరాగ్యములు సర్వతోముఖవ్యాప్తిపొంద, లోకోద్భవమునకు కారణభూతు డైన పరమేశ్వరునుండి వెలువడిన ఋగ్యజుస్సామాథర్వవేదంబుల తడంగ సమేతం బుగా సుబోధకమగు శైలిలో యనుదించి ఆంధ్రవేదంబులు"గా ఆంధ్రలోకంబునకు లభింపజేయుట పరమకర్తవ్యము. ఇట్లు మనోవీధిలో తాండవమాడుచున్న భావపరం పరలకు కాలపరిణామముబట్టి కార్యరూపమొందుకాలము సంఘటిల్లెను. ఒకానొక స్నేహితుని వాగ్దత్తము అవలంబనమయ్యెను. చిరకాలస్నేహితులును, సంపన్న గృహస్థులును, అగు శ్రీయుత ఆలపాటి దేవయ్యగారు యజుర్వేదశాఖలలో నొక దానికి పూనుకొని తన కుమారుడు వెంకటకృష్ణయ్యగారిద్వారా ౨౩-౧౨-౩౭ తేదీన జరుపబడిన వార్షికోత్సవమపుడు చదివించిన ధనము కార్యోపక్రమణకు తోడ్పడెను. తాతలనాటినుండి మాకుటుంబమునకు పోషకులుగానున్న శ్రీరాచూరు జమీందారగు శ్రీరాజామాణిక్యారావు వెంకటహయగ్రీవరావు బహదూరుగారు గత ముక్కోటిఏకాదశినాడు తమతల్లి శ్రీరాజా రాజలక్ష్మమ్మ బహదూరుగారి జ్ఞాపకార్థమై శుక్లయజుర్వేదమునకై యిచ్చిన సనదు మరింతప్రోత్సాహమొసర్చెను. ఆశ్రమ రాజపోషకులు శ్రీయుత మద్ది వెంకటరంగయ్యగారు సామవేదమును భరించ సమకట్టుట సంతోషప్రదమయ్యెను. బాల్యస్నేహితుడు శ్రీయుత మంతెన సుబ్బరాజు గారు తనతండ్రిజ్ఞాపకార్థమై ఋగ్వేదభారమును వహించి కార్యలోపమురాకుండ

రక్షించె. అథర్వవేదమునకుపూనుకొనసున్న ఒకానొకస్నేహితునికృషి ఈకార్యసమాప్తికి తోడ్పడనున్నది. అనాదిగా ఈ వేదమంత్రములను పండితవరేణ్యులు భద్రపరచియున్నారు. అందునిగూఢములైన భావపరంపరలు పండితపామరులకెల్ల సులభముగా బోధపడునట్లు మధురమైనశైలిలో తేలికయైనపదములగూర్చి ఆంధ్రానువాదము జరుగుచున్నది. వేదవిమర్శకుల భావములును, ప్రకాశకుల స్వంతభావములును ప్రత్యేక సంపుటములో తెలుపబడును. కరుణామయుని అపారమైన అనుగ్రహము చేతనే సనాతనులైన పండితులు యీఅనువాదమునకు పూనుకొనిరి. ఋగ్వేదమును సుప్రసిద్ధసంస్కృతాంధ్రపండితులును, సంస్కర్తలును, పురాణవాచస్పతి బిరుదాంకితులు నగు బ్రహ్మశ్రీ బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు ఆంధ్రీకరించియున్నారు. సామ, అథర్వవేదములను వారే అనువదింతురు. వ్యాకరణశిరోమణి బ్రహ్మశ్రీ రామవరపు కృష్ణమూర్తిశాస్త్రిగారు కృష్ణయజుర్వేదమనువదించిరి. శుక్లయజుర్వేదమునుగూడ అనువదింతురు. యజుర్వేదమునందలి మంత్రభాగములకు ఆనందాశ్రమ ముద్రణాలయమువారు అచ్చొత్తిన గీర్వాణమూలగ్రంథముల ననుసరించి స్వరము ఏర్పాటు చేసితిమి. తెలుగులిపిలో ప్రకటింపబడిన కొన్ని యజుర్వేద మంత్రములకు (క॥) యిట్లు పైన రెండునిలువుగీట్లుకల స్వరములు కన్పించుచున్నవి. ఈ సంస్కృతగ్రంథములందవి లేకుండుటచే వేయమానితిమి. అంతమాత్రమున స్వరస్ఖాలిత్యములని యుహాపోహ పడుకుందురుగాకయని మనవి

ఆంధ్ర వేదప్రకటనకు, అనివార్యములైనచోటతప్ప స్వదేశీవస్తువులనే వాడుచున్నాము. యుద్ధకాలమగుటచే వస్తువుల ధరలు పెరుగుటయు, వస్తువులు సులభముగా లభింపకుండుటయు కొంత ఆటంకమును కల్పించుచున్నవి. మూడేండ్లనుండి మురియుచున్న ప్రకటన అంతరాయములచే అప్పటప్పటికి ఆలస్యమగుచుండెను బాల్యమిత్రుడు వెంకటప్పయ్య తనతల్లి శ్రీమతి కైవారం బాలాంబగారిపేర వేదగ్రంథముల కొన్నిటినిప్పించెను. పరుచూరు ప్రాంతవాసులు మాఆలస్యమునకు జంకక, మావాయిదాలను నిరసింపక, వేలకొలదిగా ధనమిచ్చి ఆదరాభిమానములతో తోడ్పడుటచేతనే ఈపని యిప్పటికి సాధ్యమైనది. హిందూధర్మాదాయముల

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 119 | 18 | పెరుయతో | పెరుగుతో |
| 120 | 15 | నూకుబాపు | మూకుబాప |
| 123 | 1 | ంత్రములు | మంత్రములు |
| 134 | 14 | త్రిశత్వా | త్రిచత్వా |
| 135 | 9 | జ్ఞానహిత | జ్ఞానకహిత |
| 141 | 6 | బలమునుంబు | బలమునకుంబు |
| 142 | 17 | అగుపంటి | అటువంటి |
| ,, | ,, | చున్నరిన్ను | చున్నవిన్ను |
| 143 | 5 | పిమ్మనుంచ | పిమ్మటనుంచ |
| 144 | 14 | నేత్రిసమీప | నేత్రసమీప |
| 148 | 10 | ప్రాజ్ఞ్యపునులు | ప్రాజ్ఞ్యములు |
| ,, | 13 | ననుద్వాస | నగ్నిసుద్వాస |
| 151 | 2 | ఇట్లచేసిన | ఇట్లువేసిన |
| 153 | 19 | దేలతిల | దేవతల |
| 154 | 16 | విస్తీర్ణము | విస్తీర్ణము |
| 155 | 9 | కాపి | కాళీ |
| ,, | 11 | సంఖ్య | సంఖ్య |
| 159 | 4 | సతోషించు | సంతోషించు |
| 157 | 6 | జేసిపిమ్మట | జేసినపిమ్మట |
| 160 | 17 | క్షీస్థానీయ | క్షీరస్థానీయ |
| 168 | 8 | నన్నుగూడ | నన్నుగూడ |
| ,, | ,, | యాగము | యాగము |
| 171 | 2 | వార్థన | ప్రార్థన |
| 173 | 17 | ఇద్రియ | ఇంద్రియ |
| 174 | 9 | సన్నునా | నన్నునా |
| ,, | 18 | కెన్నికలనో | లెన్నికలవో |
| 176 | 10 | నంధేప్రతిష్టి | నంధ్యేప్రతిష్ఠి |
| 179 | 2 | నడియి | నదియు |
| 184 | 8 | పుతము | ప్లుతము |
| ,, | 21 | ప్రశంశా | ప్రశంసా |
| 188 | 15 | చున్ననూ | చున్నాను |
| 191 | 17 | ఫలయుక్త | ఫలముగాను |
| 192 | 15 | భుఃవచనము | బహు వచనము |
| 199 | 14 | గూహ్యవవహార | గూఢ వ్యవహార |
| 208 | 13 | సంబధ | సంబంధ |
| 219 | 19 | మయునసోయగ్ని | మయిన యగ్ని |
| 221 | 7 | నాయజనూ | ఆయుజనూ |
| ,, | 15 | ఏహావనీ | ఏయాహావనీ |
| 223 | 6 | సీతవాతాది | శీతవాతాది |
| 230 | 1 | అమావాశ్య | అమావాస్య |
| 231 | 10 | ఆయుష్ఠాన | ఆయనుష్ఠాన |
| 234 | 14 | ప్రార్థనచే | ప్రార్థనచే |
| 235 | 6 | సమృద్ధమని | సమృద్ధమని |
| 245 | 18 | అన్నదః | అన్నాదః |
| 255 | 13 | స్వష్టకృత్తు | స్విష్టకృత్తు |
| ,, | 15 | స్వష్టకృత్తులు | స్విష్టకృత్తులు |
| 257 | 16 | దర్శపూర్ణ | దర్శపూర్ణమాస |
| 264 | 5 | అభీష్టస్థాన | అభీష్టస్థాన |
| 265 | 1 | కేకుండుట | లేకుండుట |
| 266 | 6 | మతికొందరు | ఏమతికొందరు |
| 287 | 4 | షహానువాక | షష్ఠానువాక |
| 288 | 17 | ప్రస్తలము | ప్రశస్తము |
| 289 | 4 | నడకల | నడకకల |
| 297 | 8 | బడుచున్న | బడుచున్న |
| ,, | 12 | సంస్త | సమస్త |
| ,, | 14 | సాత్రాదులు | పాత్రాదులు |
| 301 | 10 | స్తోత్రిమను | స్తోత్రమును |
| 302 | 18 | మసుష్య | మనుష్య |
| 304 | 8 | తదశరీము | తనశరీరము |
| ,, | 8 | ద్వాదరాను | ద్వాదశాను |
| 310 | 11 | కెలిచిది | కలిగినది |
| 311 | 18 | చేయుపులయు | చేయవలయు |
| 317 | 12 | నిర్వాప | నిర్వాపము |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 319 | 16 | షానపర | స్థానపర |
| 323 | 6 | ఇద్రాగ్నులు | ఇంద్రాగ్నులు |
| 324 | 1 | దేవతయి | దేవతలు |
| ,, | 2 | దేపతలు | దేవతలు |
| 327 | 16 | సంస్కృత | సంస్కృతి |
| 328 | 7 | వశయును | వలయును |
| ,, | 8 | గోధుమములు | గోధుముల |
| 338 | 3 | భాదకులు | బాధకులు |
| 344 | 13 | నరహ | నరావా |
| 350 | 18 | బుతిక్కు | బుత్విక్కు |
| 352 | 8 | దేతకొరకు | దేవతకొఱకు |
| 354 | 18 | అవిధముగ | ఆవిధముగ |
| 363 | 13 | పురుపురుషు | పురుషు |
| 364 | 17 | గర్భాకము | గర్భాశయము |
| 369 | 2 | వ్యాదిచే | వ్యాధిచే |
| 375 | 16 | చున్నవి | చున్నది |
| 376 | 11 | చేసినజో | చేసినచో |
| 383 | 20 | పసపు | పసుపు |
| 414 | 17 | హవిచే | హవిస్సుచే |
| 422 | 7 | చున్నదగు | చున్నదగుచు |
| 424 | 13 | నూన్యత | శూన్యత |
| 427 | 12 | ఇద్రాగ్ను | ఇంద్రాగ్ను |
| 431 | 7 | వేయునో | వేయునో |
| 451 | 9 | అప్పుడుః | అప్పుడు |
| 455 | 4 | సేవల, | నేయవల |
| 658 | 6 | బొద | బొండ |
| 461 | 13 | పదనొకండు | పదునొకండు |
| 462 | 11 | ఐశ్వాదుల | ఐశ్వర్యాదుల |
| 464 | 13 | ప్రారంభ—సమా | ప్రారంభ, సమా |

## మంత్రభాగమునందలి తప్పొప్పులు

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 5 | బహీర్య | బహీర్వర్య |
| 2 | 1 | యజ్ఞస్య | యజ్ఞస్య |
| 3 | 4 | న్విహిదేవం | న్విహీఽదేవం |
| 4 | 1 | యజ్ఞాయై | యజ్ఞాయై |
| ,, | 4 | ద్రప్సా | ద్రప్సో |
| 6 | 4 | తమహ్నా | తమమహ్నా |
| 8 | 1 | క్ష్యేషమం | క్ష్యేషం |
| 9 | 5 | రక్షోzవ | రక్షోzవ |
| 10 | 2 | మ్యద్రి | మ్యద్రి |
| ,, | 6 | హిరణ్య | హిరణ్య |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 95 | 5 | సౌభగాన | సౌభగాని |
| ,, | ,, | దధిరేపావకే | దధిరేపావకే |
| 96 | 3 | ర్యావిష్టః | ర్యావిష్టః |
| ,, | ,, | యతి | యతి |
| 97 | 5 | తృతీయ | తృతీయ |
| 98 | 5 | ఉతశిక్ష | ఉతశిక్ష |
| 99 | ,, | ఆయుూగ్ంపి | ఆయుూగ్ంపి |
| ,, | 6 | వహ | వహ। |
| 103 | 3 | దదాధా | దదాధా |
| 105 | 3 | న్మాదయన్స్వ | న్మాదయస్స్వ |
| 109 | 1 | శ్చోదయ | శ్చోదయ |
| 110 | 2 | వర్ధసే | వర్ధసే |
| ,, | 5 | గృహీతో | గృహీతో |
| 111 | 1 | యజ్ఞపతి | యజ్ఞపతి |
| 113 | 1 | పృథివ్యా | పృథివ్యా |
| 114 | 1 | సహాశ్చ | సహాశ్చ |
| ,, | 4 | ఆగతగ్ం | ఆగతగ్ం |
| 115 | 7 | సోమం | సోమం |
| 117 | 1 | ర్వత్సస్య | ర్వత్సస్య |
| ,, | 3 | ద్రియగ్వా | ద్రియగ్వా |
| 118 | 1 | స్త్రీరసి | స్త్రీరసి |
| 119 | 2 | వామభాజః | వామభాజః |
| 120 | 1 | హిరణ్య | హిరణ్య |
| 125 | 3 | ప్రతిపక్ష్యా | ప్రతిచక్ష్యా |
| 126 | 3 | మల్మలా | మల్మలా |
| 128 | 3 | వక్రృణోతువా | వాక్రృణోతువ |
| 133 | 6 | మధుమతీః | మధుమతీః |
| 135 | 4 | స్వజ్ఞ | స్వజ్ఞ |
| 137 | 5 | అపాంసపా | అపాంసపా |
| 138 | 5 | సుమిత్రా | సుమిత్రా |
| ,, | 6 | దేవరిష | దేవరిష |
| 139 | 3 | ప్రత్యస్తో | ప్రత్యస్తో |
| 140 | 2 | యశో | యశో |
| 145 | 3 | దేయగ్ం | దేయగ్ం |
| 146 | 5 | ధేయస్య | ధేయస్య |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 148 | 4 | ఋతాయ | ఋతాయ |
| ,, | 6 | ఆయు | ఆయు |
| 149 | 4 | యజమానస్య | యజమానస్య |
| 150 | 2 | వివిదానో | వివిదానో |
| 158 | 1 | ముద్వాస | ముద్వాస |
| ,, | 3 | దధాత్వి | దధాత్వి |
| 158 | 4 | ఇదమాద | ఇహమాద |
| 146 | 1 | అగ్నేంత్వంనో | ంత్వంనో |
| 167 | 1 | సోమాసగ్ం | సోమాసగ్ం |
| 163 | 4 | టాకరం | టాకరగ్ం |
| 174 | 1 | యావంతఏవ | యావ ఏవ |
| 175 | 4 | ధత్తేవశుచి | ధత్తేపశుచి |
| 176 | 1 | ప్రవావఏషో | వావఏషో |
| 184 | 3 | త్యథకో | త్యధకో |
| 185 | 1 | ర్యదగ్ని | ర్యదగ్ని |
| 187 | 1 | త్వత్పితా | తత్పితా |
| 188 | 1 | యత్వయ | యత్వియ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 189 | 2 | అభినో | అభినో |
| ,, | 6 | మిస్వాహా | మిస్వాహా |
| 192 | 6 | సహసి | సహసి |
| 194 | 5 | సుమ్నాయ | సుమ్నాయ |
| 199 | 2 | దర్భ్యాయ | దర్భ్యాయ |
| 210 | 2 | త్వేన్ద్రో | త్వేన్ద్రో |
| 216 | 5 | గృభ్ణామి | గృభ్ణామి |
| 220 | 2 | హదేవ | హదేవా |
| 223 | 1 | ఏవం | ఏవం |
| 225 | 2 | భరతి | భరతి |
| ,, | 3 | మానుషాణి | మానుషాణి |
| 227 | 4 | తోజసః | తోజసః |
| ,, | 5 | హవిషఇతి | హవిఃఇతి |
| 228 | 5 | యుఙ్క్తే | యుఙ్క్తే |
| ,, | 6 | యుఙ్క్తే | యుఙ్క్తే |
| ,, | 5 | ప్రజాపలి | ప్రజాపతి |
| 229 | 3 | మాస్తేనా | మాస్తేనా |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 229 | 5 | పాప్నోతి | పాప్నోతి |
| 231 | 2 | త్తేనాగ్ని | త్తేనాగ్నీ |
| ,, | 5 | ప్రప్రజయా | ప్రప్రజయా |
| 232 | 1 | త్యుఖాం | త్యుఖాం |
| 233 | 2 | త్యాజ్యంచై | త్యాజ్యంచై |
| ,, | 3 | ఏవగ్సం | ఏవగ్ంసం |
| 234 | 4 | ముపాశ్య | ముపాస్య |
| 235 | 1 | దిశాహా | దిత్యాహా |
| ,, | 3 | హోత్రమే | హోత్రమే |
| ,, | ,, | సాడయే | సాదయే |
| ,, | 5 | గృహాహ్ణాన్త్యా | గృహ్ణాన్త్యా |
| 239 | 2 | మేన్ద్రియే | మేన్ద్రియే |
| 240 | 2 | చతురక్షరం | చతురక్షరం |
| 241 | 6 | త్యుపాసద్ద్వ | త్యుపాసదద్ద్వ |
| 242 | 2 | దిశోऽదస్య | దిశోऽదస్య |
| ,, | 3 | శ్రావయేతి | శ్రావయేతి |
| 243 | 2 | వైత్తేభ్యో | న్వైత్తేభ్యో |
| 246 | 1 | మూర్వ్యేన | మూర్వ్యేన |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 248 | 4 | రుషంజ్షా | రుషంజష్టు |
| 250 | 4 | చర్షణీనామ్ | చర్షణీనామ్ |
| 251 | 1 | అక్రృణో | అక్రృణో |
| 255 | 3 | వరవర్ణ్ణ | వరవర్ణ్ణా |
| ,, | ,, | పహ్వాయ | పహ్వాయ |
| 259 | 1 | యజ్ఞే | యజ్ఞో |
| ,, | 2 | బ్రహ్మవై | బ్రహ్మావై |
| 263 | 4 | వాఅస్యై | వాఅస్యై |
| 264 | 1 | భవన్తి | భవన్తీ |
| ,, | 6 | జీవన్తిః | జీవన్తీః |
| 275 | 2 | అసురాణాం | అసురాణాం |
| 279 | 2 | నపజయ్యా | నపజయ్యాను |
| 588 | 6 | పప్రయుః | పప్రయుః |
| 297 | 1 | మిమాచ | మిమాచ |
| ,, | ,, | సమ్రాట్ | సమ్రాట్ |
| ,, | 2 | ప్రజాన | ప్రజాన |
| 299 | 4 | నాభిషి | నాభిషి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 300 | 2 | ముదజజయ | ముదజయ |
| 305 | 3 | దేవావాన్క్రి | దేవాన్క్రి |
| 306 | 1 | మర్ధీరా | మర్ధీరా |
| 307 | 5 | భవతు | భవతు |
| 308 | 3 | యాభిరదేమ | యాభిర్నదేమ |
| 316 | 3 | మైన్ద్రాగ్నే | మైన్ద్రాగ్న |
| 317 | 1 | బర్హి | బర్హి |
| ,, | 5 | స్తుతో | స్తుతో |
| 318 | 5 | పితౄణాం | పితౄణా |
| 325 | 3 | వైష్ణవ | వైష్ణవ |
| 337 | 1 | జానరాజ్యా | జానరాజ్యా |
| ,, | 3 | క్రతుబాధ | క్రతుబాధ |
| 340 | 5 | పూష్ణేన్వాహా | పూష్ణేస్వాహా |
| ,, | ,, | యేస్వాహేన్ద్రాయ | యేస్వాహేన్ద్రాయ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 340 | 5 | ఘోషాయ | ఘోషాయ |
| 345 | 1 | యజ్ఞసి | యుజ్ఞసి |
| 371 | 5 | శ్వేతాం | శ్వేతాం |
| 375 | 6 | వర్చన | వర్చస |
| 376 | 1 | గ్నేయం | గ్నేయం |
| ,, | 6 | కాభ్య | కానభ్య |
| 377 | 3 | మన్యు | మన్యు |
| 388 | 3 | పథావతి | పథావతి |
| 412 | 8 | త్యన్నాదః | త్యన్నాదః |
| 414 | 2 | మిత్రి | మితి |
| 417 | 1 | పరాచీ | పరాచీ |
| 438 | 1 | అష్టా | అష్టా |
| 442 | 4 | యేత | యేత |
| 448 | 4 | వరుణ | వరుణ |



ఋక్సామాథర్వణవేద అనువాదకర్తలు:

శ్రీ బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు



యజుర్వేద అనువాద కర్తలు :

వ్యాకరణ శిరోమణి

శ్రీరామవరపు కృష్ణమూర్తి శాస్త్రిగారు



కృష్ణయజుర్వేద ప్రచురణకై శ్రీబాలకోటీశ్వరస్వామి ప్రీత్యర్థం రు ౨౧౦౦/-లు
అర్పించిన దాతలు

శ్రీ ఆలపాటి దేవయ్యగారు,
గోవాడ.



ఋగ్వేదప్రచురణకై తమతండ్రి చాపిరాజుగారి జ్ఞాపకార్థము

రు ౧౦౦౦/-లు అర్పించిన దాతలు

శ్రీ మంతెన సుబ్బరాజుగారు

మంతెనవారిపాలెం.



శుక్లయజుర్వేద ప్రచురణకై తమతల్లి శ్రీరాజా రాజలక్ష్మాయమ్మ బహాదూరుగారి
జ్ఞాపకార్థము రు ౨౧౦౦/-లు అర్పించిన దాతలు

శ్రీ రాజా మాణిక్యారావు వెంకట హయగ్రీవరావు బహద్దరు
జమీందారుగారు రాచూరు.



సామవేద ప్రచురణకై తమతల్లి లక్ష్మీదేవమ్మగారి జ్ఞాపకార్థమై రు ౨౫౦౦/-లు
అర్పించిన దాతలు

శ్రీ మద్ది వెంకట రంగయ్య గారు,

గుంటూరు.

ఓమ్.

# ఆంధ్ర వేదములు.

## [కృష్ణయజుర్వేదము.]

| | | |
|---|---|---|
| ప్రథమాష్టకము.<br>ప్రథమప్రపాఠకము. | హరిః ఓమ్. | ప్రథమానువాకము.<br>ప్రథమపంచాశత్తు. |

మూలము. ౧ఇషేత్వోర్జేత్వా ౨ వాయవస్థోపాయవస్థ ౩ దేవోవఃసవితా
ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వ మఘ్ని యాదేవభాగ
మూర్జస్వతీః పయస్వతీః ప్రజావతీ రనమీవా అయక్ష్మామావః స్తేన ఈశత
మాఘశగ్ంసో రుద్రస్య హేతిః పరివోవృణక్తు ర ధ్రువా అస్మిన్ గోపతౌ
స్యాతబహ్వీః ర్యజమానస్య పశూన్ పాహి॥

దండాన్వయము. ౧ (ఓమోదుగకొమ్మా!) అన్నముకొఱకు, బలమునకుఁ గారణమగు రసముకొఱకును, నిన్ను నఱకుచున్నాను. ౨ (ఓదూడలారా! మీరు లేత గడ్డినిఁ దినుటకై మీతల్లుల సమీపమునుండి తొలగి స్వేచ్ఛగా నరణ్యమునకు) వెళ్ళువారలై యుండుడు. (మఱల సాయంకాలమున యజమానుని గృహమునకు) వచ్చినవారలై యుండుడు. ౩ (ఓయావులారా) ప్రేరకుండు, నన్తర్యామియు, నగు నీశ్వరుఁడు మిక్కిలి యోగ్యమగు నింద్రదధి రూపమైన కర్మకొఱకు మిమ్ము (నరణ్యమునందు తృణాదికమునుఁ దినుటకై) ప్రేరణ చేయుఁగాక. ఓగోవులారా! దేవేంద్రునికి దధిరూపమగు భాగమును (అధికముగ గడ్డినిఁ దినుటచే) వృద్ధిఁ జేయుఁడు.

బలహేతువగు రసముకలిగినట్టియు, నధికమైన పాలుకలిగినట్టియు, బహుసంతానము కలిగినట్టియు, గ్రిమి (పురుగు అని తా॥) దోషరహితములైనట్టియు, నితరరోగము లేనట్టి మిమ్ము దొంగవాడపహరించుటకు సమర్థుఁడు కాకపోవుఁగాక. రుద్రుఁడను క్రూరదేవుని యాయుధము మిమ్ము విడుచుఁగాక. ౪ (ఓ యావులారా!) ఈగోస్వామి యగు యజమానునియందు స్థిరబుద్ధికలవారలై యుండుడు. (సంతానపరంపరచే) ననేకులునై యుండుడు. ౫ (ఓ మోదుగకొమ్మా! నీవు) యజమానునియొక్క గోవులను రక్షించుము.

—:-०-:—

## అనువాకము. ౨.

౨ ౧ యజ్ఞస్య ఘోషదసి ౨ ప్రత్యుష్టగ్ం రక్షః ప్రత్యుష్టా అరాతయః

౩ ప్రేయమగాద్ధిషణాబర్హిరచ్ఛమనునాకృతా స్వధయావితష్టాత ఆవహన్తి

కవయః పురస్తాద్దేవేభ్యోజుష్టమిహ బర్హిరాసదే ౪ దేవానాం పరిషూత

మసివర్షవృద్ధమసి ౫ దేవబర్హిర్మాత్వాఽన్వఙ్మాతిర్యక్పర్వతే రాధ్యాస

౬ మాచ్ఛేత్తాతే మారిషం ౭ దేవబర్హిః శతవల్శం విరోహ

౮ సహస్రవల్శాః॥

౧ (ఓ యశ్వముయొక్క ప్రక్కయెముకా! నీవు) యజ్ఞమునకు 'ఘోషత్' అను (ధనరూప) సాధనమగుచున్నావు. (ఇచట ధనమునకు "ఘోషత్" అని పేరు.) ౨ కోయుటకు సాధనమగు నీ యాయుధమున దాగిన రాక్షసస్వరూపము, ఈ యాయుధమునదాగిన శత్రువులు నశించుచురుగాక, ౩ (ఏకారణమువలన) నా ప్రాచీనులు, విద్వాంసులునగు కర్మిష్ఠులు తూర్పుదిక్కునుండి బర్హిస్సును

దీసికొనివచ్చుచున్నారో! (ఆ హేతువుచే) విద్యారూపమైనదియుఁ, బ్రజాపతిరూపుఁడగు మనువుచేఁ జేయఁబడినదియు, నశ్వముచేఁ దినబడిన యన్నమే స్వరూపముగా గల స్వధచే మిక్కిలి తీక్ష్ణముగాఁ జేయఁబడినదియు నగు నీ గుఱ్ఱముయొక్క ప్రకరయొముక బర్హిస్సునుఁ బొందుటకై వెళ్లెను. (హవిస్సును భక్షించు) దేవతలకొఱకు బ్రియమగు బర్హిస్సు నీ వేదికయందుం (అరుగు) చపలయును. ౪ (ఓ దర్భసముదాయమా! నీవు) దేవతలనిమిత్తమై గ్రహించఁబడిన దానవగుచున్నావు. (మరల) వర్షముచే వృద్ధినొందిన దానవగుచున్నావు. ౫ (దేవతలకొరకగు నో దర్భరాజా!) నిన్నుఁ బొడవుగా రెండువిధములగునట్లుగా హింసించను. హ్రస్వములైన ఖండములుగాను హింసించను. నీ సంబంధియగు మరల మొలచుస్థానమును నష్టముకానట్లుగా సంపాదించగలను ౬ (ఓ దర్భరాజా!) నీకు ఛేదకుఁడనైనను (మంత్ర సామర్థ్యముచే) హింసించువాడనగుట లేదు. (హింసాదోషము నాకుఁగలుగదని తాత్పర్యము) ౭ (దేవతలకొరకగు నో దర్భరాజా! నీవు) అనేక కొమ్మలు కలదానవుగా మొలవవలయును. ౮ (సంతానపరంపరచే) మేమనేక శాఖలు కలవారము కాగలము (ఇచ్చట "వివయగ్ంరుహేమ" అను పదములు ౨వ పనసనుండి యోజనచేసి యర్థము వ్రాయఁబడినవి. ముందుకూడ నిట్లే యర్థానుసారముగ నుత్తరపనసలనుండి మొదటిపదములను పూర్వపు పనసల చివరవాక్యములలో నన్వయించి యర్థము వ్రాయఁబడుచుండును.)

---

పంచాశత్తు ౨

౩ ౧ వివయగ్ంరుహేమ ౨ పృథివ్యాఃసంపృచఃపాహి ౩ సుసంభృతాత్వాసంభ
రామ్యదిత్యైరాస్నాఽసీ ౪ ద్రాణ్యైసంనహనం ౫ పూషాతే గ్రన్థిం
గ్రథ్నాతు ౬ సతేమాఽఽస్థా ౭ దిన్ద్రస్యత్వా బాహుభ్యాముద్యచ్ఛే
౮ బృహస్పతేర్మూర్ధ్నాహరా ౯ మ్యుర్వంతరిక్షమన్విహి దేవంగమమసి॥

౧ (తృణకాష్ఠాదులకు నాధారమగునో ద్రవ్యవిశేషమా! నీవు) భూమి యొక్క సంపర్కమువలన (నీదర్భను) రక్షించుము. ౨ (ఓతాడా! నీవు భూమికి) మొలనూలునకర్హమగు త్రాడు వగుచున్నావు. (ఓదర్భసముదాయమా!) నిన్ను బాగుగా సంగ్రహించుటకు యోగ్యమైన త్రాటిచే బంధించుచున్నాను. ౩ మేఖలా రూపబంధనము సమృద్ధికొఱకగుచున్నది. (అనగా. నింద్రునిభార్య పూర్వజన్మయందు శతక్రతువుల ననుష్ఠించిన తనభర్తచే నాయాక్రతువులందు యోక్త్రము (తాటి)చే బంధింపఁబడుటచేఁ దానిప్పుడు ఇంద్రపత్ని యైనది; కనుక నీబంధనమువలన యజమానుని భార్య (ఉత్తరజన్మమునందు ఇంద్రునిభార్య కాగలదని భావము) ౪ (సమకూర్పఁబడిన యోత్రాడా!) పోషకుఁడగు సూర్యుఁడు నీకు ముడివేయుఁగాక. ౫ (ఓదర్భా!) నీకు నిర్బంధకమగు నాత్రాటిముడి చాలకాలముండదుగాక. (దీనివలన నహింసాఫలము కలుగునని తా॥) ౬ (ఓదర్భా!) ఇంద్రదత్తమగు నింద్రియరూప సామర్థ్యమునిమిత్తమై నిన్ను బాహువులచే నెత్తుచున్నాను. ౭ (ఓదర్భా!) బ్రహ్మత్వసిద్ధికై (నిన్ను) శిరస్సున మోయుచున్నాను. ౮ (ఓదర్భా!) విశాలమగు నంతరిక్షము (వెళ్ళుట కనుకూలమైనది కావున) నీవువెళ్ళుము. ౯ (ఓదర్భా! నీవు) దేవతలనుఁ బొందినదాన వగుచున్నావు.

---

## అనువాకము. ౩.

౪ ౧ శున్ధధ్వం దైవ్యాయ కర్మణే దేవ యజ్యాయై ౨ మాతరిశ్వనో ఘర్మోఽసి

ద్యౌరసి పృథివ్యసి విశ్వధాయా అసి పరమేణ ధామ్నా దృగ్ంహస్వ మాహ్వా

౩ ర్వసూనాం పవిత్రమసి శతధారం వసూనాం పవిత్రమసి సహస్రధారగ్ం

౪ హుతస్తోకో హుతో ద్రప్సోఽగ్నయే బృహతే నాకాయ స్వాహా ద్యా

వాపృథివీభ్యాగ్ం ౫ సావిశ్వాయుః సావిశ్వవ్యచాః సావిశ్వకర్మా ౬ సంపృచ్యధ్వమృతావరీ రూర్మిణీర్మధుమత్తమా మన్ద్రా ధనస్యసాతయే ౭ సోమేన త్వాఽఽతనచ్మీన్ద్రాయ దధి ౮ విష్ణోహవ్యగ్ం రక్షస్వ॥

అవ॥ వెనుకటి యనువాక ద్వయముచే నమావాస్యనాటి పగటియందు చేయుదగిన విధానము చెప్పఁబడినది. ఈ యనువాకమున నారాత్రియందు చేయఁదగిన దోహనము (పాలుపితుకుట) విధించఁబడుచున్నది.

౧ (ఓ పాత్రలారా! మీరు) దేవయాగ స్వరూపమగు దైవికకర్మకొరకుఁ బరిశుద్ధులుకండు. ౨ (ఓ పాలకడవా!) వాయువునకు స్థానమిచ్చుటచే ప్రకాశకమగు నేయంతరిక్షముకలదో! (నీవా) యంతరిక్ష స్వరూపమగుచున్నావు. (మఱియు) ద్యులోకస్వరూపమగుచున్నావు. పృథివీలోకస్వరూపమగుచున్నావు. అధికములైన పాలనుధరించునట్టి గొప్పసామర్థ్యముచే ప్రపంచమునకాధారమగు వర్షరూపమగుచున్నావు (కావున) దృఢముగానుండుము. భగ్నముకావలదు. 3 (ఓ శాఖాపవిత్రమా!) దోహనపాత్రయందుంచఁబడిన నీవు అనేకధారలు కలవియు, (ప్రాణము నిలుచుటకాధారములు, నగు పాలబిందువులకు శోధకమగుచున్నావు. (మూడు దర్భల నొకచోఁగలిపి ముడివేయని పవిత్రమునకు శాఖాపవిత్రమని పేరు.) ౪ అల్పమైనదియు, ప్రౌఢమైనదియు నగు బిందువు నాకమనుపేరుగల (స్వర్గవాసియగు) గొప్పయగ్నికొరకు హుతమగుఁగాక. (ఆవిధముగనే) ద్యావాభూములకొఱకు గూడ స్వాహాకృతమగుఁగాక. (అగ్నియందు హవిస్సునుంచుటమాత్రము హుతమనియు, దేవతనుద్దేశించి త్యాగమును తెలుపు స్వాహాశబ్దము నుచ్చరించుచు నగ్నియందు హవిస్సునుంచుట స్వాహాకృతమనియు భేదము.) ౫ ఆ యావు సమస్తమగు నాయుస్సుకలది. ఆ యావు జగత్తునందు వ్యాప్తికలది. ఆ యావు నిఖిల కర్మలుకలది. (పృథివ్యంతరిక్షద్యులోకాభిమాన దేవతలు వరుసగా నీ చెప్పబడిన గుణములు కలిగియుండుటచే గోవులు ఈ దేవతారూపముగ స్తోత్రముచేయఁబడినవి.) ౬ (ఓ యుదకములారా!) శుభ్రముచేయు సామర్థ్యముకలిగినట్టియు, నలలు

కలిగినట్టియు, మాధుర్యముకలిగినట్టియు, సంతోషకారణములైనట్టి మీరు "సాన్నాయ్య" మను ధనముయొక్క లాభముకొఱకు దోహనపాత్రయందలి పాలతోఁ గలిసికొనుడు. (హోమమున కర్హమయిన పాలు - లేక - పెరుగు - రూపమైన హవిస్సునకు- సాన్నాయ్యమనిపేరు.) ౭ (ఓ క్షీరమా!) (పాలు) పెరుగు- అను సోమము తోనిన్నుఁ దోడుపెట్టుచున్నాను. ఈ తోడుపెట్టుటచే సిద్ధమగు పెరుగు ఇంద్రుని కొఱకు హోమము చేయఁబడును. ౮ ఓవిష్ణుమూర్తీ ! (నీవు) హవిస్సును రక్షించుము.

తృతీయానువాకము సమాప్తము.

---

## అనువాకము ४

౧ కర్మణేవాం దేవేభ్యః శకేయం ౨ వేషాయత్వా ౩ ప్రత్యుష్టగ్ంరక్షః ప్రత్యుష్టా అరాతయో ४ ధూరసి ధూర్వధూర్వన్తం ధూర్వతం యోzస్మాన్ధూర్వతి తంధూర్వయం వయం ధూర్వామ ౫ త్వం దేవానామసి సస్నితమం పప్రితమం జుష్టతమం వహ్నితమం దేవహూతమమహ్రుతమసిహ విర్ధానం దృగ్ంహస్వమా హ్వా ౬ మిత్రస్యత్వా చక్షుషాప్రేక్షే మాభేర్మాసం విక్థా మాత్వా॥

అవ॥ వెనుకటి యనువాకత్రయముచే నమావాస్యదినమునందు చేయఁదగినవిధానమంతయు సమాప్తి సేయఁబడినది. ఇటుపైనఁ బదవయనువాకమునఁ బాడ్యమి తిథియందొనర్పఁదగిన కృత్యము చెప్పఁబడుచున్నది.

౧ (ఓహస్తములారా !) దేవతల సంబంధమైన కర్మకొఱకు శుభ్రముచేయఁబడిన మిమ్ముఁ బ్రయోగించుటకు సమర్థుడనుకాగలను. ౨ (ఓశూర్ప (చేట) మను యజ్ఞసాధనమా !) నిన్ను వ్యాప్తిమత్తమగు యజ్ఞముకొఱకు (స్వీకరించుచున్నాను.) ౩ ఈ మంత్రార్థము వెనుక (అను ౨ పం ౧) చెప్పఁబడినది. ౪ (ఓయగ్నీ !) నీవు హింసకుఁడవగు చున్నావు (కావున) పాపరూపమగు హింసకుని నాశనముచేయుము. (మఱియు) నేరాక్షసాది సముదాయము, (యాగములకు హింసచేయుటద్వారా) మమ్ము హింసించుచున్నదో, ఆరాక్షసాది సముదాయమునుఁ గూడ నాశనము చేయుము. ఏయాలస్యాది రూపమగు శత్రువును మేము హింసించుచున్నారమో, ఆశత్రువునుఁగూడ నాశనము చేయుము. ౫ (ఓశకటమా !) నీవు దేవతలకుసంబంధివగుచున్నావు. (కావున) మిక్కిలి పరిశుద్ధమైనదానవు, ఎక్కువప్రియమైనదానవు, అధికమగు హవిస్సును మోయుదానవు, దేవతల నాహ్వానముచేయు దానవు నగు చున్నావు (మఱియు) వీహ్రులచే నాపాదించఁబడిన వంకరయను దోషములేని దానవు, హవిస్సును ధరించుదానవు నగుచున్నావు (కావున) దృఢముగానుండుము. భగ్నముకావలదు. ౬ (ఓధాన్యసమూహమా !) జగత్తునకు మిత్రుఁడగు సూర్యుని యొక్క చక్షుస్సు (దృష్టి)చే నిన్నుఁ జూచుచున్నాను. కావున భయము నొందవలదు. కంపించవలదు. (నేనైతే) నిన్ను హింసించను. (పైపనసయందలి "హింసిషమ్" అను పదమున కర్థమిచ్చుట వ్రాయఁబడినది.)

---

పంచాశత్తు ౨.

హింసిష ౧ మురువాతాయ ౨ దేవస్యత్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బా

హుభ్యాం పూష్ణో హస్తాభ్యామగ్నయే జుష్టం నిర్వపా ౩ మ్యగ్నీషోమాభ్యా

౪ మిదం దేవానా మిదమునః సహ ౫ స్ఫాత్యైత్వానారాత్యై ౬ సువరభి

విష్ణోఃషమం వైశ్వానరం జ్యోతి ౭ ర్ద్రుగ్ంహస్తాం దుర్యాద్యావాపృథివ్యో ౮ రుర్వన్తరిక్షమన్వి ౯ హ్యాదిత్యాస్త్వోప స్థేసాదయా ౧౦ మ్యగ్నేహవ్యగ్ం రక్షస్వ॥

౧ (ఓ ద్వారమా !) నీవు వాయుప్రవేశమునకై విస్తీర్ణము కమ్ము. ౨ ఓ) హవ్యమా !) ప్రేరకుడగు దేవునియొక్క ప్రేరణము కలుగుచుండగా, నశ్వినీదేవతల యొక్క బాహువులచేతను, పోషకుడగు దేవుని యొక్క చేతులచేతను అగ్ని దేవత కొఱకుఁ బ్రియమగు నిన్నుంచుచున్నాను. (దేవతలనుద్దేశించి యగ్నియందుంచఁ బడు - నేయి మొదలగు ద్రవ్యములకు, హవ్యమనియు, హవిస్సు అనియుపేరు.) 3 ఈపదము వెనుకటి (౨వ) వాక్యమునందలి "అగ్నయే" అను పదస్థానమున నుంచి పూర్వవాక్యార్థమే చెప్పుకొనవలయును. అగ్నీషోమాభ్యామ్ = అగ్ని, సోమ, దేవతల కొఱకు అని యర్థము. ౪ ఈయుంచఁబడిన హవిర్భాగము దేవతలకు (మాత్రము) సంబంధించిన ధనము. ఈ బండియందున్న భాగమైతే. (అర్పణ చేయఁబడనిది) దేవతలతోఁగూడ మాయొక్కధనము. (మాయుభయుల ధనమని తా॥ ౫ (ఓ హవ్యమా !) అభివృద్ధికొఱకు (మంత్రముచే) నిన్ను (సంస్కరించుచున్నాను.) దానము చేయకుండుటకై కాదు. ౬ స్వర్గరూపమగు (స్వర్గసాధన మగుటచేనని తా॥) యాగ ప్రదేశ మంతటను విశేషముగఁ జూచుచుంటిని. ఆహవనీయాగ్నిని సర్వప్రకాశక మగు జ్యోతిస్స్వరూపముగఁ జూచుచున్నాను. ౭ మాగృహములిహలోక పరలోకముల యందు దృఢములై యుండుఁ గాక. ౮ ఈవాక్యార్థము వెనుక (అను ౨పం ౨ వా) చెప్పఁబడినది. ౯ (ఓ హవ్యమా !) నిన్నుభూమియొక్క మధ్యయందుంచుచున్నాను. ౧౦ ఓ యగ్నీ ! హవిస్సును రక్షించుము.

చతుర్థానువాకము సమాప్తము.

---

## అనువాకము ౫.

౧ దేవో వః సవితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోః సూర్యస్య రశ్మిభి

౨ రాపో దేవీ రగ్రేపువో అగ్రేగువోఽగ్ర ఇమం యజ్ఞం నయతాగ్రే యజ్ఞ

పతిం ధత్త యుష్మానిన్ద్రోఽవృణీత వృత్రతూర్యే యూయమిన్ద్ర మవృణీధ్వం

వృత్రతూర్యే ప్రోక్షితాః స్థా ౩ గ్నయే వో జుష్టం ప్రోక్షామ్యగ్నీషోమాభ్యాగ్ం

౪ శున్ధధ్వం దైవ్యాయ కర్మణే దేవయజ్యాయై ౫ అవధూతగ్ం రక్షోఽవ

ధూతా అరాతయో ౬ ఽదిత్యాస్త్వగసి ప్రతి త్వా॥

అవ॥ ఈయనువాకమున వ్రీహిపైభాగమునను౦డు పొట్టు రాక్షసభాగము కావున దానిని బోగొట్టుటకై యవహననము (దంచుట) విధించఁబడుచున్నది.

౧ (ఓ యుదకములారా!) ప్రేరకుడు, నన్తర్యామియు, నగు పరమేశ్వరుఁడు ఆదిత్యస్వరూప భావనాబలమువలన) రంధ్రములు లేని దర్భపవిత్రముచేతను, జగన్నివాసహేతువగు సూర్యునియొక్క కిరణములుగా భావించఁబడిన దర్భావయవముల చేతను, మిమ్ముఁ బవిత్రము చేయుఁగాక. ౨ దేవతాస్వరూపములగు నో యుదకములారా! (శుద్ధిహేతువులగు దర్భలనుఁగూడ ప్రోక్షణముచేఁ బవిత్రము చేయువారలగుటవలన) ముందుగాఁబవిత్రము చేయునట్టియు, ప్రవాహరూపముచే శీఘ్రగాములగుటవలన మనుజులకంటెను) ముందుగానడచుస్వభావముకల మీరు మొదటనీయజ్ఞమును నిర్విఘ్నముగఁబూర్తినొందించుడు. ముందుగా నీయజమానుని స్వర్గమును బొందించుఁడు. (మఱియు) మిమ్ము నింద్రుఁడు వృత్రాసురవధయందు సహాయముగాఁగోరెను. మీరును దేవేంద్రుని సహాయముగాఁ గోరిరి. ప్రోక్షింపఁబడినవారలై యుండుడు. ఉదకసమానులుకావునమీరుఏమిచేయుటకు సమర్థులుకారు? (పూర్వమువృత్రాసురుని వధించుటకై దేవేంద్రుఁడు ప్రజాపతిని ఉపాయమడుగఁగా నతఁడు వజ్రాయుధమునుదక

ములచేఁ బ్రోక్షణముచేసి యింద్రునికిచ్చెను. అనిగాథ. ఉదకముచే బ్రోక్షించుటవలనను, అదియింద్రుడుపయోగించుటవలనను, వృత్రాసురవధ జరిగినదికావున నింద్రునికి నుదకాపేక్షయు, నుదకములకునింద్రాపేక్షయునున్నటుల నిచ్చటఁ జెప్పఁబడినది.) ౩ అగ్నికొఱకు బ్రియమగునట్లుగా మిమ్ముఁబ్రోక్షించుచున్నాను, (ఆవిధముగనే) అగ్నిషోమదేవతల కొఱకుఁబ్రియమగునట్లుగాఁ బ్రోక్షించుచున్నాను. ౪ అర్థము (అను ౩ ప. ౧ న) పూర్వోక్తము. ౫ రాక్షసస్వరూపము నశింపఁజేయఁబడుఁగాక. శత్రువులు నశింపఁజేయఁబడుదురుగాక ౬. (ఓకృష్ణాజిన (లేడిచర్మ)మా! నీవు) భూదేవతయొక్క స్వరూపమవగుచున్నావు. (కావున) భూమి నిన్నుఁ దనస్వరూపమునుగాఁ దెలిసికోనుఁగాక. ("పృథివీ వేత్తు" అను పైపనసలోని పదములకు నర్థమీవాక్యమునందే వ్రాయఁబడినది.)

---

పంచాశత్తు ౨.

పృథివీవేత్వ ౧ ధిషవణమసి వానస్పత్యం ప్రతిత్వాzదిత్యా స్త్వగ్వేత్తు ౨ గ్నేస్త నూరసివాచో విసర్జనం దేవవీతయే త్వాగృహ్ణా ౩ మ్యద్రిరసి వానస్పత్యగ్ సఇదం దేవేభ్యో హవ్యగ్ం సుశమి ౪ శమిష్వేషహవ దోర్జమా వఋద్యుమద్వదత వయగ్ం సంఘాతం జేష్మ ౫ వర్షవృద్ధమసి ౬ ప్రతిత్వా వర్షవృద్ధం వేత్తు ౭ పరాపూతగ్ం రక్షః పరాపూతా అరాతయో ౮ రక్షసాంభాగోzసి ౯ వాయుర్వోవి వినక్తు ౧౦ దేవోవః సవితా హిరణ్యపాణిః ప్రతిగృహ్ణాతు॥

౧ (ఓ యులూఖలమా! (రోలు) నీవు) దంచుటకు నాధారము, వనస్పతి వలనఁ బుట్టినదానవు నగుచున్నావు. అటువంటి నిన్ను భూమియొక్క స్వరూపమగు లేడిచర్మము తన సంబంధినిగాఁ దెలిసికొనుఁగాక (వనస్పతి=చెట్టు ఇచట కఱ్ఱరోలే వాడుదురు.) ౨ (పురోడాశ సంబంధియగునో వ్రీహిసముదాయమా!) నీవు అగ్ని హోత్రుని శరీరమవగుచున్నావు. (మఱియు) వాక్కునకు (ప్రవృత్తి) కారణమగు చున్నావు. (కావున నిటువంటి) నిన్ను దేవతలు భక్షించుటకై స్వీకరించుచున్నాను. ౩ (ఓ రోకలీ! నీవు) వనస్పతివలనఁ బుట్టినదానవైనను (దార్ఢ్యముచే) రాతివగు చున్నావు. అటువంటి నీవు దేవతలకై నీ హవిస్సును శాంతమగునట్లుగా (పొట్టు-మొదలగునది లేక శుభ్రమగునట్లుగా) జేయుము. ౪ (ఓ పాషాణమా! = రాయీ) యజమానుఁడు హవిస్సురూపమగు నన్నము నిచ్చుచున్నాడని దేవతలకుఁజెప్పుము. ఈ యన్నమునకు సంబంధించిన రుచిగల రసమునుగూడ ఇచ్చుచున్నాడని చెప్పుము. (యజ్ఞసంబంధులగు నో యాయుధములారా!) మీరీ హవిస్సును రసాభివ్యక్తికల దానినిగా దేవతలకుఁజెప్పుఁడు. మేమైతే శత్రుసముదాయమును జయించఁగలము. ౫ (ఓ శూర్పమా! (చేట) నీవు) వర్షమువలన వృద్ధినిఁ బొందినదానవగుచున్నావు. ౬ (ఓ వ్రీహి సముదాయమా! వర్షమువలన వృద్ధినొందిన నిన్ను (జేట) తన సంబంధి నిగాఁ దెలిసికొనుఁగాక. ౭ రాక్షసస్వరూపము తిరస్కరించఁబడుఁగాక. శత్రువులు తిరస్కరించఁ బడుదురుగాక. ౮ (ఓ తుషమా! =పొట్టు నీవు) రాక్షసులకు భాగ మగుచున్నావు. ౯ (ఓ తండులములారా! =బియ్యము) వాయువు మిమ్ముఁ గణముల (నూకల) నుండి వేఱుఁజేయుఁగాక. ౧౦ ప్రకాశకుఁడును, ఉంగరము హస్తమునందు కలవాఁడును, నగు సూర్యుఁడు మిమ్ము (జెదరకుండునట్లుగా) రక్షించుఁగాక.

పంచమానువాకము సమాప్తము.

---

అనువాకము ౬

౧ అవధూతగ్ంరక్షోఽవధూతా అరాతయోఽదిత్యా స్త్వగసి ప్రతిత్వా పృథివీవేత్తు ౨ దివఃస్కమ్భనిరసి ప్రతిత్వాఽదిత్యాస్త్వగ్వేత్తు ౩ ధిషణాఽసి

పర్వత్యా ప్రతిత్వాదివః స్కమ్భనిర్వేత్తు ౪ ధిషణాఽసి పార్వతేయీ ప్రతిత్వా పర్వతిర్వేత్తు ౫ దేవస్య త్వాసవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యా మధివపామిధాన్యమసి ధినుహి దేవా ౬ న్ప్రాణాయత్వాఽపానాయత్వా వ్యానాయత్వా ౭ దీర్ఘామనుప్రసితి మాయుషేధాం ౮ దేవోవః సవితా హిరణ్యపాణిః ప్రతిగృహ్ణాతు॥

అవ॥ ఈయనువాకమునఁ దండులపేషణము (బియ్యమును పిండిగాఁ జేయుట) విధించఁబడుచున్నది.

౧ అర్థము పూర్వోక్తము. ౨ (ఓశమ్యా!) (గదతో సమానాకారముకల కఱ్ఱయని తా॥) (నీవు) ద్యులోకమును ధరించిన దానవగుచున్నావు. అందువలన కృష్ణాజినరూపవగు భూమియొక్క చర్మము నిన్ను నభిమానించుఁగాక. ౩ (పిండి చేయుటకు సాధనమగు నోపాషాణమా! నీవు పిండిచేయుటను గుర్తెరింగిన దానవగుటచే) జ్ఞానస్వరూపవగుచున్నావు. (దార్ఢ్యముచే) పర్వతస్థితికిఁ దగుచున్నావు. అటువంటి నిన్ను ద్యులోకమును ధరించు శమ్య యభిమానించుఁగాక. ౪ ఓదృషత్తూ! నీవు పర్వత సంబంధివియు, జ్ఞానస్వరూపము నగుచున్నావు. అటువంటి నిన్ను పర్వత సంబంధియగు దృషత్సామాన్యము తెలిసికొనుఁగాక (దృషత్ తండులములను పిండి చేయుటకు సాధనమగు పాషాణవిశేషము.) ౫ "అధివపామి" అనుపదము వరకు నర్థము పూర్వోక్తము. ధాన్యమగుచున్నావు. దేవతలను సంతోషపెట్టుము. ౬ (ఓహవ్యమా!) నిన్నుఁ బ్రాణముకొఱకుఁ (బిండిచేయుచున్నాను.) (ఇట్లే) అపానముకొఱకు నిన్నుఁ (బిండిచేయుచున్నాను.) వ్యానముకొఱకు నిన్నుఁ (బిండి చేయుచున్నాను.) (ప్రాణము=ఉచ్ఛ్వాసము, అపానము=నిశ్వాసము, వ్యానము= ఆ రెంటియొక్క సంధి. ఈమూడు వృత్తులు యజమానునియందు చాలకాలముండుటకై

నిన్నుఁ బంధించేయుచున్నానని తా॥) ౭ (యజమానుని) యాయురభివృద్ధికై నవిచ్ఛిన్న కర్మసంతతి హేతువగు రాతిని ధరించుచున్నాను. ౮ అర్థము పూర్వోక్తము.

షష్ఠానువాకము సమాప్తము,

---

అనువాకము ౭.

౧ ధృష్టిరసి బ్రహ్మయచ్ఛ ౨ పాగ్నేఽగ్ని మామాదం జహి నిష్క్రవ్యాదగ్ం సేధాఽఽదేవయజం వహ ౩ నిర్దగ్ధగ్ం రక్షో నిర్దగ్ధా అరాతయో ధ్రువమసి పృథివీం దృగ్ంహాయుర్దృగ్ంహ ప్రజాం దృగ్ంహ సజాతానస్మై యజమానాయ పర్యూహ ౪ ధర్త్రమస్యన్తరిక్షం దృగ్ంహ ప్రాణం దృగ్ంహాపానం దృగ్ంహ సజాతానస్మై యజమానాయ పర్యూహ ధరుణమసి దివం దృగ్ంహ చక్షుః॥

అవ. ఈ యనువాకమునఁ గపాలోపధానము (కపాలములనుంచుట) విధించఁబడుచున్నది.

౧ (ఓ యుపవేషమా!) (లోడీతెడు పరిమితికల మోదుగకొమ్మ మొదటి భాగమునకు ఉపవేషమని పేరు) నీవు (నిప్పుకణికలను) దిట్టము చేయుటలో సమర్థమగుచున్నావు (కావున) బ్రహ్మశబ్దమువలనఁ బుట్టిన పురోడాశరూపదేవతల యన్నమును బొందుము. ౨ ఓ గార్హపత్యాగ్నీ! శాస్త్రీయపాకము లేని ద్రవ్యమును దినునట్టి యగ్నినిఁ బోగొట్టుము, లౌకికమగు మాంసమును దినునట్టి యగ్నినిఁగూడ విడిచిపెట్టుము. దేవతలనుఁ బూజించునగ్ని నావహించుము. ౩ (కపాలమునందుదాగు కొనిన) రాక్షస స్వరూపము తగులఁబడుగాక. శత్రువులు తగులబడుదురుగాక.

(ఓ కపాలమా! నీవు) దృఢమగుచున్నావు కావున భూమిని దృఢముగా జేయుము. ఆయుస్సును దృఢముగాజేయుము. సంతానమును దృఢముగాఁజేయుము. జ్ఞాతుల నీ యజమానునకు సేవకులనుగాఁ జేయుము. ౪ (ఓ కపాలమా! నీవు) దృఢమైన దానవగుచున్నావు. (కావున) నంతరిక్షమును దృఢముగాఁజేయుము. ప్రాణమును దృఢముగాఁజేయుము. అపానమును దృఢముగాఁజేయుము ద్యులోకమును, దృష్టిని, శ్రోత్రమును దృఢముగాఁజేయుము. దిక్కులను దృఢముగాఁ జేయుము. యోనిని దృఢముగాఁ జేయుము. సంతానమును దృఢముగాఁ జేయుము, (ఓ యష్టమ కపాలమా! నీవు) వృద్ధిఁబొందిన దానవగుచున్నావు. (కావున) నీ యజమానునకు సంతానమునుఁ గలుగఁజేయుము. ఈ యజమానునకు ధనమును సంపాదించుము. (ఇచ్చట "సజాతానస్మై యజమానాయ పర్యూహ" అను వాక్య మనేక పర్యాయము లావృత్తమైనను అర్థమొకటియే కావున నొకమారే యర్థమువ్రాయ బడినది. పై పనసలోని "భృగూణామ్" అను పదముపరకు గల భాగమునకు నిచ్చట నీయర్థము వ్రాయబడినది.)



పంచాశత్తు ౭

౧ దృగ్ంహ శ్రోత్రం దృగ్ంహ సజాతానస్మై యజమానాయ పర్యూహ ధర్త్రమసి దిశో దృగ్ంహ యోనిం దృగ్ంహ ప్రజాం దృగ్ంహ సజాతానస్మై యజమానాయ పర్యూహ చితఃస్థ ప్రజామస్మై రయిమస్మై సజాతానస్మై యజమానాయ పర్యూహ భృగూణామఙ్గిరసాం తపసా తప్యధ్వం ఽ యాని ఘర్మే కపాలాన్యుపచిన్వన్తి వేధసః। పూష్ణస్తాన్యపి వ్రత ఇన్ద్రవాయూ విముఞ్చతామ్॥

౧ "భృగూణాం" అనువాక్యమునకిచట నర్థము వ్రాయఁబడుచున్నది. (ఓ కపాలములారా!) భృగువుల యొక్కయు, నంగీరసుల యొక్కయు, (దేవతలని తా॥) తపస్సుచే వెచ్చఁబడుఁడు. ౨ అధ్వర్యురూపుఁడగు బ్రహ్మ యే కపాలములనుఁ బ్రజ్వలించిన యగ్నియందుఁ గాచుచున్నాఁడో! పోషకుఁడగు యజమానునియొక్క యాగరూపవ్రతము సమాప్తమైనదగుచుండఁగా నా కపాలములనుఁ గూడ ఇంద్రవాయువులు విడచుదురుఁగాక.

సప్తమానువాకము సమాప్తము

---

## అనువాకము ౮.

౧ సం వపామి ౨ సమాపో అద్భిరగ్మత సమోషధయో రసేన సగ్ంరేవతీ
ర్జగతీభి ర్మధుమతీ ర్మధుమతీభిః సృజ్యధ్వ ౩ మద్భ్యః పరిప్రజాతాః స్థ సమద్భిః
పృచ్యధ్వం ౪ జనయత్యై త్వా సంయౌ ౫ మ్యగ్నయే త్వాఽగ్నీషోమాభ్యాం ౬ మ
ఖస్య శిరోఽసి ౭ ఘర్మోఽసి విశ్వాయు ౮ రురుప్రథస్వ రుతే యజ్ఞపతిః ప్రథతాం
౯ త్వచం గృహ్ణీష్వా ౧౦ న్తరితగ్ం రక్షోఽన్తరితా అరాతయో ౧౧ దేవస్త్వా
సవితా శ్రపయతు వర్షిష్ఠే అధి నాకేఽగ్నిస్తే తనువం మాతిధా ౧౨ గగ్నే హవ్యగ్ం
రక్షస్వ ౧౩ సం బ్రహ్మణా పృచ్యస్వై ౧౪ కతాయ స్వాహా ద్వితాయ స్వాహా
త్రితాయ స్వాహా ॥౧॥

౧ ఈ మంత్రమున "దేవస్య త్వా" అను వెనుకటి (అను౧౪ ప ౨) మంత్రము నందలి "నిర్వపామి" అను పదస్థానమున యోజన చేసికొని వెనుకటి యర్థమునే చెప్పుకొనవలయును. హవిస్సునుగూర్చి సంబోధనము. సంవపామి = వండుచున్నాను. ౨ (చమసపాత్రయందలి) యుదకములు (కాచఁబడిన) యుదకములతోఁ గలిసికొనుఁగాక. (పిండియైన) యోషధులు ద్వివిధమగు నుదకరసముతోఁ గలిసికొనుఁగాక. (ఓయుదకములారా! ధనముగలిగినట్టియు, మాధుర్యముగలిగినట్టియు, మీరు పశుధనముకలవియు, సహజమగు మాధుర్యముగలవియు నగు (పిండిరూపమైన యోషధులతోఁ గలసికొనుఁడు. ౩ (పిండిరూపమైన యోషధులారా! మీరుమొదట) నుదకముల వలనఁబుట్టినారు. (కావునయిప్పుడుగూడ) నుదకములతోఁగలసికొనుఁడు. ౪ తడుపఁబడినపురోడాశమా) నిన్నుఁ జేతివేళ్ల మర్దనముచే బాగుగఁగలుపుచున్నాను. ౫ (ఓ పురోడాశమా!) అగ్ని దేవతకొఱకును, అగ్నీషోమ దేవతలకొఱకును నిన్ను నేను తాకుచున్నాను. ౬ (ఓ పురోడాశమా!) నీవుయజ్ఞమునకు శిరస్సగుచున్నావు. ౭ (ఓ పురోడాశమా! నీవు) వెచ్చపెట్టఁబడిన కపాలమునందుండుటచే ప్రకాశించుచున్నావు. (దేవతాయోగ్యమగుటచే) సంపూర్ణాయువు నిచ్చుదానవగుచున్నావు. ౮ (ఓ పురోడాశమా! నీవు) విస్తీర్ణము వగుము. నీయజమానుఁడు గూడ (సంతానముచే) విస్తీర్ణుడగుఁగాక. ౯ (పురోడాశమా! నీవు ఉదకములచేఁదడిసిన) చర్మమును తీసికొనుము. ౧౦ (హవిస్సునందు దాగికొనిన) రాక్షసస్వరూపము నశించుఁగాక. శత్రువులు నశించుదురుగాక. ౧౧ (ఓపురోడాశమా!) ప్రేరకుఁడు, అన్తర్యామియు నగు దేవుఁడువృద్ధినొందిన నాకమనుపేరుకల యగ్నియందుంచి నిన్నుఁ బక్వముచేయుఁగాక. ఈ యగ్ని నీశరీరమును భస్మము చేయకుండుఁగాక. ౧౨ ఓ యగ్నీ! హవిస్సును రక్షించుము. ౧౩ (పురోడాశమా!) మంత్రముతో సంపర్కము కలిగియుండుము. ౧౪ (పాత్రను శుభ్రముచేసిన యుదకము) ఏకతుఁడు, ద్వితుఁడు, త్రితుడు, అను దేవులకొఱకు స్వాహాకృతమగుఁగాక. (పూర్వము దేవతలు వ్రీహులను దంచుటచే హవిస్సునుసంపాదించి, యాబీజవధవలనఁ గలిగినపాపము నెచ్చటనుంచుదమా! అని విచారించి తమవీర్యము నగ్నియందుంచిరట. పిమ్మట నాయగ్ని యుదకదేవతను

ధ్యానించి యీ దేవవీర్యము నుదకమునందుంచెనట. ఆ యుదకమునుండి ఏకత, ద్విత-త్రితులను, దేవతలుపుట్టిరి అని పూర్వగాథ.

అష్టమానువాకము సమాప్తము.



అనువాకము. ౯.

౧ ఆదద ౨ ఇన్ద్రస్య బాహురసి దక్షిణః సహస్రభృష్టి శ్శతతేజా వాయురసి తిగ్మతేజాః ౩ పృథివి దేవ యజన్యోషధ్యాస్తే మూలం మాహిꣳసిషం ౪ మపహతోఽరరుః పృథివ్యై ౫ వ్రజం గచ్ఛ గోస్థానం ౬ వర్షతు తే ద్యౌ ౭ ర్బధాన దేవ సవితః పరమస్యాం పరావతి శతేన పాశైర్యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మస్తమతో మామౌ ౮ గపహతోఽరరుః పృథివ్యై దేవయజన్యై వ్రజమ్॥

౧ ఈపదము వెనుకటి "దేవస్యత్వా" అను మంత్రమునందలి "నిర్వపామి" అను పదస్థానమున యోజనచేసికొనవలయును. స్ఫ్యమను ఖడ్గవిశేషము (యజ్ఞసాధనము)ను, ఆదదే= తీసికొనుచున్నాను. అని అర్థము. ౨ (ఓయజ్ఞ ఖడ్గమా! నీవు) సహస్ర శత్రువులను నశింపఁజేయునదియుఁ, దేజస్సుతోఁగూడ కొనినదియు, నగు నూఱు ఆయుధములుకల దేవేంద్రుని కుడిచేతివలె సమర్థమగున్నావు. (మఱియు) వాయువువలెఁ దీక్ష్ణమగు తేజస్సుకల దానవగుచున్నావు. ౩ దేవయాగమున కాశ్రయమైన యోభూమీ! నీసంబంధమైన యోషధి మొదటిని హింసించను. ౪ అరరువను రాక్షసుఁడు భూమినుండి తొలఁగిన వాఁడగుఁగాక. ౫ (గడ్డిపోచలతోఁ గూడుకొనిన

రోధూళీ!) వాక్కునకు స్థానమగు నుత్కరప్రదేశమును గూర్చివెళ్ళుము. ౬ (ఓ వేదికా!) నీకు మేఘము వర్షించుగాక. ౭ ప్రేరకుఁడవు, అన్తర్యామివి నగు నో దేవా! ఏశత్రువు మమ్ము ద్వేషించుచున్నాడో, ఏశత్రువును మేము ద్వేషించుచున్నారమో ఆశత్రువును నూరు పాశములచే నత్యంతము దూర దేశమునందు బంధించుము. ఈ బంధనమునుండి విడువవలదు. ౮ ఈ వాక్యమున కర్థము వెనుకఁ జెప్పబడినది (అను ౯ ప ౧ వా ౭-౫).

---

పంచాశత్తు ౨

౧ గచ్ఛగోస్థానం వర్షతు తే ద్యౌర్బధాన దేవసవితః పరమస్యాం పరావతి శతేన పాశైర్యోఽస్మాన్ ద్వేష్టి యంచ వయం ద్విష్మస్త మతో మామౌగప హాతో౽రరుః పృథివ్యా అదేవయజనో వ్రజం గచ్ఛగోస్థానం వర్షతు తే ద్యౌర్బధాన దేవసవితః పరమస్యాం పరావతి శతేన పాశైర్యోఽస్మాన్ద్వేష్టి యంచ వయం ద్విష్మస్తమతో మా॥

౧ మంత్రార్థము ఈ మొదటి పనసయందే చెప్పఁబడినది. ఇచ్చట "అదేవ యజనః" అనుపదము "అరరుః" అనుపదమునకు విశేషణము.

మా ౧ గరరుస్తే దివం మాస్కా ౨ న్వసవస్త్వా పరిగృహ్ణన్తు గాయత్రేణ ఛన్దసారుద్రాస్త్వా పరిగృహ్ణన్తు త్రైష్టుభేన ఛన్దసాఽఽదిత్యాస్త్వా పరిగృహ్ణన్తు జాగతేనఛన్దసా ౩ దేవస్యత్వా సవితుః సవే కర్మ కృణ్వన్తి వేధస ౪ ఋత మస్యృత సదనమస్యృతశ్రీరసి ౫ ధా అసి స్వధా అస్యుర్వీ చాసి వస్వీచాసి

పురా క్రూరస్య విసృపో విరప్శిన్ను దాదాయ పృథివీం జీరదానుర్యామైర

యఞ్చన్ద్రమసి స్వధాభిస్తాం ధీరాసో అను దృశ్య యజన్తే॥

౧ (పరాగసమూహ రూపమగునో యుత్కరప్రదేశమా!) నీసంబంధమగు నరరువను రాక్షసుఁడు స్వర్గమునుఁ బొందకుండుఁగాక. ౨ (ఓ వేదీ!) వసురూపుఁడగు నధ్వర్యుఁడు నిన్ను గాయత్రీ ఛన్దోరూపమగు యజ్ఞఖడ్గము (స్ఫ్యము) చే మూడుగీతలు గీయుఁగాక. రుద్రరూపుఁడగు నధ్వర్యుఁడు త్రిష్టుప్ఛన్దో రూపమగు యజ్ఞఖడ్గ (స్ఫ్య) ముచే మూడుగీతలు గీయుఁగాక. ఆదిత్య రూపుఁడగు నధ్వర్యుఁడు జగతీఛన్దో రూపమైన స్ఫ్యముచేత మూడుగీతలు గీయుఁగాక. (యాగమునకై చతురశ్రముగా నలంకరించఁబడిన భూమికి వేదియని పేరు). 3 ప్రేరకుఁడు, అన్తర్యామియునైన పరమేశ్వరుని యాజ్ఞయుండఁగా బ్రహ్మసమానులగు నధ్వర్యులు ఖనన (త్రవ్వుట) రూపకర్మనుఁ జేయుచున్నారు. (ఈశ్వరానుజ్ఞచేతనే సర్వజనులు తమ యభీష్టము నెఱవేర్చుకొనుచున్నారనుట ప్రసిద్ధమని దీనివలనఁ దెలియుచున్నది.) ర ఓ వేదీ! నీవు) సత్యస్వరూపమగుచున్నావు. సత్యమునకుస్థానమగుచున్నావు. ౫ (హేవిరప్శిన్!) వివిధముగా మంత్రోచ్చారణముఁ జేయు ఋత్విక్కులు గలిగినయో వేదీ! క్రూరుఁడగు నరరు రాక్షసుఁడు పోవుటవలనఁ బూర్వకాలమందు యజ్ఞహవిస్సులను ధరించినదాన వగుచున్నావు. పితృదేవతల సంబంధియైన పిండ (స్వధ) మగుచున్నావు. (సమస్తమును ధరించుటచే) విస్తీర్ణమగుచున్నావు. (పురోడాశాదిరూప) ధనముకలదానవగుచున్నావు. జీవనమే స్వభావముగాఁగలవారు, హవిస్సును దానముచేయువారునగు యజమానులు వేదిరూపమైన యేభూమినిఁ (రాక్షసభూమికిఁ) బైగాఁ దీసికొనివచ్చి చంద్రునియందు అమృతకిరణములచే స్థాపించినారో! ఆభూమి(వేది) ని బుద్ధిమన్తులు మనస్సుచే నాలోచించి (దానియందు) యాగముచేయుచున్నారు.

నవమానువాకము సమాప్తము.

---

అనువాకము ౧౦

౧ ప్రత్యుష్టగ్ంరక్షః ప్రత్యుష్టా అరాతయోఽగ్నేర్వస్తే జిష్ఠేన తేజసా ని ష్టపామి ౨ గోష్ఠంమా నిర్మృక్షం వాజినంత్వా సపత్నసాహగ్ం సంమార్జ్మి వాచంప్రాణంచక్షుః శ్రోత్రంప్రజాం యోనిం మానిర్మృక్షం వాజినీంత్వా సపత్నసాహీగ్ం సంమార్జ్మ్యి 3 ఆశాసానా సౌమనసంప్రజాగ్ం సౌభాగ్యం తనూమ్ అగ్నేరను వ్రతాభూత్వాసం నహ్యే సుకృతాయకమ్ ౪ సుప్రజసస్త్వావయగ్ం సుపత్నీరుప॥

౧ రాక్షససమూహము నశించుఁగాక. శత్రువులు నశింతురుగాక. (ఓ స్రుక్కులారా! అతితీక్ష్ణమగునగ్ని తేజస్సుచే మిమ్ము బాగుఁగ గాచుచున్నాను. (స్రుక్ స్రువములు=నేయి మొదలగు హవిస్సులను హోమము చేయుటకు సాధనములు) ౨ (ఓ స్రువమా!) గోస్థానమును నాశనము చేయను. అన్నముకలిగినట్టియు, శత్రువును దిరస్కరించునట్టి నిన్ను బాగుగశోధనము చేయుచున్నాను. వాక్కును, ప్రాణమును, చక్షుస్సును, శ్రోత్రమును, (చెవిని) సంతానమును, యోనిని, నాశనము చేయను. అన్నమునుఁగలిగినట్టియు, శత్రువునుఁ దిరస్కరించునట్టి నిన్ను బాగుగశోధనముచేయుచున్నాను. 3 (పత్ని) అగ్నిననుసరించినదైయుండి, సరియగుమనోభావమును, సంతానమును, సౌభాగ్యమును, శరీరమును, గోరుచున్నదో! (ఆమెను) శుభకర్మకొఱకు సుఖమగునట్లుగా బంధించుచున్నాను. ౪ ఓ యగ్నీ! శత్రువులనశింపఁజేయువాడవును, ఎవ్వరిచేతఁ దిరస్కరించఁబడనివాడవునగు నిన్ను, సరియగు సంతానముకలవారమును, యోగ్యుడగు భర్తగలవారమును, నెవ్వరిచేతను తిరస్కరించఁబడనివారమునగు మేము సేవించుచున్నాము.

—:-౦-:—

## పంచాశత్తు ౨.

౧ సేదిమ। అగ్నేసపత్నదమ్భన మదబ్ధాసో అదాభ్యమ్। ౨ ఇమంవిష్యామి వరుణస్య పాశం యమబధ్నీత సవితాసుకేతః। ధాతుశ్చయోనౌ సుకృతస్య లోకేస్యోనంమే సహపత్యాకరోమి 3 సమాయుషా సంప్రజయా సమగ్నే వర్చసాపునః। సంపత్నీ పత్యాహం గచ్ఛే సమాత్మాతనువామమ ౪ మహీనాం పయోఽస్యోషధీనాగ్ం రసస్తస్య తేఽక్షీయ మాణస్యనిః॥

౧ ఈ వాక్యార్థము వెనుకటి చివరవాక్యముతోఁ గలిపి వ్రాయఁబడినది. ౨ యోగ్యమగు జ్ఞానముకలసూర్యుఁడు వరుణునియొక్క యేపాశమును బంధించెనో! ఈపాశమును విడచుచున్నాను. బ్రహ్మయొక్కస్థానమున బాగుగఁ చేయఁబడిన కర్మకు ఫలమగు లోకమునందు భర్తతోఁగూడ నాకు సుఖమునుఁ జేసికొనుచున్నాను. 3 ఓ యగ్నీ! (నేను) ఆయువుతోఁ గలిసికొనుచున్నాను. సంతానముతోఁ గలిసికొనుచున్నాను. (పాతివ్రత్య మేస్వరూపముగాఁగల) వర్చస్సుతోఁ గలిసికొనుచున్నాను. ఈభర్తతో మాటిమాటికి భార్యనై కలిసికొనుచున్నాను నాశరీరముతో జీవాత్మ చాలకాలము కలయుగాక. ౫ (ఓ యాజ్యమా! అనఁగా నేయి నీవు) గోవులపాలవగుచున్నావు. ఓషధులరసముకూడ నగుచున్నావు. అట్టి క్షీణముకాని నీయొక్క (స్వరూపమును దేవయాగముకొఱకుఁ) బాత్రయందుంచుచున్నాను.

---

## పంచాశత్తు 3.

వపామి ౧ మహీనాం పయోఽస్యోషధీనాగ్ం రసోఽదబ్ధేన త్వాచక్షు

షాఽవేక్షే సుప్రజాస్త్వాయ ౨ తేజోఽసి తేజోఽను ప్రేహ్యగ్నిస్తే తేజోమావినై ౩ దగ్నేర్జిహ్వాఽసి సుభూర్దేవానాం ధామ్నే ధామ్నే దేవేభ్యో యజుషేయజుషేభవ ౪ శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి ౫ దేవోవః సవితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోఃసూర్యస్య రశ్మిభిః ౬ శుక్రంత్వా శుక్రాయాం ధామ్నే ధామ్నే దేవేభ్యో యజుషే యజుషే గృహ్ణామి జ్యోతిస్త్వా జ్యోతిష్యర్చిస్త్వాఽర్చిషి ధామ్నేధామ్నే దేవేభ్యో యజుషేయజుషే గృహ్ణామి॥

౧ (ఓ యాజ్యమా! నీవు) గోవులపాలగుచున్నావు. ఓషధులరసముకూడ నగుచున్నావు. రోగముచేఁగొట్టఁబడని దృష్టిచే నిన్ను యోగ్యసంతానముకలిగి యుండుటకొరకుఁ జూచుచున్నాను. ౨ (ఓ యాజ్యమా! నీవు) తేజోరూపమయిన యాహవనీయాగ్నినిఁ బ్రవేశించుటకై వెళ్లుము. (ఈ) యాహవనీయాగ్ని నీతేజస్సును బోగొట్టకుండుఁగాక. ౩ (ఓ యాజ్యమా! జ్వాలారూపమయిన నాలుకలఁబుట్టించు దానవగుటచే) నగ్నియొక్క నాలుక వగుచున్నావు. దేవతలసుఖముకొరకగుచున్నావు (ఇటువంటినీవు) దేవతలకొరకు నాయాయాహుతికి నాయా మంత్రపూర్వక గ్రహణమునకై సమర్థమగుము. ౪ (ఓ యాజ్యమా! నీవు) ప్రకాశముకలదానవగుచున్నావు. జ్యోతిస్స్వరూపమగుచున్నావు. తేజోరూపమగుచున్నావు. ౫ అర్థము పూర్వోక్తము. ౬ (ఓ యాజ్యమా! ప్రకాశముకల నిన్నుఁ బ్రకాశముకలదాని యందు దేవతలకొరకు నాయా యాహుతికి నాయామంత్రపూర్వక గ్రహణమునకై సమర్థమగునట్లుగా గ్రహించుచున్నాను. జ్యోతిస్స్వరూపమగు నీవు జ్యోతిస్సునందును, కాంతిరూపమగునీవు కాంతియందును, దేవతలకొరకు నాయా యాహుతికై నాయా మంత్రపూర్వకగ్రహణమునకు సమర్థమగుదువుగాక.

దశమానువాకము సమాప్తము.

---

అనువాకము ౧౧

౧ కృష్ణో౽స్యాఖరేష్ఠో౽గ్నయే త్వా స్వాహా ౨ వేదిరసి బర్హిషే త్వా స్వాహా

౩ బర్హిరసి స్రుగ్భ్యస్త్వా స్వాహా ౪ దివే త్వా౽న్తరిక్షాయ త్వా పృథివ్యై త్వా

౫ స్వధా పితృభ్య ఊర్గ్భవ బర్హిషద్భ్య ఊర్జా పృథివీం గచ్ఛత ౬ విష్ణో స్తూ

పో౽సి ౭ ఊర్ణామ్రదసం త్వా స్తృణామి స్వాసస్థం దేవేభ్యో ౮ గన్ధర్వో౽సి

విశ్వావసుర్విశ్వస్మాదీషతో యజమానస్య పరిధిరిడ ఈడిత ఇన్ద్రస్య బాహురసి

౧ (ఓ యిధ్మమా! నీవు) కృష్ణమృగమగుచున్నావు. వనస్పతియందున్న దానవగుచున్నావు. (కావున) నగ్నికి (ప్రియమగు నిన్నుఁ ప్రోక్షించుచున్నాను. (ఇధ్మము=అగ్నిలో హోమముచేయఁదగు సమిధ.) ౨ (ఓ వేదీ! నీవు) లాభము బొందినదానవగుచున్నావు. కావున బర్హిస్సును ధరించుటకొఱకు నిన్ను ప్రోక్షించు చున్నాను. ౩ (ఓ దర్భా! నీవు ఆజ్యాదులచే) వృద్ధినొందినదానవగుచున్నావు (కావున) స్రుక్కుల (స్థాపనము) కొఱకు నిన్నుఁ ప్రోక్షించుచున్నాను (స్రుక్కు= హోమము చేయు సాధనము.)

౪ (ఓదర్భా!) ద్యులోకముకొఱకు నంతరిక్షలోకముకొఱకు నిన్నుఁ (ప్రోక్షణము చేయుచున్నాను) పృథివీలోకమునకై నిన్నుఁ (ప్రోక్షించుచున్నాను.) (ప్రోక్షణము= నీరుచల్లుట) ౫ (ఓజలమా! నాచేనీవు) పితృదేవతలకొఱకు నివ్వఁబడితివి. కావున బర్హిస్సునందున్న పితృదేవతలకై రసరూపముకమ్ము. (ఓజలావయవములారా!) మీ యుద్భూత (వ్యక్తమైన) రసరూపముచే భూమినిఁ బొందుఁడు. ౬ (ఓపరిస్తరమా!) వ్యాపించినటువంటి యజ్ఞమును సంఘాతరూపమై ధరించిన దానవగుచున్నావు. (పరిస్తరము=దర్భకట్ట) ౭ (దేవతలకొఱకగు నోదర్భరాజా!) కంబళివలె మెత్తనిస్వరూపముగల నిన్ను దేవతలకొఱకు సుఖమయిన స్థానముఁగా (వేదియందు)

పఱచుచున్నాను. ౮ (ఓమధ్యమపరిధీ ! నీవు) విశ్వావసువను పేరుకలగన్ధర్వుఁడవగు చున్నావు. (కావున) సర్వహింసకులనుండి యజమానునకు రక్షకము, అన్నరూపమునై, స్తుతింపఁబడినదానవుకమ్ము (నీవు) దేవేంద్రునియొక్క కుడిచేతివగు చున్నావు. యజమానునికి రక్షకము, అన్నరూపమునై, స్తుతింపఁబడినదానవుకమ్ము. మిత్రావరుణ దేవతలు నిన్ను నుత్తరభాగమున ధరించుదురుగాక. (అనుష్ఠింపఁ బడుచున్న) నిత్యకర్మచే యజమానునకుఁ, బోషకము, అన్నరూపమునై, స్తుతింపఁ బడినదానవుకమ్ము (పరిధి=యాగార్హమైనమేడి కఱ్ఱ).

పంచాశత్తు ౨.

దక్షిణో యజమానస్య పరిధిరిడ ఈడితో మిత్రావరుణౌ త్వోత్తరతః పరిధత్తాం ధ్రువేణ ధర్మణా యజమానస్య పరిధిరిడ ఈడితః ౧ సూర్యస్త్వా పురస్తాత్పాతు కస్యాశ్చిద భిశస్త్యా ౨ వీతిహోత్రం త్వాకవేద్యు మన్తగ్ం సమిధీమహ్యగ్నే బృహన్త మధ్వరే ౩ విశోయన్త్రే స్థ వసూనాగ్ంరుద్రాణా మాదిత్యానాగ్ం సదసిసీద ౪ జుహూరుపభృద్ధ్రువాఽసి ఘృతాచీ నామ్నా ప్రియేణ నామ్నా ప్రియే సదసిసీద ౬ తా అసదన్త్సు కృతస్య లోకే తావిష్ణో పాహి పాహి యజ్ఞం పాహి యజ్ఞపతిం పాహిమాం యజ్ఞనియమ్॥

౧ (ఓ మధ్యమపరిధీ !) సూర్యుఁడునిన్ను ముందుగాఁ బ్రతిహింసనుండియు రక్షించుఁగాక! (ఈ ౧వ వాక్యమునకర్థము వెనుకటిభాగమునకుఁ బూర్వవాక్యమున వ్రాయఁబడినది.) ౨ పండితుఁడవగు నో యగ్నీ' సమృద్ధికొఱకు హోమము కలవాఁడవును, ప్రకాశవన్తుఁడవును, గొప్పవాఁడవునగునిన్ను యజ్ఞమునందు ప్రజ్వ

లింపఁజేయుచున్నాము. (పరిధి=యజ్ఞార్హమైన మేడిచెట్టుయొక్క కాష్ఠమునకు పేరు.) ౩ (ఓ దర్భలారా! మీరు) సంతానమునకు నియామకులైయుండుఁడు. ౪ (ఓ ప్రస్తరమా! నీవు) వసువులయొక్కయు, రుద్రులయొక్కయు, నాదిత్యులయొక్కయు స్థానమునందుండుము. ౫ (ఓ ప్రస్తరమా! నీవు) జుహూవుస్వరూపము, ఉపభృత్తువు ధ్రువ స్వరూపమునగుచున్నావు. ప్రియమైన "ఘృతాచి"యను పేరుతో ప్రియమగు స్థానమునందుండుము. (జుహూవు, ఉపభృత్తు, ధ్రువ, ఈ మూఁడును హోమముచేయు సాధనములు) ౬ ఈ స్రుక్స్రువములు (హోమముచేయు సాధనములు) పుణ్యలోకమునందున్నవి. ఓ విష్ణుమూర్తీ! ఆస్రుక్స్రువములనుఁ బాలించుము. యజ్ఞమును రక్షింపుము. యజమానుని రక్షింపుము. యజ్ఞార్హుఁడనైన నన్ను రక్షింపుము.

ఏకాదశానువాకము సమాప్తము.

---

## అనువాకము ౧౨.

౧ భువనమసి విప్రథస్వాగ్నే యష్టరిదంనమః ౨ జుహ్వేహ్యగ్నిస్త్వాహ్వయతి దేవయజ్యాయా ఉపభృదేహి దేవస్త్వాసవితాహ్వయతి దేవయజ్యాయా ౩ అగ్నా విష్ణూమావామవ క్రమిషం విజిహాథాం మామాసంతాప్తంలోకం మేలోకకృతౌకృణుతం ౪ విష్ణోస్స్థానమసీ ౫ తఇన్ద్రో అకృణోద్వీర్యాణి సమారభ్యోర్ధ్వో అధ్వరో దివిస్పృశమహ్రుతో యజ్ఞోయజ్ఞపతేరిన్ద్రావాన్త్స్వాహా ౬ బృహద్భాః ౭ పాహిమాఽగ్నే దుశ్చరితాదామా సుచరితేభజ ౮ మఖస్యశిరోఽసి సంజ్యోతిషాజ్యోతిరఙ్క్తామ్॥

౧ (యాగమునుబూర్తిసేయు) నో యగ్నీ! (నీవు) భువన (సర్వమునకాధార) మగుచున్నావు. కావున విశాలమగుము. నీకొరకీయంజలిరూప నమస్కారము. ౨ ఓ జుహూవా! రమ్ము. అగ్నిహోత్రుఁడు నిన్ను దేవయాగముకొరకుఁ బిలుచుచున్నాఁడు. ఓ యుపభృత్తా! రమ్ము. ప్రకాశకుఁడు, ప్రేరకుఁడునగు సూర్యుఁడు నిన్ను దేవయాగముకొరకుఁ బిలచుచున్నాడు. (జుహూ, ఉపభృత్ = ఈరెండును హోమసాధన వస్తువులు.) ౩ ఓ యగ్నావిష్ణు దేవతలారా! (ఆఘార హోమముకొరకు మీ మధ్య నడచుచున్నవాఁడనైనను నేను పాదముచే) మిమ్ములనతిక్రమించను. నడచుటకవకాశమిచ్చుటకు నాకెడముగానుండుడు. నన్నుఁగూర్చి సంతాపమునుఁ జేయకుఁడు. స్థానమునకుఁగారణములైనమీరు నాకు (వెళ్ళుటకై) స్థానమునుఁ జేయుఁడు. ౪ (ఓ భూప్రదేశమా! నీవు) యజ్ఞపురుషునకు స్థానమగుచున్నావు. ౫ ఈ దేవయాగస్థాన బలమువలన నింద్రుఁడు (రాక్షసవధరూప) వీర్యములఁ జేసెను. నైరుతీదిక్కు నారంభించి పొడవైనదియు హింస (విచ్ఛేదము) లేనిదియు, నీశాన (దేవ) దిక్కును స్పృశించి కుటిలముకానిదియు, నింద్రుఁడు దేవతగాఁగలదియునగు యజ్ఞస్వామియైన యజమానుని యాఘారము దేవతకొరకివ్వఁబడినది. (ఆఘారము = ఒకానొక యాజ్య హోమమునకుఁ బేరు.) ౬ (ఈ యాఘారముచే జ్వాలారూపమేవిధముగా) గొప్పఁదగుచున్నదో! (ఆవిధముగా నీయగ్ని) ప్రకాశించుచున్నది. ౭ ఓ యగ్నీ! దుష్టమగు నాచరణము (అసత్యము) నుండి నన్నురక్షించుము. మంచియాచరణము (సత్యము) నందు నన్ను స్థాపించుము. ౮ (ఓ మిగిలిన యాఘారమా! నీవు) యజ్ఞమునకు నుత్తమాంగమ (శిరస్సు) గుచున్నావు (కావున నీరూపమైన జ్యోతిస్సుతో (ధ్రువపాత్రయందలి యాజ్యరూప) జ్యోతిస్సుకలిసికొనుఁగాక.

ఇట్లు ద్వాదశానువాకము సమాప్తము.

---

### అనువాకము ౧౩.

౧ వాజస్యమా ప్రసవేనోద్గ్రాభేణోదగ్రభీత్ । అథాసపత్నాగ్ం ఇన్ద్రోమే నిగ్రాభేణాధరాగ్ం అకః । ఉద్గ్రాభంచ నిగ్రాభంచ బ్రహ్మదేవాఅవీవృధన్ ।

అథా సపత్నా నిన్ద్రాగ్నీ మే విషూచీనాన్వ్యస్యతామ్ ౨ వసుభ్యస్త్వా రుద్రేభ్యస్త్వాఽఽదిత్యేభ్యస్త్వాఽ ౩ క్తగ్ం రిహాణా వియన్తు వయః । ప్రజాం యోనిం మానిర్మృక్షం ౪ మాప్యాయన్తామాప ఓషధయో మరుతాం పృషతయః స్థదివమ్॥

౧ అన్నమును జుహువు నూర్ధ్వముగా గ్రహించుటవలన నిచ్చటనుండి యింద్రుఁడు నన్ను నూర్ధ్వముగా గ్రహించెను. పిమ్మట ఉపభృత్తును గ్రిందుగా గ్రహించుటచే నాశత్రువులను నికృష్టులనుగాఁ జేసెను. పరబ్రహ్మయు, దేవతలును నాయుత్కర్షను, శత్రువుల నికృష్టతను (న్యూనతను) వృద్ధినొందించిరి. పిమ్మట నింద్రాగ్నులు నాశత్రువులను వంకరనడకగలవారినిగా విశేషముగాఁ బ్రవర్తింపఁ జేసిరి. ౨ (ఓమధ్యమపరిధీ!) నిన్ను వసువులకొఱకు (జుహువుతోఁ) గలుపుచున్నాను. (ఓ దక్షిణపరిధీ!) నిన్ను రుద్రులకొఱకుఁ (జుహువుతోఁ) గలుచుపుచున్నాను. (ఓయుత్తరపరిధీ!) నిన్ను ఆదిత్యునికొఱకు (జుహువుతోఁ) గలుపుచున్నాను. ౩ పక్షులు నేతితోఁ గలిసికొనిన ప్రస్తరాగ్రమును నాకుచున్నవై వేర్వేఱు మార్గములనుఁ గూర్చి వెళ్లుఁగాక. (నేనైతే) సంతానమును-(దానికారణమైన). యోనిని నశింపఁజేయను. ౪ ఆజ్యరూపములైనయుదకములు ప్రస్తరమూలరూపములగునోషధులనుఁ దడుపునుగాక. (ప్రస్తరావయవములగు నోదర్భావయవములారా! మీరు) వాయువుయొక్క బంధువులై యుండుడు. (ఓప్రస్తరమా! నీవు) స్వర్గమునుఁగూర్చి వెళ్ళుము. పిమ్మట మాకు వర్షమునుఁ బంపుము. (ప్రస్తరము=దర్భలతోఁ గట్టినకట్ట.)

---

పంచాశత్తు ౨.

గచ్ఛ తతో నో వృష్టిమేరయ ౧ ఆయుష్పా అగ్నేఽస్యాయుర్మే పాహి చక్షుష్పా అగ్నేఽసి చక్షుర్మే పాహి ౨ ధ్రువాఽసి ౩ యం పరిధిం పర్యధత్థా అగ్నే దేవ

పణిభిర్వ్రియమాణాః। తంత్వేతమను జోషంభరామినేదేషత్వ దపచేతయా

తైయజ్ఞస్యపాథ ఉపసమితగ్ం ౪ సగ్ంస్రావభాగాః స్థేషాబృహన్తః ప్రస్తరేష్ఠా

బర్హిషదశ్చ॥

౧ ఓ యగ్నీ! (నీవు) ఆయుస్సును పాలించువాఁడవగుచున్నావు (కావున) నాయాయుస్సును రక్షించుము. ఓ యగ్నీ! నీవు చక్షుస్సును రక్షించువాఁడవగు చున్నావు (కావున) నాదృష్టిని రక్షించుము. ౨ (ఓ వేదీ! నీవు) స్థిరమయినదాన వగుచున్నావు. ౩ ఓ యగ్నిదేవా! స్తోత్రములచేఁ బొందఁ బడుచున్న (నీవు) ఏ మధ్యమపరిధిని పశ్చిమభాగమునందు స్వయముగా స్థాపించినవాఁడవగుచుంటివో! ప్రియమైన యా మధ్యమపరిధిని నీకనుకూలమగుటచే (నీయందు) ఉంచుచున్నాను. ఈమధ్యమపరిధి నీనుండిపోయిన మనస్సుకలది కానేరదు. ఓ దక్షిణోత్తరపరిధులారా! యజ్ఞముయొక్క (ఫలరూపమైన) యన్నమునుఁబొందుఁడు. ౪ ఓ విశ్వేదేవతలారా! గొప్పవారును, అందరిచేఁబూజింపబడువారును, ప్రస్తరము పిడికిలియందుకలవారు నగుమీరు సంస్రావమే (జుహూపభృత్తులచే నుంచబడిన యాజ్యశేషము) భాగము కలవారలైయుండుఁడు. ఈ (మాచేఁజేయబడిన) స్తోత్రమునుజూచి (మంచిదని) తలచిన వారై యీ యజ్ఞమునందు కూర్చొని సంతుష్టులుకండు.

---

పంచాశత్తు ౩

దేవాఇమాం-వాచమభి విశ్వేగృణన్త ఆసద్యాస్మిన్ బర్హిషి మాదయధ్వ

౧ మగ్నేర్వామపన్న గృహాస్య సదసి సాదయామి సుమ్నాయ సుమ్నినీ

సుమ్నే మాధత్తం ధురిధుర్యౌపాతం ౨ మగ్నేऽదబ్ధాయోऽశీతతనోపాహి

మాఽద్యదివః పాహి ప్రసిత్యై పాహి దురిష్ట్యై పాహి దురద్మన్యై పాహి దుశ్చరితా దవిషంనః పితుంకృణు సుషదాయోనిగ్ం స్వాహా ౩ దేవాగా తువిదో గాతుంవిత్త్వా గాతుమిత మనసస్పత ఇమం నోదేవ దేవేషు యజ్ఞగ్ం స్వాహా వాచి స్వాహా వాతేధాః॥

౧ (ఓజుహూపభృత్తులారా! మిమ్ము) నష్టముకాని గృహాహాముకల (పృథివ్యభిమానియగు) నగ్నియొక్క (శకట రూప) స్థానమునందు (యజమానుని) సుఖము కొఱకు స్థాపించుచున్నాను (ఓసుఖవస్తములైన జుహూపభృత్తులారా!) సుఖము నందు నన్ను స్థాపించుడు. యజ్ఞభాగమును వహించునట్టి యీదంపతులను రక్షించుడు. ౨ హింసింపఁబడని జీవనము కలవాఁడవును, వేడిశరీరము కలవాఁడవునగు,నోయగ్నీ! ఇప్పుడు నన్ను స్వర్గమునుండి (దేవతలు నాకపరాధ మొనరించకుండునట్లుగా) రక్షించుము. గొప్పదియగు బంధనమునుండి (ఫలవిఘ్నమునుండి) రక్షించుము. శాస్త్రీయముకాని యనుష్ఠానమునుండి రక్షించుము. (యాగాధికార విరోధియగు) దుష్టవస్తు భోజనమునుండి రక్షించుము. నిషేధించఁబడిన యాచరణమునుండి రక్షించుము. మాయన్నము నమృతముగాఁ జేయుము. సుఖముగాఁ గూర్చొనుట నిమిత్తమైనస్థానమునుఁ జేయుము. ౩ మార్గముఁ దెలిసిన యోదేవతలారా! (పూర్వము) ఏమార్గమునొంది (వచ్చితిరో! మఱల) నామార్గమునఁబొందు. మనస్సునకుఁ బ్రిభువగు నోదేవా! (మీచేఁ జెప్పఁబడిన) దేవతలయందీ మా యజ్ఞము నుంచుము (ఈ యాజ్యము) హుతమగుఁగాక. సర్వక్రియా ప్రవర్తకుఁడగు వాయువు నందు (ఈయజ్ఞము) నుంచుము. ఈ యాజ్యము హుతమగుఁగాక.

త్రయోదశానువాకము సమాప్తము.

---*---

## అనువాకము ౧౪.

౧ ఉభావామిన్ద్రాగ్నీ ఆహువధ్యా ఉభారాధసః సహమాదయధ్యై ।
ఉభాదాతారా విషాగ్ం రయీణా ముభావాజస్య సాతయే హువేవామ్ ।
౨ అశ్రవగ్ం హిభూరిదావత్తరావాం విజామాతురుత వాఘాస్యాలాత్ ।
అథా సోమస్య ప్రయతీ యువాభ్యా మిన్ద్రాగ్నీ స్తోమంజన యామినవ్యమ్ ।
౩ ఇన్ద్రాగ్నీనవతిం పురోదా సపత్నీ రధూనుతమ్ । సాకమేకేన కర్మణా ।
౪ శుచింనుస్తోమం నవజాతమద్యేన్ద్రాగ్నీ వృత్రహణాజుషేథామ్॥

౧ ఓయింద్రాగ్నులారా! సంపూర్ణముగా హోమము చేయుటకొఱకును, పురోడాశ రూపమైన యన్నముతోఁ బరస్పరము మీరిద్దఱు కూడుకొనినవారలై సంతోషించుటకొఱకును, మిమ్ముల నిద్దఱినిఁ బిలచుచున్నాను. మీరిద్దఱు అన్నమునకు, ధనమునకును, దాతలు (కావున) నన్నముయొక్క లాభముకొఱకు మిమ్ముఁ బిలుచుచున్నాను. ౨ అల్లునికంటెను, బావమఱదికంటెను, మిమ్ముల నిద్దరిని అధిక సంతానమునిచ్చు వారలను వినియున్నాను. కావున ఓయిన్ద్రాగ్నులారా! మీకొఱకు సోమముతో సమానమైన పురోడాశము నిచ్చుటచే (మీ మనస్సునందు) నూతనమైన సన్తోషయుక్తమైన చిత్తవృత్తుల) సముదాయమును సంపాదించుచున్నాను. ౩ ఓయిన్ద్రాగ్నులారా! ప్రజలకు క్షోభను చేయువారును, దొంగతనమునకు సమర్థులునగు దానజనులు ప్రభువులుగల తొంబది పట్టణముల నొకేపర్యాయమొకే (ప్రహార) కర్మచే నశింపఁజేయుడు. (ప్రహారము=దెబ్బ). ౪ వృత్రాసురునిఁ జంపిన యోయిన్ద్రాగ్నులారా! దోషరహితమును, నూతనములైన యన్నవిశేషములచేఁ బుట్టుకకలదియునగు స్తోత్రమును సేవించుడు. (రోషగర్వాదులు లేకుండుటచే) సుఖముగా హోమముచేయుటకు సమర్థులగు మిమ్ములనిద్దఱిని ఏకారణమువలనఁ బిలచుచున్నానో! ఆహేతువువలన యజమానునికన్నమును వెంటనే యొసగుఁడు.

---

పంచాశత్తు ౨

ఉభాహివాగ్ం సుహవా జోహవీమి తావాజగ్ంసద్య ఉశతేధేష్ఠా
౧ వయముత్వా పథస్పతేరథం నవాజసాతయే । ధియేపూషన్నయుజ్మహి
౨ పథస్పథః పరిపతిం వచస్యాకామేనకృతో అభ్యానడర్కమ్ । సనోరా
సచ్ఛురుధశ్చన్ద్రాగ్రాధియం ధియగ్ం సీషధాతి ప్రపూషా ౩ క్షేత్రస్య పతి
నావయగ్ం హితేనేవజయామసి । గామశ్వంపోష యిన్త్వాసనః॥

౧ మంచిమార్గమునకుఁ బ్రభువగు నో సూర్యుఁడా! మేమేనిన్ను అన్నవస్త్ర మయిన కర్మకొఱకుఁ గలుపుచున్నాము. ౨ (ఫల) కామముచే బ్రేరణ చేయఁబడిన (నేను) ఆయామార్గమునకుఁ బాలకుఁడగు (పూషయను నామాన్తరముకల సూర్యుని (స్తోత్రమయిన) వాక్కుచేఁ బొందినవాడనగుచున్నాను. (ఆసూర్యుఁడు) మాకై శోకమునుఁబోగొట్టునవియు, జంద్రునివలె సంతోషసాధనమైన యజ్ఞభాగములు కలవియునగు నామధులనిచ్చుఁగాక. (మఱియు) గొప్పదియగు ప్రజ్ఞను ఉత్కృష్టముగా సాధించుగాక. ౩ హితమగు పుత్త్రాదికముచేతనువలె క్షేత్రస్వామి చేతను, గోవును, అశ్వమును, పోషించునన్నమును మేమంతటను జయించుచున్నాము. ఆక్షేత్రస్వామి యిటువంటి గవాశ్వాదుల విషయమై నన్ను సుఖపెట్టుగాక.

---

పంచాశత్తు ౩

మృడాతీదృశే ౧ క్షేత్రస్యపతే మధుమన్తమూర్మింధేను రివపయోఅస్మాసు
ధుక్ష్వ । మధుశ్చుతం ఘృతమివ సుపూతమృతస్యనః పతయోమృడయన్తు

౨ అగ్నేనయ సుపథారాయే అస్మాన్ విశ్వానిదేవవయునా నివిద్వాన్ ।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తేనమ ఉక్తింవిధేమ ౩ ఆదేవా
నామపిపన్థామగన్మయచ్ఛక్నవామతదనుప్రవోఢుమ్।అగ్నిర్విద్వాన్త్సయజాత్ ॥

౧ ఓ క్షేత్రస్వామీ! మాధుర్యముకలదియు, మఱలమఱల అలలవలెఁ బుట్టునదియు, నితర వస్తువులందుగూడ మాధుర్యమును స్రవింపజేయునదియు, నేతి వలె బవిత్రమయినదియునగు; (గొబ్బరి-చెఱకు-బెల్లము మొదలగు) తినదగిన వస్తు సముదాయమును, ఆవుపాలనువలె నీవుమాయందు గలిగించుము యజ్ఞముయొక్క ప్రభువులు మమ్ము సుఖపెట్టుదురుగాక! ౨ ఓ యగ్నీ! (నీవు దర్శపూర్ణ మాసేష్టి ఫలరూప) ధనముకొఱకు మమ్ము దోషరహితమైన మార్గముద్వారా నడిపించుము. ఓ దేవ! (నీవు) సమస్తమార్గములనుఁ దెలిసికొనుచున్నావు. కుటిలమయిన తప్పు దారినినడచుటయను పాపమును మానుండిపోఁగొట్టుము. నీకుగొప్పదగు నమస్కార వాక్కును బల్కుదుము. ౩ ఏకర్మననుష్ఠించుటకొఱకు (మేము) సమర్థులమగు చున్నామో యాకర్మననుష్ఠించుటకై దేవతామార్గముఁగూర్చి వచ్చినారము. అగ్ని విద్వాంసుఁడు. ఆయగ్నియే (మాకొఱకు) యాగముచేయఁగలఁడు. ఆయగ్నియే (దేవతల) నాహ్వానించువాఁడు. ఆయగ్నియే (అతిపన్నములైన) యజ్ఞములను, ఋతువులను, చేయఁగలఁడు. (అతిపన్నము= కాలమందుఁజేయబడక తప్పినవి.)

—*—

పంచాశత్తు ౪.

సేదుహోతా సోఅధ్వరాన్త్స ఋతూన్ కల్పయాతి। ౧ యద్వాహిష్ఠం
తదగ్నయే బృహదర్చ విభావసో। మహిషీవ త్వద్రయిస్త్వద్వాజా ఉదీరతే।

౨ అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్ స్వస్తిభి రతి దుర్గాణి విశ్వా। పూశ్చ పృథ్వీ బహులా న ఉర్వీ భవా తోకాయ తనయాయ శంయోః। 3 త్వమగ్నే వ్రతపా అసి దేవ ఆమర్త్యేష్వా। త్వం యజ్ఞేష్వీడ్యః। ౪ యద్వో వయం ప్రమినామ వ్రతాని విదుషాం దేవా అవిదుష్టరాసః। అగ్నిష్ట ద్విశ్వమా పృణాతి విద్వాన్యేభి ర్దేవాగ్ం ఋతుభిః కల్పయాతి॥

౧ ఏ ప్రాయణీయ హవిస్సు కలదో, యా హవిస్సు అగ్నికొఱకు గొప్పదగుగాక. ఓ సూర్యుఁడా! గోవువలె (ఫలమునిచ్చి) నన్ను ఆదరించుము. నీ యనుగ్రహమువలన ధనము, అన్నములు, అధికముగాఁ గలుగుచున్నవి. ౨ ఓ యగ్నీ! క్రొత్తవాఁడవగు నీవు మమ్ములను శాస్త్రీయానుష్ఠానములచే ననేక (అతిపాదరూప) పాపముల నతిక్రమింపఁజేసి (ఫలపర్యవసన్నములైన కర్మల) యొడ్డునుఁ బొందింపుము. (మఱియు మానివాసముకొఱకు) పట్టణము విశాలమగుఁగాక. (సస్యసంపత్తికై) భూమి విస్తీర్ణమగుగాక. (మఱియు నీవు) మాకుమారునకును, కూతురునకును సుఖమునిచ్చువాఁడవుకమ్ము. (అతిపాదదోషము=తప్పుదారినిఁగర్మ చేయుట) 3 ఓయగ్నీ! నీవువచ్చి మనుష్యులయందు వ్రతమునుఁ బాలించువాఁడవగుచున్నావు. నీవు యజ్ఞములందంతటను స్తుతింపఁబడినవాఁడవగుచున్నావు. ౪ ఓ దేవతలారా! పండితులైన మీ వ్రతముల (మాచేననుష్ఠించఁదగినవి) నత్యంతము విద్వాంసులముకాని మేము నాశనముచేయుచున్నామనుట యేదికలదో! దానినంతటను విద్వాంసుఁడగు నగ్ని పూరించుఁగాక! ఏ ఋతువిశేషములచే దేవతలను హవిస్సును భుజించుటకై (అగ్ని) గల్పించుచున్నాఁడో! ఆకాలములచే వ్రతమునుఁ బూరించుఁగాక.

ఇట్లు ప్రథమాష్టకమున ప్రథమప్రపాఠకము సమాప్తము.



## ద్వితీయ ప్రపాఠకము.

—*—

ఆప ఉన్దన్తు జీవసే దీర్ఘాయుత్వాయ వర్చస ౨ ఓషధే త్రాయస్వైనగ్ం
స్వధితే మైనగ్ం హిగ్ంసీర్దేవశ్రూరేతాని ప్రవపే ౩ స్వస్త్యుత్తరాణ్యశీయా
౪ ఽఽపో అస్మాన్మాతరః శున్ధన్తు ఘృతేన నో ఘృతప్వః పునన్తు విశ్వమస్మ
త్ప్రవహన్తు రిప్ర ౫ ముదాభ్యశ్శుచిరా పూత ఏమి ౬ సోమస్య తనూరసి
తనువం మే పాహి ౭ మహీనాం పయోఽసి వర్చోధా అసి వర్చః॥

౧ జీవనముకొఱకు, దీర్ఘాయువుకొఱకు, బ్రహ్మవర్చస్సుకొఱకు, నుదకములు (శిరస్సును) దడుపుఁగాక! ౨ ఓయోషధీ! ఈయజమానుని రక్షింపుము. ఓకత్తీ! యజమానుని హింసింపకుము. దేవతలలోఁ బ్రసిద్ధముగా వినఁబడుచున్న నేను ఈ వెండ్రుకలను క్షౌరము చేయుచున్నాను. ౩ విఘ్నములేకుండగాఁ దరువాయి కర్మలనుఁ బొందుదును. ౪ నీటిచేఁ బవిత్రముచేయు మేఘాదులు స్రవించుచున్న యుదకముచే మాయజమానులనుఁ బవిత్రము చేయుఁగాక. తల్లులగు నీయుదకములు మానుండి సమస్త పాపమునుఁ బోగొట్టుఁగాక. (స్నానాచమనములచే లోపలను, వెలుపలను,) పరిశుద్ధుఁడనగుచు నుదకములనుండి లేచివచ్చుచున్నాను. ౬ (ఓవస్త్రమా! నీవు) సోమముయొక్క శరీరమగుచున్నావు. నాశరీరమును రక్షింపుము. ౭ (ఓనవనీతమా! నీవు) ఆవుపాల (వలనఁ బుట్టినదాన) వగుచున్నావు. వర్చస్సును ధరించిన దానవగుచున్నావు. (కావున) నాయందు బ్రహ్మవర్చస్సునుంచుము. (నవనీతము=వెన్న.)

—*—

పంచాశత్తు ౨.

మయిధేహి ౧ వృత్రస్య కనీనికాఽసి చక్షుష్పా అసి చక్షుర్మే పాహి ౨ చిత్పతిస్త్వాపునాతు వాక్పతిస్త్వాపునాతు దేవస్త్వా సవితాపునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభి 3 స్తస్య తే పవిత్రపతే పవిత్రేణ యస్మైకం పునే తచ్ఛకేయ ర మావో దేవాస ఈమహే సత్యధర్మాణో అధ్వరే యద్వో దేవాసఆగురే యజ్ఞి యాసో హవా మహ ౫ ఇన్ద్రాగ్నీ ద్యావా పృథివీ ఆపఓషధీ ౬ స్త్వందీక్షాణా మధిపతిరసీహ మాస న్తం పాహి॥

౧ (ఓకాటుకా! నీవు) వృత్రాసురుని (కంటియొక్క) నల్లగ్రుడ్డువగుచున్నావు. నేత్రమునుఁ బాలించుదానవగుచున్నావు. (కావున) నాదృష్టిని రక్షించుము. ౨ జ్ఞానములకుఁ బ్రభువగు మనస్సు, ఛిద్రములులేని దర్భపవిత్రముచే, నిన్నుఁ బవిత్రముచేయుఁగాక. వాక్కులకు రాణియగు సరస్వతి, ఛిద్రములులేని దర్భ పవిత్రముచే, నిన్నుఁ బవిత్రము చేయుఁగాక. సర్వాన్తర్యామియు, ప్రేరకుఁడునగు పర మేశ్వరుఁడు ఛిద్రరహిత దర్భపవిత్రముచేతను, జగన్నివాసహేతువగు సూర్యుని యొక్క కిరణరూపములైన దర్భలచే, నిన్నుఁ బవిత్రము చేయుఁగాక. 3 ఆదిత్యరూప మైన యచ్ఛిద్ర పవిత్రమునకుఁ బ్రభువగు నోయన్తర్యామీ! నీపవిత్రముచే నే యగ్నిష్టోమ కర్మకొఱకు నాత్మను శోధించుచుంటినో! ఆ యగ్నిష్టోమము (చేయు టకు) సమర్థుఁడను గాఁగలను. ర ఓ దేవతలారా! మీసంబంధియగు నీయాగము నందు (మేము) అనుష్ఠానపరులమై వచ్చుచున్నారము. యజ్ఞమునకు సంబంధించిన యో దేవతలారా! ఏ హేతువువలనఁ గర్మల ప్రారంభమునందు మిమ్ము నాహ్వా నించుదుమో! (ఆ హేతువువలన మేమిచ్చుటకు వచ్చుచున్నాము.) ౫ (ఓయాహావనీ

యాగ్నీ !) నీవు దీక్షారూపములగు నియమములకుఁ బాలకుఁడ వగుచున్నావు. (కావున) నీసమీపమునందున్న నన్ను రక్షించుము.

ప్రథమానువాకము సమాప్తము.

—:-o-:—

## అనువాకము. ౨.

౧ ఆకూత్యై ప్రయుజేఽగ్నయే స్వాహా మేధాయై మనసేఽగ్నయే స్వాహా దీక్షాయై తపసేఽగ్నయే స్వాహా సరస్వత్యై పూష్ణేఽగ్నయే స్వాహాఽఽపో దేవీర్బృహతీ ర్విశ్వశంభువో ద్యావా పృథివీ ఉర్వన్తరిక్షం బృహస్పతిర్నో హవిషా వృధాతు స్వాహా ౨ విశ్వే దేవస్య నేతుర్మర్తో వృణీతసఖ్యం విశ్వేరాయ ఇషు ధ్యసి ద్యుమ్నం వృణీత పుష్యసే స్వాహా ౩ ర్క్సామయోః శిల్పేస్థస్తేవా మారభే తేమా॥

౧ ఆకూతి (యజ్ఞముచేయుదునను మానసికసంకల్పము) సిద్ధించుటకై (నిర్విఘ్నముగాఁ బ్రేరణచేయు) నగ్నికొఱకీ హవిస్సు హుతమగుఁగాక. ధారణాశక్తికై (నా) మనోఽభిమాని దేవతయగు నగ్నికొఱకీ హవిస్సు హుతమగుఁగాక. వ్రతనియమమునకై (నాశరీర) తపోఽభిమాని దేవతయగు నగ్నికొఱకీ హవిస్సు హుతమగుఁగాక. మంత్రోచ్చారణశక్తికై వాగింద్రియ పోషకుఁడగు నగ్నికొఱకీ హవిస్సు హుతమగుఁగాక. ఓయుదకములారా ! మాహవిస్సుచే వృద్ధినొందుడు. ద్యావాభూములు వృద్ధినిఁబొందునుఁగాక. విస్తీర్ణమగు నాకాశము వృద్ధినిఁ బొందునుగాక. బృహస్పతియు వృద్ధినిఁబొందునుగాక. ౨ మరణశీలుఁడగు యజమానుఁడు, ప్రపంచ

స్వరూపుఁడు, జగన్నిర్వాహకుఁడు నగు దేవుని యనుగ్రహమునుఁ గోరవలయును. ఓ ప్రపంచ స్వరూపుఁడా! ధనమునకుఁ బ్రభువగుచున్నావు. యజ్ఞమునుఁ బోషించుటకై ధనమును యాచించుచున్నాను. (అని దేవుని సఖ్యమునుఁ గోరవలయును.) 3 (ఓశుక్లకృష్ణరేఖలారా! మీరు) ఋక్సామములకు సంబంధించిన చిత్రరూపులగుచున్నారు. అటువంటి మిమ్ముల నిద్దఱినిఁ దాకుచున్నాను. ఉత్తమ ఋక్కుతోఁ గూడుకొనిన యీయజ్ఞముయొక్క కర్మసమాప్తిపర్యన్తము (మీరు) రక్షించుఁడు.

---

## పంచాశత్తు ౨.

పాతమాఽస్య యజ్ఞస్యోదృచ ౧ ఇమాంధియగ్ం శిక్షమాణస్య దేవక్రతుం దక్షంవరుణ సగ్ంశిశాధి యయాఽతి విశ్వాదురితాతరేమ సుతర్మాణమధి నావగ్ం రుహేమో ౨ ర్గస్యాఙ్గిరస్యూర్ణమ్రదా ఊర్జంమేయచ్ఛ పాహిమా మామా హిగ్ంసీర్విష్ణోశ్శర్మాసి శర్మయజమానస్య శర్మమే యచ్ఛ నక్ష త్రాణాం మాఽతీకాశాత్పాహి 3 న్ద్రస్య యోనిరసి॥

౧ ఓ వరుణదేవా! ఈ యగ్నిష్టోమవిషయక జ్ఞానమును సంపాదించుచున్న యజమానునిసంబంధియు, సమృద్ధమైనదియు, నగు నగ్నిష్టోమయాగమును బాగుగ నుపదేశించి పూర్తిజేయుము. (మేముకూడా పూర్తియగుటకు) సమస్తమైన విఘ్నరూపపాపములనే నావ (పడవ) చే దాటుదుమో! సుఖముగాదాటుటకు సమర్థమగు కృష్ణాజనరూపమైన యాపడవనెక్కుచున్నాము. ౨ (ఓ మొలనూలా!) నీవు అంగిరసమహర్షి సంబంధమగు నన్నరూపము, కంబలమువలె మెత్తనిదానవై నగుచున్నావు. (కావున) అన్నరసమునాకిమ్ము. నన్నురక్షించుము. (బంధనముచే బాధారూపమైన) హింసనుచేయకుము. (ఓ వస్త్రమా! నీవు) విష్ణుమూర్తికి

సుఖమునిచ్చినదానవైతివి. యజమానునకు సుఖమునిమ్ము. నాకుఁగూడ సుఖము నిమ్ము. (ఓ వస్త్రమా!) నన్ను నక్షత్రప్రకాశమునుండి రక్షించుము. 3 (ఓ కృష్ణ విషాణమా! నీవు) ఇంద్రునికిఁగారణమగుచున్నావు. నన్ను హింసించకుము. (కృష్ణ విషాణము=లేడికొమ్ము.)

---

పంచాశత్తు 3.

మామాహిగ్ంసీః ౧ కృష్యైత్వాసుసస్యాయై ౨ సుపిప్పలాభ్యస్త్వౌషధీభ్య 3 స్సూపస్థా దేవో వనస్పతిరూర్ధ్వో మాపాహ్యోదృచః ౪ స్వాహాయజ్ఞం మనసాస్వాహా ద్యావాపృథివీభ్యాగ్ం స్వాహోరోరన్తరిక్షాత్స్వాహా యజ్ఞం వాతాదారభే॥

౧ (ఓ లోష్ఠమా!) యోగ్యమగు సస్యముతోఁగూడుకొనిన కృషికొఱకు నిన్ను వేదినుండి వెళ్లగించుచున్నాను (లోష్ఠ=మట్టిగడ్డ) ౨ ఓ శిరస్సా! యోగ్యమయిన ఫలముతోఁగూడుకొనిన యోషధులకొఱకు నిన్నుఁ (గోకుచున్నాను) 3 ఓ యౌదుంబరదండమా! నీవు పైననున్నదానవై సమాప్తి పర్యన్తము నన్నురక్షించుము (సూపస్థాః = వనస్పతివలనఁబుట్టిన యౌదుంబరదండరూపమైన దేవుఁడని తా) ౪ మనస్సుచే యజ్ఞమునుఁబొందుచున్నాను. ద్యావాభూములందు యజ్ఞమున్నది. గొప్పదియగు నాకాశమునందు యజ్ఞమున్నది. వాయువుయొక్క యనుగ్రహమువలన (ప్రత్యక్షముగా) యజ్ఞము నారంబించుచున్నాను. (ఇచ్చట స్వాహాయను యవ్యయమునకు బ్రాహ్మణము ననుసరించి ప్రసిద్ధార్థముకంటె భిన్నార్థము చెప్పఁబడినది.)

ద్వితీయానువాకము సమాప్తము.

## అనువాకము ౩.

దైవీం౦ధియం మనామహే సుమృడీకామభిష్టయే వర్చోధాం యజ్ఞవాహ
సగ్ం సుపారానో అసద్వశే । ౨ యే దేవా మనోజాతా మనోయుజః సుదక్షా
దక్షపితారస్తేనః పాన్తు తేనోఽవన్తు తేభ్యోనమస్తేభ్యః స్వాహా ౩ అగ్నే త్వగ్ం
సుజాగృహి వయగ్ం సుమన్దిషీమహి గోపాయనః స్వస్తయే ప్రబుధేనః
పునర్దదః ౪ త్వమగ్నే వ్రతపా అసి దేవ ఆమర్త్యేష్వా త్వమ్॥

౧ అభీష్టార్థసిద్ధికొఱకు, దేవతావిషయకమైనట్టియు, సుఖమునకుఁ గారణమైనట్టియు, యజ్ఞమును నిర్వహించునట్టి బుద్ధిని (మేము) సంపాదించుచున్నాము. (ఆయాబుద్ధి) పూర్తిగాఁ దుదచూచినదయి మాస్వాధీనమునందుండుఁగాక. ౨ (చక్షురాది ప్రాణాభిమానులగు) నే దేవతలుకలరో! (పుట్టుకసమయమున) మనస్సుతోఁ గూడ బుట్టినట్టియు, (వ్యవహారకాలమున) మనస్సుతోఁ గూడుకొనినట్టియు (స్వవిషయములందు) నేర్పరులైనట్టియుఁ, బ్రజాపతి యుత్పాదకుఁడు గాఁగల యా దేవతలు పయః పానరూప (పాలుత్రాగుట) వ్రతము ననుష్ఠించు మమ్ము రక్షించుదురుగాక. వారికొఱకు నమస్కారము. వారికై స్వాహాకారము. ౩ ఓయగ్నీ నీవు బాగుగ మేల్కొనుము. మేము భయములేనివారమై నిద్రఁబోవుదుము. మాకు నాశనము లేకుండుటకును, మేము మేల్కొంచుటకొఱకును సామర్థ్యమునిమ్ము. ౪ ఓయగ్నీ! నీవు వచ్చి మనుజులయందు వ్రతమును బాలించు దేవుఁడవగుచున్నావు. యజ్ఞములందంతటను నీవు స్తోత్రము చేయఁబడువాఁడ వగుచున్నావు.

---

పంచాశత్తు ౨.

యజ్ఞేష్వీడ్యః ౧ విశ్వేదేవా అభి మామాఽవవృత్రన్పూషా సన్యా సోమో
రాధసా దేవః సవితా వసోర్వసుదావా రాస్వేయత్సోమాఽఽ భూయో

భర మాపృణ న్స్వార్త్యా విరాధి మాఽహ మాయుషా చన్ద్రమసి మమ భోగాయ భవ వస్త్రమసి మమ భోగాయ భవోస్రాఽసి మమ భోగాయ భవహయోఽసి మమ భోగాయ భవ॥

౧ అంతటను (ప్రార్థించుటకొఱకు) సమస్త దేవతలు నన్నావరించి యుందురు గాక. సోమరూపుఁడగు దేవుఁడివ్వఁదగిన హిరణ్యద్రవ్యముతోఁ గూడ (వచ్చుఁగాక.) సోమదేవత సాధకమగు వస్త్రముతోఁగూడ వచ్చుఁగాక. గవాదికమునకుఁ బ్రేరకుఁడగు దేవుడు ధనమునిచ్చుచున్నవాఁడై వచ్చుగాక. ఓ సోమదేవతా! ఈకర్మయందపేక్షితమగుదానినిమ్ము. సంపూర్ణతచే నన్ను బూరించుచున్నవాఁడవగుచు నధికముగా భరించుము. (నేను) ఆయుస్సులేనివాఁడనుకాను. నీవు చంద్రుఁడవగుచున్నావు. నాభోగముకొఱకుగమ్ము. (నీవు) వస్త్రమగుచున్నావు. నాభోగముకొఱకుగమ్ము. (నీవు) గోవువగుచున్నావు. నాభోగముకొఱకుగమ్ము. (నీవు) గుఱ్ఱమగుచున్నావు. నాభోగముకొఱకుగమ్ము. (నీవు) మేకపోతువగుచున్నావు. నాభోగముకొఱకుగమ్ము. (నీవు) గొఱ్ఱెవగుచున్నావు. నాభోగముకొఱకుగమ్ము.

—*0*—

పంచాశత్తు ౩

ఛాగోఽసి మమభోగాయ భవమేషోఽసి మమభోగాయభవ ౧ వాయవేత్వా వరుణా యత్వానిఋత్యైత్వా రుద్రాయత్వా ౨ దేవీరాపోఽపాంనపాద్య ఊర్మి ర్హవిష్య ఇన్ద్రియావాన్మదిన్తమస్తం వోమాఽవ క్రమిషమచ్ఛిన్నం తన్తుం పృథివ్యా అనుగేషం ౩ భద్రాదభిశ్రేయఃప్రేహి బృహస్పతిః పుర

ఏతా తే అఘ్నియే ... మవస్య వర ఆపృథివ్యా ఆరేశత్రూన్ కృణుహిసర్వవీర ర ఏదమగన్మ దేవయజనం పృథివ్యా విశ్వేదేవాయ దజుష న్త పూర్వ ఋక్సా మాభ్యాం యజుషా స న్తరన్తో రాయస్పోషేణ సమిషామదేమ॥

౧ ఓ హిరణ్యద్రవ్యమా! నిన్ను వాయుదేవుని కిచ్చుచున్నాను. నిన్ను వరుణదేవతకిచ్చుచున్నాను. నిన్ను నిర్ ఋతిదేవతకొఱకిచ్చుచున్నాను. ౨ దేవతా స్వరూపములగు నో యుదకములారా! మీసంబంధమైన యేతరంగము (అల) కలదో! (వ్రీహ్యాదులను బుట్టించుటచే) హవిస్సునకు యోగ్యమైనదియు (జల పానముచే) నింద్రియశక్తిని జేయునదియు, మిక్కిలి సంతోషకారియునైన యా తరంగమును బాదముచేదాటను. భూమియొక్క యచ్ఛిన్నమగు కట్టను (బోదె) దానిమీద నడచుచున్నాను. 3 (ఓ రథమా!) శ్రేష్ఠమయిన నిత్యాగ్నిహోత్ర స్థానముకంటె నధికమును, ప్రశస్తమునగు దేవయాగ ప్రదేశమునకు యభి ముఖముగా బొమ్ము. బృహస్పతినీకు ముందుగా వెళ్ళువాడగుగాక. ప్రయాణము నకు బిమ్మట భూసంబంధియగు శ్రేష్ఠమైన స్థానమునందీ నడకను సమాప్తి జేయుము. (రథాభిమానియగు నో యాదిత్యుడా!) రాక్షసులను దేవయాగప్రదేశమునకు దూరమునందుండునట్లు చేయుము. ర భూసంబంధియగు నేదేవయాగ ప్రదేశము కలదో! ఆ యీ స్థానమును (మేము) పొందితిమి. ఏదేవయాగప్రదేశమును ప్రాచీన దేవతలందరు సేవించిరో! (ఆదేవయాగప్రదేశమునకు మేము వచ్చి) ఋగ్యజుస్సామ వేదములందలి మంత్రములచే, సోమయాగమును బూర్తిని బొందించి వారలమై ధనసమృద్ధిచేతను, యోగ్యమగు నన్నముచేతను సంతోషించుచున్నారము.

తృతీయానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౪.

32. ౧ ఇయంతే శుక్రతనూరిదం వర్చస్తయా సంభవభ్రాజం గచ్ఛ ౨ జూరసి ధృతామన సాజుష్టావిష్ణవే తస్యాస్తే సత్యసవసః ప్రసవే వాచో యన్త్రమశీ యస్వాహా ౩ శుక్రమస్యమృతమసి వైశ్వదేవగ్ం హవిః ౪ సూర్యస్య చక్షురాఽరుహమగ్నేరక్ష్ణః కనీని కాంయ దేత శేభిరీయసే భ్రాజమానో విపశ్చితా ౫ చిదసిమనాఽసి ధీరసి దక్షిణా।

౧ దీప్తిమన్తమగు నోహిరణ్యమా! నీకిజువాలువుశరీరము ఈ యాజ్యము నీయొక్క తేజస్సు. ఆజవాలువుతోఁ గలిసికొనుము. (ఓహిరణ్యమా! ఆజ్యరూప మైన) దీప్తినిఁ బొందుము. ౨ (సోమక్రయణివగు నోవాగ్రూపమా! అనఁగా సోమమును కొనునపుడు పల్కిన పలుకా! నీవు) వేగముతోఁ గూడుకొనిన దానవగు చున్నావు. మనస్సుచే నియమింపబడిన దానవగుచున్నావు. యజ్ఞమునకుఁ బ్రియ మగుచున్నావు. ఆటువంటి నీప్రేరణ కలుగుచుండగా (మంత్రోచ్చారణరూప) వాక్ని యామమునుఁ బొందుదును. ఈ యాజ్యము హుతమగుఁగాక (ఆజ్యము=నేయి) ౩ ఓయాజ్యమా! లేక, హిరణ్యమా! నీవు, దీప్తికల దానవగుచున్నావు. నాశ రహితమవగుచున్నావు. సర్వదేవతలకుఁ బ్రియమగు హవిస్సువగుచున్నావు. ౪ సూర్యుని సంబంధియగు చక్షురింద్రియమును, అగ్నియొక్క నేత్ర సంబంధియగు నల్లగ్రుడ్డునుఁ బొందితిని (ఓసూర్యుడా! నీవు ఏకారణముచే) ఏతశము లను పేరుకల గుర్రములచేఁ బోవుచున్నావో! (ఓయగ్నీ; నీవు) వెనుకకు వ్యాపించు చున్న తేజస్సుచేఁ బ్రకాశించుచుంటివో! (ఆకారణముచే రాక్షస నివారణము కొఱకు మిమ్ముల నిద్దరినిఁ బొందితిని.)

—*—

పంచాశత్తు ౨.

౩౮. ౧ అసియజ్ఞియాఽసిక్షత్రియాఽస్య దితిరస్యు; భయతః శీర్ష్ణీ సానః సుప్రాచీ
సుప్రతీచీ సంభవ మిత్రస్త్వా పదిబధ్నాతు పూషాధ్వనః పాత్విన్ద్రాయా
ధ్యక్షాయానుత్వా మాతామన్యతామ నుపితాఽనుభ్రాతా సగర్భ్యోఽను
సఖాసయూథ్యః సాదేవి దేవమచ్ఛేహీన్ద్రాయ సోమగ్ం రుద్రస్త్వాఽఽవర్త
యతు మిత్రస్యపథాస్వస్తి సోమసఖా పునరేహి సహరయ్యా॥

౧ (సోమమునమ్మునట్టి యోవాగ్దేవతా! నీవు) చిత్ అనుశబ్దముచేఁ జెప్పఁబడిన దానవగుచున్నావు. మనశ్శబ్దముచేఁ జెప్పఁబడిన దానవగుచున్నావు. ధీశబ్దముచేఁ జెప్పఁబడిన దానవగుచున్నావు. సముద్ధరాలవగుచున్నావు. యజ్ఞ సంబంధినివగుచున్నావు. క్షత్రియజాత్యభిమానినివగుచున్నావు. ఉభయతః శీర్ష్ణియగు నదితివగుచున్నావు. (జ్యోతిష్టోమముయొక్క యాద్యంతదినములందు దేవతయగు నదితికి-ఉభయతః శీర్ష్ణియని శా॥ అనఁగా రెండుదిక్కుల తలగలది.) అటువంటి నీవు మా కొఱకు (సోమమునమ్మువానినిఁగూర్చి) తూర్పుదిక్కునకు బాగుగవెళ్ళిన దానవును, (అనంతరము మమ్ముఁగూర్చి) పశ్చిమ దిక్కునకు వచ్చినదానవునై మాతోఁ గలిసికొనుము. (ఓసోమక్రయణీ!) హితముఁజేయు దేవుఁడు నిన్నుఁ కుడిపాదము నందు బంధించుఁగాక. పోషకుఁడగు దేవుండు నిన్ను భయముతోఁ గూడుకొనిన మార్గమునుండి రక్షించుఁగాక. యాగాధ్యక్షుఁడగు నింద్రుని కొఱకు (సోమక్రయ సాధనముచే) దల్లియు, దండ్రియు; నీతోనొక గర్భమునందుఁబుట్టిన సోదరుఁడును, స్నేహితుఁడును నిన్ను అనుగ్రహించుచుండుగాక. ఓ దేవీ! అటువంటి నీవు ఇంద్రుని కై సోమదేవునను సరించి వెళ్లుము. అటువంటి నిన్ను, రుద్రదేవుఁడు జగత్తునకు మిత్రుఁడగు . . . . నూర్గముచే మమ్ముఁగూర్చి మఱలించుఁగాక. అందువలన నీకు

సుఖముగుఁగాక. అటువంటి నీవు, సోముఁడు స్నేహితుండు గాఁగలదానవై, ధనముతోఁ గూడ మమ్ముఁగూర్చి మఱలిరమ్ము. (వెనుకటి పంచాశత్తులోని గీవ వాక్యముకు గూడ నిచ్చటనే యర్థము వ్రాయఁబడినది.)

చతుర్థానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము. ౫.

౩౯. ౧ వస్వ్యసిరుద్రాస్య దితిరస్యాదితిరస్యాదిత్యాసిశుక్రాఽసి చన్ద్రాఽసి ౨ బృహస్పతిస్త్వా సుమ్నేరణ్వతురుద్రోవసుభిరాచికేతు ౩ పృథివ్యాస్త్వా మూర్ధన్నా జిఘర్మి దేవయజన ఇడాయాః పదేఘృతవతిస్వాహా ౪ పరిలిఖితగ్ం రక్షః పరిలిఖితా అరాతయ ఇదమహాం రక్ష సోగ్రీవా అపికృన్తామి యోఽస్మాన్ద్వేష్టి యంచ వయం ద్విష్మ ఇదమస్యగ్రీవాః॥

౧ (ఓ సోమక్రయణీ! నీవు) వసువుయొక్క స్వరూపమగువగుచున్నావు. రుద్రుని స్వరూపమవగుచున్నావు. ఆదిత్యుని స్వరూపమగుచున్నావు. ప్రకాశవంతమగు సోముని స్వరూపమవగుచున్నావు ఆహ్లాదమునుఁజేయు సువర్ణ (బంగారము) స్వరూపమవగుచున్నావు. ౨ (ఓ సోమక్రయణీ స్థానమా!) నిన్ను బృహస్పతి సుఖప్రదేశమునందు సంతోషఁబెట్టుఁగాక. వసువులతోఁ గూడుకొనిన రుద్రుఁడు నిన్ను గుర్తించుఁగాక. ౩ (ఓ యాజ్యమా!) భూమికి శిరస్థానీయమైనదియు, దేవయాగస్థానీయమయినదియు, నాజ్యముతోఁ గూడుకొనినదియు నగు సోమక్రయణియొక్క స్థానమునందు నిన్ను ప్రవింపఁజేయుచున్నాను. ౪ రాక్షస సముదాయము నశింపఁజేయఁబడుఁగాక ఈశత్రువులు నశింపఁజేయఁబడుదురుగాక, ఈరాక్షసుల శిరస్సును

నేను నఱకుచున్నాను. ఎవఁడుమమ్ము ద్వేషించుచున్నాఁడో! ఎవనిని మేము ద్వేషించుచున్నామో! ఇతనియొక్క కంఠమునుఁగూడ నఱకుచున్నాను.

—*—

పంచాశత్తు ౨.

౮౦. అపికృన్తామ్య ౧ స్మే రాయస్పో రాయస్తో తే రాయః ౨ సందేవి దేవ్యో ర్వశ్యా పశ్యస్వ ౩ త్వష్టీమతీ తేస పేయ సురే తా రేతో దధానా వీరం విదేయతవసం దృశి మావాగ్ం రాయస్పోషేణ వియోషమ్॥

౧ ఈయధ్వర్యునియందు రజోరూపధనముండుఁగాక, (యజమానుఁడవైన) నీయందు రజోరూపధనముండుఁగాక. భార్యయందు రజోధనముండుగాక. ౨ ఓ దేవీ! (సోమక్రయణివగు నీవు) ఊర్వశీదేవితోఁగూడ ఈభార్యనుఁజూడుము. ౩ ఓ యజమానుఁడా! పశుమనుష్యాదుల శరీరనిర్మాతయైన త్వష్టప్రజాపతి యనుగ్రహముతోఁ గూడుకొనినట్టియు, నమోఘమైన నా రేతస్సును ధరించుచున్నట్టియు, భర్తయొక్క రేతస్సును ధరించుచున్నట్టియు నేను నీతోఁగూడఁ గలిసికొందును. భర్తవగు నీకు సమానుఁడును శూరుఁడునగు పుత్రునిఁబొందుదును. ౪ నేను ధనసమృద్ధితో వియుక్తుఁడను కాను. (వియుక్త=విడువఁబడు)

పఞ్చమానువాకము సమాప్తము.

---

## అనువాకము ౬.

౮౧. అగ్ంశునా తే అగ్ంశుః పృచ్యతాం పరుషాపరుర్గన్ధస్తే కామమవతు మదాయ రసో అచ్యుతోఽమాత్యోఽసి శుక్రస్తే గ్రహో ౨ ఽభిత్యం దేవగ్ం సవితారమూణ్యోః కవిక్రతుమర్చామి సత్యసవసగ్ం రత్నధామభిప్రియం మతి మూర్ధ్వా యస్యామ తిర్భాఅదిద్యుత త్సవమని హిరణ్యపాణి రమిమీత సుక్రతుః కృపాసువః ( ౩ ప్రజాభ్యస్త్వా ప్రాణాయత్వా వ్యానాయత్వా ప్రజాస్త్వమను ప్రాణిహి ప్రజాస్త్వామను ప్రాణన్తు॥

౧ ఓ సోమలతా! నీ (యొక్క) సూక్ష్మావయవముతో (రెండవ) సూక్ష్మావయవము కలుసుకొనుఁగాక. నీ (యొక్క) పర్వముతో రెండవ పర్వము కలుసుకొనుఁగాక. (పర్వము=కణుపు) నీగంధము (వాసన) యజమానుని కోరికను రక్షించుఁగాక. నీరసము దేవతలసంతోషముకొఱకు నాశములేనిదగుఁగాక. నీవు మంత్రి వగుచున్నావు. నిన్ను గ్రహించుట బంగారమువలన సాధ్యమైనది. ౨ ద్యావాభూమి స్వరూపముల హస్తములకుఁ బ్రేరకుఁడైనట్టియు, వేదవేత్తయొక్క యోగము కలిగి నట్టియు, (కనుకనే) ఫలపర్యన్తముందు ప్రేరణము కలిగినట్టియు, రత్నములను ధరించు నట్టియు, నభిముఖముగ సంచరికిఁ బ్రియమైనట్టియు, సంచరించే మననము చేయు (తలంచ) బడుచున్న దేవునిఁ బూజించుచున్నాను. ఏదేవునియొక్క యూర్ధ్వలోకమునందుండు దీప్తి, దలంచుటకు సమర్థముకానిదై ప్రకాశించుచున్నదో! స్వర్గలోకనివాసియగు నాదేవుఁడు కరుణచే నన్నుఁబొంది యుంగరము హస్తమునందు కలవాఁడై సోమము నుఁ గొలుచునుగాక. ౩ ఓ సోమశేషమా! నిన్ను సర్వప్రజలకొఱకు పోగుచేయు చున్నాను. ప్రాణముకొఱకు నిన్ను మూటకట్టుచున్నాను. వ్యానముకొఱకు నిన్ను

విప్పుచున్నాను. జీవించుచున్న ప్రాణుల ననుసరించి నీవు జీవించుము. జీవించుచు నిన్ను ననుసరించి ప్రజలు జీవించుదురుగాక.

—:-o-:—

అనువాకము. ౭.

౪౨. ౧ సోమంతే క్రీణా మ్యూర్జస్వన్తం పయస్వన్తం వీర్యావన్త మభిమాతి షాహగ్ంం శుక్రంతే శుక్రేణ క్రీణామిచన్ద్రం చన్ద్రేణామృత మమృతేన సమ్యత్తే గో ౨ రస్మే చన్ద్రాణి ౩ తపస స్తనూరసి ప్రజాపతే ర్వర్ణ స్తస్యాస్తే సహస్రపోషం పుష్యన్త్యాశ్చరమేణ పశునా క్రీణామ్యస్మే తే బన్ధుర్మయితే రాయః శ్రయన్తా ౪ మస్మేజ్యోతి ౫ సోమ విక్రయిణితమో ౬ మిత్రోన ఏహిసుమిత్రధా ఇన్ద్రస్యో రుమావిశ దక్షిణము శన్న శన్తగ్ంం స్యోనః స్యోనగ్ంం ౭ స్వానభ్రాజా ఙ్ఘారే బమ్భారే హ స్తసుహస్త కృశానవే తేవః సోమ క్రయణాస్తా న్రక్షధ్వం మావోదభన్॥

౧ (ఓ సోమమునమ్మువాడా!) శరీరమునకు బలమునిచ్చునదియు, గోవురసముతోఁగూడుకొనినదియు, నింద్రియపటుత్వమునకుఁ గారణమైనదియు, పాపమును శత్రువును నశింపజేయునదియు, తేజోరూపమగు నీ సోమమును (నేను) బంగారము చేఁగొనుచున్నాను. సుఖరూపమయిన నీ సోమమును సుఖరూపమైన బంగారము చేఁగొనుచున్నాను. వినాశరహితమగు నీ సోమమును నాశరహితమైన బంగారము చేఁగొనుచున్నాను. (మఱియు) యోగ్యమయిన గోవుకూడ నీకు (బూర్వమిప్వఁబడినది. ౨ బంగారము మాయందే యుండుగాక. ౩ (ఓ మేకా! ద్యులోకమునందు

సోమము నీచే నవరుద్ధమగుటచే నీవు) పుణ్యముయొక్క శరీరమగుచున్నావు (ప్రజాపతివలె సర్వదేవతా స్వరూపమగుటవలన) ప్రజాపతి దేహమగుచున్నావు. (మఱియు నీవు) సంతానపరంపరచే సహస్రసంఖ్యను బోషించుచున్నటువంటి నీయొక్క చరమ (=చివర) పశువుచే సోమమును గొనుచున్నాను, నేను నీకుబంధువును. నాయందు నీసంబంధములైన సంతానరూపములగు ధనములుండుగాక. ౪ జ్యోతిస్స్వరూపమగు నూర్ణాస్తుక మాయందుండుగాక. ఊర్ణాస్తుక=గొఱ్ఱెబొచ్చుచే నిర్మితమైన దారము.) ౫ సోమము నమ్ముదానియందు దమస్సు (చీకటి) ఉండుగాక. ౬ (ఓ సోమమా!) మంచిమిత్రులను బోషించునట్టి నీవు మాకు మిత్రమైరమ్ము కోరుచున్నట్టియు, సుఖమును గలుగఁజేయునట్టియు నీవు కోరుచున్నదియు సుఖకరమునగు యజమానుని కుడితొడ నెక్కుము ౭ ఓ స్వానాదులారా! ఇవి మీకు సోమమును కొనుటకు సాధనములగు గవాదులు వాటిని మీరురక్షించుడు (ఏశత్రువులును) మిమ్ము హింసించకుందురుగాక. (స్వాన-భ్రాజ-అంఘార-బంభార-హస్త-సుహస్త-కృశాను- ఇవి సూర్యమండలములు సోమమును రక్షించునవి.)

షష్ఠమానువాకము సమాప్తము.



అనువాకము ౭.

౪౩. ఉదాయుషా స్వాయుషోదోషధీనాగ్ం రసేనోత్పర్జన్యస్య శుష్మేణో దస్థామ

మృతాగ్ం అను ౧ ఉర్వన్తరిక్షమన్విహ్య ( ) దిత్యాఃసదోఽస్యదిత్యాఃసద

ఆసీదాస్తభ్నాద్ద్యామృషభో అన్తరిక్షమమిమీత వరిమాణం పృథివ్యాఆఽసీ

దద్విశ్వాభువనాని సమ్రాడ్విశ్వేత్తాని వరుణస్యవ్రతాని ౪ వనేషువ్యన్తరి

క్షంతతాన వాజమర్వత్సుపయో అఘ్నియాసుహృత్సు।

౧ దేవతలనుగూర్చి జీవనముతోఁ గూడుకొనిన సోమముతోఁ గూడ లేచుచున్నాను. రోగాద్యుపద్రవ రహితమగునాయుస్సుతోఁ గూడుకొనిన సోమముతో లేచుచున్నాను. ఓషధులసారముతోఁ గూడుకొనిన సోమముతోఁ గూడ లేచుచున్నాను. మేఘముయొక్క సారముతోఁ గూడుకొనిన సోమముతో లేచుచున్నాను. ౨ అర్థము చెప్పబడినది. (అను ౨ పం ౨ వా౮.) 3 (ఓ కృష్ణాజనమా! నీవు) భూమికిస్థానమగుచున్నావు. (ఓ సోమమా!) ఆభూమియొక్కస్థానమును బొందుము. శ్రేష్ఠమయినయీసోమముద్యులోకమువలె (క్రిందకుబడకుండునట్లు అని తా) స్తంభనము చేసెను. ఆకాశమును (ఇంతదని) గొలిచెను. భూమియొక్క బరువునుఁ గూడ గొలిచెను. ఆసోమదేవుఁడు (తనమహిమచే) సమస్తభువనములనుఁ బొందెను. ఈవెనుకఁ జెప్పఁబడిన సర్వకర్మలు వరుణుడనుపేరుకల సోమమునకు వ్రతమువలె నియతములు. ౪ వరుణుడనుపేరుకల సోమదేవుఁడు (జగదీశ్వరునితో నభిన్నుఁడై) వనములయందవకాశమును విస్తరింపఁజేసెను. గుఱ్ఱములయందు గమనవేగమును విస్తరింపఁజేసెను. గోవులయందుపాలను విస్తరింపఁజేసెను. చిత్తము (మనస్సు)లందుసంకల్పమును విస్తరింపఁజేసెను. ప్రజలయందు జఠరాగ్నినివృద్ధిపఱచెను. ద్యులోకమునందు సూర్యునివిస్తరింపఁజేసెను. పర్వతమునందు సోమలతను స్థాపించెను.

పంచాశత్తు ౨.

౪౪. క్రతుం వరుణో విక్ష్వగ్నిం దివిసూర్యమ దధాత్సోమమద్రౌ ౧ ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః ꣳ దృశే విశ్వాయ సూర్యమ్ ౨ ఉస్రావేతం ధూర్షాహావనశ్రూ అవీరహణౌ బ్రహ్మచోదనౌ 3 వరుణస్యస్కమ్భనమసి వరుణస్యస్కమ్భసర్జనమసి ప్రత్యస్తో వరుణస్య పాశః॥

౧ పరోక్షుఁడును, పుట్టినప్రపంచమును దెలిసికొనినవాఁడునగు సూర్యదేవుని సర్వజగత్తుయొక్క దర్శనముకొఱకుఁ గిరణములు ఊర్ధ్వప్రదేశమునుఁ బొందించుచు

న్నవి. ౨ భారమునుసహించునట్టియు, బండియందు బ్రసిదములైనట్టియు, బండియందలి సోసమును బాధించునట్టియు, న్నమునకు (కృషిద్వారా) బ్రవర్తకులైన యోవృషభములారా! రండు. ౩ (ఓ శమ్యా! నీవు) వారించఁదగిన వృషభమునకు నివారణమును చేయుదానవగుచున్నావు. (ఓ యోక్త్రమా! నీవు కూడ) పరుగునుండి నివారింపఁదగిన వృషభమునకు నివారణమునుఁ జేయుచున్నావు. పొడవైన త్రాడు బండికి (పై భాగమునఁ) బరచబడినది. (శమ్య=కాడియందలి రంధ్రమునందుంచఁబడు చిడుత. యోక్త్రము=కంఠమునందలి త్రాడు అనియర్థము.)

అష్టమానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౯.

౧౫. ౧ ప్రచ్యవస్వ భువస్పతే విశ్వాన్యభిధామాని మాత్వాపరిపరీ విదన్మాత్వా పరిపన్థినో విదన్మాత్వా వృకా అఘాయవో మాగన్ధర్వో విశ్వావసు రాదఘచ్ఛ్యేనో భూత్వా పరాపత యజమానస్యనో గృహేదేవైస్సగ్ంస్కృతం యజమానస్య స్వస్త్య యన్యస్య పిపన్థామగస్మహి స్వస్తి గామనేహాసం యేన విశ్వాః పరిద్విషో వృణక్తి విన్దతే వసు ౨ నమో మిత్రస్య వరుణస్య చక్షసే మహో దేవాయతదృతగ్ం సపర్యత దూరే దృశే దేవజాతాయ కేతవేదివస్పుత్రాయ సూర్యాయశగ్ంసత ౩ వరుణస్య స్కమ్భనమసి వరుణస్య స్కమ్భసర్జ నమస్యు న్మక్తో వరుణస్య పాశః॥

౧ యజమానాధ్వర్యులను బాలించునో సోమమా! నను స్తము లైన ప్రాచీనహావిర్ధానాది (హావిస్సులుంచు పాత్రము) స్థానములను గూర్చి బాగుగ వెళ్ళుము. మార్గమునందు బాధకుడగుచోరరాజునిన్నుఁ దెలిసికొనకుండుగాక. చోరరాజసేవకులు నిన్ను దెలిసికొనకుందురుగాక. వధరూపపాపమును గోరుచున్న యరణ్యమునందలి కుక్కలు నిన్ను దెలిసికొనకుండుఁగాక.(స్వర్గమార్గమున సోమమునపహరించు) విశ్వావసునుగంధర్వుఁడు నిన్నునిరీక్షింనకుండుఁగాక (ఓ సోమమా ! నీవు) డేగవలెఁబడుటకు సమర్థమై మాయజమానుని సంబంధమైన ప్రాచీనవంశమను గృహమునకు శీఘముగావెళ్ళుము దేవతాతుల్యులగు నధ్వర్యాదులచే (ప్రవహించుటకై) అసన్నియనుస్థానము సంస్కరించఁబడినది. యజమానునకు యజ్ఞమునుఁ బొందించుదానవగుచున్నావు. (మఱియు) శ్రేయస్సునుఁబొందించునదియు, బాపరహితమైనదియు నగు ననుష్ఠానరూపమార్గమును మేముబొందితిమి. ఏమార్గముచే సర్వశత్రువుల నంతటనుఁ బొందు (యజమానుఁడు) విడచుచున్నాడో ఏమార్గముచే ధనమునుబొందుచున్నాడో! (ఆమార్గమును బొందితిమని పూర్వాన్వయము) ౨ (తన కిరణములచే జగత్తునావరించునట్టి సర్వజ్ఞుఁడగు సూర్యునికొఱకు నమస్కారము. ఓ ఋత్విజులారా! గొప్పవాడగు దేవునిసంతోషము కొఱకు, నవశ్యముఫలమునిచ్చునట్టి జ్యోతిష్టోమకర్మను జేసి) సేవఁజేయుడు. దూరమునఁజూడఁబడుచున్నవాఁడును, దేవతగాఁబుట్టినవాఁడును, బగటికి లక్షణమైనవాఁడును, ద్యులోకమునకుఁ (బుత్రునివలె) ప్రియమైన సూర్యునిసంతోషము కొఱకు స్తోత్రముఁ జేయుడు. 3 ఉన్నుక్తః= విడువబడినది మిగిలినయర్థము పూర్వోక్తము (అ౧ అను-౭ పం-౨ వా-3)

నవమానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౧౦

రఊ. ౧ అగ్నేరాతిథ్యమసి విష్ణవేత్వా సోమస్యాzzతిథ్యమసి విష్ణవేత్వాzతిథే

రాతిథ్యమసి విష్ణవే త్వాzగ్నయే త్వా రాయస్పోషదావ్నే విష్ణవే త్వా శ్యేనా

య త్వా సోమభృతే విష్ణవే త్వా ౨ యా తే ధామాని హవిషా యజన్తి తా తే

విశ్వా పరిభూరస్తు యజ్ఞం గయస్ఫానః ప్రతరణః సువీరోzవీరహా ప్రచరా సో

మ దుర్యా ౩ నదిత్యాః సదోzస్య దిత్యాః సద ఆ॥

౧ (ఓ హవిస్సా ! నీవు) అతిథియైనయగ్నికి సత్కారరూప మగుచున్నావు. అటువంటి నిన్ను విష్ణుశబ్దవాచ్యమైన సోమముకొఱకుంచుచున్నాను. (ఓహవిస్సా! నీవు) సోమమునకు సత్కారరూపమగుచున్నావు. అటువంటినిన్ను విష్ణుశబ్దముచే జెప్పఁబడుసోమము కొఱకుంచుచున్నాను. అతిథికిసత్కారరూపమగుచున్నావు. విష్ణుశబ్దవాచ్యమైనసోమముకొఱకు నిన్నుంచుచున్నాను. ధనసమృద్ధికి దాతయగు నగ్నికొఱకు నిన్నుంచుచున్నాను. విష్ణుశబ్దవాచ్యమైన సోమముకొఱకు నిన్నుంచుచున్నాను. సోమమునుభరించునట్టి డేగకొఱకు నిన్నుంచుచున్నాను. విష్ణుశబ్దవాచ్యమైన సోమముకొఱకునిన్నుంచుచున్నాను. ౨ (ఓ సోమమా !)నీసంబంధములైన యే ప్రాకసువనాదులయందు హవిస్సుచే యాగము చేయుచున్నారో! వాటినన్నిటిని అంతటనుఁబొందుము. (ఓ సోమమా !)గృహమునకునభివర్ధకమును, ప్రకర్షగా యజ్ఞసమాప్తి నిఁగూర్చిమమ్ముఁదరింపఁజేయునట్టియు; యోగ్యులైనవీరులు (నీయనుగ్రహమువలనఁబొందఁబడిన మా పుత్రపౌత్రులు) కలిగినట్టియు, (ఈ) వీరులకు పరిపాలకమును నగు నీవు (ప్రాచీనవంశములను) గృహములనుఁ బొందుము. (ప్రాచీనవంశము=సోమము మొదలగు యజ్ఞసంభారములుంచుకొను యజ్ఞశాలలోని భాగమని యర్థము. ౩ (ఓ కృష్ణాజనమా! నీవు భూమికిస్థానమగుచున్నావు. (ఓ సోమమా ! నీవు) భూమియొక్క స్థానమునుబొందుము.

పంచాశత్తు ౨.

౪౭. సీద ౧ వరుణోzసి ధృతవ్రతో వారుణమసి శం యోర్దేవానాగ్ం సఖ్యాన్మా

దేవానామపసఛ్ఛిత్స్న్న ౨ హ్యాపతయే త్వా గృహ్ణామి పరిపతయే త్వా గృహ్ణామి
తనూనప్త్రే త్వా గృహ్ణామి శాక్వరాయ త్వా గృహ్ణామి శక్మన్నోజిష్ఠాయ త్వా
గృహ్ణామ్య ౩ నాధృష్టమస్య నాధృష్యం దేవానామోజోఽభిశస్తిపా అనభి
శస్తేన్య ౪ మను మే దీక్షాం దీక్షాపతిర్మన్యతామను తప స్తపస్పతిరఞ్జసా
సత్యముపగేషగ్ం సువితే మా ధాః॥

౧ (ఓసోమమా! నీవు) వరుణపాశమును బోగొట్టుదానవగుచున్నావు. ధరించఁబడిన యజ్ఞరూపవ్రతముకల యో సోమమా! (నీవు) వరుణుని సంబంధివగుచున్నావు నీసుఖముయొక్క కలయిక చేతను వరుణాది దేవతలయొక్క స్నేహమువలనను మేము కర్మనుండి తొలగకుందుముగాక. ౨ (ఓ యాజ్యమా!) ప్రాణము కొఱకు నిన్ను ఈ పాత్రయందుఁ దీసికొనుచున్నాను. మనస్సు కొఱకు నిన్ను స్వీకరించుచున్నాను. జఠరాగ్ని కొఱకు నిన్ను స్వీకరించుచున్నాను. శక్తిస్వరూపము కొఱకు నిన్ను స్వీకరించుచున్నాను. శక్తిగల యుష్టమ ధాతువుయొక్క సారముకొఱకు నిన్ను స్వీకరించుచున్నాను. ౩ (ఓయాజ్యమా! నీవు ఇంతకుఁబూర్వమెవ్వనిచేతను) తిరస్కరించఁబడలేదు. (ఇటుపైనగూడ) తిరస్కరించఁబడుదానవు కావు. దేవతలయొక్క సారమగుచున్నావు. హింసారూపమైన పరస్పర విరోధము నుండి మమ్ముఁ బాలించుచున్నావు. (నీవైతే) హింసారూపమైన యావిరోధమునకు సంబాధము లేనిదానవగుచున్నావు. ౪ (దక్షిణేయేష్టియందలి దేవత యగు) దీక్షాపతి నాదీక్షను దెలిసికొనుగాక. ఆదేవతయే నాతపస్సును దెలిసికొనుఁగాక. నేనుగూడ శీఘ్రముగాఁదానూనప్త్ర (తనూనపాత్ =శరీరమును బడకుండఁ జేయునగ్నికిష్టము) స్పర్శనరూపమగు శపథమును బొందితిని. ఓ తానూనప్త్రమా! నన్ను శోభనమార్గ

మగు యజ్ఞకర్మయందు స్థాపించుము. (తానూనప్త్రము=దీనికర్థము ముందు అ౬ ప్ర ౨ అను౨ నందు స్పష్టముగాఁ జెప్పఁబడును.

దశమానువాకము సమాప్తము.



అనువాకము ౧౧.

౭౮. అగ్ంశురగ్ంశుస్తే దేవసోమాఽఽప్యాయతామిన్ద్రాయైకధనవిద ఆతుభ్యమి న్ద్రః ప్యాయతా మాత్వమిన్ద్రాయప్యాయస్వాఽఽప్యాయయ సఖీన్త్సన్యామేధ యాస్వస్తి తేదేవ సోమసుత్యామశీయే ౨ ష్టారాయః ప్రేషేభగా యర్త మృతవాదిభ్యోనమోదివేనమః పృథివ్యా ౩ అగ్నేవ్రతపతేత్వం వ్రతానాం వ్రతపతిరసియామమతనూ రేషాసాత్వయి॥

౧ (ఓ సోమదేవతా! నీసంబంధిమైన యే సూక్ష్మావయవము శోషించు చున్నదో! ఏ సూక్ష్మావయవము క్షీణించుచున్నదో! (అదియంతయు) ముఖ్యమయిన సోమరూప ధనమునుఁ దెలిసికొనిన యింద్రునికొఱకు వృద్ధినొందుఁగాక. (ఓసోమమా! నీకొఱకు (నిన్ను రక్షించుటకు) నింద్రుఁడుత్సాహపడుఁ గాక. నీవు కూడ నింద్రుని కొఱకు వృద్ధినొందుము. ధనలాభము చేతను, ప్రజ్ఞచేతను, ఋత్విక్కులను వృద్ధి నొందించుము ఓసోమమా! నీకు శుభమగుఁగాక. నీయనుగ్రహముచే నేను సుత్యా హస్సును బొందుదును. (సుత్యాహస్సు = యజ్ఞదినములలోనిది యొకరోజు.) ౨ భక్తు లయుందిచ్ఛగల ద్యావాభూమ్యభిమానివగు నో దేవా! (నీవు) యజ్ఞమును జెప్పునట్టి కొఱకు యజ్ఞమును ధనము కొఱకును, అన్నముకొఱకును, ఐశ్వర్యాది షడ్గుణ

సంపత్తికొఱకును, గొప్పగా నిమ్ము. (షడ్గుణములు = (౧) ఐశ్వర్యము (౨) ధర్మము (౩) కీర్తి (౪) సంపత్తు (౫) జ్ఞానము (౬) వైరాగ్యము అని - తా.) ద్యులోకము కొఱకు నమస్కారము. పృథివీలోకము కొఱకు నమస్కారము. ౩ ఓ యగ్నీ! నీవు వ్రతములకుఁ బ్రభువగుచున్నావు. వ్రతముల నాచరించుచున్న నాశరీరమేదికలదో! అది నీయందు (మనస్సుచే) సమర్పించఁబడినది. (ఇట్లు కాగా మనముభయులము వ్రతులమగుచుంటిమి. వ్రతములకు భర్తయగునో యగ్నీ! వ్రతులమైన మనయుభయుల వ్రతములుకూడ బ్రవర్తించుఁగాక. (జరుగుగాక)

పంచాశత్తు - ౨

౪౯. యాతవతనూరియగ్ం సామయి సహనౌ వ్రతపతే వ్రతినోర్వ్రతాని ౧ యా తే
అగ్నే రుద్రియా తనూస్తయా నః పాహి తస్యాస్తే స్వాహా ౨ యా తే అగ్నేఽయా
శయా రజాశయా హరాశయా తనూర్వర్షిష్ఠా గహ్వరేష్ఠోగ్రం వచో అపా
వధీం త్వేషం వచో అపావధీగ్ంస్వాహా॥

౧ ఓ యగ్నీ! నీయేశరీరము క్రూరమైనదో! దానిచే మమ్ముఁ బాలింపుము. నీయాశరీరమునకే హవిస్సు హుతమగుఁగాక. ౨ ఓ యగ్నీ! లోహనిర్మితమును, వెండిచేఁ జేయఁబడినదియు, హిరణ్య (బంగారము) నిర్మితమును, మిక్కిలి వృద్ధమైనదియు, స్పృశించుటకు శక్యముగాని, కాచఁబడిన లోహము-లేక వెండి-బంగారముల యందున్నదియునగు నేశరీరమునకుఁ గలదో! ఆ నీశరీరముచేత నుగ్రవాక్కును త్వేషవాక్కును నశింపఁజేసినవాఁడనగుచున్నాను. అటువంటి యగ్నికొఱకీ హవిస్సు హుతమగుఁగాక. (అన్నోదకములు లభించకపోవుటచే నాకలిచే బాధపడుచున్నాను దప్పికఁగొన్నవాఁడను, అనువాక్కు, ఉగ్రవాక్కు ఇయ్యది యుష్మలోకసంబంధ

హైనది. మనస్సునకు సంతాపమును గలిగించు పరలోకసంబంధమైనవాక్కు, ద్వేష వాక్కు అని భాష్యం.)

ఏకాదశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౧౨.

౯౦. ౧ విత్తాయనీమేఽసితిక్తాయ నీమేఽస్యవతాన్మానాథి తమవతాన్మావ్యథితం ౨విదేరగ్నిర్నభోనామాఽగ్నే అఙ్గిరో యోఽస్యాం పృథివ్యామస్యాయుషానామ్నే హియత్తేఽనాధృష్టంనామ యజ్ఞియంతేనత్వాఽఽదధే ౩ ఽగ్నే అఙ్గిరో యో ద్వితీయస్యాం తృతీయస్యాం పృథివ్యామ స్యాయుషా నామ్నేహియత్తేఽనా ధృష్టంనామ॥

౧ (ఓ యుత్తరవేదీ ! నీవు) నాకు అగ్నిరూపమగు ధనమును బొందుదానవు కమ్ము. జ్వాలారూపమయిన యగ్ని తేజస్సునుఁ బొందించుము. (అగ్నిని) యాచించు నట్టి నన్ను రక్షింపుము, (అగ్నినిఁ బొందకుండుట వలన) భయపడిన నన్ను రక్షింపుము ౨ ఉత్తరవేదికి సంబంధించిన యగ్ని నభస్సు అను పేరుకలది. గార్హపత్యదాక్షిణా గ్న్యాదులందు మధ్యయందు సారమగునో యగ్నీ ! ఏనీవు ఈ మట్టిరూపమైన భూమి యందుంటున్నావో! అటువంటి నీవు ఆయువు నిచ్చు నభస్సు అను పేరుగలయగ్నితో కూడుకొనినవాఁడవై (ఉత్తరవేదియందు) రమ్ము. ఏదినీకుఁ (ఎవ్వనిచే) దిరస్కరించ బడనిదియు, యజ్ఞసంబంధియునగు పేరుకలదో! ఆనామముతో (వ్యవహరించి) నిన్ను ధరించుచున్నాను. (అగానాం = రసః అంగిరసః = అవయవములలో సారమని తా॥) ౩ ఓ యంగిరసాగ్నీ! ఏ నీవు రెండవదియు, మూఁడవదియునగు

మృద్రూపమయిన భూమియందుంటున్నావో ! ఆనీవు నభస్సు అను పేరుకల యగ్నితో గూడుకొనిన వాఁడవై (ఉత్తరవేదియందు) రమ్ము. (మిగిలినయర్థము పూర్వ వాక్యమునఁ జెప్పఁబడినది.)

పంచాశత్తు ౨.

౫౧. యజ్ఞియంతేనత్వాऽऽదధే ౧ సిగ్ంహీరసి మహిషీరస్యు ౨ రుప్రథస్వోరుతే యజ్ఞపతిః ప్రథతాంధ్రువాऽసి దేవేభ్యశ్శున్ధస్వదేవేభ్యః శుమ్భస్వే ౩ న్ద్రఘోషస్త్వా వసుభిఃపురస్తాత్పాతు మనోజవాస్త్వా పితృభిర్దక్షిణతః పాతు ప్రచేతాస్త్వారుద్రైః పశ్చాత్పాతు విశ్వకర్మాత్వాऽऽ దిత్యైరుత్తరతఃపాతు ౪ సిగ్ంహీరసిసపత్నసాహీస్వాహా సిగ్ంహీరసి సుప్రజావనిః స్వాహా సిగ్ంహీః॥

౧ (ఓ యుత్తరవేదీ! నీవు) సింహస్వరూపమగుచున్నావు. కోరినయాఁడుదగిన దానవగుచున్నావు. ౨ (ఓ యుత్తరవేదీ! నీవు) గొప్పదానవుగా విస్తరించుము. నీయొక్క యజ్ఞమునకుఁ బ్రభువగు యజమానుఁడు గొప్పవాఁడుగా విస్తరించుఁగాక! దృఢమగుచున్నావు. దేవతలకొఱకుఁ బరిశుద్ధురాలవగుము. దేవతల కొఱకుఁ బ్రకాశించుదానవగుము. ౩ (ఓ యుత్తరవేదీ!) ఇంద్రఘోషుఁడను దేవుఁడు వసుగణముతోఁ గూడుకొనినవాఁడై తూర్పుదిక్కునుండి, మనోవేగమువంటి వేగముకల వాయుదేవుఁడు పితృగణములతో గూడుకొనినవాఁడై దక్షిణదిక్కునుండి నిన్ను రక్షించుఁగాక. విశ్వకర్మయను దేవుఁడాదిత్య గణముతోఁగూడుకొనినవాఁడై యుత్తరదిక్కునుండి నిన్ను రక్షించుగాక. ౪ (ఓ యుత్తరవేదీ! సింహరూపమును ధరించిన నీవు శత్రువులను నశింపఁజేయుదాన వగుచున్నావు. ఈ హవిస్సు నీకు

హుతమగుగాక! సింహస్వరూపమును ధరించిన నీవు శోభనములగు సంతానమును, భృత్యులను, నిచ్చుదానవగుచుంటివి. ఈ హవిస్సు నీకు హుతమగుఁగాక. సింహ స్వరూపముకల నీవు ఐశ్వర్యసంబంధమయిన ప్రతిష్ఠ నొసగుదానవగు చుంటివి. ఈ హవిస్సు నీకు హుతమగుగాక. సింహస్వరూపమవగు నీవు దేవతలనుఁ గోరు చున్న యజమానుని కొఱకు దేవతలనుఁ బిలువుము. నీకీ హవిస్సు హుతమగుఁగాక.

పంచాశత్తు 3.

౫౨. అసిరాయస్పోషవనిః స్వాహా సిగ్ంహీరస్యా దిత్యవనిః స్వాహా సిగ్ంహీరస్యా వహ దేవాన్దేవయతే యజమానాయస్వాహా ౧ భూతేభ్యస్త్వా ౨ విశ్వాయు రసిపృథివీం దృగ్ంహధ్రువ క్షిదస్య న్తరిక్షం దృగ్ంహాచ్యుత క్షిదసిదివం దృగ్ంహ 3 గ్నేర్భస్మాస్యగ్నేః పురీషమసి॥

౧ (ఓ జుహూ!) నిన్నుఁ బ్రాచీనులగు దేవతల కొఱకు (గ్రహించుచున్నాను.) ౨ (ఓ మధ్యమపరిధీ! నీవు) సంపూర్ణమగు నాయుస్సు నిచ్చిన దానవగుచున్నావు. భూమినిదృఢముగాఁ జేయుము. (ఓ దక్షిణపరిధీ! నీవు) స్థిరమయిన నివాసము కల దానవగుచున్నావు. ఆకాశమును దృఢముగాఁ జేయుము. (ఓయుత్తరపరిధీ! నీవు) నాశనమొందని నివాసముకల దానవగుచున్నావు. స్వర్గలోకమును దృఢముగాఁ జేయుము. 3 (ఓ యజ్ఞసంభారమా! నీవు) అగ్నినిఁ బ్రకాశింపజేయుదానవును, బూరించుదానవు నగుచున్నావు. (మిగిలిన హోమద్రవ్యములకు యజ్ఞసంభారమనితా)

ద్వాదశాను వాకము సమాప్తము.

—*—

అనువాకము ౧౩.

౫౩. యుఞ్జతే మనఉత యుఞ్జతేధియో విప్రావిప్రస్యబృహతో విపశ్చితః విహోత్రాదధేవయునావిదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః ౨ సువాగ్దేవదుర్యాగ్ం ఆవద దేవశ్రుతౌ దేవేష్వాఘోషేథా ౩ మానోవీరో జాయతాం కర్మణ్యోయగ్ం సర్వేzనుజీవామయో బహూనామ సద్వశీ॥ ౪ ఇదంవిష్ణుర్విచక్రమే త్రేధానిదధేపదమ్। సమూఢమస్య॥

౧ వేదము నధ్యయనము చేసినట్టియు, వేదార్థమును తెలిసి కొనినవాఁడును, బ్రాహ్మణుఁడునగు యజమానునకు సంబంధులును, బ్రాహ్మణులును, హోమకర్తలు నగు ఋత్విక్కులు మనస్సును (లౌకికచిన్తలనుండి తొలగించి యజ్ఞ చింతలయందు) నియమించుచున్నారు. ఇంద్రియములను గూడ (యజ్ఞము కొఱకగు స్వవ్యాపారములందు) నియమించుచున్నారు. (ఆమనోనియమాది సామర్థ్యమును) మార్గములను గుర్తెరిగిన (సర్వజ్ఞుఁడు) పరమేశ్వరుఁడొకఁడే సృష్టించెను. ఏ హేతువుచే ప్రేరకుఁడు అంతర్యామియు నగు బరమేశ్వరుని సృష్టిగొప్పదియో ! ౨ (అక్షదేవుడా !) గృహములను గూర్చి మంచివాక్కులు కలవాఁడవై యంతటను శ్రేయస్సును జేయు వాక్కును బలుకుము. ఓ ప్రసిద్ధమయిన యక్షదేవతలారా ! (ఈ యజమానుఁడు మిమ్ముఁ గూర్చి యాగము చేయుచున్నాఁడని దేవతలలో ధ్వనినిజేయుఁడు ౩ కర్మ యందు నేర్పరియు, నాలస్యాది దోషరహితుడు నగుఁ బుత్రుఁడు (మాకుఁ) బుట్టుఁ గాక. ఏ పుత్రుననుసరించి యాందరు జీవించుచుందురో ! ఏ పుత్రుడందరిని నియమించుశక్తికలవాఁడగునో ! (అట్టిపుత్రుడు అని పూర్వాన్వయము.)

పంచాశత్తు ౨

౫౪. ౧ పాగ్ంసుర ఇరావతీ ధేనుమతీహ భూతగ్ం సూయవసినీ మనవేయశస్యే

వ్యస్కభ్నాదోఽదసీవిష్ణురేతే దాధార పృథివీమభితోమయూఖైః ౨ ప్రాచీ

ప్రేతమధ్వరం కల్పయన్తీ ఊర్ధ్వం యజ్ఞం నయతం మాజీహ్వరత ౩ మత్రి

రమేథాంవర్ష్మన్ పృథివ్యా ౪ దివోవా విష్ణవుతవా పృథివ్యా మహోవా

విష్ణవుతవాఽన్తరిక్షాద్ధస్తౌపృణస్వబహుభిర్వసవ్యైరా ప్రయచ్ఛ॥

౧ (వెనుకటి పంచాశత్తులోని ౪వ వాక్యమునకుఁ గూడ నిచ్చటనే యర్థము వ్రాయఁబడుచున్నది.) విష్ణుమూర్తి (త్రివిక్రమావతారమును ధరించి) ఈప్రపంచమును విభజించి దాఁటెను. పాదమును మూఁడువిధములుగా (పృథివ్యన్తరిక్ష ద్యులోకము లంఠని తా) నుంచెను. భూమ్యాదిలోక రూపపరాగములు పాదమునందుఁగల యీవిష్ణుమూర్తియొక్క పాదమునందుఁ బ్రపంచముఁబాగుగా నంతర్భూతమయినది. అన్నము కలిగినట్టియు, నధికముగఁ బాలుకల యావులుకలవారలు, మంచితినుబండార ములతోఁ గూడుకొనిన వారలై మనుసంబంధులగు బ్రజలకొఱకుఁ గీర్తినిమిత్తమై యుందురుగాక. ఈ ద్యావాభూముల నీవిష్ణుమూర్తి విభజించిస్థాపించెను, ఆభూమిని దన తేజోరూపములగు జీవులచే నంతటను బోషించెను. (ఆవిష్ణుమూర్తి యీయుత్తర హవిర్ధానమార్గాహుతిచే సంతోషించుగాక) ౨ ఓశకటములారా! యాగమును బాధలేకుండు నట్లుగాఁజేయునట్టి (మీరు) తూర్పు దిక్కునకభిముఖులై వెళ్ళుఁడు. (మఱియుఁ) బైలోకమునందుండు దేవతలను గూర్చి యజ్ఞమును బొందించుఁడు. కౌటిల్యము లేనివారలై యుండుఁడు. ౩ ఓశకటములారా! దేవయజనమను పేరుకల పృథివియొక్క యీశరీరమునందుఁ గ్రీడించుఁడు. ౪ ఓ విష్ణుమూర్తీ! స్వర్గలోకము నుండికాని, లేక భూలోకమునుండి కాని, మహర్లోకమునుండి కాని, యంతరిక్ష లోకమునుండి కాని, (తీసికొని రాబడిన) యనేక ధన సమూహముల చేతఁ జేతులను నింపించుము. ఓ విష్ణుమూర్తీ! (నిండిన ధనముకల) కుడిచేతినుండి కాని, యెడమ చేతినుండి కాని, (యనేక పర్యాయములు గొప్పవగు మణిముత్యాదుల) నిమ్ము.

పంచాశత్తు ౩

౫.౧. దక్షిణాదోతసవ్యాత్ ౧ విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమేరజాగ్ంసియో అస్కభాయ దుత్తరగ్ం సధస్థంవి చక్రమాణ స్త్రేధో రుగాయో ౨ విష్ణోరరాటమసి ౩ విష్ణోః పృష్ఠమసి ౪ విష్ణోః శ్నప్త్రేస్థో ౫ విష్ణోఃస్యూరసి విష్ణోర్ధ్రువమసి వైష్ణవమసి విష్ణవేత్వా॥

౧ విష్ణుమూర్తియొక్క కర్మలను జెప్పుచున్నాను. ఏవిష్ణుమూర్తి పృథివీ వికారములగు బరమాణువులను నిర్మించెనో! ఏ విష్ణుమూర్తి పైనుండు దేవతలకు నివాసస్థానమగు ద్యులోకముచు (క్రింద బడకుండునట్లుగా) స్తంభింపఁ జేసెనో! ఏ విష్ణుమూర్తి మూడులోకములందు మూడు పాదముల నుంచెనో! (మఱియు) మహాత్ములచే గానముచేయఁ (కొనియాడఁ) బడుచున్నాడో! (ఆ విష్ణుమూర్తియొక్క కర్మలనని పూర్వాన్వయము.) ౨ (ఓ దర్భమాలా! నీవు) హవిర్ధాన మండపమును విష్ణుమూర్తికి లలాటమగు చున్నావు. (యజ్ఞశాలయందు హవిర్ధాన మండపమొకటి యుండును. ఆమండపము యొక్క తూర్పు దిక్కుననుండు రెండు స్తంభములందు ఈ దర్భమాల కూర్చఁబడును. లలాటము = కనుబొమ్మల మధ్యనుండు స్థానము)
౩ (ఓ దర్భమాలా! నీవు) హవిర్ధాన మంటపమును విష్ణువునకు పృష్ఠభాగ మగుచున్నావు. ౪ (శిరస్సునందు కప్పఁబడు చర్మములారా! మీరు) హవిర్ధాన మంటపమును విష్ణువునకు దవడలగు చున్నారు. ౫ (ఓ రజ్జువా! నీవు) విష్ణుదేవత గాఁగల హవిర్ధాన మంటపమునకు బంధన హేతువగు చున్నావు. (ఓ గ్రంథిరూపమా నీవు) విష్ణుసంబంధివై దృఢమగు చున్నావు. (ఓ మండపమా! నీవు) విష్ణుదేవతాక మగుచున్నావు(కావున) నిన్ను విష్ణుప్రీతికై దాకుచున్నాను. (రజ్జుః = తాడు గ్రన్థిః= ముడి)

త్రయోదశానువాకము సమాప్తము.

— * —

## అనువాకము. ౧౪.

౫౬. కృణుష్వపాజః ప్రసితిం నపృథ్వీం యాహిరాజే వామవాగ్ం ఇభేన తృష్వీ
మనుప్రసితిం ద్రూణానోఽస్తాఽసి విధ్యరక్షస స్తపిష్ఠైః ౨ తవభ్రమాస ఆశు
యాపత స్త్వను స్పృశధృషతా శోశుచానః తపూగ్ంష్యగ్నేజుహ్వా పతఙ్గాన
సందితో విసృజ విష్వగుల్కాః ౩ ప్రతిస్పశోవి సృజతూర్ణి తమోభవాపా
యుర్విశో అస్యా అదబ్ధః యోనోదూరే అఘశగ్ంసః

౧ (ఓ యగ్నీ ! మృగమును బంధించుటకుఁ) బ్రసరించఁబడిన పాశమునువలె రాక్షసుల నడ్డుపెట్టుటకు బలమును జేయుము. మంత్రితోఁ గూడుకొనిన వాఁడును, ఏనుగుతోఁ గూడుకొనిన వాఁడునగు రాజువలె రాక్షసుల పైనవెళ్ళుము. శీఘ్రముగా వెళ్లునట్టి గొప్పసేన ననుసరించి వెనుకనుండి వెళ్ళిచంపుచున్న వాఁడవై మిగిలిన సేనను బోగొట్టు వాఁడవగుము. (పగుగొట్టుచున్న) రాక్షసులను దీక్ష్ణముగా బాణములచే బొడువుము ౨ ఓ యగ్నీ ! నీకిరణములు త్వరగా వెళ్ళునట్టివై యంతటను బడుచున్నవి. (నీవుకూడ) బాగుగాఁ బ్రకాశించువాఁడవై (యాకిరణములచే నారాక్షసులను) ధార్ష్ట్యముగాఁ దాకుము. హుతమైన హవిస్సుచే నీవెడతెఱపు లేని వాఁడవగుము. సంతాపములను, నిప్పుకణములను, మహాజ్వాలలను, (రాక్షసులను బాధించుటకు) విశేషముగాఁ బుట్టించుము. ౩ ఓ యగ్నీ ! చిత్రవధఁ జేయునట్టి యేరాక్షసుఁడు మాకు దూరమునందు (వుండెనో !) వానింగూర్చి తొందరకల వాఁడవై బంధనమునకుఁ గారణములగు పాశముల ననేకవిధములుగాఁ బుట్టించుము. ఎవఁడు సమీపమునందు (వుండెనో !) వానింగూర్చియు, దొందరకల వాఁడవై యనేకవిధములయిన పాశములను బుట్టించుము. ఎవ్వని చేతను హింసించఁబడని నీవు మాసంతానమునకుఁ బాలకుఁడ వగుము. బాధించునట్టి యేరాక్షసుఁడును నీసమీపమున ధృష్టుఁడైయుండకుండుఁగాక. (ధృష్టుఁడు = దిట్టతనము కలవాఁడు.)

పంచాశత్తు ౨.

౫౭. యోఽస్మభ్యగ్నే మాగిక్షిప్తే వ్యథిరాదధర్షీత్। ౧ ఉదగ్నే తిష్ఠ ప్రత్యాతనుష్వ న్యమిత్రాగ్ం ఓషతాత్తిగ్మహేతే। యోనో అరాతిగ్ం సమిధాన చక్రే నీచాతం ధక్ష్యతసం నశుష్కమ్ ౨ ఊర్ధ్వోభవ ప్రతివిధ్యాధ్య స్మదావిష్కృణుష్వదైవ్యాన్యగ్నే। అవస్థిరాతను హియాతుజూనాం జామిమజామిం ప్రమృణీహిశత్రూన్ సతే॥

౧ ఓ యగ్నీ ! నీవులెమ్ము. శత్రువులను గూర్చియంతటను బ్రవర్తించుము. తీక్ష్ణమైనయాయుధము కల యో యగ్నీ ! (నీవు) శత్రువులను బాగుగాఁ దగులఁ బెట్టుము. ఓ ప్రజ్వలించుచున్న యగ్నీ ! ఎవఁడు మాకు శత్రుభావమును జేసెనో ! అతనిని నీచునిగాఁ జేసియెండిన కర్రనువలె భస్మము చేయుము. ౨ ఓ యగ్నీ ! నీవు సన్నద్ధుఁడవగుము. మాకుఁబైన (ఏ శత్రువులున్నారో ! వారిని) బాధించుము. ఓ యగ్నీ ! దైవికములగు కర్మలను బ్రకటన జేయుము. రాక్షసుల కర్మలు (ఏవిధము గ) నష్టములగునో ! ఆ విధముగాఁ జేయుము. మాటిమాటికిఁ గొట్టఁబడినవాఁడును గొట్టఁబడనివాఁడు అగు సమస్త శత్రులను జంపుము.

పంచాశత్తు ౩

౫౮. జానాతిసుమతిం యవిష్ఠయ ఈవతే బ్రహ్మణే గాతుమైరత్ విశ్వాన్యస్మై సుదినా నిరాయోద్యుమ్నాన్యర్యో విదురో అభిద్యౌత్ ౫ సేదగ్నే అస్తు సుభగః సుదానుర్యస్త్వా నిత్యేన హవిషాయ ఉక్థైః పిప్రీషతిస్వ ఆయుషి

దురోణే విశ్వేదస్మై సుదినా సాఽసదిష్టిః 3 అర్చామి తే సుమతిం ఘోష్యర్వాక్సం తేవా వాతాజరతామ్॥

౧ ఓ గొప్ప యువకుండా ! ఏ యజమానుండు (స్వగృహమును గూర్చి) వెళ్లునట్టి దృఢమైన నీకొఱకు హవీరూపమయిన యన్నము నిచ్చుచున్నాడో! ఆయజమానుండే నీయనుగ్రహముతో (గూడుకొనిన) మంచి బుద్ధినిం దెలిసికొనుచున్నాడు. (నీవుకూడ) స్వామివై, ధనములను, కీర్తులను, గృహములను, ఉద్దేశించి యీయజమానుని కొఱకు నన్నిటిని మంచి దినములనుగాం జేయుము. ౨ ఓ యగ్నీ ! ఏ యజమానుండు తన జీవితమంతయు, దనగృహమునందు బ్రతిదినము చేయందగిన హవిస్సుచే నిన్ను సంతోషపెట్టుటకుం గోరుచున్నాడో! ఏ యజమానుండు శస్త్రము (మంత్రవిశేషము) లచే నిన్ను సంతోషంపెట్టుచున్నాడో! ఆయజమానుండే సౌభాగ్యము కలవాండును, శోభనమైన దానము కలవాండును గూడనగుంగాక. ఈయజమానునకా యిష్టియంతయు మంచిదినము కలదగుచున్నది. 3 ఓ యగ్నీ ! నీసదనుగ్రహమును (మనస్సుచేం) బూజించుచున్నాను. నవీనమైనను ఘోషమను బాహ్యార్థానముకల యీస్తుతిరూపమయిన (నా) వాక్కు మఱల మఱలం బ్రసరించుచున్నదై నీయందు బాగుగ జీర్ణించుగాక (నిన్ను విడచి వేరొకచోటికి వెళ్లకుండుగాక అని తా॥) (మేమైతే నీయనుగ్రహమువలన) మంచిగుఱ్ఱములతోం గూడుకొనినవారలమును, మంచిరథములతోం గూడుకొనినవారలమునగుచు, నిన్ను బూజించెదము. (నీవుకూడ) ప్రతిదినము మాయందు సామర్థ్యమును ధరింపంజేయుము.

పంచాశత్తు ౪.

౫౯. ఇయంగీః స్వశ్వాస్స్వసుర థామర్జయేమాస్మే క్షత్రాణి ధారయేరనుద్యూన్ ౧ ఇహత్వాభూర్యా చరేదు పత్మన్దోషావస్తర్దీ దివాగ్ంసమనుద్యూన్ క్రీడన్తస్త్వాసుమనసః సపేమాభిద్యుమ్నా తస్థివాగ్ంసోజనానామ్ ౨ యస్త్వా

స్వశ్వః సుహిరణ్యో అగ్నఉపయాతి వసుమతారథేన తస్యత్రాతాభవసి తస్యసఖాయస్త ఆతిథ్యమానుషగ్జుజోషత్ మహోరుజామి॥

౧ ఓ యగ్నీ! ఈ లోకమునందు (శ్రేయస్సునుగోరు పురుషుఁడు) రాత్రింబవళ్లు ప్రకాశించుచున్న నిన్నుఁ బ్రతిదినము తన నిమిత్తమై బహుళముగా నంతట నుపచారము చేయుఁగాక. (కాన) మేము క్రీడించుచున్నవారమును, సంతుష్టమైన మనస్సుకలవారమును, (నీయనుగ్రహమువలన) జనులలో ధనములను బొందినవారమునై నిన్ను సేవించుదుము. ౨ ఓ యగ్నీ! (నీయనుగ్రహమువలన) మంచిగుఱ్ఱములతోఁ గూడుకొనినవాఁడును, మంచిబంగారముతోఁ గూడుకొనినవాఁడు నగు నేయజమానుఁడు హవీరూపమయిన ధనముకల రథముతోఁ గూడనిన్నుఁ బొందుచున్నాఁడో! ఆ యజమానునకు (నీవు) రక్షకుఁడవగుచున్నావు. (మఱియు) ఎవఁడు నీకుఁ బ్రతిదినము ప్రీతిపురస్సరముగ నతిథిసత్కారమును జేయుచున్నాఁడో! వానికి (నీవు) స్నేహితుఁడువలె స్వాధీనుఁడవగుచున్నావు.

పంచాశత్తు ౫౧

౬౦. బన్ధుతావచోభిస్త న్నాపితుర్గో తమాదన్వియాయ త్వంనో అస్యవచ సశ్చికిద్ధి హోతర్య విష్ఠసుక్రతోదమూనాః ౨ అస్వప్రజస్తరణయః సుశేవా అతన్ద్రాసోఽవృకా అశ్రమిష్ఠాః తేపాయవః సధ్రియఞ్చో నిషద్యాగ్నేతవ నఃపాన్త్వమూర 3 యేపాయవో మామతేయం తే అగ్నేపశ్యన్తో అన్ధందురితాదరక్షన్ రరక్షతాన్త్సుకృతో విశ్వవేదాదిప్సన్త ఇద్రిపవోనాహా॥

౧ ఓ యగ్నీ! (నీ సంబంధమయిన) బంధుభావముచే (రాక్షసుల) తేజస్సు నధిక్షేపరూపవాక్కులచేత నాశనము చేయుచున్నాను. ఆ నీబంధుత్వమును, గోత మునితో సమానుఁడును, అధ్యాపకుఁడునగు దంద్రినుండి నన్నుఁ బొందించుము. (అదివఱకు దనతండ్రిపై నున్న బాంధవ్యము నాపైకూడనని) దేవతల నాహ్వానించు నట్టి యోయగ్నీ! ఓ యువకుఁడా! మంచియాగములుకలవాఁడా! దాన్తమయిన మనస్సుకలవాఁడా! నీవు (వేదాధ్యయనముచేసిన) నావాక్కుయొక్క (రహస్య మును) దెలిసికొనుచున్నావు. (దాన్తః = ఇంద్రియములవలన నుపశమించువాఁడు. తపమువలని కష్టమునోర్చువాఁడు, లేదాఆచార్యాదులచే శిక్షింపఁబడినవాఁడుఅనితా॥

౨ మూర్ఛలేనివాఁడవగునోయగ్నీ! మిథ్యాభూతము (అసత్యము)లు కానట్టియు, పాప రూపమయిన తమస్సును బోఁగొట్టునట్టియు, సుఖముగా సేవించుటకు యోగ్యమయి నట్టియు, ప్రమత్తములు కానట్టియు, హింసకములు కానట్టియు, శ్రమరహితములై నట్టియు, బరిపాలకములైనట్టియుఁ, గూడనుండునట్టి నీయొక్క యాకిరణములు యాగప్రదేశమునందుండి మమ్మురక్షించుఁగాక.

3 ఓయగ్నీ! నీసంబంధములైనవియు, బరిపాలకములునగు నీకిరణములు "మమత" యనుపేరుకల యొకానొక స్త్రీయొక్క సంతానమును గ్రుడ్డివానినిగాఁ జూచుచున్నవై గ్రుడ్డితనమేస్వరూపముగాఁగల పాపమునుండిరక్షించినవో! ప్రపంచమును దెలిసికొను చున్న నీవు మంచికర్మలను జేయునట్టి యాకిరణములను రక్షించుము. నీ శత్రువు లగు రాక్షసులాకిరణములను దిరస్కరించుటకుఁ గోరుచున్నవారలైనను తిరస్క రించలేరు.

పంచాశత్తు ౬.

౬౧. దేభుః ౧ త్వయావయగ్ం సధన్యస్త్వోతా స్తవప్రణీత్యశ్యామ వాజాన్ ఉభాశగ్ంసాసూదయ సత్యతాతేZ నుష్ఠుయాకృణుహ్యాహ్వయాణ ౨ అయా తేఅగ్నేసమిధా విధేమ ప్రతిస్తోమగ్ం శస్యమానంగృభాయ దహాశసోర

ఉసగ పాహ్యస్మాన్ద్రుహో నిదోమిత్ర మహోఆలవద్యాత్ 5 రక్షోహణం వాజినమాజి ఘర్మి మిత్రం ప్రథిష్ఠ ముపయామిశర్మ శిశానో అగ్నిః క్రతుభిః సమిద్ధః సనోదివా॥

౧ ఓ యగ్నీ! నీతోఁగూడఁ గర్మను బొందుచున్నట్టియు, నీచే రక్షింపఁబడినట్టియు మేము నీ ప్రేరణచే నన్నములను భుజింతుము. ఓ సత్యమయిన విస్తృతి కలవాఁడా! కొనియాడఁదగిన యైహికాముష్మికములగు బురుషార్థముల రెంటినిమ్ము. (భక్తులకు) సిగ్గునుజేయని యోయగ్నీ! సాధనముల ననుష్ఠింపఁ జేయుటద్వారా (ఆ రెండుపురుషార్థములను) జేయుము. ౨ ఓ యగ్నీ! ఈ సమిధచే నిన్నుఁ బరిచర్యచేయుదుము. మాచేగొనియాడఁబడుచున్న స్తోత్రమును గ్రహించుము. అప్రశస్తులగు రాక్షసులను దగులఁబెట్టుము. ఉపకారమగు దేజస్సుకల యోయగ్నీ! (శత్రువులచేఁ జేయఁబడిన) ద్రోహములనుండియు, నిందనుండియు, ననుష్ఠానము నుండియు మమ్ము రక్షించుము. 3 రాక్షసులకు హంతకుఁడును, అన్నవన్తుఁడునగు నగ్నినభిముఖముగాఁ బ్రజ్వలింపఁజేయుచున్నాను. జగత్తులకు మిత్రుఁడును, మిక్కిలి విస్తీర్ణుఁడును, శరణుఁడునగు నగ్నిని సేవించుచున్నను, క్రతువులచేఁ దీక్ష్ణమయిన యాయగ్ని పగటియందు హింసకునినుండి మమ్ము రక్షించుఁగాక. ఆ యగ్నియే రాత్రియందుఁగూడ రక్షించుఁగాక.

పంచాశత్తు ౭.

౬౨. సరిమఃపాతు నక్తమ్ ౧ విజ్యోతిషాబృహతా భాత్యగ్నిరావిర్విశ్వాని కృణుతే మహిత్వా ప్రాదేవీర్మాయాః సహతేదురేవాః శిశీతే శృఙ్గేరక్షసే వినిక్షే ౨ ఉతస్వానాసో దివిషన్త్వగ్నేస్తిగ్మాయుధా రక్షసేహన్తవాఉ మదేచి దస్యప్రరుజన్తిభామా నవరన్తే పరిబాధో అదేవీః॥

౧ ఈ యగ్ని గొప్పదగు జ్యోతిస్సుచేఁ బ్రకాశించుచున్నాడు. ప్రపంచములను మాహాత్మ్యముచేఁ బ్రకటన జేయుచున్నాడు. రాక్షసుల సంబంధమైనవియు నతిక్రమించుటకు శక్యముకాని మాయలను నశింపఁజేయుచున్నాడు. రాక్షసులను నశింపఁజేయుటకొఱకు (రెండు) జ్వాలలను దీక్ష్ణములనుగాఁ జేయుచున్నాడు.
౨ తీక్ష్ణతయే యాయుధముగాఁ గలవియు, నీకుఁ (బురోడాశముచే) ధ్వనిచేయుచున్నవియు నగు నగ్నికిరణములు రాక్షసులను జంపుటకొఱకే ద్యులోకమునందుఁ బ్రసరించుఁగాక! ఈ యగ్నికిరణములు (కాంతులు) నాసంతోషముకొఱకే (శత్రువులను) నాశనముచేయుచున్నవి. అంతటను జేయబడిన రాక్షసబాధలు మమ్ము నావరించుటలేదు.

చతుర్దశానువాకము సమాప్తము.

ప్రథమాష్టకమున, ద్వితీయప్రపాఠకము సమాప్తము.

— * —

## తృతీయ ప్రపాఠకము



౬.3. దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యా మాదదే ౨ ఽభ్రిరసి నారిరసి ౩ పరిలిఖితగ్ం రక్షః పరిలిఖితా అరాతయ ఇదమహగ్ం రక్షసో గ్రీవా అపికృన్తామి యోఽస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మ ఇదమస్య గ్రీవా అపికృన్తామి ర దివే త్వాఽన్తరిక్షాయ త్వా పృథివ్యై త్వా ౬ శున్ధతాం లోకః పితృషదనో ౭ యవోఽసి యవయాస్మద్ద్వేషః॥

౧ ఈ మంత్రార్థము పూర్వోక్తము. అభ్రియను వస్తువును సంబోధనము చేయవలయును. ఆదదే = గ్రహించుచున్నాను. ౨ (ఓ యాయుధమా! నీవు) అభ్రివగుచున్నావు. (అయినను మమ్ముగూర్చి) శత్రువుకానిదాని వగుచున్నావు. (అభ్రి = భూమిని త్రవ్వుటకు సాధనమయినదియు, వాడియైన యగ్రభాగముకలదియుఁ, గొయ్యతో జేయఁబడినదియు నగు నాయుధవిశేషము.) ౩ రాక్షసస్వరూపము నశించుగాక. శత్రువులు నశింపఁజేయఁబడుదురుగాక ఇప్పుడు నేను రాక్షసుల కంఠమును నఱకుచున్నాను. ఎవఁడు మమ్ము ద్వేషించుచున్నాడో! ఎవనిని మేము ద్వేషించుచున్నామో! ఇప్పుడు వీని కంఠమునుగూడ నఱకుచున్నాను. ర (ఓ యాయుధమా!) నిన్ను (అగ్రభాగమును) ద్యులోకముకొఱకు ప్రోక్షించుచున్నాను. నిన్ను (మధ్యభాగమును) అన్తరిక్షలోకము కొఱకుఁ ప్రోక్షించుచున్నాను. నిన్ను (మొదలును) భూలోకముకొఱకుఁ ప్రోక్షించుచున్నాను. (ఇచ్చట మోదుగ కఱ్ఱకు లోకత్రయస్వరూపము వర్ణింపఁబడినది. ప్రోక్షించుట = పైని నీళ్లుచల్లుట.) ౬ పితృదేవతలుండుటకు స్థానమగు (అవటమనుపేరుగల) లోకము పరిశుద్ధమగుఁగాక. ౭ ఓ (ధాన్యమా! నీవు) కలియకుండ చేయుటకుఁ గర్తవగు

చున్నావు. కావున శత్రువులను మానుండి వేరుచేయుము. రాక్షసులను మానుండి వేరుచేయుము.

పంచాశత్తు ౨

౬౮. యవమారాతీః ౧ పితృణాగ్ం సదనమస్య ౨ ద్దివగ్ం స్తభానాఽన్తరిక్షం పృణపృథివీందృగ్ంహ ౩ ద్యుతానస్త్వా మారుతోమినోతు మిత్రావరుణయోర్ధ్రువేణ ధర్మణా ౪ బ్రహ్మవనింత్వా క్షత్రవనిగ్ం సుప్రజావనిగ్ం రాయస్పోషవనింపర్యూహామి ౫ బ్రహ్మదృగ్ంహాక్షత్రం దృగ్ంహ ప్రజాం దృగ్ంహ రాయస్పోషం దృగ్ంహ ఘృతేన ద్యావాపృథివీ ఆపృణేథా ౬ మిన్ద్రస్యసదోఽసి విశ్వజనస్యఛాయా ౭ పరిత్వాగిర్వణోగిర ఇమాభవన్తు విశ్వతో వృద్ధాయుమను వృద్ధయోజుష్టాభవన్తు జుష్టయ ౮ ఇన్ద్రస్య స్యూరసీన్ద్రస్యధ్రువమస్యైన్ద్రమసీన్ద్రాయత్వా॥

౧ (ఓ బర్హిస్సా!) పితృదేవతలకు స్థానమగుచున్నావు. ౨ (ఓ మేడికొమ్మా)! ద్యులోకము నూర్ధ్వదేశమునందు నిలుపుము. అంతరిక్షలోకమును పూరించుము. భూమిని దృఢముగాఁజేయుము. ౩ (ఓ మేడికొమ్మా!) మిత్రావరుణదేవతల సంబంధియు, దృఢమును నగు నీధారణముచే (నిటునటుపడిన) నిన్ను వాయుపుత్రుఁడగు ద్యుతానుఁడను దేవుఁడు అవటలోకమునం దుంచుఁగాక. ౪ (ఓ మేడికొమ్మా! బ్రాహ్మణజాతినిచ్చునట్టి నీచుట్టును మట్టిత్రుడుచుచున్నాను. క్షత్రియజాతినిచ్చునట్టి నీచుట్టును మట్టిత్రుడుచుచున్నాను. ధనసమృద్ధి నిచ్చునట్టి నీచుట్టును మట్టిత్రుడుచుచున్నాను. ౫ (ఓ దండమా!) బ్రాహ్మణ్యమును దృఢము

గాఁజేయుము క్షత్రియత్వమును దృఢముగాఁ జేయుము. సంతానమును దృఢముగా జేయుము. ధనసమృద్ధిని దృఢముగాఁ జేయుము. ౬ భూమ్యాకాశస్వరూపము లగు నౌదుంబరి (= మేడికొమ్మ) యొక్క యగ్రమూలములారా! ఈ యానేతిచే సంతతను తృప్తిని బొందుడు. ౭ (సమస్తజనమునకు నీడయగు నోయోదుమ్బరమా! నీవు) ఇంద్రునికి స్థానమగుచున్నావు. ౮ స్తోత్రములచే సేవించఁదగిన యోయింద్రుఁడా! దీర్ఘాయువుకల నిన్ను ననుసరించి వృద్ధినొందిన యీ స్తోత్రరూపములగు వాక్కులు నిన్నుఁజుట్టుకొనుఁగాక. మా సేవలు నీకుఁ బ్రియములగుఁగాక. ౯ (ఓ బంధనకారణమా! నీవు) ఇంద్రునికిఁ ద్రాడువగుచున్నావు. (ఓ గ్రన్థిస్వరూపమా! = ముడి నీవు) ఇంద్రసంబంధివై దృఢమగుచున్నావు. (ఓ మండపమా! నీవు) ఇంద్రుఁడు దేవతగాఁగలదానవగుచున్నావు. ఇంద్రుని సంతోషమునకై నిన్నుఁ దాకుచున్నాను. (ఈ త్రాడు ఇంద్రునకు పాశాయుధముగా వర్ణించెను.)

ప్రథమానువాకము సమాప్తము.



## అనువాకము ౨.

౬౫. రక్షోహణో వలగహనో వైష్ణవాన్ఖనామీ ౨ దమహంతం వలగముద్వపామి యంనః సమానోయమ సమానో నిచఖానేదమే నమధరం కరోమి యోనః సమానోయోzసమానోzరాతీ యతిగా యత్రేణఛన్దసాzవ బాఢోవలగః ౩ కిమత్రభద్రంతన్నౌ సహ ౪ విరాడసి సపత్నహాస మ్రాడసి భ్రాతృవ్యహా స్వరాడస్యభిమాతిహా విశ్వారాడసి విశ్వాసాం నాష్ట్రాణాగ్ంహన్తా॥

౧ రాక్షసులనుఁ జంపునవియు, వలగమునుఁ జంపునవియు, విష్ణువు దేవతగాఁగలవియునగు (ఉపరవములను) గోతులను ద్రవ్వుచున్నాను. (వలగాః=శత్రువులనుఁజంపుటకు భూమియందు పాతిపెట్టబడినవియు, జీర్ణములయిన కటపటాది ఖండములతో మూటకట్టఁబడినవియునగు ఎముకలు, గోళ్లు, రోమములు, పాదములందలి ధూళులునని తా॥) ౨ (మమ్ముఁజంపుటకు విద్యా ధన సౌభాగ్యాదులతో) సమానుఁడేవలగమునుఁ ద్రవ్వెనో! అసమానుఁ డేవలగమునుఁ ద్రవ్వెనో! ఆవలగమును నేనిప్పుడే పెళ్లగించుచున్నాను. మమ్మునుద్దేశించి సమానుఁడుగాని, అసమానుఁడుగాని యెవఁడు శత్రువువలె నాచరించుచున్నాఁడో! వీనినిప్పుడు యజమానునికిఁ గ్రిందనుండువానిఁ నిగాఁ జేయుచున్నాను. గాయత్రీ ఛన్దోభిమానియగు దేవతచేవలగము బాధించఁబడినదగుఁగాక. ౩ (ఓ యధ్వర్యుడా !) ఈయుపరవములందు (గోతులందు) మాకుపయోగకరమైన దేమియున్నది! (ఇదిప్రశ్న) (సోమాభిషవ ద్వారా) సేవించఁదగినది సర్వముకలదు. (ఇదిసమాధానము) ఆ సేవించఁదగినది మనకుఁ గూడనుండుఁగాక. (ఇదియజమానుని మాట) ౪ ఓ యాభ్యన్తరశత్రువా ! (విరుద్ధమగు నింద్రియవృత్తియని తా॥) (నీవు) అనేకవిధములగాఁ బ్రకాశించువాఁడవగుచున్నావు. ఓ బాహ్య శత్రువా! బాగుగాఁ బ్రకాశించు వాఁడవగుచున్నావు. ఓ యితరశత్రువా ! స్వయముగాఁ బ్రకాశించువాఁడ వగుచున్నావు. అనేకరాష్ట్రములకు హన్తకుఁడవగు నో శత్రువా ! అన్ని దేశములందుఁ బ్రకాశించు వాఁడవగుచున్నావు. (సపత్నహా=విరుద్ధమయిన యింద్రియవృత్తి రూపమగు నాంతరశత్రువు. భ్రాతృవ్యహా=బాహ్యశత్రువు. అభిమాతిహా=గ్రామహద్దుఁ పొలిమేర లందువాదించుచుండు శత్రువులని తా)

పంచాశత్తు ౨.

౬౬. రక్షోహణో వలగహనః ప్రోక్షామి వైష్ణవాన్రక్షోహణో వలగహనోఽవనయామి వైష్ణవాన్యవోఽసి యవయాస్మద్ద్వేషో యవయారాతీ రక్షోహణో వలగహనోఽవస్తృణామి వైష్ణవాన్రక్షోహణో వలగహనోఽభిజుహోమి వైష్ణవా

౨ ప్రక్షోహణో వలగహనావుపదధామి వైష్ణవీరక్షోహణో వలగహనౌ పర్యూహామి వైష్ణవీ రక్షోహణౌ వలగహనౌ వైష్ణవీ ౩ బృహన్నసిబృహద్గ్రావా బృహతీ మిన్ద్రాయ వాచంవద॥

౧ రాక్షసులను నశింపఁజేయునట్టియు, వలగములను నశింపఁజేయునట్టి విష్ణుదేవతాకములగు నుపరవములను ప్రోక్షణము (ఉదకము జల్లుట) చేయుచున్నాను. ఇట్టి యుపరవముల (గోతు)లందుదకముఁ బోయుచున్నాను. (ఓ ధాన్యమా! నీవు) వేరుచేయుటకుఁ గర్తవగుచున్నావు. (యవ=వేరుచేయునది) మానుండి శత్రువులను వేరుచేయుము. రాక్షసులను వేరుచేయుము. రాక్షస నాశకములు-విష్ణుదేవతాకములు వలగములను నశింపఁజేయునవియు నగు నపరవములను (దర్భలచేఁ)బరుచుచున్నాను ఇట్టియుపరవములనుద్దేశించి హోమము చేయుచున్నాను. ౨ ఈమంత్రార్థము పూర్వోక్తమే క్రియాపదములకు మాత్రమర్థము వ్రాయఁబడుచున్నది ప్రోక్షామి= ఉదకమును జల్లుచున్నాను. ఉపదధామి = కప్పుచున్నాను. పర్యూహామి= (తడిచేతితో)తుడుచుచున్నాను. పరిస్తృణామి= (దర్భలను) పరుచుచున్నాను. చివరవాక్యములో "అభిమృశామి" = (తాకుచున్నాను) అనుపదము నధ్యాహారము చేయవలయును. ౩ (ఓ పాషాణమా! = రాయి నీవు బలముచే) గొప్పదానవగుచున్నావు గొప్పరాళ్ళు అవయవములుగాఁ గలదానవగుచున్నావు. దేవేంద్రుని కొఱకు గొప్పధ్వని కలవాక్కును బలుకుము.

ద్వితీయానువాకము సమాప్తము.

—*—

## అనువాకము. ౩.

౬౭. విభూరసిప్రవాహణో వహ్నిరసి హవ్యవాహనః శ్వాత్రోఽసి ప్రచేతాస్తు

ఘోఽసి విశ్వవేదా ఉసిగసికవిరఙ్ఘారిరసి బమ్భారి రవస్యురసి దువస్వాఞ్ఛు
న్ధ్యూరసి మార్జాలీయః సమ్రాడసికృశానుః పరిషద్యోఽసి పవమానః ప్రత
క్వాఽసిన భస్వాన సంమృష్టోఽసిహవ్యసూద ఋ తధామాఽసి సువర్జ్యోతిర్బ్ర
హ్మజ్యోతిరసి సువర్ధామాఽజోఽస్యేక పాదహిరసి బుధ్నియోరౌద్రేణా నీకే
నపాహిమాఽగ్నే పిపృహిమా మామాహిగ్ంసీః॥

( ఓయాగ్నీధ్రస్థానమా! నీకంటె వేరగు స్థానమునందు విహరించు నీవు ) అనేకవిధములుగా నగుచున్నావు. ( ఓ హోతృస్థానమా! నీవు ) హవ్యవాహనుఁడగు ( హవిస్సును వహించువాడని తా॥ ) నగ్నిరూపమగుచున్నావు. ఓ మిత్రావరుణస్థానమా! నీవు మిత్ర స్వరూపము, వరుణస్వరూపము నగుచున్నావు. ( ఓ బ్రాహ్మణాచ్ఛంసి స్థానమా! నీవు )విశ్వమును గుర్తెరిఁగిన తుధుఁడను దేవతా స్వరూపమగుచున్నావు. ( ఓ పోతృస్థానమా!) మనోహరుఁడైన పండితునిస్వరూపమగుచున్నావు. ( ఓనేష్టృస్థానమా! నీవు ) సోమమును రక్షించునట్టి అంఘారి బంభారి యను దేవతల స్వరూపమగుచున్నావు. ( ఓశుద్ధిస్థానమా! నీవు పాత్రలనుకడుగుటద్వారా ) శోధకము, మార్జనమునకు స్థానమగుచున్నావు. ( ఓ యాహవనీయమా! నీవు )బాగుగఁబ్రకాశించుచున్న యగ్నిస్వరూప మగుచున్నావు. ( ఓ స్తోత్రస్థానమా! నీవు ) అంతటనుండుటకు యోగ్యమును, పవిత్రమునగుచున్నావు. ( ఓ చాత్వాలమా! నీవు శీఘ్రముగా వెళ్లుటకై లోపలనవకాశము కలదానవగుచున్నావు. ( పశువునుంచు ప్రదేశమా! నీవు)రాక్షసాదులతోఁ గలియనిదానవై హృదయాదిహవ్యమునుఁ బక్వము చేయుదానవగుచున్నావు. ( ఓ మేడికొమ్మా! నీవు )సామగానము చేయువారలకు సత్యమయిన నివాసస్థానమగు స్వర్గమునుబ్రకాశింపఁజేయుదాన వగుచున్నావు. ( ఓ బ్రహ్మస్థానమా! నీవు ) బ్రహ్మయను ఋత్విజునియొక్క జ్యోతిస్స్వరూపము, స్వర్గతుల్యమగు స్థానమునగుచున్నావు. ఓ నూతన గార్హపత్యమా! నీవు ) ప్రోష్ఠపదా నక్షత్రమునియు, నేకపాద్దేవత

యనియుఁ జెప్పఁబడు దేవతాస్వరూపమగుచున్నావు.) ఓ విడువఁబడుగార్హపత్యమా! నీవు) ప్రోష్ఠపదానక్షత్రమనియు, నహిర్బుధ్న్యుండని చెప్పఁబడు దేవతాస్వరూపమగుచున్నావు. (ఈ పూర్వోక్తములగు బదునారుస్థానములందు నభిమానించి యుండునట్టియో యగ్నీ!) నీ క్రూరమైన సైన్యముచే రాక్షసులనుండి నన్ను రక్షించుము. (కర్మఫలమునిచ్చుటద్వారా) నన్ను బూర్ణమనోరథునిఁగాఁ జేయుము. నన్ను హింసించకు. (చాత్వాలము = యాజ్ఞికుల గర్త (గుంట) విశేషము.)

తృతీయానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౪.

౬౮. త్వగ్ంసోమతనూ కృద్భ్యో ద్వేషేభ్యోzన్య కృతేభ్య ఉరుయన్తాzసి వరూథగ్ంస్వాహాజుషాణో అప్తురాజ్యస్య వేతు స్వాహాzయంనో అగ్నిర్వరివః కృణోత్వయం మృధఃపుర ఏతుప్రభిన్దన్ అయగ్ంశత్రూఞ్జయతు జర్హృషాణోzయంవాజంజయతు వాజసాతౌ ఉరువిష్ణో విక్రమస్వోరుక్షయాయ నఃకృధి ఘృతంఘృతయోనే పిబప్రప్రయజ్ఞపతిం తిర ౨ సోమోజిగాతిగాతువిత్॥

౧ ఓ సోమమా! నీవు శరీరమును నశింపఁజేయునట్టి రాక్షసుల కొఱకును, ద్వేషించు శత్రువుల కొఱకును, శత్రులచేఁ జేయఁబడిన ఇతరములకును, నియామకమగుచున్నావు. (అవియన్నియు నేవిధముగ మమ్ము బాధించవో! ఆవిధముగాఁ బాలించుచున్నావని తా॥) అటువంటి నీకొఱకీ హవిస్సు హుతమగుఁగాక. ఓ సోమమా! నీవు మాయందు ప్రీతికలిగినదానవు. (రాక్షసులుచూడకుండుటకై) స్వల్ప

దేహము కలదానవు నగుచు నాజ్యముయొక్క బిందువునుద్రావుము. (నీకిది) హోమము చేయఁబడుఁగాక. ఈ యగ్ని మాకు శ్రేయస్సును జేయుఁగాక. ఈ యగ్నిశత్రువులను నశింపఁజేయుచు ముందుగాఁబోవుఁగాక. సంతుష్టమయిన మనస్సుకల యీయగ్ని శత్రువులను జయించుఁగాక. ఈ యగ్నియన్నలాభముకల యుద్ధమునందన్నమును, (మాకు) వశముచేయుఁగాక. సర్వవ్యాపివగునో యాహవనీయాగ్నీ! (మాయందలి యనుగ్రహమునకై శత్రువులందు) పరాక్రమమును జూపుము. మానివాసము కొఱకధికముగా గృహధనాదికమును సంపాదించుము. ఆజ్యముకారణముగాగలయో యగ్నీ! (హోమము చేయఁబడునీ) యాజ్యమును ద్రావుము. యజమానునతిశయముగా వృద్ధిపొందించుము. (ఆజ్యము=నేయి) ౨ మార్గమును గుర్తెఱింగిన సోమము తన స్థానమునకు పోవుచున్నది. అలంకరింపఁబడినదియు, యజ్ఞమునకుఁగారణమునగు దేవతలయొక్క స్థానమును బొందుచున్నది.

పంచాశత్తు ౨.

౬౯. దేవానామేతినిష్కృత మృతస్యయోనిమాసద ౧ మదిత్యాః సదోఽస్యదిత్యాఃసద ఆసీదై ౨ షవోదేవసవితః సోమస్తగ్ం రక్షధ్వంమావోఽభ ౩ దేత త్త్వగ్ం సోమదేవో దేవానుపాగా ఇదమహం మనుష్యోమనుష్యాన్త్సహ ప్రజయాసహరాయస్పోషేణ ౪ నమోదేవేభ్యః స్వధాపితృభ్య, ఇదమహం నిర్వరుణస్య పాశాత్సువరభి॥

౧ (ఓ కృష్ణాజినమా! నీవు) భూమికి స్థానమగుచున్నావు. (ఓ సోమమా! నీవు) భూమియొక్క స్థానమునందుఁగూర్చుండుము. ౨ (ఓదేవా! సూర్యుఁడా! ఇంద్రాదిదేవతలారా! అనికూడ సంబోధనము చేయవలయును.) ఇది మీసోమము. ఈ (ఆ) సోమమును రక్షించుడు. సోమరక్షకులగు మిమ్ము నొకఁడును హింసించకుండుఁగాక. ౩ ఓ సోమమా! నీవు దేవతవగుచు నీదేవతలనిప్పుడు పొందు

చున్నావు. పుత్రాది సంతానముతోఁ గూడుకొనినవాఁడను, పశువు మొదలు గాఁగల ధనసమృద్ధితోఁ గూడుకొనినవాఁడనునగు నేను మనుజుఁడనగు మ నామను ష్యులనిప్పుడు పొందుచున్నాను. ఈ దేవతల కొఱకు నమస్కారము. పితృదేవ తలకొఱకు స్వధాకారము. (పితృదేవతలకొఱకుఁ జేయునమస్కారము స్వధాకా రమని చెప్పఁబడును.) నేను దీనిని వరుణునిపాశమునుండి విడిపించుచున్నాను. (స్వర్గసాధకమగుటచే) స్వర్గరూపమగు సర్వయాగప్రదేశమును విశేషముగాఁజూ చుచున్నాను. ఆహవనీయాగ్నిని సర్వత్ర ప్రకాశ జ్యోతిస్స్వరూపముగాఁ జూచు చున్నాను.

పంచాశత్తు 3.

౨౦. విఖ్యేషం వై శ్వానరంజ్యోతి ౧ రగ్నేవ్రతపతేత్వం వ్రతానాం వ్రతపతిరసి యామమతనూ స్త్వయ్య భూదియగ్ం సామయియాత వతనూర్మయ్య భూదేషాసా త్వయి యథాయథంనో వ్రతపతే వ్రతినోర్వ్రతాని॥

౧ వ్రతములకుఁ బ్రభువగు నోయగ్నీ! నీవు వ్రతములలో వ్రతపతి వగుచు న్నావు. ఏనాశరీరము (పూర్వము) నీయందుండెనో ఆయీశరీరము నాయం దున్నది) ఏనీశరీరము (పూర్వము) నాయందుండెనో ఆయీశరీరము నీయం (దున్నది.) ఓ వ్రతపతీ! వ్రతము నారంభించిన మనయొక్క వ్రతములు సమము గానే యున్నవి. (అవాంతరదీక్షారంభమునందు యజమానుఁడు తనశరీరము నగ్ని యందు సంకల్పపూర్వకముగ నుంచియు, నగ్నిశరీరమును తనయందుంచియు, వ్రత నియమము ఆరంభించఁబడినది. మఱల నిచ్చట నావ్రతనియమము శరీరముమార్పు చేసి చెప్పఁబడినది. అనఁగా మలినమైన పూర్వశరీరము నగ్నియందుంచి శుద్ధశరీర ముతోఁ గర్మారంభము చేసెనని తా॥)

చతుర్థానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౫.

౭౧. ౧ అత్యన్యానగాం నాన్యానుపాగా మర్వాక్త్వాపరైర విదంపరోఽవరై స్తంత్వాజుషే వైష్ణవం దేవయజ్యాయై ౨ దేవస్త్వాసవితామధ్వానక్త్వోషధే త్రాయస్వైనగ్ం స్వధితేమైనగ్ం హిగ్ంసీ ౩ ర్దివమగ్రేణ మాలేఖీర న్తరిక్షం మధ్యేన మాహిగ్ంసీః పృథివ్యాసంభవ ౪ వనస్పతే శతవల్శో విరోహ ౫ సహస్రవల్శా వివయగ్ం రుహేమ ౬ యంత్వాఽయగ్ం స్వధితిస్తేతిజానః ప్రణినాయమహతే సౌభగాయా ౭ చ్ఛిన్నోరాయః సువీరః॥

౧ ఎదుటనున్న యో మోదుగవృక్షమా! నీకంటె యూపార్హ వృక్షములను గూడఁ బొందితిని. ఇతరములగు యూపానర్హ వృక్షములనైతే పొందలేదు. గొప్ప లక్షణములతోఁ గూడుకొనిన వాఁడవును, చెడు లక్షణములకు దూరుడవు నగునిన్ను బొందితిని. (ఓ వృక్షమా!) అటువంటి నిన్ను విష్ణుదేవతగాఁగల దేవయాగము కొఱకు సేవించుచున్నాను. (యూప్యవృక్షములు=మోదుగ మొదలగునవి. అయూప్య వృక్షములు = వేప నిమ్మ మొదలగునవి, అని) యూపము = యజ్ఞపశువును గట్టు స్తంభము అందుకుఁ దగినది యూపార్హము. ౨ (ఓ వృక్షమా!) అన్తర్యామియుఁ బ్రేరకుఁడునగు సూర్యుఁడు నేతితో నిన్నుఁ దడుపుగాక. స్వధితియను నో యాయుధమా! ఈ వృక్షమును రక్షించుము. దీనిని హింసించకుము.

౩ (ఓ ఛేదించఁబడిన వృక్షమా! నీవుపడుచు) అగ్రభాగముచే స్వర్గలోకమును బ్రద్దలుచేయకుము మధ్యభాగముచే నాకాశమును హింసించకుము. భూమితోఁ (గలిసికొని) యుండుము. ౪ ఓ వనస్పతీ! అనేకకొమ్మలు కలదానవై మొలువుము. (వనస్పతి = పుష్పములు లేకుండగా ఫలములచేఁ బ్రకాశించు వృక్షము.) ౫ పూర్వము (అ ౧ ప్ర ౧ అను ౨.) చెప్పబడినది. ౬ ఓ ఛేదిం

పఁబడిన వృక్షమా! తీక్ష్ణమయిన యీ స్వధితియను నాయుధము గొప్పసౌభాగ్యముకొఱకు (అడ్డముగాఁ గొమ్మలను నఱకుటచే) గొప్పదగు యూపభావమును బొందించెను. (కావున) ఆ నఱకుటవల్ల నీవుభయపడకుము. ౭ (ఓ యూపమా! మంచివీరులుకలనీవు) భిన్నముకానిదానవుకమ్ము. ధనములను యజమానునకివ్వవలయును. (యూపము = యజ్ఞపశువునుగట్టు స్తంభము.)

పంచమానువాకము సమాప్తము.



అనువాకము ౬.

౭౨. పృథివ్యై త్వాఽన్తరిక్షాయ త్వా దివే త్వా ౨ శున్ధతాంలోకః పితృషదనో యవోఽసి యవయాస్మద్ద్వేషో యవయారాతీః పితృణాగ్ంసదనమసి 3 స్వావేశోఽస్యగ్రేగా నేతృణాం వనస్పతిరధిత్వా స్థాస్యతి తస్యవిత్తా ౪ ద్దేవస్త్వా సవితా మధ్వాఽనక్తు ౫ సుపిప్పలాభ్యస్త్వౌషధీభ్య ౬ ఉద్దివగ్ం స్తభానాఽన్తరిక్షం పృణ పృథివీముపరేణదృగ్ంహ ౭ తే తే ధామాన్యుశ్మసి॥

౧ (ఓయూపమా!) భూమికొఱకు, అంతరిక్షముకొఱకు, ద్యులోకముకొఱకు, నిన్నుఁ (బ్రోక్షించుచున్నాను.) ౨ ఈమంత్రార్థము పూర్వోక్తము. 3 (యూపమునకు ప్రథమశకలము స్వరువు చషాలముఅనినాయకత్రయము కలదు.అదిచ్చట ప్రథమశకలమునకు సంబోధనము) ఓ ప్రథమశకలమా! (నీవు) మంచిస్థితికలదానవగుచున్నావు. ఆనాయకులలో మొదటిదానవు. వనస్పతి రూపమయిన యూపము నిన్ను నధిష్ఠించి యుండగలదు. ఆయూపమునుఁ దెలిసికొనుము (ప్రథమశకలము = యూపస్తంభమునుఁ జెక్కునపుడు మొదట పడినముక్క) ౪ (ఓ చషాలమా!

అన్తర్యామియుఁ, బ్రేరకుఁడునగు సూర్యుఁడు మధురమగు (తేజోరూపమయిన) నాజ్యముచే నిన్నుఁ దడుపునుగాక. (చషాలము = యూపస్తంభమునకుఁ బైభాగమునయుండు కంకణము.) ౫ ఓ చషాలమా ! మంచిఫలముతోఁ గూడుకొనిన యోషధిగూలకు నిన్ను యూపముయొక్క యగ్రభాగము నందుంచుచున్నాను. ౬ (ఓ యూపమా !) ద్యులోకమునూర్ధ్వ ప్రదేశమున స్తంభింపఁజేయుము. అంతరిక్షలోకమునుఁ బూరించుము. ఇతరసాధనముచేత భూమిని దృఢముగాఁ జేయుము.

## పంచాశత్తు ౨

౭౩. ౧ గమధ్యేగావో యత్రభూరిశృఙ్గా అయాసః అత్రాహ తదురుగా యస్య విష్ణోః పరమం పదమవభాతిభూరేః ౨ విష్ణోః కర్మాణిపశ్యత యతోవ్రతాని పస్పశే ఇన్ద్రస్యయుజ్యః సఖా ౩ తద్విష్ణోః పరమంపదగ్ం సదాపశ్యన్తిసూరయః దివీవచక్షురాతతమ్ ౪ బ్రహ్మవనింత్వాక్షత్రవనిగ్ం సుప్రజావనిగ్ం రాయస్పోషవనిం పర్యూహామి బ్రహ్మదృగ్ంహ క్షత్రందృగ్ంహ ప్రజాం దృగ్ం హరాయస్పోషందృగ్ంహ ౫ పరివీరసి పరిత్వాదైవీర్విశో వ్యయన్తాం పరీమగ్ం రాయస్పోషో యజమానం మనుష్యా ౬ అన్తరిక్షస్యత్వాసానావవగూహామి॥

౧ (యూపాభిమానివగునో విష్ణుమూర్తీ !) నీయాస్థానములనుఁ బొందుటకు గోరుచున్నాము. ఏస్థానములందు వెళ్లువారు అధికదీప్తికలవారును అపాయరహితులునై యుంటున్నారో ! ఈ స్థానములయందే మహాత్ములచే గానముచేయఁబడుచున్నవాఁడును, గొప్పవాఁడునగు విష్ణుమూర్తియొక్క యీయుత్కృష్టస్థానము ప్రకాశించుచున్నది. (అటువంటి స్థానమునుఁబొందుటకుఁ గారణమగు కర్మలకు

యూపమీయవటమునం(గోతియం)దుండుగాక. అని తా. ౨ (ఓ జనులారా!) విష్ణుమూర్తియొక్క-సృష్టి,స్థితి, సంహారరూపములగు కర్మలనుజూడుడు. ఏకర్మలచే (మీ) లౌకిక వైదికకర్మలనిర్మించెనో! ఆ విష్ణుమూర్తి యింద్రునికి యోగ్యుడైన స్నేహితుఁడు. 3 వేదాంతపారంగతులగు విద్వాంసులాకాశమునందుఁ బ్రసరించిన దృష్టివలె వ్యాప్తమయిన విష్ణుమూర్తియొక్క యీయుత్కృష్టస్థానము నెల్లపుడుజూచుచున్నారు. ౪ (ఓ యూపమా! నీవు) అంతటను (ఈ త్రాటిచేఁ) జుట్టఁబడినదాన వగుచున్నావు. దేవసంబధులగు ప్రజలు (మరుద్గణములు) నిన్ను నంతటనుజుట్టుకొందురుగాక. (ఆ విధముగానే) యీయజమానుని ధనము - పుత్రులు - భ్రుతులు - మొదలగు మనుష్యులు జుట్టుకొందురుగాక. ౫ ఈ మంత్రార్థము పూర్వముచెప్పఁబడినది. ౬ (ఓ స్వరువా!) నిన్ను నంతరిక్షముయొక్క (మధ్యనుండు రశనాగుణము యొక్క) ప్రక్కయందు దాచుచున్నాను. (స్వరుః = లొడితడుపరిమాణముకల కాష్ఠ విశేషము.)

షష్ఠానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౭.

౭౪. ఇషేత్వోపవీరస్యు పో దేవాన్దైవీర్విశః ప్రాగుర్వహ్నీరుశిజోబృహస్పతే ధారయావసూనిహవ్యాతే స్వదస్వాందేవ త్వష్టర్వ సురణ్వా రేవతీరమధ్వ ౨ మగ్నే ర్జనిత్రమసివృషణౌస్థ ఉర్వశ్యస్యాయురసి పురూరవా ఘృతేనాక్తే వృషణం దధాథాం 3 గాయత్రంఛన్దోఽను ప్రజాయస్వ త్రైష్టుభంజాగతంఛన్దోఽను ప్రజాయస్వ ౪ భవతమ్॥

౧ ఓ దర్భా! పశురూపమైన దేవాన్నము కొఱకునిన్ను స్వీకరించుచున్నాను. (ఓ రావికొమ్మా! నీవు) ఉపాకరణము చేయుటకు బోవుచున్నావు. అగ్నీ షోమాది దేవతలను, దేవసంబంధులగుప్రజలను, యాగనిర్వాహకులగు పభక్షణకాములను పశుసంబంధిహృదయాద్యవయవములు సమీపమునఁ బొందినవి. (ఓ బృహస్పతీ!) హృదయాది ద్రవ్యములనుఁ బోషించుము. (ఓ పశువా!) నీహవ్యములు రుచికల వగుఁగాక. (ఓ త్వష్ట్రదేవా!) పశుద్రవ్యమును సుందరముగాఁ జేయుము. పాలు మొదలగు ధనముకలయో పశువులారా!) యజమానుని గృహమునందుఁ గ్రీడించుడు. (ఉపాకరణము = తాకుట) పశునవయవములను వేఱ్వేఱఁగోసితీసిహోమము చేతురు] ౨ (ఓ శకలమా! నీవు) అగ్నికి జనకమగుచున్నావు. (ఓ దర్భలారా! మీరు) వీర్యమును స్రవించువారలగుచున్నారు. (ఓ క్రిందనున్న యరణీ! = అగ్నిని మథించుటకు సాధనమగు రావికొమ్మయని తా॥) (నీవు) ఊర్వశితో సమానమగుచున్నావు. (ఓ పైననున్న యరణీ! నీవు) పురూరవునితో సమానమగుచున్నావు. (ఓ యరణులారా! మీరు) నేతితోఁగలిసికొనినవారలై సేచనమును (స్రవించుటను) బోషించుడు.) (ఓ యరణిద్వయమా! నీవుయజ్ఞమున కాయువు స్థానమగుచున్నావు. 3 (ఓ యగ్నీ! నీవు) హోతచేఁ బఠించఁబడు గాయత్రీఛన్దస్సు నుద్దేశించిపుట్టుము. (ఈ విధముగానే) త్రిష్టుప్ఛన్దస్సు నుద్దేశించి పుట్టుము. జగతీఛన్దస్సు నుద్దేశించి శీఘ్రముగాఁ బుట్టుము. ౪ ఈ "భవతమ్" పదము రెండవపంచాశత్తులో వివరణచేయఁబడును.

—*—

పంచాశత్తు ౨.

౭౨. ౧ సగనమనసాసమోకసావరేపసౌ మాయజ్ఞగ్ం హిగ్ంసిష్టం మాయజ్ఞపతింజాతవేదసౌ శివౌభవతమద్యనః అగ్నావగ్నిశ్చరతి ప్రవిష్టఋషీణాం

పుత్రో అధిరాజఏషః స్వాహాకృత్య బ్రహ్మణా తేజుహోమిమామాదేవానాం మిథుయా కర్భాగధేయమ్॥

౧ (ఏ యగ్ని పూర్వ మాహవనీయమునందున్నదో! ఏయగ్ని యిప్పుడరణిచే మథించఁబడినదో!) ఆ మీరిద్దఱు మమ్ముఁ గూర్చి సమమనస్సుకల వారును, సమాన మయిన నివాసస్థానము కలవారును, పాపమనస్కులు కానివారును, కండు. యజ్ఞమును- యజ్ఞకర్తను హింసించకుడు. ఇప్పుడీకర్మయందు మమ్ముఁగూర్చి శాంతికలవారలు కండు. బాగుగఁ బ్రకాశించు చున్నట్టియు, మంత్రములకుఁగాని ఋత్విక్కునకుఁగాని పుత్రుడగునీ (మథించఁబడిన) యగ్ని యాహవనీయమునందుఁ బ్రకాశించినదై సంచరించుచున్నది. ఓ మథించఁబడిన యగ్నీ! నీకొఱకు స్వాహాశబ్దము నుచ్చరించి మంత్రముచే హోమము చేయుచున్నాను. దేవతల భాగధేయమును (అదృష్టమును మిథ్యా భూతముగాఁ జేయకుము. (అదృష్టముచెడఁగొట్టకుమని తా)

సప్తమానువాకము సమాప్తము.



అనువాకము ౮.

౭౬. ఆదద ఋతస్యత్వా దేవహవిః పాశేనాऽऽరభే ధర్షామానుషా ౨ నద్భ్యస్త్వామదీభ్యః ప్రోక్షామ్యపాం పేరురసి స్వాత్తం చిత్సదేవగ్ం హవ్యమాపోదేవీః స్వదతైనగ్ం ౩ సంతే ప్రాణోవాయునా గచ్ఛతాగ్ం సంయుజత్రై రఙ్గానిసంయజ్ఞపతిరాశిషా ౪ ఘృతేనాక్తౌ పశుంత్రాయేథాగ్ం ౫ రేవతీ ర్యజ్ఞపతిం ప్రియధాऽऽవిశతో ౬ రోఅంతరిక్షసజూ ర్దేవేన ।

౧ (ఓ రశనా!) నిన్ను స్వీకరించుచున్నాను. దేవతలకు హవిస్సునగునో పశువా! యజ్ఞసిద్ధి కొఱకు నిన్నుఁ బాశముచే బంధించుచున్నాను. (దేవభావమును బొందుటచే) మానుషములగు తాడనాది యుపద్రవములనుఁ దిరస్కరించుము. (రశన = త్రాడు.) ౨(ఓ పశువా!)నిన్ను ఉదకముల చేతను ఓషధుల చేతను బ్రోక్షించుచున్నాను. ఉదకములనుఁ ద్రావుదానవగు చున్నావు. దేవతాస్వరూపములగు నోయుదకములారా! రుచికలదైనను దేవతనిమిత్తమై హోమము చేయుటకు యోగ్యమయిన యీపశువును (మఱింత) రుచికలదానినిగాఁ జేయుడు. 3 (ఓ పశువా!) నీప్రాణము వాయువుతోఁ గలిసికొనుఁగాక. హృదయము మొదలగు నంగములు యాగవిశేషములతోఁగలిసికొనుఁగాక. యజ్ఞకర్తఆశీస్సుతోఁగలిసికొనుఁగాక. ౪ (ఓ స్వరుస్వధితులారా! మీరు) నేతితోఁగూడుకొనిన వారలై పశువును రక్షించుడు. (స్వధితి= యజ్ఞఖడ్గ విశేషము.) ౫ ధనముకల (పశ్వవయవములారా!) యజమానునిఁగూర్చి ప్రియమును ధరించినవారుకండు. (హవిర్భావముచే యజ్ఞమును) ప్రవేశించుడు. ౬ ఈ వాక్యార్థము ౨వ పంచాశత్తునందు వ్రాయఁబడును.

పంచాశత్తు ౨

౭౭. వాతేనాస్య హవిష స్త్మనాయ జసమన్య తనువాభవ వర్షీయో వర్షీయసి యజ్ఞేయజ్ఞపతిం ధాః ౨ పృథివ్యాః సంపృచః పాహి 3 నమ స్త ఆతానా ౪ నర్వాప్రేహి ఘృతస్యకుల్యామనుసహప్ర జయానహ రాయస్పోషేణాZZపో దేవీః శుద్ధాయువఃశుద్ధాయూయం దేవాగ్ం ఊడ్వ్గం శుద్ధావయం పరివిష్టాః పరివేష్టారోవో భూయాస్మ ॥

౧ విస్తీర్ణమగు నోయింద్రియసముదాయమా! = (అన్తరిక్ష) ఈ పశువునకభిమానదేవుఁడగు ప్రాణవాయువుతోను, జీవాత్మతోనుగూడ హవిస్సులనిమ్ము.

ఈ పశువుయొక్క (రాబోవు) దేవశరీరముతోఁ గలిసికొనుము. మిక్కిలి విస్తీర్ణ మయిన యింద్రియసముదాయమా! అధికముగ విస్తీర్ణమగు యజ్ఞమునందు యజమానుని స్థాపించుము. ౨ (ఓ బర్హిస్సా!) భూమియొక్క సంపర్కమునుండి (ఈ పశువును) రక్షించుము (పశ్వంగము భూమిమీదఁ బడకుండగ నుంచుటయే రక్షణమని తా॥) బర్హి = దర్భ. 3 అంతటను వ్యాప్తికల సూర్యకాంతీ! నీకు నమస్కారము. ౪ (ఓ పత్నీ! నీవు) శత్రువులులేనిదానవగుచు నాజ్యముయొక్క ప్రవాహము ననుసరించి సంతానముతోను, ధనసమృద్ధితోనుకూడా వెళ్లుము. దేవతాస్వరూపములగు నోయుదకములారా! మాశుద్ధినిఁ గోరుచున్నట్టియు, స్వయముగఁ బరిశుద్ధములైనట్టియు మీరు దేవతలను (యాగప్రదేశమునందు) పొందించుడు. మేముకూడ మీతోఁగూడుకొనినవారలమై పరిశుద్ధులమగుచు మీకుఁ బరివేష్టలముకాఁగలము. (పరివేష్టారః = చుట్టుకొనియుండువారలు.)

అష్టమానువాకము సమాప్తము.

— * —

## అనువాకము ౯.

౨౮. వాక్త ఆప్యాయతాం ప్రాణస్త ఆప్యాయతాం చక్షుస్త ఆప్యాయతాగ్ం శ్రోత్రంత ఆప్యాయతాం యాతేప్రాణాఞ్ఛుగ్జగామ యాచక్షుర్యాశ్రోత్రం యత్తే క్రూరం యదాస్థితం తత్త ఆప్యాయతాం తత్త ఏతేనశుంధతాం నాభిస్త ఆప్యాయతాంపాయుస్త ఆప్యాయతాగ్ం శుద్ధాశ్చరిత్రాః శమద్భ్యః ॥

౧ (ఓ పశువా!) నీవాగింద్రియము (రాబోవు దేవతాదేహమునందు) సుఖముగా వృద్ధినొందుఁగాక! నీప్రాణము సుఖముగా వృద్ధినొందుఁగాక! నీ చక్షురింద్రియము సుఖముగా వృద్ధినొందుఁగాక. నీశ్రోత్రేంద్రియము వృద్ధినొందుగాక.

(మఱియుఁ జనిపోవు కాలమునందు హృదయపుండరీకమునం దిమిడియున్న) నీ ప్రాణముల నేశోకము పొందినదో! ఏ శోకము చక్షురింద్రియమును బొందినదో! ఏ శోకము శ్రోత్రేంద్రియమును బొందినదో! ఏ క్రూరకర్మ (బంధించుట మొదలగునది) (మాచే) చేయఁబడినదో! ఏ క్రూరకర్మ (ఛేదనము మొ॥) చేయదగియున్నదో! ఆ నీకష్టమంతయు శాంతినిఁ బొందుఁగాక! నీ యీ ప్రాణాదికము ఈజలముచే (రాబోవు దేవతాదేహమునందుఁ బ్రవేశించుటకు) శుద్ధమగుఁగాక. నీ బొడ్డు వృద్ధినొందుఁగాక నీగుదస్థానము వృద్ధినొందుఁగాక. పాదములు శుద్ధములగుఁగాక (ప్రోక్షణముకొఱకు నియుక్తములగు) నుదకములకొఱకు సుఖమగుఁగాక. (పశువుక్రింద బర్హిస్స్వరూపముగా నుంచఁబడిన) యోషధులకు సుఖమగుఁగాక. (పశువును కోయుచున్న) భూమికి సుఖమగుఁగాక, (పశుమరణకాలమునందుపస్థితములగు) రాత్రింబవళ్లకొఱకు సుఖమగుఁగాక! ౨ వ పంచాశత్తులోని వాక్యమునకుఁగూడ నర్థమిచ్చుట వ్రాయఁబడినది.)

పంచాశత్తు ౨

౭౮. శమోషధీభ్యః శంపృథివ్యై శమహోభ్యాం ౧ మోషధే త్రాయస్వైనగ్ం స్వధితేమైనగ్ం హిగ్ంసీః ౨ రక్షసాం భాగోఽసీదమహగ్ం రక్షోఽధమంతమో నయామి యోఽస్మాన్ద్వేష్టి యంచవయంద్విష్మ ఇదమేనమధమం తమోనయామీ ౩ షేత్వాఘృతేన ద్యావాపృథివీ ప్రోర్ణ్వాథా ౪ మచ్ఛిన్నోరాయఃసువీర ఉర్వంతరిక్ష మన్విహి ౬ వాయోవీహిస్తోకానాగ్ం ౭ స్వాహోర్ధ్వనభసం మారుతం గచ్ఛతమ్ ॥

౧ ఓ యోషధీ! ఈ పశువును రక్షించుము. ఓ స్వధితీ! ఈ పశువును హింసింపకుము. ౨ (రక్తముచే దడపఁబడిన యోబర్హిస్సా! నీవురాక్షసుల భాగమగు

చున్నాను. నేనీరాక్షససముదాయమును గొప్పదుఃఖమును బొందించుచున్నాను. ఎవఁడు మమ్ము ద్వేషించుచున్నాడో! ఎవనిని మేము ద్వేషించుచున్నామో! ఈ (ఆ) శత్రువును గొప్పదుఃఖమునుఁ బొందించుచున్నాను. ౩ (ఓ వపా!) నిన్ను (యజమానునకు, దేవతకును) అన్నముకొఱకుఁ (వెళ్లగించుచున్నాను.) భూమ్యాకాశసమానములగునో వపాశ్రపణులారా! నేతితో సమానమగు వపతో మీ స్వరూపమును గప్పుకొనుడు, (వప = మేదస్సు) ౪ (మంత్రసామర్థ్యముచే) భిన్నము కానిదియు, బుత్రపౌత్రాదులను గలుగఁజేయునదియు నగు (నీ వపాభాగము) యజమానునకు ధనముల నిచ్చుఁగాక. ౫ (ఓవపా! నీవు) (వెళ్లగించుటయను క్రూరకర్మ యొక్క శాంతి కొఱకు) విస్తీర్ణమగు నంతరిక్షమును బ్రవేశించి (హవనీయప్రదేశమును) గూర్చిపొమ్ము. (వప = బొడ్డుకిందనుండుపొర సన్ననిది) ౬ ఓ వాయువా! స్తోకములను వేఱుగాఁజేయుము. (త్రావుమని తా) (ఆజ్యము హోమము చేయబడునపుడు తత్సమీపమునఁబడు బిందువులు స్తోకములని భావము) ౭ (ఓ వపాశ్రపణులారా! మీరు) ఆహుతియగుచుండగా నూర్ధ్వముగా నభస్సను పేరుకల మరుత్పుత్రునిఁ బొందుడు.

నవమానువాకము సమాప్తము.



అనువాకము ౧౦

౮౦ సం తే మనసా మనః సం ప్రాణేన ప్రాణో జుష్టం దేవేభ్యో హవ్యం ఘృతవ

త్స్వాహై౨ న్ద్రః ప్రాణో అఙ్గేఅఙ్గే ని దేధ్యదై న్ద్రో౽పానో అఙ్గేఅఙ్గే వి బోభువ ద్దేవ

త్వష్టర్భూరి తే సగ్ంసమేతు విషురూపా యత్సలక్ష్మాణో భవథ దేవత్రా య

యన్తమవసే సఖాయోఽను త్వా మాతాపితరో మదన్తు శ్రీరస్యగ్నిస్త్వా శ్రీణా

త్వాపః సమరిణన్వాతస్య॥

౧ (ఓ హృదయమా !) మనస్థానీయమగు (పృషదాజ్యముతో దేవతల) మనస్సుకలిసికొనుఁగాక. ప్రాణస్థానీయమగు పృషదాజ్యముతోఁ బ్రాణము కలిసికొనుఁగాక. దేవతలకొఱకుఁ బ్రియమగు హవిస్సు నేతివలెహుతమగుఁగాక. (మనస్థానీయము=మనస్సునకు బదులుగానున్న) ౨ ఇంద్రుఁడు దేవతగాఁగల ప్రాణముపశువు యొక్క యాయా యంగములందు బాగుగానుంచఁ బడుఁగాక. ఇంద్రదేవతాకమగు నపానముకూడ విశేషముగానుండు గాక. ఓ బ్రహ్మదేవుఁడా! నీయనుగ్రహముచే నమస్తమగు నంగ సముదాయము (ఛేదనముచే విడిపోయినను) కలిసికొనుఁగాక. ఓ హృదయాద్యవయవములారా! (మీరు) విలక్షణస్వరూపులైనను (హవిర్భావము చే) సమానలక్షణము కలవారుకండు. (ఓ పశువా !) దేవతలలోనికి బోవనున్న నిన్ను మిత్రములగు నితరపశువులు, తల్లియు, తండ్రియు, (నీ ద్వారాస్వర్గము బొందుటచేఁ దమకులమును సర్వమును) సేవించుట కంగీకరించుదురుగాక. (సంతోషించుదురు గాక.) 3 (ఓ వసా ! నీవు) ఆశ్రయించఁదగిన దానవగుచున్నావు. (కావున) నాహవనీయాగ్ని నిన్ను నాశ్రయించుగాక. ఉదకములు నిన్నుఁ బొందుఁగాక. (ఓ వసా !) వాయుగమనము కొఱకు నాదిత్యుని గమనము కొఱకు, నుదకసంబంధములగునోషధులు మొలచుట కొఱకును, నిన్నుఁగప్పుచున్నాను. (మాంసమును వండుపాత్రయందుండు చిక్కని ద్రవవిశేషము వసయనఁబడును. వసనుగప్పుటచే రక్షించఁబడును గాన, నావపాహోమమువలనఁ గలుగు పుణ్యముచే వాయ్వాదిత్య సంచారరూప జగద్వ్యవహారము జరుగునని భావము.)

### పంచాశత్తు ౨.

౮౧. త్వామ్ధజేవ పూ ష్ణోర్గంహ్యే ఆపామోషధీనాగ్ం రోహిష్యై ౧ ఘృతం ఘృతపావానః పిబతవసాం వసాపావానః పిబతాన్తరిక్షస్య హవిరసిస్వాహా త్వాzన్తరిక్షాయ దిశః ప్రదిశ ఆదిశో విదిశ ఉద్దిశః స్వాహాదిగ్భ్యో నమోదిగ్భ్యః॥

౧ (నేతిని౦ బానము చేయునో దేవతలారా! ఇచ్చటనున్న) నేతిని౦ ద్రావుడు. వసను బానము చేయు దేవతలారా! (ఇచ్చటనున్న) వసను౦ ద్రావుడు. (ఓపశువా! నీవు) అంతరిక్షమునందుండు దేవగణమునకు హవిస్సువగుచున్నావు. అంతరిక్షనివాసియగు దేవగణముకొఱకు నిన్ను హోమము చేయుచున్నాను దక్షిణదిక్కుకొఱకు నిన్ను హోమము చేయుచున్నాను. తూర్పుదిక్కు కొఱకునిన్ను హోమము చేయుచున్నాను. ఉత్తరదిక్కుకొఱకునిన్ను హోమము చేయుచున్నాను. సర్వదిక్కులకొఱకు నమస్కారము.

దశమానువాకము సమాప్తము.

— * —

అనువాకము. ౧౧.

౮ ౨. సముద్రంగచ్ఛస్వాహాన్తరిక్షం గచ్ఛస్వాహా దేవగ్ం సవితారంగచ్ఛ స్వాహాఽ

హోరాత్రేగచ్ఛస్వాహా మిత్రావరుణౌగచ్ఛస్వాహా సోమంగచ్ఛస్వాహా

యజ్ఞంగచ్ఛస్వాహాఛన్దాగ్ంసి గచ్ఛస్వాహాద్యావా పృథివీగచ్ఛస్వాహానభో

దివ్యం గచ్ఛస్వాహాఽగ్నిం వైశ్వానరం గచ్ఛస్వాహాఽద్భ్యస్త్వౌషధీభ్యో

మనోమేహార్ది యచ్ఛతనూం త్వచంపుత్రం నప్తారమశీయ ౨ శుగసి తమభి

శోచయోఽస్మాన్ద్వేష్టి యంచవయం ద్విష్మోధామ్నో ధామ్నో రాజన్నితో

వరుణనోముఞ్చయదాపో అఘ్నియావరుణేతిశపామహేతతో వరుణనోముఞ్చ॥

౧ (ఓ హవిస్సా! నీవు) సముద్రమును బొందుము. (సముద్రముకొఱకు నిన్ను) హోమము చేయుచున్నాను. ఆకాశమును బొందుము. (ఆకాశముకొఱకునిన్ను

హోమము చేయుచున్నాను. అన్తర్యామియుఁ బ్రేరకుఁడున గుసూర్యునిఁబొందుము. అట్టిసూర్యునికొఱకు నిన్ను (హోమము చేయుచున్నాను. ఆ హోరాత్రములనుబొందుము.(అహోరాత్రముల కొఱకు నిన్ను) హోమము చేయుచున్నాను. మిత్రావరుణ దేవతలను బొందుము. (ఆ దేవతలకొఱకు నిన్ను) హోమము చేయుచున్నాను. సోమమునుబొందుము (సోమముకొఱకు నిన్ను) హోమము చేయుచున్నాను. వేదములనుఁ బొందుము. (వేదములకొఱకు నిన్ను) హోమము చేయుచున్నాను. భూమ్యాకాశములనుబొందుము. (వాటికొఱకు నిన్ను) హోమము చేయుచున్నాను. దేవతాసంబంధియగు నాకాశమునుఁ బొందుము. అట్టియాకాశముకొఱకు నిన్ను హోమము చేయుచున్నాను. సర్వప్రకాశుఁడగు నగ్నినిఁ బొందుము. (అట్టియగ్నికైనిన్ను) హోమము చేయుచున్నాను. (ఓ హావిర్లేపమా!) ఉదకకార్యములగు నోషధులసిద్ధికై నిన్ను బర్హిస్సునందు (మార్జనము చేయుచున్నాను.) (ఓ సముద్రాది దేవతాసముదాయమా!) నాకుసంతోషముకల మనస్సునిమ్ము. (నీయనుగ్రహమువలన) ఉత్తమజాతీయమగు శరీరమును, కాంతిమంతమయిన రూపమును, సుగుణవంతుఁడైనపుత్రుని పౌత్రుని బొందుదును. ౨ (ఓహృదయశూలమా! నీవు) శోకస్వరూప మగుచున్నావు. ఎవఁడుమమ్ము ద్వేషించుచున్నాడో! ఎవనిని మేము ద్వేషించుచున్నామో! ఆ ద్వేషించువానిని, ద్వేషింపఁబడువానిని నీవు దుఃఖింపఁజేయుము. ఓ వరుణుఁడా! ఈ ద్వేష్టృద్వేష్య స్థానమునుండి మమ్ము విడిపించుము. ఓ యుదకములారా! ఓ గోవులారా! ఓ వరుణ దేవా! యని మేము (మాయిష్టప్రాప్తికి - అనిష్టనివృత్తికి) దేవుఁడవగు నిన్ను (ప్రత్యక్ష నామగ్రహణముచే) బాధించుచున్నాము. ఓ వరుణ దేవా! ఆ ప్రత్యక్షనామగ్రహణము వలనఁ గలిగినపాపమునుండి మమ్ము విడిపించుము. (మహాత్ములనామమును వారియెదుట నుచ్చరించినచో వారికిగొప్పద్రోహము చేసినట్లని శ్రుతి చెప్పుచున్నది.)

ఏకాదశానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౧౨.

౮౩. హవిష్మతీరిమా ఆపోహవిష్మాన్దేవో అధ్వరోహవిష్మాగ్ం అవివాసతిహ విష్మాగ్ం అస్తుసూర్యః ౨ అగ్నేర్వోఽపన్న గృహస్యసదసి సాదయామిసుమ్నా య సుమ్నినీః సుమ్నేమాధత్తేన్ద్రాగ్నియో ర్భాగధేయీః స్థమిత్రావరుణయో ర్భాగధేయీః స్థవిశ్వేషాం దేవానాం భాగధేయీః స్థయజ్ఞేజాగృత ॥

౧ ఈ గ్రహించఁబడిన వసతీ, వరీ యనుపేర్లుకల యుదకములు (సోమముచే) హవిస్సుకలవగుఁగాక. ఇంద్రుఁడుకూడ హవిష్మన్తుఁడగుగాక. యాగముకూడ హవిష్మన్తమై విశేషముగాఁ బ్రవర్తించుఁగాక. సూర్యుఁడుకూడ (వసతీవరీ యుదకములకుఁ బ్రకాశకుఁడగుటచే) హవిష్మన్తుఁడగుఁగాక. ౨ (ఓ వసతీవరీయుదకములారా! నశించని గృహముకల శాలాముఖీయాగ్నియొక్క (సమీప) స్థానమునందు మిమ్ము స్థాపించుచున్నాను. ఓ యుదకములారా! సర్వప్రాణిసుఖమునకుఁ బ్రవృత్తులైనట్టియు, స్వయముగ సుఖవన్తములైన మీరు (మా) యజమానునిసుఖమునందుంచుడు. (మీరు) ఇంద్రాగ్నిదేవతలకు భాగములై యుండుడు. మిత్రావరుణదేవతలకు భాగములైయుండుడు. సమస్తదేవతలకు భాగములైయుండుడు.

ద్వాదశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౧౩.

౮౪. హృదేత్వా మనసేత్వా దివేత్వా సూర్యాయ త్వోర్ధ్వమిమ మధ్వరం కృధిదివిదేవేషు హోత్రాయచ్ఛసోమరాజ న్నేహ్యవరోహ మాభేర్మాసంవిక్థా

మాంత్వాహిగ్ంసిషం ప్రజాస్త్వ ముపావరో హప్రజాస్త్వా ముపావరో హన్తు ౨ శ్రుణోత్వగ్నిః సమిధాహావం మేశ్రుణ్వన్త్వాపో ధిషణా శ్చదేవీః శ్రుణోత గ్రావాణో విదుషోను ॥

౧ (ఓ సోమమా !) సిన్నుహ్వా నయముకల మనుజుల కొఱకు గ్రహించుచున్నాను. మనస్సుకల పితృదేవతలకొఱకు నిన్ను గ్రహించుచున్నాను. ద్యులోకమునందుండు దేవతలకొఱకు నిన్ను స్వీకరించుచున్నాను. నీవీయజ్ఞమును ఉన్నతమును (సమాప్తము) గాఁజేయుము. దేవతలయందు హోతచే (మాస్తోత్రరూపములగు నాహ్వానములను) స్థాపించుము. ఓ శ్రేష్ఠమగు సోమమా ! అభిషవ స్థానమునందు రమ్ము. బండినుండిదిగుము. భయపడకుము. కంపమునొందకుము. నేనైతే నిన్ను హింసించను. (కావున) నీవు (దేవలోకమునకుఁ బోయి దేవతాసంబంధులగు) ప్రజలను బొందుము. ఆప్రజలునిన్నుఁ బొందుదురుగాక. ౨ ఆజ్యాహుతిచేఁ బ్రకాశించుచున్న యగ్ని నాయాహ్వానమును వినుఁగాక ! ఓ యుదకములారా ! విద్యావన్తములు, దేవతారూపములునగు మీరుకూడవినుడు. ఓ పాషాణములారా ! (అభిషవముకొఱకువచ్చిన) మీరును విద్వాంసులే యగుచు యజ్ఞమునువినుడు. అన్తర్యామియుఁ బ్రేరకుఁడునగు సూర్యుఁడు నాయాహ్వానమును వినుఁగాక. (అభిషవస్థానము= సోమమును రసమునుగాఁజేయు ప్రదేశము. పాషాణము = రాయి) [దంచిన సోమలతను రాతిపలకలమిధ్యనుంచి రసముపిండుదురు. అదిఅభిషవము.]

పంచాశత్తు ౨

౧౪. యజ్ఞగ్ంశ్రుణోతు దేవః సవితాహావంమే ౧ దేవీరాపో అపాంనపాద్యఊర్మి ర్హవిష్య ఇన్ద్రియావాన్మదిన్త మస్తం దేవేభ్యో దేవత్రాధత్త శుక్రగ్ం శుక్ర పేభ్యోయేషాంభాగః స్థస్వాహా ౨ కార్షిరస్యపాపాం మృధ్రగ్ం 3 సము

ద్రస్యావోఽక్షిత్యా ఉన్నయే ౪ యఃమగ్నేపృత్సు మర్త్యమావో వాజేషు
యంజునాః సయన్తా శశ్వతీరిమః॥

౧ ఓ దేవతాస్వరూపములగు నుదకములారా! (ఉదకముమధ్యయందున్నను) ఉదకమును నశింపఁజేయనిదోయాయగ్నీ! సోమరూపమయిన హవిస్సునకు హితమయిన దియు, నింద్రియ వృద్ధిని జేయునదియు, నత్యంతము సంతోషము చేయునదియునగు నేయలకలదో! ప్రకాశవన్తమయిన యాయులను, ఏదేవతలకు మీరు భాగమైతిరో సోమమునుఁబానముచేయు నాదేవతలకొఱకు (దేవతలనుద్దేశించి హోమముచేయుట కు) దేవతలందుస్థాపించుడు. ఈయాజ్యము (మీకై) హుతమగుఁగాక. ౨ (ఓయాజ్యమా! నీవు) ఉదకములందు హోమము చేయబడుచుఁ బోగొట్టబడిన దానవగుచున్నావు. ఉదకముల కనిష్టరూపమగు నిన్ను బోగొట్టుచున్నాను. 3 ఓ యుదకములారా! సముద్రమునకువలె మిమ్ము క్షీణతలేకుండుటకై నెత్తుచున్నాను. ౪ ఓయగ్నీ!) యేమరణస్వభావముగల మనుజుని యుద్ధములందు రక్షించుచున్నావో, అన్నములనిమిత్తమై యేమనుజునిఁ బొందుచున్నావో, ఆ మనుజుఁడు (నీయనుగ్రహముచే) నిత్యములగు ధనరూపాన్నములను బొందఁగలఁడు.

త్రయోదశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౧౪.

౮౬. త్వమగ్నేరుద్రో అసురోమహోదివస్త్వగ్ంశర్ధోమారుతం పృక్షఈశిషే
త్వంవాతైరరుణైర్యాసి శంగయస్త్వంపూషావిధతః పాసినుత్మనా ౨ ఆవో
రాజానమధ్వరస్య రుద్రగ్ం హోతారగ్ం సత్యయజగ్ం రోదస్యోః అగ్నిం

పురాతనయిత్నో రచిత్వాహిరణ్యరూపమవసే కృణుధ్వమ్ 3 అగ్నిర్హోతానిష
షాదాయజీయానుపస్థేమాతుః సురభావులోకే యువాకవిః పురునిష్ఠః॥

౧ ఓ యగ్నీ ! నీవు రుద్రుడవు. శత్రువులకు నాశకుడవు. ద్యులోకమున కుత్పవరూపుడవు నీవు వాయువు సంబంధమగు బలస్వరూపుడవు (బలవంతులలోఁ బ్రసిద్ధులగు మరుద్గణములకుఁగూడ నీయనుగ్రహముచేతనే బలమువచ్చుచున్నది. కావున మరుద్గణములతోఁ) గలిసికొనినవాఁడవై(నీసైన్యమును)నియమించుము నీవు సుఖమునుఁ బొందినవాఁడవై వాయువేగముకల యెర్రనిగుఱ్ఱములచేఁ బోవుచున్నావు. పోషకుఁడవగు నీవు (హవిస్సుచే). సేవచేయుచున్న యజమానులను స్వయముగానే రక్షించుచున్నావు. ౨ ఓ ఋత్విగ్యజమానులారా ! శత్రువుచేఁ జేయఁబడబోవుమీ మరణముకంటెఁ బూర్వమునందు యజ్ఞమునకుఁ బ్రభువైనట్టియు, (శత్రువులను గూర్చి) కూరుఁడైనట్టియు, ఫలమునిచ్చుటకై భక్తులనాహ్వానించునట్టియు, ద్యులోక భూలోకములయందవశ్యముగఁ గర్మఫలము నిచ్చునట్టియు, బంగారుస్వరూపుడునగు నగ్నిని రక్షణముకొఱకు స్వాధీనముగాఁ జేసికొనుడు. 3 దేవతలనాహ్వానించునట్టి యు, మానవహోతకంటె నతిశయముగయాగము చేయునట్టియు, యువకుఁడై నట్టియు, మేధావంతుఁడును, గార్హపత్యాది స్థానములందున్నవాఁడును, సత్య వంతుఁడును, మనుజులకుఁ బోషకుఁడును, (మఱియు) మనుజుల యొక్క హృదయమందు (జఠరాగ్నిరూపముగఁ) బ్రకాశించుచున్న వాఁడునగు నీయగ్ని వేదికి సమీపముననున్నట్టియు, బరిమళించుచున్న గంధముతోఁ గూడుకొనిన నాహవనీయ స్థానమునందుఁ గూరుచుండెను.

పంచాశత్తు ౨.

౪౭. ఋతావాధర్తా కృష్టీనాముతమధ్య ఇద్ధః ౧ సాధ్వీమకర్దేవ వీతింనోఅద్య యజ్ఞస్య జిహ్వామవిదామగుహ్యామ్ స ఆయురాzగాత్సురభి ర్వసానోభద్రా మకర్దే

వహాతింనో అద్య. ౨ అక్రన్దదగ్నిః స్తనయన్నివద్యౌః క్షామారేరిహద్వీరుధః సమఞ్జన్ సద్యోజజ్ఞానో విహీమిద్ధో అఖ్యదారోదసీ భానునాభాత్యంతః ౩ త్వే వసూని పుర్వణీక ॥

౧ ఈ యగ్ని యిప్పుడు నాసంబంధమగు దేవతలకివ్వఁబడిన పురోడాశాహుతిని రుచిగలదానినిగాఁజేసెను. (కావున) యజ్ఞమునకు జిహ్వాస్థానీయమైనట్టియు, రహస్యమైనట్టి యగ్ని దేవతను (మేము) పొందితిమి. (పురోడాశాజ్యములు మొదలగు ద్రవ్యములయొక్క) పరిమళములతోఁ గూడుకొనిన యా యగ్ని మాయాయువును రక్షించుచువచ్చుఁగాక. ఇప్పుడు మాసంబంధమగు దేవాహుతిని భద్రముగఁజేయుఁగాక. ౨ ఈ యగ్ని దాహకమగుదానిని (= హవిస్సులను) నాకుచు మాకనుకూలమగు వాటిని వ్యక్తముజేయుచు, ద్యులోకమునందలి మేఘమేవిధముగ (పంటలెండిపోవునను భయమును నివారించునో, ఆవిధముగ మాయనిష్టమునుఁ బోగొట్టుటకై) ధ్వనిచేయుఁగాక. ఏ కారణముచేఁ బుట్టుచున్నవాఁడును, ఇప్పుడే ప్రకాశించినవాఁడునై యనేకవిధమైన ప్రపంచమునుఁ బ్రఖ్యాతికలదానినిగాఁ జేయుచున్నాడో! ద్యావాభూముల మధ్యయందంతటను కాంతిచే స్వయముగాఁ బ్రకాశించుచున్నాడో! ౩ ఈ వాక్యార్థము ౩ వ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౩.

౮౮. హోత్రద్రోషావస్తోరేరిరే యజ్ఞియాసః క్షామేవ విశ్వాభువనానియస్మిన్త్సగ్ంసౌభగాని దధిరేపావకే ౨ తుభ్యంతా అఙ్గిరస్తమవిశ్వాః సుక్షితయః పృథక్ అగ్నేకామాయయేమిరే ౩ అశ్యామతం కామమగ్నే తవోత్యశ్యామరయిగ్ంరయివః సువీరమ్ అశ్యామ వాజమభివాజయన్తో

శ్యామద్యుమ్నమజరాజరం తే ౪ శ్రేష్ఠంయవిష్ఠభారతాగ్నే ద్యుమన్తమాభర॥

౧ అత్యంతమధికుడవును, దేవతల నాహ్వానించువాఁడవునగు నోయగ్నీ! రాత్రింబవళ్లు యజ్ఞమునకుఁదగిన హవిస్సులు వచ్చుచున్నవి. (నీయనుగ్రహము వలనఁబూర్వము ) దహించఁబడిన వస్త్రమువలె సమస్తములగు లోకములు (సారములేనివయి) పవిత్రముచేయు (నీవు అనుగ్రహించిన వాఁడవగుచుండగా) సౌభాగ్యమునుఁ బొందినవి. (అటువంటి నీవు మమ్మనుగ్రహించుమని భావము) ౨ అధికముగ సంగములయొక్క బలముతోఁ గూడుకొనిన యోయగ్నీ! వేది రూపమయిన మంచిభూమితోఁ గూడుకొనినట్టియు, సమస్తములైన యాప్రజ లనేకవిధములగు కామితార్థముల నిచ్చునట్టి నీకొఱకు నియమమును స్వీకరించిరి. ౩ ఓయగ్నీ ! నీరక్షణముచేతను ఆ యభీష్టమగు ఫలమునుఁ బొందుదుము. ఓ ధన వంతుఁడా ! శోభనులగు పుత్ర పౌత్రాదులతోఁ గూడుకొనిన ధనమును బొందు దుము. అన్నమును గోరుచున్న మేము అన్నము సంతతను బొందుదుము. ఓ క్షతి లేనియగ్నీ ! క్షీణముగాని కీర్తినిఁ బొందుదుము. ౪ అతిశయముగ వియోగమును జేయునట్టియు, ఋత్విజులచే భరించదగినట్టియు, నాహుతికి నివాసభూతుఁడు నగు నో యగ్నీ ! శ్రేష్ఠమైనదియుఁ, బ్రకాశవంతమైనదియు, ననేకులచేఁ గోరదగినదియు నగు (మణిముక్తాదిరూప .గు) ధనమును దీసికొనిరమ్ము.

పంచాశత్తు ౪.

౮౯. వసోః పురుస్పృహగ్ం రయిమ్ ౧ సశ్వితాన స్తన్యతూరోచనస్థా అజరేభి ర్నానదద్భిర్యవిష్ఠగ యః పావకః పురుతమః పురూణి పృథూన్యగ్నిరనుయాతి భర్వన్ ౨ ఆయుష్టే విశ్వతో దధదయమగ్నిర్వరేణ్యః పునస్తే ప్రాణ ఆయతి

పరాయక్ష్మగ్ం సువామి తే ౩ ఆయుర్దా అగ్నే హవిషో జుషాణో ఘృతప్రతీకో ఘృతయోని రేధి ఘృతంపీత్వా మధుచారుగవ్యం పితేవపుత్రమభి॥

౧ ఏ యగ్ని పావనము చేయువాఁడో! ఆహవనీయ, గార్హపత్యాది నామము చేతను, యవిష్ఠాది విశేణముల చేతను, ననేకవిధములు కలవాఁడో, పురోడాశాది హవిస్సులను భక్షించుచున్నవాఁడై యనుదినము యజమానుని గృహమునుఁ (గూర్చి యుఁబోవుచున్నాఁడో!) ఆ యగ్ని ప్రకాశించుచున్నవాఁడు, పలములను విస్తరింపఁ జేయువాఁడు, ప్రకాశవంతములగు దేవయజన స్థానముల యందున్నవాఁడు, ముసలితనము లేనివాఁడు, స్తోత్రముఁ జేయు దేవతలతోఁ గూడుకొనినవాఁడు, అత్యంతము శత్రువులకు వియోగముఁ జేయువాఁడును, (అగుచున్నాడు) ౨ ఓ యజమానుఁడా! శ్రేష్ఠుఁడయిన యీయగ్ని నీకు సంపూర్ణాయువు నిచ్చుఁగాక. (అకాల మృత్యువుచే గ్రహింపఁబడినను) నీప్రాణము మఱల ఈయగ్నియొక్క యనుగ్రహముచే (నీశరీరమునందు) వచ్చుఁగాక. నీవ్యాధిని నాశనము చేయుచున్నాను. (ఇదిఋషి లేక ఋత్విజుఁడు యజమానునితోఁ బలికినవాక్యము) ౩ ఓ యగ్నీ! పురోడాశరూప హవిస్సులను సేవించువాఁడవును, ఉపక్రమమునందాజ్యము కలవాఁడవును, (ఆఘార, ప్రయాజాదులు నేతిచే హోమము చేయఁబడును కావున నని తా) ఆజ్యము (జన్మ) కారణముగాఁగల వాఁడవు నగు నీవు మిక్కిలి రుచిగలిగినట్టియు, (శోధితమగుటచే) నిర్మలమయినదియు, నగు గోసంబంధమయిన యాజ్యమునుఁద్రాగి యజమానున కాయువు నొసగుము. ఈయజమానుని తండ్రి పుత్రునివలె రక్షించుము.

పంచాశత్తు ౫౦.

౯౦. రక్షతాదిమమ్ ౧ త్వస్మై తే ప్రతిహార్యతే జాతవేదో విచర్షణే అగ్నేజనామి సుష్టుతిమ్ ౨ దివస్పరిప్రథమం జజ్ఞేఅగ్నిరస్మ ద్ద్వితీయం పరిజాతవేదాః తృతీయమప్సునృమణా అజస్ర మిన్ధాన ఏనం జరతేస్వాధీః ౩ శుచిఃపావకవన్ద్యో

౪ స్య బృహద్విరోచసే త్వంఘృతేభిరాహుతః ౮ దృశానోరుక్మ ఉర్వ్యావ్య ద్యౌద్దుర్మర్ష మాయుః శ్రియేరుచానః అగ్నిరమృతో అభవద్వయోభిః॥

౧ అనేకవిధులగు యజమానులుగల యోయగ్నీ! ప్రతిదినము యజమానుని గృహమునకు వెళ్లుచున్న యీసీకొఱకు శోభనమగు స్తుతినిబుట్టించుచున్నాను. ౨ అగ్ని ప్రథమమున ద్యులోకమునకుఁ బైభాగమున (సూర్యరూపముగాఁ) బుట్టెను. మనుష్యలోకమునకుఁ బైభాగమున (ప్రసిద్ధమగు) నగ్నిరూపముగా రెండవ జన్మను బొందెను. సముద్రమునందు (బడబాగ్ని) రూపముగా మూఁడవజన్మను బొందెను. మూఁడుజన్మలందును యజమానులందనుగ్రహబుద్ధి కలవాఁడు, ఈయగ్నినిఁబురోడా శాదులచేఁ బ్రకాశింపఁజేయుచు స్వాధీనమనన్సు కలవాఁడై ముసలితనము వచ్చువ ఱకుఁ బరిచర్యఁ జేయుచున్నాడు. ౩ ఓ నివగునోయగ్నీ! శుద్ధిచేయువాఁడవును, వన్దనీయుఁడవు నగు నీవు ఆజ్యము మొదలగు హవిస్సులచే బాగుగా హోమము చేయఁబడినవాఁడవగుచు నధికముగఁ బ్రకాశించుచున్నావు. ౪ చూడఁదగిన రూప ముకలవాఁడును, బంగారుతో సమానుడు నగు నగ్ని యితరులచేఁ దిరస్కరించఁ బడని జీవనము నాశ్రయించుటకుఁ గోరుచున్నవాఁడై గొప్పకాంతిచేఁ బ్రకాశించు చున్నాడు. అటువంటి యగ్ని హవిస్సులచే నమృతస్వరూపుఁడాయెను. (ఏకారణము చేత) నీయగ్నిని ద్యులోకమునందుండు దేవగణముమంచి రేతస్సు కలదై పుట్టించెనో! (అందువలన నితని కమృతస్వరూపత్వము యుక్తమేయని భావము.)

పంచాశత్తు ౬.

౯౧. యదేనం ద్యౌరజనయత్సురేతాః ౧ ఆయదిషే నృపతింతేజ ఆనట్ శుచి రేతో నిషిక్తంద్యౌరభీకే అగ్నిః శర్ధమనవద్యంయువానగ్ం స్వాధియం జన యత్సూదయచ్చ ౨ సతేజీయ సామనసాత్వోత ఉతశిక్షస్వపత్యస్యశిక్షోః

అగ్నేరాయోనృతమస్యప్రభూతౌ భూయామతేసుష్టుత యశ్చపస్వః ౩ అగ్నే

సహాన్తమాభరద్యుమ్నస్య ప్రాసహారయిమ్ విశ్వాయః॥

౧ ఏ తేజస్సు అభీష్టసిద్ధికై యజమానుని బాలించునగ్నినంతటను పొందెనో! శుభ్రమగునేబీజము (తలిదండ్రులచే) నుంచబడినదో ! ఆతేజస్సుచేతను, అబీజము చేతను ద్యులోకమునందలి యగ్ని సేవించు కాలమునందు బలవంతుడును, దోమరహితుడును, యువకుడును, స్వాధీనమనస్సు కలవాడునైన పురుషుని బుట్టించుచున్నాడు. పాపమును నాశనము చేయుచున్నాడు. (కావున యజమానునకు దేజస్సు నిచ్చుటకు అగ్ని సమర్థుడని తా ॥)

౨ ఆ యజమానుడు అత్యంతము తేజోవంతమగు మనస్సుచే నీచేత రక్షింపబడినవాడు. ఓయగ్నీ! శోభనులయిన పుత్రపౌత్రాదులతో గూడుకొనినవాడును, సమర్థుడగుటకిచ్ఛయించుచున్నవాడును, మనుజులలో శ్రేష్ఠుడునునగు యజమానునకు ధనములనొసగుము. నీప్రభుత్వముండగా(నీయనుగ్రహము వలన) (మేము) ధనముకలవారము, శోభనస్తుతితో గూడుకొనినవారము కాగలము. ౩ ఓయగ్నీ !మాకీర్తిని దిరస్కరించునట్టిశత్రువును మాయధీనమునందుంచుము. అతనిధనముగూడ (మాకు) బొందించుము. ఏ నీవు మాశత్రుసేనలన్నిటిని మాయన్నముల నిమిత్తమై నీసాన్నిధ్యముచే దిరస్కరించుచుందువో ! - (ఇతరులను దిరస్కరించుటకు నీసన్నిధానముకంటె వేఱొక ప్రయత్నము లేదని తా॥)

పంచాశత్తు ౭

౯౨. చర్షణీరభ్యాసా వాజేషు సాసహాత్ ౧ తమగ్నేపృతనా సహగ్ంర

యిగ్ం సహస్వ ఆభర త్వగ్ంహిసత్యో అద్భుతోదాతా వాజస్యగోమతః

౨ ఉక్షాన్నాయవశాన్నాయ సోమపృష్ఠాయ వేధసే స్తోమైర్విధేమాగ్నయే

౩ వద్మాహిసూనో అస్యద్మసద్వా చక్రేఅగ్నిర్జనుషా zజ్మాన్నమ్ సత్వంన ఊర్జసన ఊర్జంధా రాజేవ జేరవృకే క్షేష్యంతః ౪ అగ్న ఆయూగ్ంషి ॥

౧ బలవంతుడవగు నోయగ్నీ ! నీవాయితరసేనను (దిరస్కరించుటకు సమర్థమైన ధనమునుదీసికొనిరమ్ము. (యేకారణముచే) నీవుబాధరహితుడవు, ఆశ్చర్య చరిత్రకలవాడవు,| (నగుచుంటివో, (ఆ హేతువువలన) అనేక గోవులతోఁగూడఁ కొనిన యన్నమునకు దాతవునీవే. ౨ వృషభము హవిస్సుగాఁగలిగినట్టియు వంధ్యాయగు పశువు హవిస్సుగాగలిగినట్టియు, సోమముతోఁ గూడుకొనినపృష్ఠ స్తోత్రములు కలిగినట్టియు, నన్నమునకు బ్రహ్మాయునగు స్తోత్రములచేఁ బరిచర్యఁ జేయుదుము. ౩ పుత్రుడువలె నభీష్టమునుఁ దీర్చునట్టియగ్నీ ! నీవు వాక్స్వరూపుడ వగుచున్నావు. అన్నమునందు (జఠరాగ్నిరూపముగ) నివసించునట్టి యగ్నిజన్మ మాత్రముచేతనే నన్నమును, గృహమునుచేసెను. ఓ రసమునిచ్చువాడా ! నీవు మాకు రసమునిమ్ము. రాజువలె జయించుము. హింసమొదలగు దోషములులేని యజమానునియందు (నీవనుగ్రహించుటకు) లోపలనివసించుచున్నావు.

౪ ఈ వాక్యార్థము ఈ తరువాత పనసలో వ్రాయఁబడును.

పంచాశత్తు ౬

౧౫ పవస ఆసువోర్జమిషంచనః ఆరేబాధస్వదుచ్ఛునామ్ ౨ అగ్నేపవస్వస్వపా అస్మేవర్చః సువీర్యమ్ దధత్పోషగ్ం రయింమయి ౩ అగ్నేపావకరోచిషా మన్ద్రియాదేవ జిహ్వయా ఆదేవాన్వక్షియక్షిచ ౪ సనఃపావకదీదివోzగ్నే దేవాగ్ం ఇహాzzవహా ఉపయజ్ఞగ్ం హవిశ్చనః ౫ అగ్నిఃశుచివ్రతతమః శుచి ర్విప్రః శుచిఃకవిః శుచీరోచత ఆహుతః ౬ ఉదగ్నే శుచయస్తవ శుక్రా భ్రాజన్త ఈరతే తవజ్యోతీగ్ంష్యర్చయః॥

౧ ఓ యగ్నీ! మాజీవనములను (వృద్ధినొందునట్లుగ) శోధనముచేయుచున్నావు. పాలు మొదలగురసమును, అన్నమును మాకభిముఖముగఁ బ్రేరణ చేయుము. ఉపద్రవమును దూరమునందుఁ బొందించి నాశనము చేయుము. ౨ ఓ యగ్నీ! శోభనకర్మకల నీవు మా బ్రహ్మవర్చస్సును, గొప్పసామర్థ్యమును వృద్ధినొందించుము పుష్టిని, ధనమును నాయందుస్థాపించుము. ౩ ఓ యగ్నీ! ఓ శోధనముచేయువాఁడా! ఓ ద్యోతనాత్ముఁడా! కాంతికలిగిన మృదువైన వాక్కు దేవతలను గొనిరమ్ము. యాగముకూడఁ జేయుము. ౪ ఓ శోధకుఁడా! ఓ ప్రకాశించుచున్న యగ్నీ! మాకొరకు నీ కర్మయందు దేవతల నావహించుము. మాయీ యజ్ఞమును, హవిస్సును, (దేవతల)సమీపమునందుఁబొందించుము. ౫ ఈయగ్ని (స్వయముగానే) మిక్కిలి శుద్ధమైన యాచరణముకలవాఁడు. (పిమ్మట బ్రాహ్మణాభిమానుఁడగుటచే) శుద్ధమైనవాఁడు. (అటుపిమ్మట పండితాభిమానియగుటచే) శుద్ధమైనవాఁడు, (అంతకంటె పిమ్మట) నభిముఖముగ హోమము చేయబడుచున్న వాఁడై కాంతిమంతుడగుచుఁ బ్రకాశించుచున్నాఁడు. ౬ (ఓ యగ్నీ!) పరిశుద్ధము లగు నీకిరణములు ప్రకాశించుచున్నవై యూర్ధ్వముగఁ బోవుచున్నవి. ఆవిధముగానే పూజకములైనట్టియు, బ్రకాశింపఁజేయునట్టి దేవతారూపములనుఁ బొందుచున్నవి.

ప్రథమాష్టకమున తృతీయప్రపాఠకము సమాప్తము.

—*—

# చతుర్థప్రపాఠకము.



## అనువాకము ౧.

౧౪. ఆదదే గ్రావాఽస్యధ్వర కృద్దేవేభ్యో గమ్భీరమిమమధ్వరం కృధ్యుత్త
మేనపవినేంద్రాయ సోమగ్ంసుషుతం మధుమంతం పయస్వంతం వృష్టివని
౨ మింద్రాయత్వా వృత్రఘ్న ఇంద్రాయత్వా వృత్రతుర ఇంద్రాయత్వా
ఽభిమాతిఘ్న ఇంద్రాయత్వాఽఽదిత్యవత ఇంద్రాయత్వా విశ్వదేవ్యావతే
3 శ్వాత్రాః స్థవృత్రతురో రాధోగూర్తా అమృతస్యపత్నీ స్తాదేవీర్దేవత్రేమం
యజ్ఞంధత్తోపహూతాః సోమస్యపిబతోపహూతోయుష్మాకమ్ ॥

౧ (ఓ సోమాభిషవ సాధనమా !) నీవు యజ్ఞనిష్పాదకముగు (దృఢమైన) రాతివగుచున్నావు. (కావున) నీయజ్ఞమును దేవతలకొఱకు గంభీరముగాఁజేయుము. ఉత్కృష్టమగు నీచేత సోమమును బాగుగా నలగకొట్టబడిన దానినిగాను, మాధుర్యముకల దానినిగాను, పాలవలె రసము కలదానినిగాను, (సూర్యునిద్వారా) వర్షమునిచ్చుదానినిగాను చేయుచున్నాను. (అభిషవము = నలగకొట్టి రసముతీయుట) ౨ (ఓ సోమమా !) మేఘములను బ్రద్దలుచేయునట్టియు వృత్రాసురుని నాశనము చేసినట్టియుఁ బాపమును పోగొట్టునట్టియు, (తృతీయసవనము నందాదిత్యుని కొఱకు గ్రహించబడునుగాన) నాదిత్యుడు కలిగినట్టియు,(ప్రాతస్సవనమునందు దేవతలనందరినుద్దేశించి గ్రహించఁబడునుగాన) సర్వదేవతలుగల ఇంద్రునికొఱకు నిన్ను కొలుచుచున్నాను. (ప్రాతస్సవనము - తృతీయసవనము = ఈ రెండును యజ్ఞదినమున నంతర్యాగములు) 3 (ఓ యుదకములారా ! మీరు) త్వరగలవారును, వృత్రాసురుని

నశింపజేసినవారును, అన్నమును సంపాదించుటకు సన్నద్ధులును, సోమమునకుఁ బాలకులైయుంటున్నారు. అటువంటి మీరు దేవతాహూపులై దేవతలయందు (మా) యీ యజ్ఞమును స్థాపించుడు. అనుజ్ఞను పొందినవారై గుచు సోమాంశమును త్రావుడు సోమముకూడ ననుజ్ఞకలవై మీ (యంశమును) పానముచేయుఁగాక.

పంచాశత్తు ౨

౧౧. సోమఃపిబతు ౧ యత్తేసోమదివి జ్యోతీర్యత్పృథివ్యాం యదురావన్తరిక్షే తేనాస్మై యజమానాయోరు రాయాకృధ్యధిదాత్రేవోచో ౨ ధిషణేవీడూ సతీవీడయేథామూర్జందధాథా మూర్జంమే ధత్తంమావాగ్ం హిగ్ంసిషం మామాహిగ్ం శిష్టం ౩ ప్రాగపాగు దగధరాక్తాస్సర్వాదిశ ఆధావన్తవ్వమ్బ నిష్వర ౪ యత్తేసోమాదాభ్యంనామజాగృవి తస్మైతేసోమసోమాయస్వాహా॥

౧ ఓ సోమమా! ద్యులోకమునందే తేజస్సు (నీదికలదో) భూలోకమునందే తేజస్సు (కలదో) అంతరిక్షలోకమునందే తేజస్సు (కలదో) ఆ తేజస్సుచే నీయజమానుని కొఱకు ధనముచే విస్తీర్ణమగుస్థానమునుఁ జేయుము. (మఱియు నీ యజమానుడు భక్తిచేనధికుఁడసి) ఫలమునిచ్చు నింద్రునికొఱకుఁ జెప్పుము. ౨ సోమమును ధరించు ఫలకములారా! విశేషముగ (సోమమును) ధరించినవారలగుచుఁ (దెబ్బచే వియోగమునుఁ జెందక) దృఢముగ స్తంభించుడు. సోమరసమును ధరించుడు బలమునకు గారణమైన రసమును నాకొసంగుడు. నేను మిమ్ము హింసించను. మీరు కూడనన్ను హింసించకుడు. ౩ తూర్పు, పడమర, ఉత్తర, అధర, దిక్కులేవి కలవో (ఓ సోమమా!) అవియన్నియు నిన్నుఁ గూర్చియభిముఖముగఁ బరుగిడుఁగాక. మాతృస్థానీయమైన యోసోమమా! (అంశములనుండి రసస్వరూపముగ) పొమ్ము. (అంశువులు = సోమలతలు) ౪ ఓ సోమమా! శత్రువులచేఁ దిరస్కరించ బడనిదియు,

జాగరూకమైనదియు నగు నీవేరేది కలదో ? ఓ సోమమా ! ఆ సోమమను పేరును ధరించిన నీకొఱకు (సోమాంశద్వయము) హుతమగుగాక.

ప్రథమానువాకము సమాప్తము.

— * —

## అనువాకము ౨.

౯౬. వాచస్పతయే పవస్వవాజిన్వృషా వృష్ణో అగ్ంశుభ్యాంగభస్తి పూతో దేవోదేవానాం పవిత్రమసి యేషాంభాగోఽసి తేభ్యస్త్వా ౨ స్వాంకృతోఽసి మధుమతీర్న ఇషస్కృధి విశ్వేభ్యస్త్వేన్ద్రియేభ్యో దివ్యేభ్యః పార్థివేభ్యో ౩ మనస్త్వాఽష్టూర్వ న్తరిక్షమన్విహిస్వాహాత్వా సుభవఃసూర్యాయ దేవేభ్య స్త్వామరీచిపేభ్య ౪ ఏష తేయోనిః ప్రాణాయత్వా॥

౧ అన్నమునిచ్చునట్టి యో సోమమా ! పాలకుఁడైన దేవునికొఱకు వాక్సంబంధియగు మన్త్రముచే శుద్ధముకమ్ము. రసస్వరూపమగుటచే వర్షించుటకుసమర్థమైన నీవు (పూర్వమరణ్యమునందు) సూర్యునిచేఁ బవిత్రముచేయబడితివి. (ఇప్పుడైతే) వర్షణసమర్థములగు సోమాంశువులచే బవిత్రముకమ్ము. నీవుకూడ దేవతవేయగుచు (సోమపానము చేయునట్టి) దేవతలకు శుద్ధిచేయుటకు కారణమగుచున్నావు. ఏదేవతలకు భాగమగుచున్నావో వారికై నిన్ను గ్రహించుచున్నాను. ౨ ఓ యుపాంశుగ్రహమా ! నీవు నాచేఁగ్రహింపఁబడిన దానవగుచున్నావు. మధురములయిన యన్నములను మాకొఱకుఁ జేయుము. దేవజన్మమునందున్నవియు, మనుజజన్మమునందున్నవియు, నగు నింద్రియములకొఱకు (హితమునకై) నిన్ను స్వీకరించుచున్నాను (ఉపాంశుగ్రహము = యజ్ఞమునందు సోమరసమునుంచు పాత్ర విశేషము.)

3. (ఓ ప్రాణరూపమయిన యుపాంశుగ్రహమా!) నిన్ను మనస్సు వ్యాపించుఁ గాక. విస్తీర్ణమయిన యంతరిక్షమునను సరించి (నీవు ఆహవనీయ ప్రదేశము నొందుము) బొమ్ము. (ఓ సద్భావముకల ప్రాణమా!) నీరూపమయిన గ్రహమును (బహిఃప్రాణరూపమగు) సూర్యుని కొఱకు హోమము చేయుచున్నాను. (ఓ లేపమా! నీవు) మరీచిపాలక దేవతలకొఱకుఁ (బరిధియందు మార్జనము చేయుచున్నాను) (లేపము=సూక్ష్మాంశము. పరిధి=యజ్ఞమునం దుపయోగించు కాష్ఠవిశేషము.) ౪ (ఓయుపాంశుగ్రహమా!) ఈఖరముయొక్క దక్షిణభాగము నీకు స్థానము. (కావున) ప్రాణదేవతా సంతోషముకై నిన్నుంచుచున్నాను. (ఖరము=హవిర్ధానమండపమున కెదుట మట్టితో తయారుచేసిన ప్రదేశమని తాత్పర్యము.)

ద్వితీయానువాకము సమాప్తము.



## అనువాకము 3.

౯ ౭. ఉపయామగృహీతోఽస్యన్తర్యచ్ఛ మఘవన్పాహి సోమమురుష్యరాయః

సమిషోయజస్వాన్తస్తే దధామిద్యావాపృథివీ అన్తరుర్వన్తరిక్షగ్ం సజోషా

దేవైరవరైః పరైశ్చాన్తర్యామే మఘవన్మాదయస్వ ౨ స్వాంకృతోఽసిమధు

మతీర్న ఇషస్కృధి విశ్వేభ్యస్త్వేన్ద్రియేభ్యో దివ్యేభ్యః పార్థివేభ్యో మన

స్త్వాఽష్టూర్వన్తరిక్షమన్విహి స్వాహాత్వా సుభవః సూర్యాయ దేవేభ్యస్త్వా

మరీచిపేభ్య ఏష తేయోనిర పానాయత్వా॥

౧ (ఓసోమరసమా! నీవు) పృథివిచేఁ గ్రహింపఁబడినదాన వగుచున్నావు. (పృథివియందుఁబుట్టిన కొయ్యతోఁజేయఁబడిన పాత్రవిశేషమునకు అంతర్యామ మని పేరు.) ఓదేవేంద్రుడా! అంతర్యామ పాత్రను (శత్రువులకు కనిపించ నట్లుగా) నియమించుము. సమీచీనములగు నన్నముల నొసఁగుము. సోమ రసమును రక్షించుము. ధనములను రక్షించుము. (నీయనుగ్రహము వలన ద్యావాభూములను వ్యవధానము కలవిగాఁజేయుము. విస్తీర్ణమయిన యంతరిక్షమును లోపలధరించుచున్నాను. ఓ యింద్రుఁడా! చిన్నవారును పెద్దవారునగుసర్వదేవతల చేతను సేవింపఁబడుచున్నవాఁడవయి యంతర్యామపాత్రయందు (వారిని) సంతోషఁబెట్టుము. (నీవు సంతోషించినవాడవయి యితరులకుఁ గూడ సంతుష్టులఁ జేయుమని తా॥) ౨ ఈమంత్రమునకర్థము ౨వయనువాకమునందు వ్రాయఁ బడినది. అపానాయ=అపానవాయుదేవతా సంతోషమునకయి అనియర్థము.

తృతీయానువాకము సమాప్తము.



అనువాకము ౪.

౯౫. ఆవాయోభూషశుచిపా ఉపనః సహస్రం తేనియుతో విశ్వవార ఉపో తేఅన్ధో మద్యమయామి యస్య దేవదధిషే పూర్వపేయమ్ ఉపయామగృహీతోऽసి వాయవే త్వేన్ద్రవాయూ ఇమేసుతాః ఉపప్రయోభిరాగత మిన్దవోవాము శన్తిహి ఉపయామగృహీతోऽసి న్ద్రవాయుభ్యాం త్వైష తేయోనిః సజోషాభ్యాంత్వా॥

౧ ఓ వాయువా! (నీవు వచ్చిపాత్రల) నలంకరించుము. శుద్ధమయిన సోమమును బానము చేయునో వాయువా! (నీవు) మమ్ముఁ బొందుము. ఓ విశ్వ

వ్యాపకుడా ! నీకు వెయ్యి (౧౦౦౦) గుఱ్ఱములున్నవి. నీ సోమరసరూపమయిన యన్నము సంతోషకరమయినది. (కావున) నిన్నుఁ బొందుచున్నాను. ఓ దేవా ! ఏ సోమరసద్రవ్యము మొదట పానముచేయఁదగినదను మనస్సును ధరించినవాఁడ వైతివో ! (ఆసోమముచే నిన్నుఁ బొందుచున్నాను.) ఓ సోమరసమా ! (నీవు)పృథివీరూపమయినదారు (కొయ్య) పాత్రచేగ్రహింపఁబడిన దానవగుచున్నావు. నిన్ను వాయువు కొఱకు గ్రహించుచున్నాను. ఓ ఇంద్రవాయువులారా ! ఈసోమములు రసముదీయఁబడినవి. (కావున) సోమరసరూపములయిన యన్నములచే సమీపము నకురండు. ఏ కారణముచే సోమరసములు మిమ్ముఁ గోరుచున్నవో ! ఓసోమమా ! దారుపాత్రచే గ్రహింపఁబడిన దానవగుచున్నావు. ఇంద్ర వాయువుల కొఱకు నిన్ను గ్రహించుచున్నాను. ఓ గ్రహమా ! (పాత్ర) ఈ ఖరముయొక్క రెండవ భాగము నీకుస్థానము. (కావున) సమానసంతోషముకల యింద్రవాయువుల కొఱకు నిన్నుంచుచున్నాను. (ఖరము= అర్ధము వెనుకద్రావాయఁబడినదే)

చతుర్థానువాకము సమాప్తము.

—*—

## అనువాకము. ౫

౯౯. ౧ అయంవాంమిత్రావరుణాసుతః సోమఋతావృధా మమేదిహశ్రుతగ్ంహవమ్ ఉపయామగృహీతోఽసి మిత్రావరుణాభ్యాంత్వైషతే యోనిరృతాయుభ్యాంత్వా।

౧ సత్యమునభివృద్ధిఁ జేయునట్టియో మిత్రావరుణులారా! మీాసోమమురసము దీయఁబడినది. (కావున) నీకర్మయందు మాయాహ్వానమును వినుడు. (ఓసోమమా ! నీవు) పృథివీరూపమయిన దారుపాత్రచే గ్రహింపఁబడిన దానవగుచున్నావు. మిత్రావరుణులకొఱకు నిన్ను (హోమము చేయుచున్నాను.) ఈ ఖరప్రదేశము యొక్క

యొకభాగము నీకుస్థానము. సత్యమును గోరుచున్న మిత్రావరుణులకొఱకు నిన్నుం చుచున్నాను.

పంచమానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౬.

౧౦౯. యావాంకశా మధుమత్యశ్వినా సూనృతావతీ తయాయజ్ఞం మిమిక్షతమ్
ఉపయామగృహీతోఽస్యశ్విభ్యాం త్వైష తేయోనిర్మాధ్వీభ్యాంత్వా॥

౧ ఓ యశ్వినీదేవతలారా! కఠినశబ్దములు లేనిదియు, ప్రియమగు వాక్కులతోఁ గూడుకొనినదియు నగు నే వాక్కు మీకుఁగలదో! ఆవాక్కుచే యజ్ఞమును బూర్తిసేయుడు. (శేషము పూర్వమువలె నూహ్యము. అశ్విభ్యామ్=అశ్వినీ దేవతలకొఱకు మాధ్వీభ్యామ్=తేనెచేఁబూర్ణమగు శరీరముకలవారని యర్థము.)

షష్ఠానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౭.

౧౧౦. ప్రాతర్యుజౌ విముచ్యేథామశ్వినావేహ గచ్ఛతమ్ అస్యసోమస్యపీతయే
ఉపయామగృహీతోఽస్య శ్విభ్యాంత్వైష తేయోని రశ్విభ్యాంత్వా॥

౧ ఓ యశ్వినీదేవతలారా! (మీరు) ప్రాతఃకాలమున (నీయజమానునితోఁ) గూడుకొనినవారలై యితర యజమానులతో వియుక్తులుకండు. ఈ కర్మయందుఁ నీ

సోమమును ద్రావుటకు రండు. (శేషము పూర్వమువలె నూహ్యము.)

సప్తమానువాకము సమాప్తము.

—:-o-:—

అనువాకము ౮

౧౦౨. అయం వేనశ్చోదయత్పృశ్ఞి గర్భా జ్యోతిర్జరా యూరజసో విమానే ఇమమపాగం సంగమే సూర్యస్య శిశుంనవిప్రామతి భీరిహంతి ఉపయామ గృహీతోఽసిశండాయ త్వైష తే యోనిర్వీరతాం పాహి ॥

౧ జరాయువువలెఁ జుట్టుకొన్నట్టి విద్యుత్తుకల్గి యభిమతుఁడైనట్టి యీ యింద్రుఁడు పరాగముయొక్క విశేషమయిన కూడికగల భూప్రదేశమునందాదిత్యుని గర్భములయిన యుదకములను వర్షించుచున్నాడు. ఉదకములకు సూర్యగర్భభావమెట్లనగా సూర్యునికి ఉదకములకును, సంగమము కలుగుచుండగా ఋత్విజులింద్రునిఁ బాలుద్రావు పిల్లవానివలె(లాలనచేయుచున్నవారలై) మంత్రసహితములగు నాహుతులచే యాగముచేయు చున్నారు. (ఓ శుక్రగ్రహమా !) దారుపాత్రచేగ్రహింపఁబడినదానవగుచున్నావు శుక్రపుత్రుడగు శండునికొఱకు నిన్నుగ్రహించుచున్నాను. ఈ ఖరప్రదేశము యొక్క యొకభాగము నీకు స్థానము. (అటువంటి నీవు) యజమానుని కర్మశూరత్వమును పాలించుము. (శుక్రగ్రహము-పూర్వమువలె యజ్ఞపాత్ర విశేషము.)

అష్టమానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము ౯.

౧౦౩. తంప్రత్నథా పూర్వథా విశ్వథేమథా జ్యేష్ఠతాతిం బర్హిషదగ్ంసువర్విదం ప్రతీచీనం వృజనం దోహసేగిరాఽఽశుంజయంత మనుయాసువర్ధసే ఉప యామగృహీతోఽసి మర్కాయత్వైష తే యోనిః ప్రజాఃపాహి ॥

(ఓయింద్రుఁడా! యేనీవు) మాకుప్రతికూల మయినట్టియు, విడువఁదగినది యనగు నాలస్యాదిదోషములను నశింపఁజేయుచున్నావో, యేక్రియలందు శీఘ్ర ముగాఁజేయునట్టి యజమానుననుసరించి (సోమపానముచేత, స్తోత్రముచేతను నీవు వృద్ధినొందుచున్నావో, ఆక్రియలందు జ్యేష్ఠుఁడవును, యాగమునందున్న వాఁడవును, స్వర్గమును (యజమానునికిచ్చుదానినిగా) దెలిసికొనుచున్నవాఁడ వునయిన యానిన్ను ప్రాచీనులగు భృగువు మొదలయిన మహర్షులవలెను, పితరు లవలెను, అతీతులగు సమస్త యజమానులవలెను స్తోత్రము చేయుచున్నాము. ఓ మంథిగ్రహమా! నీవు దారుపాత్రచే గ్రహించఁబడుచున్నావు. శుక్రపుత్రుఁ డగు మర్కునికయి నిన్ను గ్రహించుచున్నాను. ఈఖరప్రదేశముయొక్క యొక భాగము నీకుస్థానము. నీవు యజమానునియొక్క సంతానములను రక్షించుము. మంథిగ్రహము=వెనుకటివలెనొక యజ్ఞపాత్రవిశేషము.

నవమానువాకము సమాప్తము.

---

అనువాకము ౧౦.

౧౦౪. యేదేవా దివ్యేకాదశస్థ పృథివ్యామధ్యేకాదశస్థాప్సు షదోమహినైకాదశ స్థతే దేవాయజ్ఞమిమం జుషధ్వము పయామగృహీతోఽస్యాగ్రయణోఽసిస్వా

గ్రయణోఽసిస్వ యజ్ఞంజిన్వ యజ్ఞపతి మభిసవనాపాహి విష్ణుస్త్వాంపాతు విశం

త్వంపాహీన్ద్రియేణైష తే యోనిర్విశ్వేభ్యస్త్వా దేవేభ్యః॥

ఓ దేవతలారా! ఏమీరు ద్యులోకమునందుఁ బదునొకండుగురుగానున్నారో పృథ్వి,అంతరిక్షలోకములందు మీమహిమచేఁ బదునొకండుగనున్నారో ఆమీరీయజ్ఞమును సేవించుడు. (ఓసోమమా! నీవు )మట్టిపాత్రచేత గ్రహించఁబడుచున్నావు ఆగ్రయణమను పేరు కలదానవగుచున్నావు. బాగుగా శ్రేష్ఠత్వమునుబొందిం మనట్టి యజ్ఞమును సంతోషపెట్టుము. సవనముల నభిముఖముగా రక్షించుము. విష్ణుమూర్తి నిన్ను రక్షించుఁగాక. నీవు యజమానుని సంతానమును సామర్థ్యమునిచ్చుటచే రక్షించుము. ఈ ఖరప్రదేశముయొక్క ఒకభాగము నీకు స్థానము. సమస్తదేవతలకొఱకు నిన్నుంచుచున్నాను. (సవనము=యజ్ఞము)

దశమానువాకము సమాప్తము

---

అనువాకము ౧౧.

౧౦౫. ౧ త్రిగ్ంశత్త్రియశ్చగణినో రుజన్తోదివగ్ం రుద్రాఃపృథివీంచసచన్తే ఏకా

దశాసో అప్సుషదః సుతగ్ంసో మంజుషన్తాగ్ం సవనాయవిశ్వే ఉపయామ

గృహీతోఽస్యాగ్రయణోఽసి స్వాగ్రయణోఽజిన్వయజ్ఞం జిన్వయజ్ఞపతి మభి

సవనాపాహి విష్ణుస్త్వాం పాతువిశంత్వం పాహీన్ద్రియేణైష తే యోనిర్విశ్వే

భ్యస్త్వా దేవేభ్యః॥

౧ మూడుపదునొకండులుగల దేవగణములు శత్రువులను నాశనము చేయుచున్నవారును, శత్రుస్త్రీలనేడ్పించుచున్నవారునై, (కొందరు) ద్యులోకమును సేవించుచున్నారు. (మఱికొందరు) భూలోకమును సేవించుచున్నారు. (మిగిలిన) పదునొకండుగురన్తరిక్షులోకమును సేవించుచున్నారు. ఆ సమస్త దేవతలు సవనము కొఱకు నభిషుతమైన సోమమును సేవింతురుగాక. (అభిషుతము=రసము తీయబడినది) శేషము పూర్వవత్తు.

ఏకాదశానువాకము సమాప్తము.

---

అనువాకము ౧౨.

౧౦౬. ౧ ఉపయామగృహీతోఽసీన్ద్రాయత్వా బృహద్వతే వయస్వత ఉక్థాయువే

యత్త ఇన్ద్రబృహద్వయస్తస్మై త్వా విష్ణవే త్వైష తే యోనిరిన్ద్రాయత్వోక్థాయువే॥

౧ (ఓ సోమమా !) స్థాలిచేత గ్రహించబడిన దానవగుచున్నావు. బృహత్సామముల (సామవిశేషముల) యందిష్టుడును, శస్త్రము (మంత్రవిశేషము)ను కోరుచున్నవాడునగు నింద్రుని కొఱకు గ్రహించుచున్నాను. ఓ యింద్రుడా ! నీకు గొప్పసోమరూపమగు నే యన్నము కలదో, దానిని బానము చేయుటకొఱకు వేడుచున్నాను. (ఓ సోమమా !) నిన్ను విష్ణువుకొఱకు గ్రహించు చున్నాను. ఈ ఖరప్రదేశము యొక్క యొకభాగము నీకు స్థానము. శస్త్రప్రియుడగు నింద్రుని కొఱకు నిన్ను (ఈ ప్రదేశమున నుంచుచున్నాను)

ద్వాదశానువాకము సమాప్తము.

---

## అనువాకము ౧౩.

౧౦౭. మూర్ధానం దివో అరతిం పృథివ్యా వైశ్వానర మృతాయజాతమగ్నిమ్ కవిగ్ం సమ్రాజమతిథిం జనానామాసన్నా పాత్రం జనయంతదేవాః ఉపయామగృహీతోఽస్యగ్నయేత్వా వైశ్వానరాయధ్రువోఽసి ధ్రువక్షితి ర్ధ్రువాణాం ధ్రువతమోఽచ్యుతానామచ్యుతక్షిత్తమ ఏష తేయోని రగ్నయేత్వా వైశ్వానరాయ ॥

౧ ద్యులోకమునకు శిరస్సువలె భాసకమైనట్టియు, భూమికిఁ బైనఉండునట్టియు యజ్ఞముకొఱకు నాహవనీయ రూపముగాఁ బుట్టునట్టియు, తనభక్తుల ననుగ్రహించుటను గుర్తెరింగినట్టియు, బాగుగాఁ బ్రకాశించుచున్నట్టియు, యజమానులకు సత్కారయోగ్యమైనట్టి వైశ్వానరాగ్నిని (మేము స్తోత్రము చేయు చున్నాము.) (ఇటువంటియగ్ని) ముఖమునందు దేవతలు చమసరూపమైన సోమగ్రహము నింద్రవాయ్వాదిస్థానములందుఁ బుట్టించెను. ఓ సోమమా ! స్థాలీరూపమైన పాత్రచే గ్రహించబడినదానవగుచున్నావు. వైశ్వానరాగ్నికొఱకు నిన్నుస్వీకరించుచున్నాను. (ఓ సోమగ్రహమా ! నీవు) ధ్రువమను పేరుకలదానవగుచున్నావు. స్థిరమైన నివాసము కలదానవు. ఆదిత్యస్థాల్యాదుల యొక్క మధ్యలో మిక్కిలి దృఢమగుచున్నావు. ఈ బీజమునాటని ప్రదేము నీకు స్థానము. (ఈ స్థానమునందు) వైశ్వానరాగ్నికై నిన్నుంచుచున్నాను. చమసము = యజ్ఞపాత్రవిశేషము.

త్రయోదశానువాకము సమాప్తము.



## అనువాకము ౧౪

౧౦౮. మధుశ్చమాధవశ్చ శుక్రశ్చ శుచిశ్చనభశ్చ నభస్యశ్చేషశ్చోర్జశ్చ సహశ్చ
సహస్యశ్చ తపశ్చతపస్యశ్చోపయామ గృహీతోఽసి సగ్ంసర్పోఽస్యగ్ం
హస్పత్యాయత్వా॥

౧ (ఓ సోమమా !) నీవు దారుపాత్రచే గ్రహించఁబడిన దానవు , చైత్ర మాసస్వరూపమును అగుచున్నావు. (ఇట్లే) వైశాఖాది మాసముల స్వరూపమవు నగుచున్నావు. (౧మధుః=చైత్రమాసము) (౨) మాధవః = వైశాఖమాసము. (౩) శుక్రః = జ్యేష్ఠమాసము. (౪) శుచిః = ఆషాఢమాసము. (౫) నభః= శ్రావణ మాసము. (౬) నభస్యః = భాద్రపదము. (౭) ఇషః = ఆశ్వీయుజము. (౮) ఊర్జః = కార్తీకము. (౯) సహః = మార్గశీర్షము. (౧౦) సహస్యః= పుష్యము. (౧౧) తపః= మాఖమాసము. (౧౨) తపస్యః = ఫాల్గునము.

## అనువాకము ౧౫.

౧౦౯. ఇన్ద్రాగ్నీ ఆగతగ్ం సుతంగీర్భిర్నభో వరేణ్యమ్ అస్యపాతం ధియేషితా ఉప
యామగృహీతోఽసీన్ద్రాగ్నిభ్యాంత్వైష తేయోనిరిన్ద్రాగ్నిభ్యాంత్వా॥

౧ ఓ ఇంద్రాగ్నులారా ! స్తోత్రములతోఁ గూడుకొనినదియు, స్వర్గనివాసు లగు దేవతలచేఁ గొనియాడఁదగినదియు, నగు నభిషుతమైన సోమమును గూర్చిరండు. బుద్ధిచే ప్రార్థించబడిన మీరు ఈ సోమముయొక్క యంశమునుద్రావుడు. శేషము పూర్వవత్తు.

పంచదశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౧౬.

౧౧౦. ఓమాసశ్చర్షణీ ధృతో విశ్వేదేవాస ఆగత దాశ్వాగ్ంసో దాశుషః సుతమ్

ఉపయామ గృహీతోఽసి విశ్వేభ్యస్త్వా దేవేభ్య ఏష తే యోనిర్విశ్వేభ్య

స్త్వా దేవేభ్యః॥

౧ రక్షకులును, మనుష్య పోషకులును, నభిషుతమైన సోమము నిచ్చునట్టి యజమానునకు ఫలమునొసగు వారునైన యోవిశ్వేదేవతలారా! రండు శేషము పూర్వవత్తు, (రక్షణము = అనిష్టము నివారించుట. పోషణము = ఇష్టమును కలుగ జేయుట. విశ్వేదేవతలు = దేవతలలో భేదము.)

షోడశానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము ౧౭ - ౧౮

౧౧౧. మరుత్వన్తం వృషభంవా వృధానమకవారిందివ్యగ్ం శాసమిన్ద్రమ్ విశ్వా

సాహమవసే నూతనాయోగ్రగ్ంసహోదామిహతగ్ం హువేమ ఉపయా

మగృహీతోఽసీన్ద్రాయత్వామరుత్వత ఏష తేయోనిరిన్ద్రాయత్వా మరుత్వతే॥

౧౧౨ (౧౮) ఇన్ద్రమరుత్వ ఇహపాహి సోమంయథాశార్యాతే అపిబః సుతస్య తవ

ప్రణీతీతవశూరశర్మన్నా వివాస న్తికవయః సుయజ్ఞాః ఉపయామగృహీతోఽ

సీన్ద్రాయత్వా మరుత్వత ఏష తేయోనిరిన్ద్రాయత్వా మరుత్వతే॥

మరుద్గణములతో కూడుకున్నట్టియు, గ్రామములను వృద్ధినొందించునట్టియు, పీడింపబడనిశత్రువులు కలిగినట్టియు, స్వర్గమునందున్నట్టియు, దుష్టులనుశిక్షించునట్టియు, బ్రపంచమును బాలించుటకు సమర్థుడైనట్టియు, క్రొత్తదగు రక్షణము ఇప్పటి శత్రువులనుండి యజమానుని రక్షించుట) కొఱకనుగ్రహుడైనట్టియు, బలము నిచ్చునట్టియు, నీ యింద్రుని (మేము) ఈ కర్మయందు బిలుతుము. శేషము పూర్వవత్తు. ౨ మరుద్గణములతోఁ గూడుకొనిన యోఇన్ద్రా! నీనీకర్మయందు సోమమును ద్రావుము. యేవిధముగా శర్యాతియను యజమానుని యొక్క కర్మయందభిషుతమైనసోమమును బానము చేసితివో! ఓ శూరుడా! నీయనుజ్ఞచే బాగుగాయజ్ఞము చేసినపండితులు (యేవిధముగ) నీసుఖము నిమిత్తముగుచుండగా నభిముఖముగ బరిచర్య చేయుచున్నారో, (ఆవిధముగ నీయజమానుఁడు కూడ యనిభావము, శేషము పూర్వవత్తు

సప్తదశ, అష్టాదశ, అనువాకములు సమాప్తములు.



అ ను వా క ము ౧౯.

౧౧౩. మరుత్వాగ్ం ఇన్ద్రవృషభోరణాయపి బాసోమమనుష్వధం మదాయ ఆసిఞ్చస్వజఠరే మధ్వఊర్మింత్వాగ్ంరాజాzసి ప్రదివః సుతానామ్ ఉపయామ గృహీతోzసీన్ద్రాయత్వా మరుత్వత ఏష తేయోనిరిన్ద్రాయత్వా మరుత్వతే॥

౧ ఓ యింద్రుఁడా! మరుద్గణములతోఁ గూడుకొనినట్టియు, గ్రామములను వృద్ధినొందించుచున్నట్టి నీవు క్రీడకొఱకు నవనీయపురోడాశములతోఁ గూడుకొనిన సోమమును ద్రావుము. సంతోషము కొఱకు మధురమగు (త్రాగఁబడిన) సోమము యొక్క సారమును (నీ జఠరాగ్ని) యందుస్థాపించుకొనుము. పొందఁదగిన స్వర్గము

నకును, అభిషుతమైన సోమమునకును, నీవు రాజువగుచున్నావు. (శేషము పూర్వవత్తు)

ఏకోనవింశానువాకము సమాప్తము.

—:-0-:—

అనువాకము ౨౦.

౧౧౩. మహాగ్ం ఇన్ద్రో య ఓజసా పర్జన్యో వృష్టిమాఇవ స్తోమైర్వత్సస్య వావృధే ఉపయామగృహీతోఽసి మహేన్ద్రాయ త్వైష తే యోనిర్మహేన్ద్రాయ త్వా॥

౧ వర్షముకల మేఘమువలె నేయింద్రుఁడు బలముచే గొప్పవాడగుచున్నాడో! ఆయింద్రుఁడు వత్సస్థానీయుడగు యజమానుని యొక్క స్తోత్రముచే వృద్ధినొందుఁగాక. శేషము పూర్వవత్తు

వింశానువాకము సమాప్తము.

---

అనువాకము ౨౧.

౧౧౪. మహాగ్ంఇన్ద్రో నృవదాచర్షణి ప్రాఉతద్విబర్హా అమినః సహోభిఃఅస్మద్రియగ్వావృధేవీర్యాయోరుః పృథుః సుకృతః కర్తృభిర్భూత్ ఉపయామగృహీతోఽసి మహేన్ద్రాయ త్వైష తే యోనిర్మహేన్ద్రాయ త్వా॥

౧ ఈ మహేంద్రుఁడు మనుష్యుఁడువలె మనుజుల నభీష్టభోగముల చేఁ దృప్తి పఱచువాఁడును, రాజుమొదలగువారు సేవకుల నేవిధము నిష్టభోగముల చేతృప్తిపఱ

చుదురో, ఆవిధముగనని తా) ప్రకృతి, వికృతి రూపములగు రెండుసోమయాగములందు వృద్ధినొందినవాఁడును, బలముచేనుపమాన రహితుఁడును, మాతో సమానుఁడునై వృద్ధినొందెను. (మేమితని యనుగ్రహముచే నేవిధముగవృద్ధి నొందితిమో! ఈ యింద్రుఁడు కూడ హవిస్సులచే వృద్ధినొందెనని భావము.) సామర్థ్యసిద్ధికొఱకు యజమానులచే (నీ యింద్రుఁడుకీర్తిచే) విపులుఁడైనవాఁడును, బలముచే విస్తృతుఁడునునై బాగుగా వృద్ధినొందెను. శేషము పూర్వవత్తు॥

ఏకవింశానువాకము సమాప్తము.



అనువాకము ౨౨.

౧౬. కదాచన స్తరీరసి నేన్ద్ర సశ్చసి దాశుషే ఉపోపేన్ను మఘవన్భూయ ఇన్ను తే దానం దేవస్య పృచ్యతే ఉపయామగృహీతోఽస్యాదిత్యేభ్యస్త్వా ౨ కదాచన ప్రయుచ్ఛస్యుభే నిపాసి జన్మనీ తురీయాఽఽదిత్య సవనం త ఇన్ద్రియమాతస్థావమృతం దివి ౩ యజ్ఞో దేవానాం ప్రత్యేతి సుమ్నమాదిత్యాసో భవతా మృడయన్తః ఆవోఽర్వాచీ సుమతిర్వవృత్యాదగ్ంహోశ్చిద్యా వరివోవిత్తరాసత్ ౪ వివస్వ ఆదిత్యైష తే సోమపీథస్తేన మన్దస్వ తేన తృప్య తృప్యాస్మ తే వయం తర్పయితారో ౫ యా దివ్యా వృష్టిస్తయా త్వా శ్రీణామి॥

౧. ఓ ఇంద్రుఁడా! నీవొకప్పుడును హింసకుడవగుట లేదు. హవిస్సు నిచ్చు యజమానునకు) ఫలమునిచ్చుటకై యజమానుని సమీపమునందే పోవుచున్నావు.

ఓ ఇంద్రుడా ! దేవుడవగు నీక్వవదగిన హవిస్సు సంబంధించుచున్నది. (యజమానునిచే మఱలహవిస్సు ఇవ్వబడుచున్నదని తా) ఓ సోమమా ! నీవుదారు పాత్రచే గ్రహింపబడుచున్నావు. ఆదిత్యుల కొఱకు నిన్ను స్వీకరించుచున్నాను. ౨ ఓ యింద్రుడా! ఒకప్పుడును ప్రమాదము నొందుటలేదు. (ఇచట ప్రశబ్దము నిషేధార్థకము. యచ్ఛ ధాతువు ప్రమాదార్థకము.) జరుగుచున్నదియు, రాబోవునదియు, నగు యజమానుని యొక్క రెండుజన్మలనుఁ బాలించుచున్నావు. ఓ యాదిత్యుడా ! ఈ తృతీయసవనమునీసంబంధమైనది. (ఇచటతృతీయమను నర్థమునందు వర్ణవ్యత్యాసముచే "తురీయ'' శబ్దముపయోగింపబడినది.) ఆసవనమునందింద్రి యాభివృద్ధికిఁగారణమును నమృత సమానమునగు పెరుగు ద్యులోకసమానమైన హవిర్ధానము నందభిముఖముగనున్నది. (హవిర్ధానము = హవిస్సునుంచు మండపము) ౩ ఈ యజ్ఞపురుషుడు దేవతల సుఖమును దెలిసికొనుచున్నాడు. (పుట్టించుచున్నాడని తా) ఓ యాదిత్యులారా ! మమ్ము సుఖపెట్టుచున్నవారు కండు. మీయనుగ్రహబుద్ధి నవీనులమగు మాయందు బ్రవర్తించినదై విశేషముగా నుండుగాక. (ఏ)యనుగ్రహబుద్ధి పాపమును నశింపజేయుచున్నదో, ఆ యనుగ్రహబుద్ధి పరిచర్యను మిక్కిలి తెలిసి కొనినదై యుండుగాక. ౪ విశిష్టనివాసముగల ఓయాదిత్యుడా ! ఈ మూడవది నీకు బానముఁ చేయందగిన సోమము. ఆసోమదర్శనముచే సంతుష్టుఁడవగుము. ఆసోమపానముచేతృప్తినొందుము. నీకు దృప్తిని కలుగజేసిన మేముకూడ తృప్తులమగుదుము. ౫ ఓ సోమమా ! యేది దేవతాసంబంధమగు వర్షమునకుఁ గారణమో, ఆ పెరుగుతో నిన్ను గలుపుచున్నాము.

ద్వావింశాను వాకము సమాప్తము.

అనువాకము ౨౩.

౧౧౭. వామమద్యసవితర్వామముశ్వోదివేదివే వామమస్మభ్యగ్ం సావీః వామస్యహిక్షయస్య దేవభూరేరయాధియా వామభాజఃస్యామ ఉపయామగృహీతోఽసిదేవాయత్వా సవిత్రే॥

౨ ఓ సూర్యుడా! ఇప్పుడుమాకొఱకు గర్మఫలము నొసగుము. రేపు గూడ కర్మఫలము నొసగుము. (అటుపైన) ప్రతిదినమునందు గర్మఫలమునొసగుము. ఓ దేవా! కర్మఫలరూపమైనదియు, విస్తీర్ణమునగు స్వర్గనివాసము యొక్క యీశ్రద్ధతోఁగూడుకొనిన బుద్ధిచేఁగర్మానుష్ఠానము కలవారము కాగలవారము. ఓసోమమా! దారుపాత్రచే గ్రహింపబడినదానవగుచున్నావు. అంతర్యామియు, ప్రేరకుడు నగు సూర్యునికొఱకు నిన్ను గ్రహించుచున్నాను.

త్రయోవింశాను వాకము సమాప్తము.

---

అనువాకము ౨౪.

అదబ్ధేభిః సవితః పాయుభిష్ట్వగ్ం శివేభిరద్య పరిపాహినోగయమ్ హిరణ్యజిహ్వః సువితాయ నవ్యసేరక్షామాకిర్నో అఘశగ్ంస ఈశత ఉపయామగృహీతోఽసి దేవాయత్వాసవిత్రే॥

౧ ఓ సూర్యుడా! హింసింపబడనివియు, పాలించునవియు నగు మంగళము (అనుగ్రహవిశేషము)లచే నీవు మాగృహము నంతటను రక్షించుము. రమణీయమైన నాలుకకల నీవు నూతనమైన స్వర్గప్రాప్తికొఱకు (నాయీకర్మను) రక్షించుము. రక్షించుము మమ్ము నిందించువాఁడు మాకుపాపమాచరింప సమర్థుఁడుకాక పోవుగాక. శేషముపూర్వవత్తు.

చతుర్వింశాను వాకము సమాప్తము.

అనువాకము ౨౫.

౧౧౯. హిరణ్యపాణిమూతయే సవితార ముపహ్వయే సచేత్తా దేవతాపదమ్ ఉప యామగృహీతోఽసి దేవాయత్వా సవిత్రే॥

౧ బంగారు హస్తమునందుగల సూర్యుని రక్షించుటకై బిలుచుచున్నాను. ఆ సూర్యుడు దేవతారూపుడు. మాయోగ్యమైన స్థానమును దెలిసికొనగలడు. శేషము పూర్వవత్తు.

పంచవింశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౨౬.

౧౨౦. సుశర్మాఽసి సుప్రతిష్ఠానో బృహదుక్షేనమ ఏష తేయో నిర్విశ్వేభ్యస్త్వా దేవేభ్యః॥

౧ (ఓ వైశ్వదేవగ్రహమా ! నీవు) మంచిసుఖము కలదానవు, మంచిస్థితికల దానవునగుచున్నావు. శస్త్రముసందు (స్తోత్రముచేయ బడుచున్ననీకొఱకు) గొప్ప నమస్కారము. శేషముపూర్వవత్తు.

షడ్వింశానువాకము సమాప్తము.

—:-o-:—

అ ను వా క ము ౨౭.

౧౨౧. బృహస్పతిసుతస్య తఇందో ఇంద్రియావతః పత్నీవంతం గ్రహంగృహ్ణా మ్యగ్నా 3 ఇపత్నీ 3 ౪సజూర్దేవేన త్వష్ట్రా సోమంపిబ స్వాహా ॥

౧ ఓ సోమమా ! వీర్యవంతమును, యజమానునిచే నభిషుతమైన నీయొక్క దేవతాంశముగల గ్రహమును గ్రహించుచున్నాను. పత్నీవంతుడవగు నో యగ్నీ ! ప్రజాపతి దేవునితోగూడ సోమమును ద్రావుము. ఈ హవిస్సు హుతమగుగాక.

సప్తవింశాను వాకము సమాప్తము.

— * —

అ ను వా క ము ౨౮.

౧౨౨. హరిరసిహారియోజనో హర్యోఃస్థాతావజ్రస్య భర్తాపృశ్నేః ప్రేతాతస్యతే దేవ సోమేష్టయజుషః స్తుతస్తోమస్య శస్తోక్థస్య హరివంతం గ్రహంగృహ్ణా మిహరీః స్థహర్యోర్ధానాః సహసోమా ఇంద్రాయస్వాహా ॥

౧ ఓ సోమమా ! నీవు హరితవర్ణముకలదానవగుచున్నావు. ఇంద్రుడుదేవత గాకలదానవు. గుఱ్ఱములతో గూడుకొనిన రథము నందుంటున్నదానవు. (ఇంద్రు నిచే ద్రాగబడుటవలన నిద్రాభేదముచే వజ్రాయుధమునుః బోషించుదానవు. అన్న మును (యాగమును సాధించుట ద్వారా) ప్రేరణచేయుదాన వగుచున్నావు. ఓ సోమ దేవతా ! (యజ్ఞసాధనముగాః) ప్రయోగించబడిన గ్రహణ, సాదనాది

ంత్రములు కలిగినట్టియు, స్తోత్రముచేయబడిన స్తోమములు (వివృత్పంచదశ, సప్తదశ, ఏకవింశ, నామకములు) కలిగినట్టియు, రక్షించబడిన శస్త్రములు (ప్రఉగాద్య, నిష్కైవల్య, మరుత్వతీయ,వైశ్వదేవాగ్ని మారుతనామకములు) కలిగినట్టియు, నింద్రుడు దేవత గాగలదియునగునీయాగ్రహామును గ్రహించుచున్నాను. వెచ్చపెట్టబడిన తండులములారా! మీరింద్రరథమును మోయునట్టిగుర్రసంబంధులు గహరిశబ్దార్థముచే రూఢములుకండు. సోమముతో కూడినవారలు కండు. అటువంటి యీహావిస్సు ఇంద్రునికొరకు హుతమగుగాక.

అష్టావింశానువాకము సమాప్తము.

---

అనువాకము ౨౯.

౧౭౩. అగ్న ఆయూగ్ంషి పవస ఆసువోర్జ మిషంచనః ఆరేబాధస్వ దుచ్ఛునామ్ ఉపయామగృహీతో౽ స్యగ్నయే త్వా తేజస్వత ఏష తే యోనిరగ్నయే త్వా తేజస్వతే॥

౧ ఓయగ్నీ! (నీవు) భక్తులయాయువులను వృద్ధిని పొందించుచున్నావు. మాకన్నమును, బలమును నొసగుము. శత్రుసేనను దూరమునందుండునట్లుగా బాధించుము. ఓ సోమమా! నీవు దారుపాత్రచే గ్రహించబడిన దానవగుచున్నావు. ఇత్యాదిపూర్వవత్.

ఏకోనత్రింశానువాకము సమాప్తము.

---

అనువాకము ౩౦.

౧౩౪. ఉత్తిష్ఠన్నోజసా సహపీత్వా శిప్రే అవేపయః సోమమిన్ద్రచమూసుతమ్ ఉపయామగృహీతోఽసీన్ద్రాయత్వౌజస్వత ఏషతేయోనిరిన్ద్రాయత్వౌజస్వతే॥

౧ ఓ యింద్రుడా ! అభిషుతమైన సోమమును పానమునుచేసి బలముతో గూడి లేచినవాడవై భక్షించుటకు సాధనములగు దవడలను కదలించుము. (దవడలను కదలించుటచే నీసంతోషమును దెలియపఱచుమని తా) శేషము పూర్వవత్తు.

త్రింశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౩౧,

౧౩౫. తరణిర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసిసూర్య విశ్వమాభాసిరోచనమ్ ఉపయామగృహీతోఽసి సూర్యాయత్వాభ్రాజస్వత ఏషతేయోనిః సూర్యాయత్వాభ్రాజస్వతే॥

౧ ఓ సూర్యుడా ! నీవు చీకటిని పోగొట్టువాడవును, అందరిచే జూడదగినవాడవును, (సమస్తలోకములందు) కాంతినిగలుగజేయు వాడవు నగుచున్నావు. సర్వజగత్తును కాంతిగలుగునట్లుగా నంతటను ప్రకాశింపజేయుచున్నావు. (ఓ యతిగ్రాహ్యమా !) (అగ్నిష్టోమమునందలి పాత్రవిశేషము) దీప్తిమంతుడగు సూర్యుని కొఱకు నిన్ను గ్రహించుచున్నాను (కావున నీవాసూర్యునికొఱకై) మృత్పాత్రచే గ్రహింపబడిన దానవగుచున్నావు. ఈ హవిర్ధానమండపమునందలి ప్రదేశము నీకు

స్థానము. (కావున) కాంతిమంతుఁడగు సూర్యునికొఱకు నిన్నా స్థానము నందుంచుచున్నాను.

ఏకత్రింశానువాకము సమాప్తము.

---

అనువాకము ౩౨.

౧ ౨౬. ఆప్యాయస్వమదిన్తమ సోమవిశ్వాభిరూతిభిః భవానః సప్రథస్తమః॥

౧ మిక్కిలి సంతోషయుక్తమయిన యో సోమమా! సమస్తవిధములయిన మా రక్షణలచే సంతతము వృద్ధినొందుము. మమ్ముఁ గూర్చి మిక్కిలి ప్రసిద్ధి కలదాన వగుము.

ద్వాత్రింశానువాకము సమాప్తము

---

అనువాకము ౩౩.

౧౨౭. ఈయుష్టేయేపూర్వతరామపశ్యన్వ్యుచ్ఛన్తీముషసంమర్త్యాసః ఆస్మాభిరూను ప్రతిపక్ష్యాభూదోతేయన్తి యే అపరీషుపశ్యాన్॥

౧ ఏమనుజులు ప్రాతఃకాలమునుఁ జేయునట్టి యుషఃకాలదేవత నితరులకంటెఁ బూర్వము చూచుచున్నారో; ఆమనుజులా దేవతనుఁ బొందుచున్నారు. (ఆదేవత) మాచేతనుగూడ ప్రత్యక్షముగాఁ జూడదగినదేయైనది. ఏయితరులుకూడ రాత్రుల

చివరలందు (ఆదేవతను)జూచుచున్నారో ; వారుకూడ నాదేవతనన్నివిధముల చేతను పొందుచున్నారు.

త్రయస్త్రింశానువాకము సమాప్తము.

---

అ ను వా క ము. ౩౪.

౧౭౫. జ్యోతిష్మతీం త్వాసాదయామి జ్యోతిష్కృతంత్వా సాదయామి జ్యోతిర్వి

దంత్వాసాదయామిభాస్వతీంత్వా సాదయామి జ్వలన్తీం త్వాసాదయామి

మల్మలాభవన్తీంత్వాసాదయామి దీప్యమానాం త్వా సాదయామి రోచ

మానాంత్వాసాదయామ్యజస్రాంత్వా సాదయామి బృహజ్జ్యోతిషంత్వాసాద

యామి బోధయన్తీంత్వా సాదయామి జాగ్రతీంత్వా సాదయామి॥

౧ (ఓ సమిధా ! = అగ్నియందు వేల్చఁబడుకాష్ఠ విశేషము.) మిక్కిలిస్వల్ప ప్రకాశముతోఁ గూడుకొనిన నిన్నీ యగ్నియందుంచుచున్నాను. కొంచెమధిక మయిన ప్రకాశముకల నిన్నీ యగ్నియందుంచుచున్నాను. అధికప్రకాశముకల నిన్నీ యగ్నియందుంచు చున్నాను. శేషమిూవిధముగా నేయర్థమూహించుకొనవలయును. భాస్వతీమ్ = కొంచెము కాన్తికలది. జ్వలన్తీమ్ = కొంచెమధికమయిన కాన్తికలది. మల్మలాభవన్తీమ్ = తగలబడుచున్న కాష్టముయొక్క ధ్వని యనుకరణమయిన "మల్మల" అనుశబ్దముకలది దీప్యమానామ్ = అతిస్వల్పమయిన కాన్తికలది. రోచమానామ్= కొంచెమధికమయిన కాన్తికలది అజస్రామ్ = ఎక్కువ అధిక మయిన కాన్తికలది. బృహజ్జ్యోతిషమ్ = వృద్ధినొందునట్టి కాన్తికలది. బోధయన్తీమ్ =

వ్యాపించుచున్న కాన్తికలది. జాగ్రతీమ్ = స్వభావము చేతనేప్రకాశించునట్టిది.

చతుస్త్రింశానువాకము సమాప్తము

---

## అనువాకము ౩౫.

౧౭౯. ప్రయాసాయస్వాహాzzయాసాయ స్వాహా వియాసాయ స్వాహాసంయాసా
య స్వాహోద్యాసాయస్వాహాzవయాసాయస్వాహా శుచేస్వాహా శోకా
యస్వాహా తప్యత్త్వైస్వాహా తపతేస్వాహా బ్రహ్మహత్యాయై స్వాహా
సర్వస్మై స్వాహా ॥

౧ "ప్రయాస" అనుదేవతకొఱకీ (స్రువముచే గ్రహింపబడిన యాజ్యము) హుతమగుగాక. ఇట్లే మిగిలినపదముల యర్థముకూడ సమన్వయించుకొనఁ దగినది. ప్రయాస- ఆయాస- వియాస- సంయాస- ఉద్యాస, ఇత్యాదిచతుర్థ్యన్త పదముల కాయాదేవతలు అర్థమని యెఱుంగవలయును.

పంచత్రింశానువాకము సమాప్తము.

---

## అనువాకము ౩౬.

౧౮౦. చిత్తగ్ం సంతా సేనభవంయక్నారుద్రంతనిమ్నా పశుపతిగ్ం స్థూల
హృదయేనాగ్నిగ్ం హృదయేనరుద్రం లోహితేన శర్వంమతస్నాభ్యాం

మహాదేవమంతః పార్శ్వనోషిష్టహానగ్ం శింగీనికోశ్యాభ్యామ్ ॥

౧ ద్వితీయాన్తములయిన "చిత్త" "భవ" ఇత్యాదిశబ్దములు దేవతావిశేష వాచకములు. తృతీయాన్తములయిన "సన్తాన" ఇత్యాదిశబ్దములు పశుమాంసవిశేష వాచకములు. ప్రతివాక్యములోను "పరితోషయామః" (=సంతోషపఱచుచున్నాము.) అనుపదము నధ్యాహారము చేయవలయును. సంతానమనెడి మాంసముచే "జిత్త" అనుదేవతను సంతోషపఱచు చున్నాము. ఇట్లే మిగిలిన ౮ వాక్యములకర్థముచెప్పు కొనవలయును.

షట్త్రింశానువాకము సమాప్తము.

---

అనువాకము ౩౭.

౧౩౧. ఆతిష్ఠవృత్ర హన్రథంయుక్తాతే బ్రహ్మణాహరీ అర్వాచీనగ్ం సుతేమ నోగ్రావకృణోతు వాగ్నునా ఉపయామగృహీతోఽసీంద్రాయత్వా షోడ శినఏషతే యోనిరింద్రాయత్వా షోడశినే ॥

౧ వృత్రాసురుని జంపినయింద్రుడా! నీగుఱ్ఱములు మంత్రముతో గూడు కొనినవై రథమును మోయుచున్నవికావున) నెక్కుము. ఈరాయి అభిమవధ్వనిచే నిమనస్సు నభిముఖముగాఁ జేయుగాక. ఓ సోమమా! దారుపాత్రచే గ్రహింప బడిన దానవగుచున్నావు. అటువంటి నిన్ను షోడశ (౧౬) సంఖ్యనుఁ బూరించునట్టి స్తోత్రము, శస్త్రముగలయింద్రుని కొఱకు గ్రహించుచున్నాను. ఓ షోడశగ్రహమా!

ఈ ఖరప్రదేశము యొక్క యొకభాగము నీకు స్థానము. నిన్ను పూర్వోక్తుఁడగు నింద్రునికొఱకు ఈ స్థానమునందుంచు చున్నాను.

సప్తత్రింశానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౩౮.

౧౩౨. ఇన్ద్రమిద్ధరీవహతోఽప్రతి ధృష్టశవసమృషీణాంచస్తు తీరుపయజ్ఞంచమానుషాణామ్ ఉపయామగృహీతోఽసీన్ద్రాయత్వా షోడశినఏష తే యోనిరిన్ద్రాయత్వాషోడశినే॥

౧ మంత్రములయొక్క స్తోత్రములను, యజమానుల యజ్ఞమునుబొంది (ఎవ్వనిచేతను) తిరస్కరించబడని యింద్రుని గుఱ్ఱములు (రథముచే) వహించు చున్నవి. శేషము పూర్వవత్తు.

అష్టత్రింశానువాకము సమాప్తము.

———

అనువాకము ౩౯.

౧౩౩. అసావిసోమ ఇంద్రతే శవిష్ఠధృష్ణవాగహి ఆత్వాపృణక్త్వింద్రియగ్ంరజః సూర్యం నరశ్మిభిః ఉపయామగృహీతోఽసీంద్రాయత్వా షోడశిన ఏష

తేజోనిరింద్రాయత్వా షోడశినే ॥

౧ అతిశయముగ బలవంతుఁడగు నోయింద్రా ! నీకై సోమరసము తీయబడినది. దార్ఢ్యవంతుడగు నోయింద్రా ! రమ్ము. కిరణములచే స్వీకరింపబడిన జలము సూర్యునివలె నింద్రియశక్తి నిన్నుఁబూరించుఁగాక. శేషము పూర్వవత్తు.

ఏకోనచత్వారింశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౪౦.

౧౩౪. సర్వస్యప్రతిసీవరీ భూమిస్త్వోపస్థ ఆఽధిత స్యోనాస్మై సుషదాభవయచ్ఛాస్మై శర్మ సప్రథాః ఉపయామగృహీతోఽసీంద్రాయత్వా షోడశిన ఏష తేయోనిరింద్రాయత్వా షోడశినే ॥

౧ ఓ యింద్రుడా ! సమస్తమగు భూతసముదాయము యొక్క ఈ యాభిముఖ్యమును (ఆభిముఖ్యము=ప్రాధాన్యము) నాశనము చేయునట్టి భూమినిన్నుఁ బైభాగమున ధరించుగాక. (ఓ భూమిరా !) ఈ యింద్రుని కొఱకు మంచినివాస స్థానము నిచ్చుదానవు, సుఖమునిచ్చుదానవును కమ్ము. నీయజమానుని కొఱకు విస్తృతికలదాన వైసుఖమునిమ్ము. శేషము పూర్వవత్తు.

చత్వారింశానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము ౪౧

౧౩౫. మహాగ్ం ఇంద్రోవజ్రబాహుః షోడశీశర్మయచ్ఛతు। స్వస్తినోమఘవా కరోతు హంతుపాప్మానం యోఽస్మాన్ద్వేష్టి ఉపయామగృహీతోఽసీంద్రాయత్వా షోడశిన ఏష తేయోని రింద్రాయత్వా షోడశినే ॥

౧ వజ్రము హస్తమందు కలిగినట్టియు షోడశ (౧౬) సంఖ్యనుఁబూరించు స్తోత్ర, శస్త్రములుకలిగినట్టి మహేంద్రుడీ యజమానుని కొఱకుసుఖమునిచ్చుగాక. ఇంద్రుడు మనకుమంగళముఁ జేయుగాక. పాపమును నశింపఁజేయుగాక. ఏపాపము మనలను ద్వేషించుచున్నదో! శేషము పూర్వవత్తు.

ఏకచత్వారింశానువాకము సమాప్తము,

—:-o-:—

అనువాకము ౪౨.

౧౩౬. సజోషా ఇంద్ర సగణోమరుద్భిః సోమంపిబవృత్రహాఞ్ఛూరవిద్వాన్ జహిశత్రూగ్ం రపమృధోనుదస్వాథాభయం కృణుహివిశ్వతోనః ఉపయామగృహీతోఽసీంద్రాయత్వాషోడశినఏష తేయోనిరింద్రాయత్వా షోడశినే ॥

౧ ఓ వృత్రాసురనాశకుడా! ఓ శూరుడా! ఓ యింద్రుడా! ప్రీతిసహితుఁడవును, మరుత్తుల సంఘముతోఁ గూడిన నీవు (యజమానునిభక్తిని) తెలిసికొనిన వాడవై సోమమునుద్రావుము. (మమ్ము జంపుటయందు సన్నద్ధులైన) శత్రువులఁ

జంపుము. ఇతర శత్రువులఁ బోఁగొట్టుము. పిమ్మట మాకంతటను భయము లేకుండు నట్లుగాఁ జేయుము. శేషము పూర్వవత్తు.

ద్విచత్వారింశానువాకము సమాప్తము.

---

అనువాకము ౪౩.

౧౩౮. ఉదుత్యం జాతవేదసం దేవంవహంతి కేతవః దృశే విశ్వాయసూర్యమ్ ౨ చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః ఆ౽ప్రా ద్యావాపృథివీ అంతరిక్షగ్ం సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ ౩ అగ్నేనయ సుపథారాయే అస్మాన్విశ్వాని దేవవయునానివిద్వాన్ యుయోధ్యస్మ జ్జుహురాణమేనో భూయిష్ఠాంతే నమఉక్తిం విధేమ ౪ దివంగచ్ఛసువః పత ౫ రూపేణ ॥

౧ కిరణములు అగ్నిసమానుఁడగు సూర్యదేవుని సమస్త ప్రపంచముయొక్క దృష్టికొఱకు నూర్ధ్వప్రదేశమునందే పొందించుఁగాక. ౨ అనేకములైన రంగులు కలిగినట్టియు, సమస్తజగత్తునకుఁ జక్షుస్థానీయములైనట్టి కిరణములయొక్క మండలము ఉదయమునుఁ బొందుచున్నది. ఆమండలమందున్న సూర్యుఁడు జంగమప్రపంచమునకు, స్థావరప్రపంచమునకు నాత్మయగుచు ద్యులోక, భూలోకములను, అంతరిక్షలోకమును నిండించెను. (జంగమము = కదలునట్టి పశుపక్ష్యాదికము. స్థావరము = కదలని వృక్షాదికము.) ౩ ఓ యగ్నీ ! పరలోకసంబంధియగు ధనము పొందుట

కొఱకు మమ్ము మంచిమార్గముద్వారానడిపించుము. ఓ దేవా ! (నీవు) సమస్త మార్గములను దెలిసికొనుచున్నావు. కుటిలమయిన యీపాపమును మానుండి యెడముగాఁ జేయుము. నీకొఱకు నమస్కారవచనమునుఁ జేతుము. ౪ (ఓ బంగారమా ! నీవు) ఆకాశముఁ గూర్చిపొమ్ము. (పిమ్మట) స్వర్గలోకమునుఁ బొందుము. ౫ ఈ పదము రెండవ పంచాశత్తులోఁ దెలిగింపబడును.

పంచాశత్తు ౨

౧౩౭, వోరూపమభ్యైమి వయసావయః ౨ తుథోవోవిశ్వవేదా విభజతువర్షిష్ఠే
అధినాకే ౩ ఏతత్తే అగ్నేరాధఐతి సోమచ్యుతంతన్మిత్రస్య పథానయ
ఋతస్య పథాప్రేతచంద్రదక్షిణా యజ్ఞస్యపథా సువితానయంతీ ౪ బ్రా
హ్మణమద్య రాధ్యాసమృషిమార్షేయం పితృమంతం పైతృమత్యగ్ం
సుధాతుదక్షిణం ౫ విసువఃపశ్య వ్యంతరిక్షం యతస్వసదస్యైః ౬ అస్మ
ద్దాత్రాదేవత్రాగచ్ఛత మధుమతీః ప్రదాతారమావిశతానవహాయాస్మా
న్దేవయానేనపథేత సుకృతాం లోకేసీదత తన్నఃసగ్ంస్కృతమ్ ॥

౧ (ఓ దక్షిణలారా !) ఈ కోమలమగు బంగారముయొక్క రూపముచే (వేదికదక్షిణభాగము నందున్నమీయొక్క) కోమలరూపమునుఁ బొందుచున్నాను. ౨ (ఓ దక్షిణలారా !) మిక్కిలివృద్ధినొందిన స్వర్గమునందున్నవాఁడును, సర్వజ్ఞుఁడు నగు తుథుఁడనుదేవుఁడు మిమ్ముఁ దగునట్లుగా విభాగము చేయుఁగాక. ౩ ఓయగ్నీ ! నీసమృద్ధికిఁ గారణమైనట్టియు, సోమయాగమునంగు ప్రాప్తమై యీదక్షిణాద్రవ్యము వచ్చుచున్నది. ఆ యీద్రవ్యమును శాంతుఁడవగుచు నీమార్గమునుఁ బొందించుము, మంచినడకగల యజ్ఞపురుషునియొక్క మార్గముచే (దక్షిణప్రదేశమునుండి యుత్త

౯ప్రదేశమునకుఁ) బొందించబడుచున్న బంగారు మొదలగు ద్రవ్యములారా! సత్యము యొక్క మార్గమున బాగుగాఁ బ్రవర్తించుఁడు. ౫. ఈ యజ్ఞమునందు వేదార్థమును దెలిసికొనునట్టియు, వేదార్థవేత్తయొక్క కుమారుఁడైనట్టియుఁ, దండ్రిచే బాగుగా శిక్షింపబడినట్టియు, బాగుగా శిక్షణనుఁ బొందిన పతివ్రతయొక్క కుమారుఁడైనట్టియు శ్రేష్ఠమగు బంగారము దక్షిణగాకల బ్రాహ్మణుని (అత్రివంశజుని) బంగారముచే సంతోషపెట్టుదును. ౬. (ఓ యజమానుడా! స్వర్గముచు విశేషముగా జూడుము. ఆకాశమును విశేషముగా జూడుము. సభయందున్న బ్రాహ్మణులతోఁ గూడ ప్రయత్నము చేయుము. ౭. (ఓ దక్షిణలారా!) మాచే నివ్వబడిన వారగుచు ఋత్విజులను చేరుఁడు. ఓ గోవులారా! తియ్యని పాలతో గూడుకున్న వారగుచు (పరలోకమునందు) యజమానుని (మఱియొక రూపముచే) ప్రవేశించుడు. మమ్ము విడచి పుణ్యవంతులయొక్క (అర్చిరాది) మార్గముచే బొందుడు. (వెళ్లి) పుణ్యవంతుల యొక్క స్థానమునందుండుడు. ఆస్థానము మీకొఱకు (అనుభవించుటకు యోగ్యమగునట్లుగా) సంస్కరింపఁ బడినది.

త్రిశత్వారింశానువాకము సమాప్తము.



అనువాకము ౪౪.

౧౩౯. ధాతారాతిః సవితేదంజుషంతాం ప్రజాపతిర్నిధిపతిర్నో అగ్నిః। త్వష్టావిష్ణుః ప్రజయాసగ్ం రరాణో యజమానాయ ద్రవిణందధాతు ౹ సమింద్రణో మనసా నేషిగోభిః సగ్ం సూరిభిర్మఘవన్ త్సగ్ం స్వస్త్యా సంబ్రహ్మణా దేవకృతం యదస్తి సం దేవానాగ్ం సుమత్యా యజ్ఞియానామ్

3 సంవర్చసాపయసా సంతనూభి రగన్మహి మనసాసగ్ం శివేనత్వష్టా నో అత్రవరివః కృణోతు ।

౧ దానము చేయు స్వభావముగల బ్రహ్మయు, సూర్యుడును, నవనిధులనుం బాలించునట్టి ప్రజాపతియు, నగ్నియు, త్వష్టయు, విష్ణువునగు నాల్గురు దేవులు మాయీ హవిస్సును భక్షింతురుగాక. (ఈ దేవగణము) యజమానుని సంతానముతో బాగుగాం గ్రీడించుచున్నదై యజమానుని కొఱకు ధనమును బోషించుగాక. ౨ ఓ యింద్రుడా! అనుగ్రహముతో గూడుకొనిన మనస్సుచే మమ్ము నావులతోం గూర్పుము. హోత మొదలగు విద్వాంసులతో గలుపుము. ఓయింద్రుడా! క్షేమముతోం గూర్పుము (అర్థజ్ఞానసహితమగు) వేదముచే దేవతల కొఱకుం జేయంబడిన కర్మయేది కలదో, ఆకర్మతోం గూర్పుము. యజ్ఞసంబంధులగు దేవతల యనుగ్రహబుద్ధితోం గూర్పుము. 3 (మేము దేవతానుగ్రహమువలన) బలముతోను బలమునకుం గారణమగు పాలతోను, శోభనశరీరములతోను, మిక్కిలి శ్రద్ధగల మనస్సుతోను కలిసికొంటిమి. ప్రజాపతిదేవుడు మాకీకర్మయందు గోరదగిన ధనమును జేయుగాక. శరీరములను శుద్ధి చేయుగాక. పాపమేదికలదో దానినిగూడ శుద్ధిచేయుగాక.

పంచాశత్తు ౨

౧౦౦. అనుమార్ష్టు తనువో యద్విలిష్టమ్, (౧) యదద్యత్వా ప్రయతియజ్ఞే అస్మిన్నగ్నే హోతారమవృణీ మహీహ। ఋధగయాడృధగుతాశమిష్ఠాః ప్రజానన్యజ్ఞముపయాహివిద్వాన్ (౨) స్వగావో దేవాః సదనమకర్మయ ఆజగ్మ సవనేదంజుషాణాః। జక్షివాగ్ంసః పపివాగ్ం సశ్చవిశ్వేzస్మే ధత్తవసవో వసూని (3) యానావహ ఉశతో దేవ దేవాన్త్సాన్ ॥ ౨॥

౧ ఓ యగ్నీ! ఏకారణమువలన నీదినమున ఈయజ్ఞముజరుగు చుండఁగా నిన్నుహోత (యజ్ఞనిష్పాదకుని) గాఁగోరితిమో! ఆహేతువుచే సమృద్ధమగునట్లుగా యాగమునుఁజేసితివి (మరియు) మాకువిఘ్నశాంతిని జేసితివి. (కావుననీవు) మాభక్తినిఁదెలిసికొనిన వాఁడవగుచు నీయజ్ఞమునుఁబొందుము. ౨ ఓదేవతలారా! ఏమీరు సంతోషించినవారై యీమూఁడు సవనములనుఁగూర్చి వచ్చితిరో! ఆమీస్థానమును స్వాధీనముగాఁజేసితిమి. మీరందరును సవనీయపురోడాశములను భక్షించినవారును, సోమమునుఁబానము చేసినవారునగుచున్నారు. ఓపశువులారా! (మీరు) మాయందు ధనములనుస్థాపించుడు 3 ఈవాక్యార్థము ౪వ పంచాశత్తులో వ్రాయబడును.

పంచాశత్తు ౯.

౧౦. ౧ ప్రేరయస్వ అగ్నేసధస్థే వహమానాభరమాణా హవీగ్ంషివసుంఘర్మం దివమాతిష్ఠతాను ౨ యజ్ఞయజ్ఞం గచ్ఛయజ్ఞపతిం గచ్ఛస్వాంయోనిం గచ్ఛస్వాహై 3 మతేయజ్ఞోయజ్ఞపతే సహసూక్తవాకః సువీరఃస్వాహా ౪ దేవాగాతు విదోగాతుం విత్వాగాతు మితమనసస్పత ఇమంనోదేవదేవేషు యజ్ఞగ్ంస్వాహా వాచిస్వాహా వాతేధాః॥

౧ ఓయగ్నిదేవుఁడా! హవిస్సులఁగోరుచున్నట్టి యేదేవతలఁబిలిచిన వాఁడవగుచుంటివో! ఆదేవతలను (కూడానివసించుటకు) స్వకీయస్థానమునందుఁబ్రేరణచేయుము. ఓదేవతలారా! హవిస్సులను (రథాదులచేఁ) బొందించువారును, పోషించుచున్నవారునైజగన్నివాస కారణుఁడగు సూర్యునిఁబొందుడు. పిమ్మట స్వర్గలోకమునుం బొందుడు ౨ ఓయజ్ఞమా! (నీవునీప్రతిష్ఠకొఱకు) యజ్ఞనామకుఁడగు విష్ణుమూర్తిని బొందుము. (ఫలమునిచ్చుటకై) యజమానునిఁబొందుము. (నీవుపుట్టుటకుఁ) గారణమగు (వాయువుయొక్క క్రియాశక్తినిఁ) బొందుము. నీకిది హుతమగుఁగాక.

౩ ఓయజమానుఁడా! ఈయనుష్ఠింపఁబడుచున్న నీయజ్ఞము స్తోత్రములతోఁగూడుకొనినదియుఁ, గర్మయందు నేర్పరులగు ఋత్విజులుకలదియు నగుచున్నది. కావున (నీయాజ్యమునీచే) హోమము చేయబడిన దగుఁగాక. మార్గముఁ దెలిసికొనిన యో దేవతలారా! మీయాగమనమార్గమును దెలిసికొని, యజ్ఞమునసమాప్తి చేయఁబడినదగుచుండగా, (మరలనా) మార్గమును గూర్చియే వెళ్లుఁడు. మనస్సునకు ప్రభువగు నోపరమేశ్వరుఁడా! మాయీయజ్ఞమును మొదట దేవతలందుస్థాపించుము. (పిమ్మట) క్రియాప్రవర్తకుడగు వాయుదేవునియందుస్థాపించుము.

చతుశ్చత్వారింశాను వాకము సమాప్తము

—*—

అనువాకము ౪౫.

౧౪.౨. ఉరుగ్ంహిరాజా వరుణశ్చకార సూర్యాయ పంథామన్వేత వాఉఅపదే పాదాప్రతిధాతవే zకరుతాపవక్తా హృదయావిధశ్చిత్ ౨ శతంతేరాజన్ భిషజః సహస్రముర్వీగమ్భీరా సుమతిష్టేఅస్తు బాధస్వద్వేషోనిరృతింపరాచైః కృతంచిదేనః ప్రముముగ్ధ్యస్మత్ 3 అభిష్ఠితో వరుణస్య పాశో ౪ zగ్నే రనీకమపఆవివేశ అపాంస పాత్రృతి రక్షన్నసుర్యం దమే దమే ॥

౧ వరుణరాజే సూర్యునిఁగ్రమముగాఁ బొందుటకొఱకు నిరాధారమగు నంతరిక్షమునందు విపులమగు మార్గము నేకారణమువలనఁజేసెనో! ఆహేతువువలనమాకుఁగూడ పాదమునుంచుటకై మార్గమునుఁజేయుఁగాక. మఱియు నెవండు శత్రువుల నిందించువాఁడో! ఎవండుశరీరమునుఁ గొట్టువాఁడో! (వాఁడునుప్రతిబంధ

కమునుఁజేయకుండుఁగాక. మార్గమునుఁజేయుఁగాక (అనితా) ౨ ఓవరుణరాజా! నీకనేకవేలసంఖ్యకల (మాయుపద్రవమును బోఁగొట్టు)వైద్యులుండిరి. కావునవిపులమైనదియు, నాదరయుక్తమునగు ననుగ్రహాబుద్ధి (నీకు) మాయందుండుఁగాక. శత్రువులను భాధించుము, యజ్ఞమును నశింపఁజేయుదానిని తిరస్కరించుము. (మాచేఁ) జేయంబడినదైనను ఈపాపమును మానుండి విడిపించుము. ౩ వరుణుని పాశము (పాదాక్రమణముచేఁ) దిరస్కరించఁబడినది. (జలమునందుండునదియు, సూక్ష్మమయిన దారముమాదిరిగా నుండునదియు, బంధించుటకుఁ గారణమయినదియునగు జీవవిశేషము — వరుణపాశమని — భాష్యము.) ౪ అగ్నిముఖము ఉదకములనుఁ బ్రవేశించెను. "అపాంనపాత్" అనిపేరుకల్గినట్టి యోయగ్నీ! ఆయాగృహమునందు రాక్షసులచేఁ జేయబడిన యాగవిఘ్నమునుఁబోఁగొట్టి, (యజ్ఞమును) రక్షించుచున్నవాడవై ప్రజ్వలించుటకు సాధనమగు నాజ్యమును కలిసికొనునట్లుగాఁజేయుము. నీనాలుక యాజ్యమునుఁ గూర్చిసన్నద్ధమగుఁగాక.

పంచాశత్తు ౨.

౧౪౩. సమిధంయక్ష్యగ్నే ప్రతితేజిహ్వా ఘృతముచ్చరణ్యే ౧ త్సముద్రేతే హృదయ
మప్స్వన్తః। సన్త్వావిశన్త్వోషధీరుతాఽఽపో యజ్ఞస్యత్వాయజ్ఞపతే హవిర్భిః
సూక్తవాకేనమోవాకే విధేమా ౨ వభృథనిచఙ్కుణనిచే రురసిసిచఙ్కుణా
వదేవైర్దేవకృత మేనోఽయాడవ మర్త్యైర్మర్త్యకృత మురోరానోదేవరిష
స్వాహి ౩ సుమిత్రాన ఆపఓషధయః॥

౧ ఓ జుహూ! నీబలము సముద్రసమానములగు నుదకములతో మధ్యనుండుఁగాక. - ఓషధులునిన్ను బాగుగాఁబ్రవేశించుఁగాక. ఉదకములు ప్రవేశించుఁగాక. ఓ యజమానుఁడా! (నీ) హవిస్సులచే (దేవతలఁ దృప్తిపఱచి) నిన్ను సూక్తవాక నమోవాకములచేఁ జెప్పఁబడినఫలము నందుంతుము. ("ఇదంద్యావాపృథివీ"

ఇత్యాది మంత్రము సూక్తవాకమనియు, "నమోవాచేయాచోదితా" ఇత్యాదిమంత్రము నమోవాకమనియు వివేకము.) ౨ అవభృధ కర్మనభిమానించునట్టి యో వరుణుడా! (రాక్షసులను భయపెట్టుటకు) బాగుగధ్వనిచేసిన వాఁడవగుచున్నావు. (మారక్షణకొఱకు రహస్యముగా) సంచరించు స్వభావము కలవాడవగు చున్నావు. రాక్షసుల భయమునకై ధ్వనిచేసిన యో వరుణుడా! దేవతల విషయమై (మాచే) చేయఁబడిన యపరాధము నా దేవతలతోఁ గూడ (నీవు) నశింపఁజేయుము. మనుజుల విషయమై చేయఁబడిన యపరాధమును మనుజులతోఁ గూడ నశింపఁజేయుము. ఓ దేవా! అధికమగు (దేవ - మనుజకృత) హింసనుండి యంతటను మమ్ము రక్షించుము. 3 ఈ వాక్యార్థము 3వ పచాంశత్తులో వ్రాయఁబడును. (అవబృధము = యజ్ఞాంతమందుఁ జేయుస్నానము.)

పంచాశత్తు 3.

౧౪౫. సంతుదుర్మిత్రాస్తస్మై భూయాసుర్యోఽస్మాన్ద్వేష్టి యంచవయంద్విష్మో

౨ దేవీరాపఏషవోగర్భస్తం సుప్రీతగ్ం సుభృత మకర్మదేవేషునః

సుకృతోబ్రూతా 3 ప్రతియుతో వరుణస్యపాశః ప్రత్యస్తోవరుణస్య

పాశ ౪ ఏధోఽస్యేధిషీమహి సమిదసి తేజోఽసి తేజోమయిధేహ్యాపో

అన్వచారిషగ్ం రసేనసమసృక్ష్మహి పయస్వాగ్ం అగ్నఆఽగమంతంమా

సగ్ంసృజ వర్చసా ॥

౧ ఉదకములు, ఓషధులు, నాకు మంచిమిత్రములై యుండుగాక. ఎవఁడు మమ్ము ద్వేషించుచున్నాఁడో! ఎవనిని ద్వేషించుచున్నామో! వానికొఱకు మిత్రములుకానివై (శత్రువులై) యుండుఁగాక. ౨ దేవతాస్వరూపులగు నో యుదకములారా! ఈ వరుణుఁడు మీయొక్క గర్భమువలె లోపలనుండెను. కావున మీరక్షణ

ముకొఱకు నావరుణుని హవిస్సుచే బాగుగా సంతోషించిన వానిగాను, బాగుగాఁ బోషింపబడిన వానినిగాను, మేము చేసితిమి. ఆ వరుణుఁడు మమ్ము మంచియనుష్ఠానము చేయువానినిగాఁ బలుకుఁగాక. ౩ వరుణుని పాశము వేరుగాఁ జేయఁబడినది. వరుణుని పాశము నశింపఁజేయఁబడినది. ౪ ఓ సమిధా! వృద్ధికిఁ గారణమగుచున్నావు. (కావునమేము) వృద్ధినొందితిమి. ఇంధనమునకు సాధనమగుచున్నావు. కాంతికి సాధన మగుచున్నావు. కాంతిని నాయందుస్థాపించుము. ఉదకమునుఁబొంది (యవభృథకర్మ) ననుష్ఠించినవాడ నగుచున్నాను. ఫలముతోఁ గలిసికొనిన వాడనగుచున్నాను. ఓ యగ్నీ! పాలయొక్క సమృద్ధితో గూడినవాఁడనై వచ్చితిని. అటువంటి నన్ను బలముతోఁగలుపుము.

పంచచత్వారింశానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౪౬.

౧౪౫. యస్త్వాహృదాకీరిణా మన్యమానోఽమర్త్యం మర్త్యోజోహవీమి। జాతవేదో యశో అస్మాసు ధేహి ప్రజాభిరగ్నే అమృతత్వమశ్యామ్। ౨ యస్మైత్వగ్ం సుకృతేజాతవేద ఉలోకమగ్నే కృణవఃస్యోనమ్। అశ్వినగ్ం సపుత్రిణం వీరవన్తం గోమన్తగ్ం రయిం నశతేస్వస్తి। ౩ త్వేసుపుత్రశవసోఽవృత్రన్కామకాతయః। నత్వామిన్ద్రాతిరిచ్యతే। ౪ ఉక్థఉక్థేసోమ ఇన్ద్రమమాద నీథేనీథే మఘవానమ్॥

౧ ఓ యగ్నీ! నేను మర్త్యుఁడనగుచు గుణముగొనియాడు స్వభావముగల మనస్సుచే నిన్ను మరణములేనివానినిగాఁ దలచుచున్నవాడనై పిలుచుచున్నానో,

అటువంటి మాయందుఁ పుత్రపౌత్రాదిరూప సంతానములచే (సంపాదింపబడిన) కీర్తినుంచుము ఓ యగ్నీ ! (నీయనుగ్రహమువలన) దేవభావమునుఁ బొందుదును. ౨ ప్రపంచమును తెలిసికొనిన యో యగ్నీ ! మంచికర్మను చేసిన యజమానుని కొఱకు సుఖముఁగలుగ జేయు స్థానమునుఁజేయుచున్నావు. ఆ యజమానుఁడు శూరులగు భటులతోను, గోవులతోను కూడుకొనినదియును, పుత్రసమేతమునగు ధనమును బాగుగాఁ బొందుచున్నాడు. 3 బలమునుఁబుత్రుఁడవగు (బలము అనుపదార్థము నుండిపుట్టినందున) నో యింద్రుఁడా ! మాస్తోత్రములు నీయందు బాగుగానున్నవి. ఒకస్తుతినిన్నతిక్రమించుటలేదు. ౪ ఈ వాక్యార్థము రెండవ పంచాశత్తులో వ్రాయబడును.

పంచాశత్తు ౨.

౧౪౬. సుతాసః యదీగ్ంసబాధః పితరంనపుత్రాః సమానదక్షా అవసేహవన్తే। ౨ అగ్నేరసేన తేజసాజాతవేదోఽరోచసే। రక్షోహాఽమీవచాతనః। అపో అన్వచారిషగ్ం రసేనసమసృక్ష్మహి పయస్వాగ్ం అగ్నఆఽగమంతంమాసగ్ం సృజవర్చసా 3 వసుర్వసుపతిర్హి క ౧ స్యగ్నే విభావసుః। స్యామ తే సుమతావపి। ౪ త్వామగ్నే వసుపతిం వసూనామభిప్రమన్దే॥

౧ సోమయాగమందున్నట్టి యా యా శస్త్రమునందా సోమమింద్రుని సంతోషపెట్టెను. సమానులగు యజమానులలో నేర్పరులును, (పుత్రస్థానీయులునగు) యజమానులు (పితృస్థానీయుడగు) నింద్రుని పుత్రులు తండ్రినివలెనా యా యాగప్రదేశమందు రక్షించుటకైఁ బిలుచుచున్నారు. యేకారణముచే (నాహ్వానింప బడిన యింద్రుడు శత్రువులవిషయమై) బాధచేయువాడో ! ౨ ఓ యగ్నీ ! (యాగప్రదేశమునందు) రాక్షసులకు నాశకుఁడవును (శరీరమునందలి) ఆంతరరోగమునకు నాశకుడవునగు నీబలముతో మమ్ము గలుపుము. తేజస్సుచే విశేషముగఁ బ్రకాశించు

చున్నావు. శేషము పూర్వము క్తము ౩ ఓ యగ్నీ ! యేకారణమువలన (నీవులోక ములను) నివసింపఁ జేయువాడవు, ధనస్వామివి, తేజస్సు ధనముగాఁగలవాడవు నగు చుంటివో (ఆ హేతువువలన) మేముకూడ నీయనుగ్రహ బుద్ధియందుండిన వారలము కాగలము! ౭ దీనియర్థము ౯వ పంచాశత్తులో వ్రాయబడును.

పంచాశత్తు ౩.

౧౮౭. అధ్వరేషురాజన్ త్వయావాజంవాజయంతో జయేమాభిష్యామ పృత్సు తీర్మర్త్యానామ్। ౨ త్వామగ్నేవాజసాతమం విప్రావర్ధన్తిసుష్టుతమ్। సనోరాస్వసువీర్యమ్। ౩ అయంనో అగ్నిర్వరివః కృణోత్వయం మృధఃపురఏతు ప్రభిన్దన్। అయగ్ంశత్రూఞ్జయతు జర్హృషాణోఽయంవాజంజయతు వాజసాతౌ। ౪ అగ్నినాఽగ్నిఃసమిధ్యతే కవిర్గృహపతిర్యువా। హవ్యవాడ్ జుహ్వాస్యః ౫ త్వగ్ంహ్యగ్నే అగ్నినా విప్రోవిప్రేణసన్త్సతా। సఖాసఖ్యాసమిధ్యసే। ౬ ఉదగ్నేశు చయస్తవ విజ్యోతిషా॥

౧ ఓ ప్రకాశించుచున్న యగ్నీ ! యాగములందు ధనములలో (నున్న) శ్రేష్ఠధనములకుఁ బ్రభువగునిన్ను అధికముగ సంతోషపెట్టుచున్నాను. అన్నమును గోరుచున్న (మేము నీయనుగ్రహముచే) నన్నమును జయించుచున్నారము. విరోధులగు మనుజులయొక్క సేనలనుఁదిరస్కరించుటకు సమర్థులముకాగలము. ౨ ఓ యగ్నీ! అతిశయముగ నన్నమునిచ్చునట్టియు, స్తోత్రములచే బాగుగా స్తోత్రము జేయఁబడుచున్న నిన్ను యజమానులభివృద్ధిని బొందించుచున్నారు. అగువంటినీవు మాకుమంచి సామర్థ్యమునిమ్ము. ౩ ఈయగ్ని మాకుఁబరిచర్యఁ జేయునట్టిభృత్యసముదాయమును సంపాదించుగాక. ఈ యగ్ని శత్రువులను బద్ధలుచేయుచున్న వాఁడై (మాకు

యెదుటఁబోవుగాక. ఈయగ్ని కొట్టుచున్నవాఁడై శత్రువులను జయించుగాక. అన్న దాననిమిత్తమై యితరుల యన్నమును జయించుగాక. ౪ విద్వాంసుఁడును, గృహములకుస్వామియు, యువకుఁడును (దేవతలకొఱకు) హవిస్సునుఁ బొందించువాఁడును నాలుకముఖముగా గలవాఁడునగు (పూర్వమునందున్న) నగ్ని (పిమ్మటనుంచబడిన) అగ్నిచే బాగుగాఁ బ్రజ్వలించుచున్నాఁడు. ౫ ఓ పూర్వాగ్ని పిమ్మరుంచబడినయగ్ని చేఁబాగుగాఁ బ్రకాశించుచున్నావు. అటువంటి నీవు సన్మార్గమందున్న బ్రాహ్మణ జాతిచే బ్రాహ్మణుఁడవు, స్నేహితునిచే స్నేహితుడవు నగుచున్నావు. ౬ "ఉదగ్నే" అను మంత్రము "త్వమగ్నేరుద్రః" అను యనువాకమునందును, "విద్యోతిషా" అను మంత్రము "కృణుష్వపాజః" అను యనువాకమునందును, వాఖ్యాతములు

ఇట్లు ప్రథమాష్టకమునఁ జతుర్థ ప్రపాఠము సమాప్తము.

—*0*—

# పంచమప్రపాఠకము.



## అనువాకము ౧.

౧౪౮. దేవాసురాస్సంయత్తా ఆసన్తే దేవావిజయముపయన్తోఽగ్నౌ వామంవసుసం
న్యదధతేదమునో భవిష్యతి యదినోజేష్యన్తీతి తదగ్నిర్న్యకామయత తేనా
పాక్రామత్తద్దేవా విజిత్యావరురుత్సమానా అన్వాయన్తదస్య సహసాఽదిత్స
న్తసోఽరోదీద్యదరోదీత్తద్రుద్రస్య రుద్రత్వం యదశ్ర్వశీయత తత్॥

౧ దేవతలు, రాక్షసులు యుద్ధసన్నద్ధులైరి. జయమునుబొందిన యాదేవతలు (ఆయసురులనుండి యపహరించిన) శ్రేష్టమగు ధనమును (ఇకముందు) మనలను రాక్షసులు జయించినచో నీధనముల నీకుపయోగించునని (తలంచి) యగ్నియం దుంచిరి. అగ్నిదేవుఁడాధనముగోరెను. ఆధనముతోఁ గూడపగుగిడెను. దేవతలు (భాగ్యవశముచే రాక్షసులను) జయించి యా ధనము నడ్డగించుటకుఁ గోరికకలవారైయగ్నికి వెనుకనుండి యా ధనమును బలాత్కారముగా గ్రహించుటకిచ్ఛయించిరి. ఆ యగ్నియేడ్చెను. ఏకారణముచే నేడ్చెనో! | ఆ హేతువువలన ఆ రోదనమునుండి రుద్రుఁడు పుట్టెను. (ఇచటఁ బ్రసంగవశమువలన రుద్రశబ్దప్రవృత్తికిఁ గారణము చెప్పఁబడినది.) నేత్రసమీపమునుండి యేబిందువుభూమియందుఁబడెనో! ఆకన్నీటిబిందువురజత (వెండి) రూపమగు ధనమయినది. కన్నీటినుండిపుట్టుటచే నా వెండియను ధనము దక్షిణకుఁ దగినదికాదు. కన్నీటినుండిపుట్టిన యా వెండినియెవఁడు యజ్ఞమునందు దానముసేయునో! అతనిగృహమునందు సంవత్సరమునకంటెఁ బూర్వమునందేరోదన నిమిత్తముకలుగుచున్నది. కావున యజ్ఞమునందు వెండిని దానముసేయరాదు. ౨ మొదటగొప్ప భాగముతోఁ గూడుకొనిన వాడనగుదును.

పంచాశత్తు ౧.

౧౪. రజతగ్ం హిరణ్యము భవత్తస్మాద్రజతగ్ం హిరణ్యమదక్షిణ్య మశ్రుజగ్ం హి యోబర్హిషి దదాతిపురాzస్య సంవత్సరాద్గృహేరుదన్తి తస్మాద్బర్హిషి నదేయగ్ం ౨ సోzగ్నిర బ్రవీద్భాగ్యస్త్వన్యథవ ఇదమితి పునరాధేయం తే కేవలమిత్యబ్రువన్నృధ్నవ్ఖలుస ఇత్యబ్రవీద్యోమద్దేవత్యమగ్నిమాదధాతా ఇతి 3 తంపూషాzధత్తతేన॥

౧ మొదట గొప్పభాగముతోఁ గూడుకొనిన వాడనగుదును. పిమ్మట నీధనమువిూకివ్వ గలనని యా యగ్నికిఁ జెప్పెను. ఆ దేవతలు నీకీపునరాధేయము (పునరాధేయము = హవిస్సు) భాగమని (ఇచ్చిరి) దానిచే సంతోషించిన యగ్ని యీ వాక్యమును పలికెను. ఎవఁడు నేను దేవతగాగల హవిస్సుచేసి నన్ను గూర్చి పునరాధానముచేయునో, వాడుసమృద్ధిమంతుఁడుగదా ! యని (పునరాధానము = కర్మ విశేషము. పునరాధేయము = హవిర్విశేషము.) 3 ఆ యగ్నిని సూర్యుఁడుపునరాధానముచేసెను. దానిచే సూర్యుఁడు పశురూపసమృద్ధినిఁబొందెను కావునఁ బశువులు సూర్య దేవతాకములని చెప్పబడుచున్నవి. ఆ యగ్నినిఁ బ్రజాపతి పునరాధానముచేసెను. దానిచేఁ బ్రజాపతిపశురూపసమృద్ధినిఁ బొందెను. కావునఁబశువులు ప్రజాపతిదేవతాకములని చెప్పఁబడుచున్నవి. ఆ యగ్నిని మనువు పునరాధానము జేసెను. దానిచే సంతానసమృద్ధినిఁ బొందెను. కావునఁ బ్రజలు "మనుసంబంధుల" నిచెప్పఁబడుచున్నారు. ఆయగ్నిని బ్రహ్మదేవుఁడు పునరాధానముచేసెను. దానిచే బ్రహ్మసంతానరూపమగు సమృద్ధినిఁ బొందెను. బ్రహ్మసంవత్సరాభిమాని యగు దేవత కావునఁ బ్రజలు, పశువులు, సంవత్సరముననుసరించి బుట్టుచున్నారు.

పంచాశత్తు ౩.

౧౫౦. పూషాఽఽర్ధ్నోత్తస్మా త్పూష్ణాః పశవ ఉచ్యన్తేతంత్వష్టాఽ ధత్త తేనత్వష్టాఽఽ ర్ధ్నోత్తస్మాత్త్వాష్ట్రాః పశవఉచ్యన్తేతం మనురాఽధత్త తేన మనురార్ధ్నోత్త స్మాన్మానవ్యః ప్రజాఉచ్యన్తేతం ధాతాఽధత్త తేన ధాతాఽఽర్ధ్నోత్సంవత్స రోవైధాతాతస్మాత్సం వత్సరం ప్రజాః పశవోఽను ప్రజాయన్తే ౨ యఏవం పునరాధేయస్యర్ధిం వేద॥

౧ ఈవాక్యార్థము వెనుకటి రెండవపంచాశత్తులోని మూడవ వాక్యమునం దువ్రాయబడినది. ౨ ఏవఁడీవిధముగాఁ బునరాధేయముయొక్క సమృద్ధిని తెలిసి కొనునో, (వాఁడును) సమృద్ధినొందును.

పంచాశత్తు ౪

౧౫౧. ఋధ్నోత్యేవ ౧ యోఽస్యైవం బన్ధుతాంవేద బన్ధుమాన్భవతి ౨ భాగ ధేయంవా అగ్నిరాహిత ఇచ్ఛమానః ప్రజాంపశూన్యజమాన స్యోపదోద్రా వోద్వాస్య పునరాదధీత భాగధేయేనై వైనగ్ం సమర్ధయత్యథో శాన్తి రేవాస్యైషా ౩ పునర్వసోవ్వరాదధీ తైతద్వై పునరాధేయస్య నక్షత్రం యత్పునర్వసూ స్వాయామేవైనం దేవతాయామాధాయ బ్రహ్మవర్చసీ భవతి ౪ దర్భైరాదధాత్యయాతయా మత్వాయ ౫ దర్భై ర్హ్యా దధాత్యద్భ్యశ్చ

ఏవై నమోషధీభ్యోఽవరుధ్యాఽఽధత్తే ౬ పఞ్చకపాలః పురోడాశో భవతి పఞ్చ వా ఋతవ ఋతుభ్య ఏవైనమవరుధ్యాఽఽధత్తే।

౧ ఎవఁడీవిధముగ నగ్నియొక్క బంధుత్వమునుఁ దెలిసికొనునో, వాఁడు బంధువులు కలవాడగును. ౨ (మొదటి యాధానముచే) సంపాదింపబడినయగ్ని యధిక భాగమునుఁ గోరుచున్నవాఁడై యజమానునియొక్క సంతానమును, పశువులనుఁ బీడించెను. మొదటియగ్నినుద్వాసనచేసి, నూతనాగ్నిని మఱల నాధానముఁ జేసినచో దనభాగముచేతనే (యజమానుఁడీ) యగ్నిని సంతోషపెట్టుచున్నాఁడు. మఱియు నీయజమానునకు నీయుపద్రవము యొక్క శాంతియునగుచున్నది. ౩ పునర్వసు నక్షత్రమేదికలదో ! యిదియే పునరాధేయమునకు (విహితమైన) నక్షత్రము (కాలము.) (ఈ పునరాధేయమునకు) స్వకీయమైన నక్షత్రాత్మక దేవతయందీ యగ్ని నాధానము చేసి (యజమానుఁడు) బ్రహ్మవర్చస్సు కలవాఁడగుచున్నాఁడు. (పునర్వసునక్షత్రమునందగ్నిని పునరాధేయము చేయవలయుననియు, నీనక్షత్రము స్వీయ దేవతయనియు, భావము.) ౪ సారముకలిగియుండుటకై (ఈయగ్నిని) దర్భలచే నాధానము చేయవలయును. ౫ అగ్నిని దర్భలచే నాధానము చేయవలయును. (అట్లుచేసినచో దర్భలకుఁ గారణమగు) నుదకములవలన, నోషధులవలనను, ఈ యగ్నినిఁ బొంది (యజమానుఁడు) ఆధానము చేసినవాఁడగుచున్నాఁడు. ౬ (ఈ కర్మయందు ఐదుకపాలములందు సంస్కృతమైన పురోడాశముండవలయును. ఋతువులైదు. (కావున) ఋతువులవలన నీయగ్నినిఁ బొందియాధానముఁ జేసినవాఁడగుచున్నాడు (హేమన్త శిశిర ఋతువులనొకటిగా వివక్షఁజేసి యిచటనైదు ఋతువులని చెప్పఁబడినది.)

ప్రథమాను వాకము సమాప్తము.

— * —

అనువాకము ౨.

౧౫.౨. పరావాఏషయజ్ఞం పశూన్వపతియోఽగ్ని ముద్వాసయతే పఞ్చకపాలః పురో
డాశో భవతి పాఙ్క్తో యజ్ఞః పాఙ్క్తాః పశవో యజ్ఞమేవ పశూనవరున్ధే ౨ వీర
హా వా ఏష దేవానాం యోఽగ్ని ముద్వాసయతే నవా ఏతస్య బ్రాహ్మణా
ఋతాయవః పురాఽన్న మక్షన్పఙ్క్త్యోయాజ్యానువాక్యా భవన్తి పాఙ్క్తో యజ్ఞః
పాఙ్క్తః పురుషో దేవానేవ వీరం నిరవదాయాగ్నిం పునరా॥

౧ ఎవఁడగ్ని నుద్వాసనము చేయునో! ఈతఁడు యజ్ఞమును, పశువులను నశింపఁజేయును. పురోడాశము అయిదు కపాలములందు సంస్కరించఁబడినదగుచున్నది. ధానాదిహవిస్సులచే నిష్పన్నమగు యజ్ఞము పాఙ్క్తము. (పఙ్క్తిఛన్దస్సు పశువుహేతువగుటవలన) పశువులు పాఙ్క్తములు యజ్ఞమును, పశువులను అవరోధము చేసినవాఁడగుచున్నాఁడు (ఉద్వాసనము = ఎత్తివేయుట, ధానములు = ధాన్యవిశేషములు, పాఙ్క్తము = పంక్తిచ్ఛందస్సంబధి, అవరోధము = అడ్డగించుట) ౨ దేవతలలోనగ్ని వీరుఁడు.) ఎవఁడు దేవతలలోన నుద్వాసనము చేయునో, ఈతఁడు వీరహత్య చేసినవాఁడగుచున్నాఁడు. సత్యమును గోఱుచున్న బ్రాహ్మణులు పూర్వమీవీరహత్యజేసిన యజమానుని యన్నమును భోజనము చేయలేదు. పంక్తిచ్ఛందస్సుకల "అగ్నితమద్యాశ్వమి" త్యాది నాలుగు ఋక్కులు యాజ్యానువాక్యలగుచున్నవి. యజ్ఞము పాంక్తము. పురుషుఁడు పాంక్తుఁడు. దేవతలలో నేవీరుడగునగ్నిని (విడచిపెట్టుటవలన వచ్చినదోషమునుండి) వేరుచేసి పునరాధానముఁ జేయవలయును.

పంచాశత్తు ౨

౧౫.౩. ధత్తే ౧ శతాక్షరా భవంతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయు
ష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి ౨ యద్వా అగ్నిరాహితో నర్ధ్యతే జ్యాయో

భాగధేయం నికామయమానోయ దాగ్నేయగ్ం సర్వంభవతి సైవాస్య ర్ధిః 3 సంవాఏతస్యగృహే వాక్సృజ్యతే యోఽగ్నిముద్వాసయతేస వాచగ్ం సగ్ంసృష్టాంయజమాన ఈశ్వరోఽను పరాభవితోర్విభక్తయో భవంతివాచో విధృత్యై యజమానస్యాపరాభావాయ ॥

౧ "ఆగ్నేతమద్య" ఇత్యాదులు నాలుగు ఋక్కులు (౧౦౦) నూరుఅక్షరములు కలవగుచున్నవి. పురుషుఁడు నూరువత్సరములాయువు కలవాఁడును, (పదియింద్రియములు నూరునాడులందు సంచరించుటచే) నూరుఇంద్రియములు కలవాఁడునై (తన) యాయువు నందును, ఇంద్రియములందును ప్రతిష్ఠావన్తుఁడ (ప్రసిద్ధుఁడ) గుచున్నాడు. ౨ గొప్పభాగ్యమును (అదృష్టమును) గోరుచున్నవాఁడైనను యజమానుఁడు అగ్నిరహితుఁడైనచో సమృద్ధిమన్తుఁడ భాగ్యవన్తుఁడ) గుటలేదు. అగ్నిసంబంధియగు సర్వసంపత్తును ఏదికలదో! ఇదియే యీయజమానునకు సమృద్ధి. 3 ఎవడు అగ్నినుద్వాసనము చేయుచున్నాడో! వీనియొక్క వాక్కు-గృహము నందున్నస్త్రీ శూద్రులవాక్కులతోఁ) గలిసికొనుచున్నది. (వారివాక్కుతో సమానమగుచున్నదని తా) ఆవాక్కు-ననుసరించి యజమానుడు ఇతరవైలక్షణ్యరూపమగు నుత్కర్షలేకపోవుటచే) తిరస్కృతుఁడగుచున్నాఁడు ("సమిధో అగ్నిఆజ్యస్యవ్యన్తు" ఇత్యాది ప్రయాజమంత్రములందున్న సంబుధ్యన్తమగు నగ్నిశబ్దమునకుఁ బూర్వమునందున్న సంబుద్ధి, సప్తమీ, తృతీయా, ద్వితీయా, విభక్త్యంతములగు నగ్నిశబ్దముల నీవిధముగాఁ (గర్మకాలమునందుఁ) బ్రయోగించినచో నీవిభక్తులచే బునరాధేయమునకగ్న్యాధేయమునకంటె వైలక్షణ్యముకలుగఁగా యజమానుఁడు విలక్షణుడగునుకావున) నీయజమానుని యొక్క-వాక్కు శుద్ధమయినదగుచుండగాఁ బరాభవము శాంతమగుచున్నది. అని తా. (=విభక్తిప్రయోగము - (౧) అగ్నేఽగ్నే, (౨) ఆగ్నావగ్నే (3) అగ్నినాఽగ్నే (౪) అగ్నిమగ్నే అని ప్రయాజమంత్రములందున్నది.

సమిదో౽గ్నే౽గ్న౽ ఆజ్యస్యవియన్తు ౧.
తనూనపాదగ్నావగ్న ఆజ్యస్యవేతు ౨.
ఇడో౽అగ్నినా౽గ్న ఆజ్యస్యవియన్తు 3.
బర్హిరగ్నిమగ్న ఆజ్యస్యవేతు ౪.

ఇట్లు విభక్తిప్రయోగమని యెఱుంగవలయును.

పంచాశత్తు 3.

౧౫౪. ౧ విభక్తింకరోతి బ్రహ్మైవతదక ౨ రుహాగ్ంశు యజతియథావామం వసు విదానో౽గుహతితాదృగేవ తద 3 గ్నింప్రతిస్విష్టకృతం నిరాహయథావామంవసువివిదానః ప్రకాశం జిగమిషతితాదృగేవత ౪ ద్విభక్తిముక్త్వాప్రయాజేన వషట్కరోత్యాయ తనాదేవనైతి ౫ యజమానోవైపురోడాశః పశవఏతే ఆహుతీ యదభితః పురోడాశమేతే ఆహుతీ॥

౧ (ఎవఁడీపూర్వోక్తవిధముగ) విభక్తివిధానమును ననుష్ఠించుచున్నాఁడో (ఆతఁడగ్న్యాధేయమువలన) నా పునరాధేయమును దృఢముగఁ జేయుచున్నాఁడు. ౨ మంత్రోచ్చారణధ్వని మెల్లగానుండునట్లుగా యాగముఁజేయవలయును. లోకమునందేవిధముగ పురుషుఁడు శ్రేష్ఠమైన ధనమును పొంది నవాఁడై దాచుకొనుచున్నాఁడో, ఈమందమయిన మంత్రోచ్చారణముకూడ నట్టువంటిదే. (యజ్ఞఫలమును జాగ్రతగా దాచుకొనిన వాఁడగుచున్నాఁడు) 3 స్విష్టకృదగ్నినిఁగూర్చి (మంత్రోచ్చారణమును) బిగ్గరగాఁ జేయవలయును. శ్రేష్ఠమయిన ధనమునుబొందిన పురుషుండేవిధముగఁ బ్రసిద్ధిపొందవలయునని కోరుచున్నాఁడో, ఈయుచ్చధ్వని గూడనట్టిదియే (ప్రసిద్ధికలవాఁడగుచున్నాఁడని తా॥)

౯ పూర్వోక్తవిభక్తి ప్రకారమును జెప్పి ప్రయాజమంత్రముచేత వషట్కారపూర్వకముగ యాగముచేయవలయును. ఇట్లు చేసినచో బూర్వోక్త యజమానుఁడు) స్వగృహమునుండి తొలగిపోవుట లేదు. ౫ యజమానుఁడేపురోడాశము. (యజమానునివలె ప్రధానమని తా) ఈ పశువులేయాహుతులు, పురోడాశమునంతట నాహుతులను హోమము చేసినచో (నగ్ని) పశువుల చే యజమానునే యంతటను గ్రహించుచున్నాడు.

పంచాశత్తు ౯.

౧౫౫. జుహోతియజమాన మేవోభయతః పశుభిః పరిగృహ్ణాతి ౧ కృతయజుః సంభృతసంభార ఇత్యాహుర్న సంభృత్యాః సంభారానయజుః కర్తవ్యమిత్య ౨ థోఖలుసంభృత్యా ఏవసంభారాః కర్తవ్యం యజుర్యజ్ఞస్యస మృద్ధ్యై ౩ పునర్నిష్కృతో రథో దక్షిణా పునరుత్స్యూతం వాసః పునరుత్సృష్టోఽన డ్వాన్పునరాధేయస్య సమృద్ధ్యై ౪ సప్తతే అగ్నే సమిధః సప్తజిహ్వా ఇత్య గ్నిహోత్రం జుహోతియత్ర యత్రైవాస్యన్యక్తంతతః॥

౧ "భూమిర్భూమ్నా" ఇత్యాది మంత్రసముదాయము సంపాదింపఁబడిన (సంభారముకలదని విజ్ఞులుచెప్పుచున్నారు. (సంభారములు = సప్తమృద్విశేషములు) (ప్రథమాధానమునందు సంభారములు సంపాదింపఁబడుటవలనను, మంత్రసముదాయముచ్చరింపబడుటవలనను (ఈకర్మయందుఁగూడ) సంభారములు సంపాదింపనవసరము లేదు. మంత్రసముదాయోచ్చారణముచేయ నవసరము లేదు. (అనిపూర్వపక్షము) ౨ పూర్వోక్తసంభారములు సంపాదింపవలయును. మంత్రసముదాయ ముచ్చరింపవలయును. (ఇట్లుచేయుట) యజ్ఞముయొక్క సమృద్ధికొఱకు అగుచున్నది. అథోశబ్దము పూర్వపక్షమునుఁ బోగొట్టునది ఇదిసిద్ధాంతము.) ౩ పునరాధేయము యొక్కసమృ

ద్ధికొఱకు మొదటభగ్నమయి తరువాత దృఢముఁజేయబడినరథము (ఈకర్మయందు) దక్షిణ (మఱియు) మొదటచినిగిపోయి మఱలకుట్టఁబడిన వస్త్రము దక్షిణ. (ఇట్లు) మొదటదుర్బలముగానుండి పిమ్మటఁ బోషణముచే శక్తివన్తమయిన యెద్దుదక్షిణ. ౪ "సప్తతేఅగ్నే" ఇత్యాది మంత్రముచే నగ్నిహోత్రము నుద్దేశించిహోమము చేయవలయును. (ఈ "సప్తతే" అను మంత్రము. అ౧ ప్రశ్న అను౩ పం౨ లో వ్యాఖ్యానము చేయబడును.) (ఇట్లుహోమము చేసినచో) నీపునరాధేయ దేవతయగు నగ్నియొక్క యంగమే యేప్రదేశమునందు మఱువఁబడినదో; ఆప్రదేశమునుండి యంగసహితమగు నగ్నినే (యజమానుఁడు) సంపాదించినవాఁడగుచున్నాఁడు.

పంచాశత్తు ౫.

౧౫౬. ఏవైనమవరున్ధే ౧ వీరహావా ఏష దేవానాం యోఽగ్ని ముద్వాసయతే తస్యవ
రుణ ఏవర్ణయాదాగ్ని వారుణమేకాదశ కపాలమను నిర్వపేద్యంచైవహాన్తి
యశ్చాస్యార్ణయాత్తౌ భాగధేయే నప్రీణాతి నార్తిమార్ఛతి యజమానః॥

౧ ఎవఁడు దేవతలలో నగ్ని నుద్వాసనము చేయునో; వీఁడు వీరహత్య చేసిన వాఁడ (గుచున్నాఁడు.) వానికి వరుణుఁడు ఋణగృహీతునివలెఁ బీడించువాఁడ (గుచున్నాఁడు.) కావుననాదోషము పోవుటకై) (ఆయజమానుఁడు) అగ్నియు, వరుణుఁడు దేవతగాఁగల పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపముచేయవలయును. ఏయగ్నినిఁ జంపుచున్నాఁడో (ఉద్వాసనము చేయుచున్నాఁడో, అని తా) ఏ వరుణుఁడు ఋణగృహీతుని వలెఁబీడించుచున్నాఁడో, వారిద్దరినిఁ బురోడాశభాగముచే యజమానుఁడు సంతోషపెట్టుచున్నాఁడు. బాధనుఁ బొందుటలేదు.

ద్వితీయానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౩.

౧౫౩. భూమిర్భూమ్నా ద్యౌర్వరిణాఽన్తరిక్షం మహిత్వా। ఉపస్థే తే దేవ్యదితేఽగ్నిమన్నాదమన్నాద్యాయాఽఽదధే। ౨ ఆఽయంగౌః పృశ్నిరక్రమీద సన్మాతరంపునః। పితరంచ ప్రయన్త్సువః। ౩ త్రిꣳశద్ధామ విరాజతి వాక్పతఙ్గాయ శిశ్రియే। ప్రత్యస్యవహద్యుభిః। ౪ అస్యప్రాణాదపానత్యన్తశ్చరతి రోచనా। వ్యఖ్యన్మహిషఃసువః। ౫ యత్త్వా॥

౧ ఓ గార్హపత్యప్రదేశమా ! నీవు బాహుళ్యముచే భూలోకస్వరూపమగుచున్నావు. శ్రేష్ఠత్వముచే స్వర్గలోకస్వరూపమగుచున్నావు. మహత్త్వముచే నన్తరిక్షలోకస్వరూపమగుచున్నావు. ఓ భూమీ ! గార్హపత్యప్రదేశరూపమగు నో దేవీ ! నీ తొడయందన్నమును భుజించునట్టి గార్హపత్యాగ్నిని (యజమానునకుఁ దినుటకు యోగ్యమగు) నన్నముసిద్ధించుటకై నాధానముఁ జేయుచున్నాను. ౨ ఈగార్హపత్యాగ్ని (ఆదిత్యరూపముచే) బోవునట్టిస్వభావముకలదియుఁ దెల్లనిరంగుకలదియునై పృథివీరూపమగు తల్లినాక్రమించును. స్వర్గలోకస్వరూపమగు తండ్రినిగొప్పగాఁ బొందెను. ౩ ఆదిత్యరూపమగు గార్హపత్యాగ్నిసంబంధమైన ముప్పది సంఖ్యగల (ముహూర్తరూపమగు) తేజస్సువిశేషముగాఁ బ్రకాశించుచున్నది. రెండుగడియల కాలముహూర్తము వైదికస్తుతివాక్కు పక్షివలె (నాకాశమున సంచరించునాదిత్యు) నాశ్రయించెను. (ఓగార్హపత్యాగ్నీ ) నిన్నుఁగూర్చి యుద్వాపనరూపమైనయే ప్రతికూలకర్మమాచే జేయబడినదో, (దానినినంతయు) విడచి జ్వాలారూపములగు కాంతులచే మాహవిస్సును దేవతలయందుఁ బొందించుము. (ఉద్వాపన = తీసిపారవేయుట) ౪ ఈయాదిత్యుని దీప్తియుచ్ఛ్వాసతుల్యమగు బ్రాణమునుండి నిశ్వాసతుల్యమైన యస్తమయమునుఁ బొందుచున్నదై (ద్యావాభూముల) మధ్యయందుసంచరించుచున్నది. గొప్పనుండ

లమునందున్న యాదిత్యుఁడు (యజమానుల కొఱకు) స్వర్గమునుఁ బ్రకాశింపఁజేసెను.
౫ దీనియర్థముతరువాయి వాక్యమున వ్రాయబడును.



పంచాశత్తు ౨.

౧౫౭. క్రుద్ధఃపరోవప మన్యునాయదవర్త్యా। సుకల్పమగ్నే తత్తవపునస్త్వోద్దీపయామసి। ౨ యత్తేమన్యు పరోప్తస్య పృథివీమనుదధ్వసే। ఆదిత్యావిశ్వేతద్దేవా వసవశ్చ సమాభరన్। ౩ మనోజ్యోతిర్జుషతా మాజ్యం విచ్ఛిన్నం యజ్ఞగం సమిమందధాతు। బృహస్పతి స్తనుతామిమంనో విశ్వేదేవా ఇహమాదయన్తామ్। ౪ సప్తతే అగ్నేసమిధః సప్తజిహ్వాఃసప్త॥

౧ ఓ దక్షిణాగ్నీ ! యేకారణమున కోపముచే నిన్ను యుద్వాసనముఁ జేసితినో, యేదారిద్ర్య దోషముచే నుద్వాసనము చేసితినో, ఓ యగ్నీ ! అదియంతయు నీయనుగ్రహమువలన బాగుగాఁజేయఁబడినదగుగాక. నిన్నుఁ బ్రకాశింపఁజేయుదుము. ౨ ఓ యాహవనీయాగ్నీ ! నాకోపముచే నుద్వాసనముఁ జేయఁబడిన నీయే తేజస్సు భూమినిఁబ్రవేశించి నశింపఁజేయఁబడినదో, ఆ తేజస్సునాదిత్యులు, విశ్వేదేవతలు వసువులు తీసికొందురుగాక. ౩ (ఉద్వాసనాపరాధ పరిహారముకొఱకు) కొనియాడఁదగిన యగ్నియొక్క జ్యోతిస్సు ఆజ్యరూపహవిస్సును సేవించుగాక. విచ్ఛిన్నమైన నీ యజ్ఞమును సంధానముఁ జేయుగాక. బృహస్పతి యీయజ్ఞమును విస్తీర్ణముఁ జేయుగాక. సర్వదేవతలీకర్మయందుఁ దృప్తికలవారగుదురుగాక. ౪ దీనియర్థము తరువాయి వాక్యముతోఁ జేర్చి వ్రాయఁబడును.

పంచాశత్తు 3.

౧౫౭. ఋషయఃసప్తధామ ప్రియాణి సప్తహోత్రాః సప్తధాత్వాయ జన్తిసప్తయో
నీరాపృణస్వాఘృతేన ౨ పునరూర్జానివర్తస్వ పునరగ్న ఇషాZZయుషా పున
ర్నఃపాహివిశ్వతః 3 సహరయ్యానివర్తస్వాగ్నేపి న్వస్వధారయా విశ్వప్స్ని
యావిశ్వతస్పరి ౪ లేకఃసలేకః సులేకస్తేన ఆదిత్యా ఆజ్యంజుషాణా వియ
న్తుకేతః సకేతః సుకేతస్తేన ఆదిత్యా ఆజ్యం జుషాణావియన్తు వివస్వాగ్ం
అదితిర్దేవజూతిస్తేన ఆదిత్యా ఆజ్యంజుషాణావియన్తు॥

౧ ఓ యగ్నీ ! సమిధలునప్త (౭) సంఖ్యకలవి. (అశ్వత్థ, ఉదుమ్బర. పలాశ శమీ, వికంకత, అశనిహత, పుష్కరవర్ణములనునవి.) జ్వాలారూపములగు (కాళీ-కరాళ, మనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణ, స్ఫులింగినీ, విశ్వరుచి, యను) నాలుకలునప్త (౭) సంఖ్యకలవి. (సమిధలను సంపాదించుటకొఱకు) మంత్రములు నప్తసంధ్యకలవి. ప్రియములగు స్థానములు సప్తసంఖ్యకలవి. (ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్ని, సభ్య, ఆవసథ్య, ప్రాజహిత, అగ్నీధ్రయములు) సోమయాగమునందగ్నిని ధరించునవని తా.) హోత్రమొదలగు (హోత, ప్రశస్త, బ్రాహ్మణాచ్ఛంసి, పోత నేష్ట, ఆగ్నీధ్ర, అచ్ఛావాకులనువారు) వషట్కర్తలేడ్గురు. నిన్ను యజమానులేడు విధములుగా యాగము చేయుచున్నారు. అగ్నిష్టోమ, అత్యగ్నిష్టోమ, ఉక్థ్యషోడశి అతిరాత్ర, అప్తోర్యామ, వాజపేయ అని యేడువిధములు ) అటువంటి నీవు ఏడు ఆహవనీయాది) స్థానములనాజ్యముచేఁ బూరించుము. ౨ ఓ యగ్నీ ! (నీవు నాచేనుద్వాసనము చేయఁబడినవాఁడవైనను) పాలు మొదలగు రసములతోఁగూడ (నిచ్చుటకు) రమ్ము. అన్నముతోను, ఆయువుతోను, కూడమఱలరమ్ము. మాటిమాటికిఁ జేయఁ

బడిన సమస్తాపరాధములనుండి మమ్ము రక్షించుము. 3 ఓ యగ్నీ ! ధనముతోఁ గూడ రమ్ము. ప్రపంచమునకు జీవనాధారమయిన వర్షధారచేఁ దృణధాన్యలతా వృక్షములకుఁ బైభాగమునఁ దడుపుము. ౪ లేక- సలేక- సులేక- అను ప్రసిద్ధులయిన యాదిత్యులు సంతోషించుచున్నవారై మాయాజ్యమునుఁ ద్రావుదురుగాక. కేత- సకేత- సుకేత- అను ప్రసిద్ధులయిన యాదిత్యులు సంతోషించుచున్నవారై మాయాజ్యమును ద్రావుదురుగాక. వివస్వన్తుడు- అదితి, దేవజాతి యను ప్రసిద్ధులైన యాదిత్యులు సంతోషించుచున్నవారై మాయాజ్యమునుఁ ద్రావుదురుగాక.

తృతీయానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౪.

౧౮౭. భూమిర్భూమ్నా ద్యౌర్వరిణేత్యాహాఽఽశిషైవైన మాధత్తే ౧ సర్పావై జీర్యన్తోఽమన్యన్త సఏతంక సర్ణీరః కాద్రవేయో మన్త్రమపశ్యత్తతో వై తే జీర్ణాస్తనూరపాఘ్నత సర్పరాజ్ఞియా ఋగ్భిర్గార్హపత్యమాదధాతి పునర్నవమేవైనమజరంకృత్వాఽఽధత్తేఽథోపూతమేవ 3 పృథివీమన్నాద్యంనోపానమత్తైనతమ్॥

౧ "భూమిర్భూమ్నాద్యౌర్వరిణా" అను మంత్రముచే నన్నముఁ బొందవలయునను కోరికచేతనే ఈయగ్నినాధానము చేయవలయును. ౨ సర్పములు ముసలితనమునుఁ బొందినవై (ఈముసలితనమెట్లుపోవునా !) యని విచారించినవి. అప్పుడు

కసర్ణీరుఁడను కద్రూపుత్రుఁడు "భూమిర్భూమ్నా" ఇత్యాదిమంత్రసముదాయమును (ముసలితనమునుబోగొట్టు దానినిగాఁ) జూచెను. ఆమంత్రసామర్థ్యమువలన నాసర్పములు ముసలిచర్మము విడనాడి నూతన చర్మములను బొందినవి. (కావున) సర్పములకు రాణియగు భూమియొక్క మంత్రములచే గార్హపత్యాగ్ని నాధానము చేయవలయును. (భూమికి మంత్రము వేఱుగానున్నది.) (ఇట్లుచేసినచో) మఱల నూతనమగునగ్నిని ముసలితనములేనివానిగాఁ జేసెసిపిమ్మటఁ బవిత్రవంతునిగాఁ జేసినట్లగును. ౩ దీనియర్థము తరువాయి వాక్యములో వ్రాయఁబడును.

—:-o-:—

పంచాశత్తు ౨.

౧౬౦. మన్త్రిమపశ్యత్తతో వై తామన్నాద్యముపాన మద్యత్సర్పరాజ్ఞియా ఋగ్భి గ్గార్హపత్యమాదధాత్యన్నాద్యస్యా వరుద్ధ్యా అథోఅస్యామేవైనం ప్రతిష్ఠిత మాధత్తే ౨ యత్త్వాక్రుద్ధఃపరోవ పేత్యాహాపహ్నుత ఏవాస్మైతత్ ౩ పుష స్త్వోద్దీపయామసీత్యాహ సమిన్ధ ఏవైనం ౪ యత్తేమన్యు పరోప్తస్యేత్యాహ దేవతాభి రేవ॥

౧ పృథివిని అన్నసిద్ధిపొందలేదు. (అప్పుడా) భూమి "భూమిర్భూమ్నా" అను నీమంత్రసముదాయమునుఁజూచెను. దానివలన నాభూమిని అన్నసిద్ధిపొందినది. "భూమిర్భూమ్నా" అను భూమియొక్క ఋక్కులచే యన్నసిద్ధియొక్క లాభము కొఱకు గార్హపత్యాగ్నిని నాధానముఁజేసినచో, అప్పుడు యీ యగ్నినీభూమియందే ప్రతిష్ఠావంతునిగా నాధానముఁ జేసినవాఁడగుచున్నాఁడు. ౨ "యత్త్వాక్రుద్ధః పరోవప" అనుమంత్రపాఠము- ఆయుద్వాసనము చేయుట ఈయగ్నికొఱకు నిగరణము చేయు

చున్నదని చెప్పుచున్నది. (నిగరణము = కప్పిపుచ్చుట.) ౩ "పునస్త్వోద్దీపయామసి" ఇత్యాదిమంత్రపాఠముచే (యజమానుఁడీ) యగ్నినిఁ బ్రజ్వలింపఁ జేయుచున్నాఁడు. ౪ "యత్త్వేమన్యుపరో ప్తస్య" ఇత్యాదిమంత్రపాఠముచే నీయజమానుఁడు ఆదిత్యాది దేవతలచే నీయగ్నిని తేజోవన్తుఁడుగాఁ జేయుచున్నాఁడు.

---

## పంచాశత్తు ౩.

౧౬౧. ఏనగ్ంసంభరతి ౧ వివాపతస్య యజ్ఞశ్ఛిద్యతే యోఽగ్నిముద్వాసయ తేబృహాస్పతి వత్యర్త్వోపతిష్ఠతే బ్రహ్మవై దేవానాం బృహాస్పతిర్బ్రహ్మణైవయ

జ్ఞగ్ంసందధాతి ౨ విచ్ఛిన్నం యజ్ఞగ్ం సమిమందధా త్వితాత్యాహాసంత

త్యై ౩ విశ్వేదేవా ఇదమాదయంతామి త్యాహాసంతత్యై వయజ్ఞం

దేవేభ్యోఽ నుదిశతి ౪ సప్త తేఅగ్నే సమిధః సప్తజిహ్వాః ॥

౧ ఏ యజమానుఁడగ్ని నుద్వాసనము చేయునో; ఇతనియజ్ఞమువిచ్ఛిన్నమగు చున్నది. (సంపూర్ణమైనయజ్ఞఫలమునుఁ బొందనేరడని, తా॥) "బృహాస్పతి" శబ్దము గలఋక్కుచేనగ్నిని సేవించవలయును. బృహాస్పతి దేవతలకుబ్రహ్మ (కావున) బ్రహ్మచేతనేయజ్ఞమునవిచ్ఛిన్నముగఁ జేయుచున్నాఁడు. ౨ "విచ్ఛిన్నంయజ్ఞమ్" ఇత్యాది మంత్రపాఠమునందలి "సందధాతు" అనుపదమువిచ్ఛిత్తిలేకుండుటకైయగు చున్నది. ౩ "విశ్వేదేవా" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) అవిచ్ఛిత్తి (సంతతి) చేతనే యజ్ఞమును దేవతలకొఱకిచ్చుచున్నాఁడు. ౪ ఈ వాక్యార్థము తరువాతి (౧౨) పంచాశత్తుతోఁ జేర్చివివరింపఁబడును.

—*—

పంచాశత్తు ౮.

౧౯౭. ఇత్యాహ సప్తసప్తవై సప్తధాzగ్నేః ప్రియాస్తనువస్తా ఏవావరుంధే ౨ పునరూర్జాసహ రయ్యేత్యభితః పురోడాశమాహుతీ జుహోతియజమానమేవోర్జాచర య్యాచోభయతః పరిగృహ్ణాత్యా ౩ దిత్యావా అస్మాల్లోకా దముంలోక మాయం తే zముష్మిల్లోకే వ్యతృష్యంత ఇమంలోకంపునరభ్య వేత్యాగ్ని మాధాయై తాన్హోమాన జుహవుస్త ఆర్ధ్నువం తే సువర్గంలోక మాయన్యః పరాచీనం పునరాధేయా దగ్నిమాదధీతసఏతాన్ హోమాంజుహు యాద్యామేవాzz దిత్యాఋద్ధి ర్తామృద్ధ్నువంతామేవర్ధ్నోతి ॥

౧ "సప్తతేఅగ్నే" ఇత్యాది మంత్రపాఠముచే సమిత్తులు మొదలగు పదార్థములువేఁడుగా (చెప్పబడినవి.) ఏఁడుగానున్న పదార్థములగ్నికిఁ బ్రియములైనశరీరములు. (కావునయజమానుఁడు) వాటినేబొందుచున్నాఁడు (అగ్నికిసప్తత్వసంఖ్య యిష్టమని భావము.) ౨ "పునరూర్జాసహ" అనుమంత్రపాఠముచే పురోడాశమంతటనాహుతులను హోమముచేయవలయును. (అప్పుడగ్ని)పాలుమొదలగు రసముచేతను ధనముచేతను, యజమానునంతటను గ్రహించుచున్నాఁడు. (ధనవంతునిగాఁజేయునని తా.) 3 ఆదిత్యాది దేవతలీలోకమునుండి స్వర్గలోకమునుఁ బొందిరి. (కాని) యాలోకమునందు విశేషముగా నాశకలవారైరి. మఱలనీలోకమును గూర్చివచ్చి యగ్నినాధానముఁజేసి (లోకాదిమంత్రములచే) నీయాహుతులను హోమము చేసిరి.

అప్పుడా దేవతలు సమృద్ధినిపొందిరి. (పిమ్మట) స్వర్గలోకమునుఁ బొందిరి. ఏయజమానుఁడు పునరాధేయమునకంటెఁ బిమ్మటనగ్నినాధానముఁ జేయునో ఆతడీయాహుతులను (లోకాదిమంత్రములచే) హోమముఁ చేయవలయును. ఆదిత్యాది దేవత లేసమృద్ధినిపొందిరో; (ఈయజమానుఁడుగూడ) ఆసమృద్ధినే పొందుచున్నాడు.

చతుర్థానువాకము సమాప్తము.

---

## అనువాకము ౫.

౧౯౪. ఉపప్రయంతో అధ్వరం మంత్రంవోచేమాగ్నయే ఆరేఅస్మేచశృణ్వతే ౧ అస్యప్రత్నామను ద్యుతగ్ం శుక్రందుదుహ్రే అహ్రయః పయఃస హస్రసామృషిమ్ ౨ అగ్నిర్మూర్ధా దివఃకకు త్పతిఃపృథివ్యాఅయమ్ అపాగ్ం రేతాగ్ంసిజిన్వతి ౩ అయమిహప్రథమోధాయిధాతృభి ర్హోతా యజిష్ఠోఅధ్వరేష్వీడ్యః యమప్నవానోభృగ వోవిరురుచు ర్వనేషుచిత్రం విభువం విశేవిశే ఉభావామింద్రాగ్నీ ఆహువధ్యై ॥

యజ్ఞమునుపొందిన వారలమై మేముదూరము నుండియు (ననుగ్రహముచే) మావాక్యమును వినుచున్న యగ్ని సంతోషముకొరకు (ఉపస్థాన) మంత్రము (జెప్ప వారము కాగలము.

ఈయగ్నియొక్క పురాతనమగు (గోస్థానీయమైన) అనుకూలప్రకాశమును సంకోచములేక ఋత్విక్కులు క్షీరస్థానీయమైనట్టియు, బహుధనము నిచ్చునట్టియు

గర్మప్రవర్త్తకమునగు జ్యోతిస్సునుఁ బిదుకుచున్నారు. (దుదుహ్రే = ద్వికర్మకప్రయోగము. ప్రకాశమునుండి అని తా॥) ౩ ఈయగ్ని (ఆదిత్యరూపముచే) ద్యులోకమునకు శిరస్థానీయుఁడు, భూమికిఁ బాలకుఁడు. ఉదకములయొక్క (కార్యములకు) స్థావర, జంగమ శరీరములను (జఠరాగ్నిరూపముచే) సంతోషపెట్టుచున్నాడు.

౪ దేవతలనాహ్వానించునట్టియు, మనుజులకంటె నధికముగ యాగముఁ జేయునట్టియు యాగములందు స్తోత్రము చేయఁ బడుచున్న నీయగ్ని యీకర్మయందుఁ బ్రధానుఁడై ధరించుటకుఁ బ్రయత్నించుచున్న (మాచే) ధరింపబడుచున్నాడు. "అప్నవాన" సంజ్ఞకలవారున్ను, "భృగు" సంజ్ఞయుకలవారునగు మునులుతమయాశ్రమములందా యాప్రబలాభివృద్ధికొఱకు నీయగ్నినిఁ బహుయాగముల కాధారమగునట్లుగా) విచిత్రముగాను, వ్యాప్తికలవానినిగాను, విశేషముగాఁ బ్రకాశింపజేసిరో! ౫ దీనియర్థము తరువాయి వాక్యములో వ్రాయబడును.

—*0*—

పంచాశత్తు ౨.

౧౬౪. ఉభాశాధసహ సహమాదయధ్వ్య ఉభాదాతారా విషాగ్ం రయీణా ముభావాజస్య సాతయే హువేవామ్ ౨ అయంతే యోనిర్ఋత్వియో యతోజాతో అరోచథాః తంజానన్నగ్న ఆరోహాథానోవ ర్ధయారయిమ్ ౩ అగ్నఆయూగ్ంషిపవసఆసువోర్జ మిషంచనః ఆరేబాధస్వ దుచ్ఛునామ్ ౪ అగ్నే పవస్వస్వపా అస్మేవర్చః సువీర్యమ్ దధత్పోషగ్ం రయిమ్॥

౧ ఓ యింద్రాగ్నులారా ! మిమ్ము నిద్దరిఁ గూర్చి యభిముఖముగా హోమము చేయుటకుఁ గోరుచున్నాను. మఱియు నిద్దరినికూడా అన్నముతోఁ దృప్తిపఱచుటకుఁ గోరుచున్నాను. (ఏ హేతువుచే) మీరిద్దరు అన్నములకు, ధనములకు, దాతలగుచున్నారో, ఆకారణమువలన మిమ్ముఁ బిలుచుచున్నాను. ౨ ఓ యగ్నీ ! ఈయాహవనీయ ప్రదేశము నీకు స్థానము. ఋతుసంబంధియగు నేయాహావనీయ ప్రదేశము నుండి పుట్టినవాఁడవై ప్రకాశించింతివో! ఆప్రదేశము(నాదియని)ను దెలిసికొనినవాఁడవై యధిష్ఠించుము. పిమ్మట నాధనమును వృద్ధినొందించుము ౩ ఓయగ్నీ! (నీవు) మాయాయువులను (దోషములేనివాటినిగా)శోధనము సేయుచున్నావు. మాకు బలకారణమగు రసమును, ధనమును దీసికొనిరమ్ము. శత్రుసేనను దూరమునందు బాధించుము. ౪ ఓయగ్నీ! శోభనకర్మకలనీవు మాయందు పుష్టిని, ధనమును ధరింపఁ జేయుచు మాయందలి బ్రహ్మవర్చస్సును, సమీచీనమగు సామర్థ్యముగను శోధించుము.



పంచాశత్తు ౩.

౧౬౫. మయి ౧ అగ్నేపావక రోచిషా మన్ద్రయా దేవజిహ్వయా ఆదేవాన్ వక్షియక్షిచ ౨ సనఃపావక దీదివోఽగ్నే దేవాగ్ం ఇహాఽఽవహా ఉప యజ్ఞగ్ం హవిశ్చనః ౩ అగ్నిః శుచివ్రతతమః శుచిర్విప్రః శుచిః కవిః శుచీరోచత ఆహుతః ౪ ఉదగ్నే శుచయస్తవ శుక్రాభ్రాజన్త ఈరతే తవజ్యోతీగ్ంష్యర్చయః ౫ ఆయుర్దా అగ్నేఽస్యాయుర్మే ॥ ॥

౧ పవిత్రముచేయు నోయగ్నిదేవా! ప్రకాశించుచున్నట్టియు సంతోషపెట్టునట్టి నాలుకచే దేవతలనావహించితివి. యాగముకూడ జేయుచుంటివి. ౨ పవిత్ర

ము చేయునోయగ్నీ! ప్రకాశించుచున్నయానీవు దేవతలనిచ్చుటకుఁ దీసికొనిరమ్ము మాయజ్ఞమును, హవిస్సును, బొందుము. 3 ఈయగ్ని దేవుడు మిక్కిలిశుద్ధమగు వ్రతముతో గూడుకొనినవాడు. బ్రాహ్మణాభిమానియై శుచియగువాడు, పండితాభిమానియై శుచియగువాడు. మాచే (అంతటను) బాగుగ హోమము చేయబడినవాడును శుచియై ప్రకాశించుచున్నాడు. ర ఓయగ్నీ! నీయొక్క శుద్ధములగు కిరణములు ప్రకాశించుచున్నవై యూర్ధ్వముగాఁ బోవుచున్నవి. పూజించువారు నీజ్యోతిస్సులను(బొందుచున్నారు) ౫ దీనియర్ధము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

---

## పంచాశత్తు ర.

౧౬౬. దేహి వర్చోదా అగ్నేఽసి వర్చో మేదేహి తనూపాఅగ్నేఽసి తనువం మేపాహ్యగ్నే యన్మేతనువా ఊనంతన్మ ఆప్రుణ ౨ చిత్రావసోస్వస్తితే పారమశీయ 3 ధానాస్త్వా శతగ్ం హిమాద్యుమన్తః సమిధీమహి వయస్వన్తో వయస్కృతం యశస్వన్తో యశస్కృతగ్ం సువీరాసో అదాభ్యం అగ్నే సపత్నదమ్భనం వర్షిష్ఠే అధినాకే ర సంత్వమగ్నే సూర్యస్య వర్చసాఽగథాః సమృషీణాగ్ంస్తుతేన సంప్రియేణ ధామ్నా త్వమగ్నే సూర్యవర్చా అసి సంమామాయుషా వర్చసాప్రజయాసృజ ॥ర॥

౧ ఓ యగ్నీ! నీవు ఆయువునిచ్చువాఁడ వగుచున్నావు. (కావున)నాకాయువు నొసంగుము. ఓ యగ్నీ! వర్చస్సునిచ్చువాఁడ వగుచున్నావు. నాకువర్చస్సు నొస

గుము. ఓ యగ్నీ! శరీరమును రక్షించువాడ వగుచున్నావు. నాశరీరమును రక్షించుము. నాశరీరమునకు(ఏది)తక్కువో దానినినాకుఁబూరింపుము. ౨ ఓ రాత్రీ! నీసమాప్తిని క్షేమముగాబొందుదును. ౩ ఓ యగ్నీ! అన్నమునకుకర్తవును, కీర్తినిచ్చువాడవును, తిరస్కరించబడనివాడవును, గొప్పదగు స్వర్గమువిషయమై శత్రువుల యొక్కనాశనము కలవాఁడవునగునిన్ను, అన్నముకలవారమును, కీర్తికలవారమును, శోభన పుత్రపౌత్రాదులతో కూడుకొన్నవారమును, సమిధలచే బ్రజ్వలింపఁజేయుచున్నవారమునగు మేము నూఱుసంవత్సరములు ప్రకాశముకలవారమై బాగుగాఁ బ్రఖ్యాతులము కాగలము ౩ ఓ యగ్నీ! నీవుసూర్యునియొక్క తేజస్సుతోఁగలిసికొనిన వాఁడవగుచున్నావు. ఋషులయొక్కస్తోత్రముతోఁ గలిసికొనినవాఁడవగుచున్నావు. ప్రియమగుస్థానము (ఆహవనీయప్రదేశము) తోఁగలిసికొనిన వాఁడవగుచున్నావు. ఓ యగ్నిదేవా! నీవుసూర్యునితో సమానతేజస్సుగల వాడవగుచున్నావు. మమ్ము నాయువుతోను, వర్చస్సుతోను, సంతానముతోను గూర్చుము.

పఞ్చమానువాకము సమాప్తము

అనువాకము ౬.

౧౬౭. సంపశ్యామి ప్రజాఅహామిడ ప్రజసోమానవీః సర్వాభవంతు నోగృహే ౨ అ భ్యస్తామ్భోవో భక్షీయమహాస్థ మహోవోభక్షీయ సహాస్థ సహోవోభక్షీయోర్జస్థోర్జం వోభక్షీయ ౩ రేవతీరమధ్వ మస్మిన్లోకే౽స్మిన్గోష్ఠే౽స్మిన్ క్షయేస్మిన్ యోనావిహైవ స్తేతోమా౽పగాత బహ్వీర్మే భూయాస్త ॥

౧ నేను ప్రజలను ఆవుయొక్క సంతానమును బాగుగాఁ జూచుచున్నాను మనుష్యరూపప్రజలు, ఆవుయొక్క సంతానములు, సమస్తములు మాగృహమునందు ఉండుగాక. ౨ (ఓ పశువులారా! మీరు) పానము జేయఁ బడినయుదకసారమగు క్షీరాదిస్వరూపులైయుండుడు. ఉదకసారమగు మీపాలను త్రాగుదును. అందరిచే నాదరించఁదగు క్షీరస్వరూపులై యుండుడు. అందరిచేనాదరించఁదగిన మీపాలనుద్రావుదును. బలమునుఁ జేయునట్టిక్షీరస్వరూపులైయుండుడు. బలమునుఁ జేయుమీపాలను ద్రావుదును. మిక్కిలిరుచిగలక్షీరస్వరూపులై యుండుడు. అట్టిమీపాలనుద్రావుదును. ౩ ఓ పశువులారా! ఈ భూలోకమునందు, ఈమంటపమందు, ఈగృహమునందు ఈస్థానవిశేషమునందు క్రీడింపుడు. ఈ స్థానమునందే (ఎల్లపుడు) ఉండుడు. ఈస్థానమునుండి పోవలదు. (సంతానపరంపరచే) ననేకులై నాకుపయోగింపుడు.

— * —

పంచాశత్తు ౨.

౧౬౮. సగ్ంహితాఽసి విశ్వరూపీరామోర్జావిశాఽఽ గౌపత్యేనాఽఽరాయస్పోషేణ సహస్రపోషం వగపుష్యాసంమయి వోరాయః శ్రయన్తామ్ ౨ ఉపత్వాఽగ్నే దివే దివే దోషావస్తర్ధియావయమ్ నమో భరన్త ఏమసి ౩ రాజన్తమధ్వరాణాం గోపామృతస్య దీదివమ్ వర్ధమానగ్ం స్వేదమే ౪ సనః పితేవసూనవేఽగ్నే సూపాయనోభవ సచస్వానః స్వస్తయే అగ్నే ॥౨॥

౧ ఓదూడా! నీవు (తల్లితోఁ) గూడుకొనినదానవగుచున్నావు. (ఆదరముగా స్తనమును బానముసేయుటకు నిరుప్రక్కల మఱల మఱలఁబరుగిడుచున్నదానవై)

యనేకరూపములుకలదానవువలెఁ (ప్రకాశించుచున్నావు. అటువంటినీవు) పాలుమొదలగు రసము (నిమిత్తము) చేతను, నాసంబంధమగు పశుస్వామిత్వము (కారణము) చేతను, ధనసమృద్ధి (నిమిత్తము) చేతను, నన్నుఁ బొందుము. (నాసమీపమునకు రావలయుననితా) సహస్రసంఖ్యచే సమృద్ధియేవిధముగనగునో! ఆవిధముగ మిమ్ముఁ బోషించఁగలను. మీసంబంధములగు పాలుమొదలయిన ధనములు నాయందు (నన్ను) ఆశ్రయించియుండుఁగాక. ౨ ఓ యగ్నీ! ప్రతిదినము మేము ప్రాతస్సాయంకాలములందు బుద్ధిపూర్వకముగా నమస్కారమును సంపాదించుచున్నవారమై నిన్నుఁ బొందుచున్నాము. ౩ యజ్ఞములకు రాజువైనట్టియు, నావులకుఁ బాలకుఁడవైనట్టియు సత్యముచేఁ బ్రకాశించునట్టియు, నగ్నిహోత్రగృహమునందు (హవిస్సులచే) వృద్ధినొందుచున్ననిన్నుఁబొందుచున్నామని వెనుకటి మంత్రములోని కన్వయము. ౪ ఓ యగ్నీ! అటువంటి నీవు (మాకొఱకు) పుత్రునికొఱకుఁ జేరుతండ్రివలె సమర్థుడవుకమ్ము. మాక్షేమముకొఱకుఁ గలిసికొనుము.

---

## పంచాశత్తు ౩.

౧౬౭. అగ్నే ౧ త్వంనో అన్తమః ఉతత్రాతా శివోభవవరూథ్యః ౨ తంత్వా శోచిష్ఠదీదివః సుమ్నాయనూనమీమహే సఖిభ్యః ౩ వసురగ్ని ర్వసుశ్రవాః అచ్ఛా నక్షిద్యుమత్తమోరయిందాః ౪ ఊర్జావః పశ్యామ్యూర్జామాపశ్యతరాయస్పోషేణ వఃపశ్యామి రాయస్పోషేణమాపశ్యతేడాః స్థమధుకృతః స్యోనామాఽఽవిశతే రామదః సహస్రపోషంవః పుష్యాసమ్ ॥

౧ ఓ యగ్నీ ! నీవు మాకత్యంతము సమీపమునందుండు వాఁడవుకమ్ము. మఱియు రక్షకుఁడవు, మంగళకరుఁడవునగుచు గృహమునందు(నిత్యము) సన్నిహితుఁడవుకమ్ము. ౨ (ఓ యగ్నీ ! నీవు) మిక్కిలి పరిశుద్ధుఁడవు, ప్రకాశించుచున్నవాఁడవు. మిత్రులమగు మాసుఖము కొఱకు నూతనుఁడవైనట్టియు, పూర్వోక్తగుణములతోఁ గూడుకొనిననిన్నుఁ బొందుదుము. ౩ ధనముకల నీయగ్ని వసురుద్రాది దేవతలచే వినఁబడుచున్నాఁడు. అటువంటి యో యగ్నీ ! మాకభిముఖుఁడవై రమ్ము. అతిశయముగఁ బ్రకాశించుచున్నవాఁడవై ధనమునిమ్ము. (ఓ గృహమునందలి పశువులారా!) పాలుమొదలగు రసము (నిమిత్తము) మిమ్ముఁ జూచుచున్నాను. అట్టి రసము (నిమిత్తము) నన్నుఁ జూడుడు. ధనసమృద్ధి నిమిత్తము మిమ్ముఁ జూచుచున్నాను. అట్టిధనసమృద్ధి (నిమిత్తము) నన్నుఁ జూడుడు. ఓ యావులారా ! (మీరు) మధురమగు నేతినిఁజేయువారలై యుండుడు. సుఖముఁజేయువారు, అన్నముకలవారు, సంతోషపెట్టువారునైనన్నుఁ బొందుడు. సహస్రసంఖ్యచే సమృద్ధి యగునట్లుగా మిమ్ముఁ బోషించుదును. మీధనములు నాయందాశ్రయించి యుండుగాక.



## పంచాశత్తు ౮.

౧౭౦. మయివోరాయః శ్రయంతాం ౧ తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ౨ సోమానస్గ్ంస్వరణం కృణుహిబ్రహ్మణస్పతే కక్షీవంతం యఔశిజమ్ ౩ కదాచన స్తరీరసినేంద్ర సశ్చసిదాశుషే ఉపోపేన్ను మఘవన్భూయ ఇన్నుతేదానం దేవస్య పృచ్యతే ౪ పరిత్వాగ్నే పురంవయంవిప్రగ్ం సహస్యధీమహి ధృషద్వర్ణం దివేదివే

ఛేత్తారంభంగురావతః ౫ అగ్నే గృహపతే సుగృహపతి రహం త్వయా
గృహపతినా భూయాసగ్ం సుగృహపతి ర్మయాత్వంగృహపతినా భూయాః
శతగ్ం హిమాస్తా మాశిషమాశాసే తంతవే జ్యోతిష్మతీం తామాశిష
మాశాసేఽముష్మై జ్యోతిష్మతీమ్ ॥

౧ ఏ సూర్యుఁడు మాబుద్ధులను ప్రేరణచేయుచున్నాఁడో! ఆ సూర్యుని యొక్క కొనియాడదగిన యా తేజస్సును ధ్యానముచేతుము. ౨ గొప్పకర్మకు ప్రభువగు నోయగ్నీ! ఏ నీవు ఉశిజపుత్రుని (ఋషిని) గర్మప్రవర్తకునిగాఁ జేసితివో! అటువంటి నీవు నన్నుఁగూడా సోమయాగమునకు ఉపదేష్టనుగాఁ జేయుము. ౩ పరమైశ్వర్యసంపన్నుఁడవగు నోయగ్నీ! (నీవు) ఒకప్పుడును హింసకుఁడవగుటలేదు. హవిస్సు నిచ్చుయజమానుని కొఱకత్యంత సమీపమునందే యుంటున్నావు. ఇంద్రసదృశుఁడవగు నోయగ్నీ! మఱలకూడ నీదానము (మాతో) కలిసికొనుచున్నది. ౪ బలవంతుడవగు నోయగ్నీ! యిష్టమగువాటిని సంపాదింపఁ జేయువాఁడవును బ్రాహ్మణాభిమానివియు, శత్రువులను దిరస్కరించు నాకారము కలవాడవును, నాశనము చేయు స్వభావముకల రాక్షసునకు భేదకుఁడవగు నిన్ను మేము ప్రతిదినమంతటను ధరించుచున్నారము. ౫ గృహమును బాలించునట్టి యోయగ్నీ! నీచే ననుగ్రహింపఁబడిన నేను హేమన్తర్తుసహితములగు నూరుసంవత్సరములు శోభనగృహపతినికాగలను. గృహపతినగు నాచేఁ బూజింపఁబడిన నీవు నూరు సంవత్సరములు శోభనగృహస్వామివి కాగలవు. పుట్టఁబోవు పుత్రపౌత్రాది సంతానమునకై బ్రహ్మవర్చస్సుతోఁ గూడుకొనినట్టి యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి రూపమగు నాశీస్సును నేనుకోఱుచున్నాను. (ఈవిధముగా) నీపుట్టిన సంతానము కొఱకు బ్రహ్మవర్చస్సుతోఁ గూడుకొనిన (పూర్వోక్తమగు నాశీస్సును గోఱుచున్నాను.

షష్ఠానువాకము సమాప్తము.

అనువాకము ౭.

౧౩.౧. అయజ్ఞోవా ఏషయోఽసామో పప్రయంతో అధ్వరమిత్యాహ స్తోమమే

వాస్మై యునక్త్యు ౨ పేత్యాహప్రజా వైపశవఉపేమంలోకం ప్రజామేవ

పశూనిమంలోక ముపైత్య 3 స్యప్ర త్నామను ద్యుతమిత్యాహ సువ

ర్గోవైలోకఃప్రత్నఃసువర్గమేవలోకగ్ం సమారోహత్య ౪ గ్నిర్మూర్ధాదివః

కకుదిత్యాహ మూర్ధానమ్ ॥

౧ ఏయజ్ఞముసామరహితమో, అది యజ్ఞమే కానేరదు. "ఉపప్రయన్తో అధ్వరమ్" అనుమంత్రపాఠముచే (యజమానుఁడు) ఈయగ్నికొరకు స్తోమమునుసంపాదించినవాఁడగును. (స్తోమము = ఋగ్భేదమువలన, ఆవృత్తిభేదమువలన, నిష్పన్నమయిన సామములసముదాయము) ౨ ప్రజలేపశువులు. ప్రజలు, పశువులు భూలోకమును పొందుచుండిరి. (కావున యజమానుఁడుకూడ) "ఉప"అనుమంత్రపాఠసామర్థ్యమువలన సంతానమును, పశువులను పొంది, తద్యుక్తుఁడగుచు భూలోకమును పొందుచున్నాడు 3 పురాతనలోకము స్వర్గలోకమే. "అస్యప్రత్నామ్" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) స్వర్గలోకమునే యధిష్ఠించుచున్నాడు. ౪ "అగ్నిర్మూర్ధా" ఇత్యాది మంత్రపాఠముచే (అగ్ని) ఈయజమానుని సమానజాతీయులలో శ్రేష్ఠునిగాఁజేయుచున్నాడు, మరియు దేవలోకమునుండి మనుజలోకమునందువచ్చి ప్రతిష్ఠావన్తుఁడగుచున్నాడు.

పంచాశత్తు ౨.

౧౭.౨. ఏవైనగ్ంసమానానాం కరోత్యథోదేవలోకాదేవ మనుష్యలోకే ప్రతిష్ఠత్య

౨ యమిహప్రథమో ధాయిధాతృభిరిత్యాహ ముఖ్యమేవైనం కరోత్యు
3 భావామింద్రాగ్నీ ఆహువధ్యా ఇత్యాహౌజో బల మేవావరుంధే
౪ zయంతేయోనిర్‌ఋత్వియ ఇత్యాహపశవో వై రయిఃపశూనేవావరుంధే
౫ షడ్భిరుపతిష్ఠతేషడ్వా ॥

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ "అయమిహ" ఇత్యాది మంత్రపాఠముచే నీయజమానుని (అగ్ని) ముఖ్యుని గాఁజేయుచున్నాడు. 3 "ఉభావామిన్ద్రాగ్నీ" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) ఓజోరూప మయిన బలమును పొందుచున్నాడు. ౪ పశువులేధనము. "అయంతే" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) పశువులనే పొందుచున్నాడు. ౫ ఈవాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు 3.

౧౭3. ఋతవఋతుష్వేవ ప్రతితిష్ఠతి షడ్భిరుత్తరాభిరుపతిష్ఠతే ద్వాదశ సంపద్య న్తే ద్వాదశ మాసాఃసంవత్సరః సంవత్సరఏవ ప్రతితిష్ఠతి ౨ యథావై పు రుషోzశ్వో గౌర్జీర్యత్యేవ మగ్నిరాహితో జీర్యతిసంవత్సరస్య పరస్తాదగ్ని పావమానీభి రుపతిష్ఠతే పునర్నవమేవైన మజరంకరోత్యథో పునాత్యే వో 3 పతిష్ఠతే యోగఏవాస్యైష ఉపతిష్ఠతే ॥

౧ "ఉపప్రయన్తే" ఇత్యాది పూర్వమంత్రషట్కముచే యజమానుఁడుఉపస్థానము (ప్రార్థన) చేయవలయును. ఋతువులుఆరు. (కావున యజమానుఁడు) ఋతువులందే ప్రతిష్ఠావన్తుఁడగుచున్నాడు. "అగ్న ఆయూగ్ంషి" ఇత్యాది యుత్తరమంత్రషట్కముచే (యజమానుఁడు) అగ్న్యుపస్థానము చేయవలయును. ఇట్లుచేయఁగా) ౧౨ పంౘెండుమంత్రములగుచున్నవి. ౧౨ మాసములుసంవత్సర మగుచున్నది. (కావున) సంవత్సరమునందే యజమానుఁడు ప్రతిష్ఠితుఁడఁగు చున్నాడు. (ఉపస్థానము=ప్రార్థన) ౨ పురుషుఁడు, గుర్రము, గోవు, ఏవిధముగా ముసలితనము పొందునో ఇటులనే యగ్నియు బాగుగాఁ జేర్పబడినవాఁడై ముసలి తనమును పొందుచున్నాడు. (కావున) అగ్ని, పవమానదేవతల సంబంధము లగు ఋక్కులచే సంవత్సరమునకు ఒక్కమాట (అగ్నిని) ఉపస్థానముచేయ వలయును. (ఇట్లుచేసినచో యజమానుఁడు)ఈ యగ్నిని ముసలితనము లేనివానిని గాను, నూతనునిగాను చేసినవాఁడగును. మఱియుఁ బవిత్రునిగాఁ జేసిన వాఁడగుచున్నాడు. 3 ఈ వాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁ బడును.

## పంచాశత్తు ౪.

౧౭౪. దధ్నఏవాస్యైష ఉపతిష్ఠతే యాశ్చైవాస్యైషోపతిష్ఠతే యథాపాపీయాఞ్ఛ్రేయస ఆహృత్య నమస్యతి తాదృగేవతదా ౨ యుర్దాఅగ్నేఽస్యాయుర్మే దేహీత్యాఽఽహాయుర్దాహ్యేష వర్చోదాఅగ్నేఽసివర్చోమే దేహీత్యాహావర్చో దాహ్యేష తనూపా అగ్నేఽసి తనువంమే పాహీత్యాహ ॥

౧ సేవించుచున్నాఁడను నదియేయగ్నికి (యజమానునితో ననుగ్రాహ్యాను గ్రాహకరూప) సమ్బన్ధము సేవించుచున్నాఁ డనునదియేయగ్నికి (యజమానునితో గలయుపద్రవ నివారణ రూపమయిన) సమ్బన్ధము. సేవించుచున్నాఁడనుట (యేది కలదో) ఇదియగ్నికి (యజమానునితో) యాచ్ఞారూపసమ్బన్ధము. (లోకమునందే విధముగ దరిద్రుఁడు ధనికునికొరకు కానుకందెచ్చి నమస్కరించు చున్నాఁడో, యీ యగ్ని సేవ కూడనట్టిదియే.) ౨ "ఆయుర్దాఅగ్నే" యిత్యాది మంత్రపాఠములచే నీయగ్ని (యజమానునకు) నాయువునిచ్చు వాఁడ (గుచున్నాడు) "వర్చోదయగ్నే" ఇత్యాదిమన్త్రపాఠములచే నీయగ్ని (యజమానునకు) వర్చస్సులు (కాన్తివిశేషము) నిచ్చువాఁ (డగుచున్నాఁడు) "తనూపాఅగ్నే" ఇత్యాది మన్త్రపాఠములచే నీయగ్ని (యజమానునియొక్క) శరీరమును రక్షించు వాఁడ (గుచున్నాఁడు)

పంచాశత్తు ౫౦.

౧౭౫. తనూపా హ్యాహో౽ ౧ గ్నేయన్మేతనువా ఊనంతన్మ ఆపృణేత్యాహాయ న్మే ప్రజాయైపశూనామూనం తన్మఆపూరయే తివావైతదాహ ౨ చిత్రా వసోస్వస్తితే పారమశీయేత్యాహ రాత్రిర్వై చిత్రావసు రవ్యుష్ట్యైవాఏత స్యైపురా బ్రాహ్మణాఅభైషు ర్వ్యుష్టిమేవావరుంధ ౩ ఇంధానాస్త్వా శతమ్ ॥

౧ "అగ్నేయన్మే" ఇత్యాది మన్త్రపాఠములచే నాయొక్కసన్తానములకుఁ బశువులకు నేదితక్కువో, (ఓయగ్నీ!) నాకుదానినిఁబూర్తిసేయుము, అనునిదియే చెప్పఁబడినది. ౨ రాత్రియేచిత్రావసువు. (నక్షత్రాది రూపమయిన చిత్రవిూ

రాత్రియందుఁ బ్రకాశించుటచే నున్నదని తా॥) ఈరాత్రియొక్క యవసానరూపమయిన ప్రాతఃకాలము కొఱకు, బ్రాహ్మణులు పూర్వమొకప్పుడు భయపడిరి· హేమన్తర్తువునందు రాత్రికాలమెక్కువ కావున తెల్లవారదని భయమొందిరని భావము) (కావున యజమానుఁడు) "చిత్రావసో" ఇత్యాది మంత్రపాఠముచేఁ బ్రాతఃకాలమునే పొందుచున్నాడు. ౩ ఈవాక్యార్థము ౬ వ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౬.

౧౭౬. హిమా ఇత్యాహ శతాయుః పురుషః శతేన్ద్రియ ఆయుష్యేవేన్ద్రియే ప్రతితిష్ఠ
౨ త్యేషా వైమూర్మీ కర్ణకావత్యేత యా హ స్మ వై దేవా అసురాణాగ్ం శత
తర్హాగ్ం స్తృగ్ం హన్తియ దేతయా సమిధమాదధాతి వజ్రమేవై తచ్ఛత
ఘ్నీంయజమానో భ్రాతృవ్యాయ ప్రహరతి స్తృత్యా అచ్ఛమ్బట్కారం
౩ సన్త్వమగ్నే సూర్యస్య వర్చసాzగథా ఇత్యాహై తత్త్వమసీదమ
హంభూయాసమితి వావైతదాహ ౪ త్వమగ్నే సూర్యవర్చా అసీత్యా
హాzzశిషమేవైతా మాశాస్తే ॥

౧ "ఇన్ధానాస్త్వా" ఇత్యాది మంత్రపాఠముచేఁ బురుషుండునూరుసంవత్సరములుపరిమాణముకల యాయువు కలవాఁడును, నూరుఇంద్రియములుకలవాఁడునై ఆయువు నందును, ఇద్రియమునందును ప్రతిష్ఠావన్తుఁడగుచున్నాఁడు. ౨ ఈబుఱుకు రంధ్రములు కలదియు, మండుచున్న యినపకడ్డీ. ఈబుఱుకుచేతనే దేవతలు

రాక్షసులలో శతతర్హులను (ఒకదెబ్బచేతనే నూర్గురిని జంపువారని వ్యుత్పత్తి) హింసించుచున్నారు. ఈబుఱ్ఱుచే సమిధలనాధానము చేసినచో ఈశతఘ్నియను (నూర్గురను జంపునది) బుఱ్ఱునుయజమానుఁడు వజ్రమునుగాఁజేసి తనకు నాశము లేకుండునట్లు విస్తరించుటకై శత్రువులను జంపుటకును విసరుచున్నాడు. ౩ "సంత్వమగ్నే" ఇత్యాది మంత్రపాఠముచే, "ఓయగ్నీ! ఈతేజస్సును నీవు (పొందినవాఁడ) వగుచున్నావు. (నిన్ను బ్రార్థించుటచే) నేను ఈతేజస్సును (పొందినవాఁడ) నగుచున్నాను. అనునర్థము చెప్పఁబడుచున్నది

౪ "త్వమగ్నేసూర్యవర్చా" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు- "ఓ యగ్నీ! నన్ను నాయువుతోను సంతానముతోను కలుపుము" అనునట్టి) యీ యాశీస్సునే కోరుచున్నాను.

సప్తమానువాకము సమాప్తము.



## అనువాకము ౮.

౧౭౭. సంపశ్యామి ప్రజాఅహామిత్యాహ యావంతఏవ గ్రామ్యాః పశవస్తానే వా

వరుంధే ౨ zమ్భఃస్థామ్భో భక్షీయేత్యాహ మ్భొహ్యేతామహఃస్థ

మహో వో భక్షీయే త్యాహామహో హ్యేతాః సహస్థ సహో వో భక్షీయే

త్యాహ సహో హ్యేతా ఊర్జస్థోర్జం వో భక్షీయేతి ॥

౧ "సంపశ్యామి ప్రజాఅహామ్" ఇత్యాదిమంత్రపాఠముచే గ్రామ్యపశువు లెన్నికలవో, (యజమానుఁడు) వాటినన్నిటినిఁ బొందుచున్నాఁడు. (ఈయనువాకము

౬వ యనువాకమునకు వ్యాఖ్యానప్రాయము.) ౨ "అమ్భఃస్థామ్భోవో" ఇత్యాది మంత్ర పాఠముచే నమ్భశ్శబ్దార్థమే యీపశువులనియు, "మహస్థ" ఇత్యాదిమంత్ర పాఠముచే నీపశువులు మహశ్శబ్దార్థములే యనియు, "సహస్థసహోవో" ఇత్యాది మంత్ర పాఠముచే నీపశువులు సహశ్శబ్దార్థములనియు, "ఊర్జస్థ" ఇత్యాదిమంత్ర పాఠముచే నీపశువులు ఊర్జశ్శబ్దార్థమనియు; (వివక్షచేయఁ బడుచున్నది.)

పంచాశత్తు ౭.

౧౭౮. ఆహోరో్హ్యేతా ౧ రేవతీరమధ్వ మిత్యాహ పశవో వై రేవతీః పశూనే

వాఽఽత్మ న్రమయత ౨ ఇహైవస్తేతో మాఽపగా తేత్యాహ ధ్రువావే

వైనా అనపగాః కురుత ౩ ఇష్టకచిద్వా అన్యోఽగ్నిః పశుచిదన్యః సగం

హితాఽసి విశ్వరూపీరితి వత్సమభిమృశత్యుపై వైనం ధత్తే పశుచితమేనం

కురుతే ప్ర॥

౧ పశువులే రేవతీ శబ్దార్థము. (రేవతీః=పాలుమొదలగు ధనముకలవనివృత్) "రేవతీరమధ్వమ్" ఇత్యాదిమంత్ర పాఠముచే (యజమానుఁడు) పశువులనే తన గృహమునందు సంతోషపెట్టుచున్నాఁడు. ౨ "ఇహైవస్తేతో" ఇత్యాదిమంత్ర పాఠముచే (యజమానుఁడు) ఈపశువులను నిత్యమైనవాటినిగాను, కదలని వాటిని గానుచేయుచున్నాఁడు. 3 ఇష్టకల (రాళ్ల) నుపధానముజేసియగ్ని (యెట్లు) చయనముజేయఁబడునో, (ఇట్లే) మఱియొక యగ్నిపశువును పధానముచేసి యగ్ని చేయఁ బడుచున్నాడు. "సగంహితాసి విశ్వరూపః" అనుమంత్రముచే దూడను తాక వలయును. (ఈ వత్సస్పర్శచే యజమానుఁడు) పశువును పధానము చేసినవాఁడగు చున్నాడు. (మఱియు) నగ్నిని చయనము చేసినవాఁడగుచున్నాడు (ఉపధానము=

పరుచుట, లేక—సన్నద్ధముగానుంచుట చయనము= అగ్నిని బ్రజ్వలింపఁజేయుట ఇష్టక=ఇటుక)

పంచాశత్తు ౩.

౧౭౭. ప్రవాఏషో ऽస్మాల్లోకాచ్చ్యవతేయ ఆహవనీయ ముపతిష్ఠతే గార్హపత్య ముపతిష్ఠతే ऽస్మిన్నేవలోకే ప్రతితిష్ఠత్యథో గార్హపత్యాయైవ నిహ్నుతే ౨ గాయత్రీభి రుపతిష్ఠతే తేజోవైగాయత్రీ తేజఏవాత్మన్ధత్తే ऽథోయ దేతం తృచమన్వాహ సంతత్యై 3 గార్హపత్యం వాఅనుద్విపాదోవీరాః ప్రజాయంతే యఏవంవిద్వాన్ద్విపదాభి ర్గార్హపత్యముప తిష్ఠతే ॥

౧ ఏ యజమానుఁడు ఆహావనీయాగ్నిని సేవించుచున్నాఁడో, ఈతఁడు ఈలోకము నుండి జారిపోవుచున్నాడు. గార్హపత్యాగ్నిని సేవించినచో నీలోకమునందే ప్రతిష్ఠితుఁడగుచున్నాడు. కావునగార్హపత్యాగ్నినే సేవించవలయును. ౨ "ఉపత్యాగ్నే" ఇత్యాది గాయత్రీ ఋక్కులచే (నగ్నిని) సేవించవలయును. తేజస్సే గాయత్రి. (కావున నట్టి యజమానుఁడు)తనయందుఁ దేజస్సునే ధరించుచున్నాఁడు. విచ్ఛేదము లేకుండుటకై నీ ఋక్కు చెప్పఁబడినది. 3 గార్హపత్యాగ్ని ననుసరించి రెండుపాదములుంకలవీరులు పుట్టుచున్నారు. యజమానుఁ డేవిధముగాఁ దెలిసికొనినవాఁడై రెండుపాదములుంకల ఋ క్కులచే గార్హపత్యాగ్నిని సేవించుచున్నాడో; వీనికివీరుడు పుటుచున్నాడు.

—*0*—

పంచాశత్తు ౪.

౧౭౦ ఆzస్యవీరోజాయత ౧ ఊర్జావగ్ం పశ్యామ్యూర్జ్ఞామా పశ్యతేత్యాహాzz
శిషమేవైతామాశాస్తే ౨ తత్సవి తుర్వరేణ్య మిత్యాహ ప్రసూత్యైసో
మానగ్ం స్వరణమిత్యాహ సోమపీథమేవా వరున్ద్ధేకృణుహిబ్రహ్మణ
స్పత ఇత్యాహబ్రహ్మవర్చసమేవా వరున్ద్ధే ౩ కదాచనస్తరీర సీత్యాహ
నస్తరీగ్ం రాత్రిం వసతి॥

౧ "ఊర్జావగపశ్యామి" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) ఆశీర్వాదమునే కోరుచున్నాఁడు. ౨ "తత్సవితు" రిత్యాదిమంత్ర పాఠమునందలి సవితృపదము "ప్రేరణచేయుట" అనునర్థముచెప్పుచున్నది. "సోమానగ్ంస్వరణమ్" ఇత్యాదిమంత్ర పాఠముచే (యజమానుఁడు) యజ్ఞవిశేషమునుఁ బొందుచున్నాఁడు. "కృణుహిబ్రహ్మణస్పతీ" ఇత్యాది మంత్రపాఠముచే బ్రహ్మ వర్చస్సునే పొందుచున్నాడు. ౩ ఎవడేవిధముగఁ దెలిసికొనినవాఁడై యగ్నిని సేవించుచున్నాఁడో; వాఁడు "కదాచన స్తరీరసి" ఇత్యాదిమంత్ర పాఠముచే నంధకార బంధురమయిన రాత్రిని (రాత్రియందు) నివసించుటలేదు. (అనగా సుఖకరమయిన రాత్రియందు నివసించుచున్నాఁడని తా॥)

పంచాశత్తు ౫.

౧౭౧. యఏవంవిద్వానగ్ని ముపతిష్ఠతే ౧ పరిత్వాగ్నే పురంవయమిత్యాహ

పరిధిమేవైతంపరిద ధాత్యస్కందాయా ౨ గ్నేగృహపత ఇత్యాహ యథా యజురేవైత ౩ చ్ఛతగ్ం హిమాఇత్యాహ శతంత్వా హేమన్తానిన్ధిషీయేతి వావైతదాహ ౪ పుత్రస్య నామగృహ్ణాత్యన్నాద మేవైనంకరోతి ౫ తా మాశిష మాశాసేతన్తవే జ్యోతిష్మతీమితి బ్రూయాద్యస్య పుత్రోఽజాతః స్యాత్తేజస్వ్యేవాస్య బ్రహ్మవర్చసీ పుత్రోజాయతేతామాశిషమాశాసేఽ ముష్మైజ్యోతిష్మతీమితి బ్రూయాద్య స్యపుత్రోజాతః స్యాత్తేజ ఏవాస్మిన్బ్ర హ్మవర్చసందధాతి॥

౧ "పరిత్వాఽగ్నే" ఇత్యాదిమంత్ర పాఠముచే నాశము లేకుండుటకై యజమానుఁడు పరిధిని ధరించవలయును. (పరిధి=అగ్నిచుట్టువేయు పుల్లలలోనొకటి) ౨ "అగ్నేగృహపతే" ఇత్యాది మంత్రపాఠముచే యజుస్సు నతిక్రమించకుండగా స్తోత్రముచేయఁబడినది. ౩ "శతగ్ంహిమా" ఇత్యాది మంత్రపాఠము- (ఓయగ్నీ!) నూరువత్సరములు నిన్నుఁ బ్రజ్వలింపఁ జేయుదును. (సేవించుదునని తా॥) అను నర్థమునే చెప్పినది. (ఇచట హేమన్తశబ్దము సంవత్సరమును బోధించునని యెఱుంగవలయును.) ౪ "తన్తవేఽముష్మై" అను మంత్రభాగమునుఁ బుత్రునిపేరుచ్చరింపవలయును. (అట్లుచేసినచో యజమానుఁడు) ఈపుత్రుని అన్నవన్తునిగాఁ జేయుచున్నవాఁడగుచున్నాఁడు ౫ "తామాశిషమాశాసేత న్తవే" ఇత్యాదిమంత్ర పాఠము నుచ్చరింపవలయును. ఎవనికిఁ బుత్రుఁడుపుట్టలేదో; దీనికి (ఆమంత్రపాఠ సామర్థ్యము వలన) బ్రహ్మవర్చస్సుతోఁ గూడుకొనిన పుత్రుఁడు పుట్టుచున్నాఁడు. "తామాశిష మాశాసేఽముష్మైజ్యోతిష్మతీమ్" అను మంత్రపాఠమునుచ్చరింపవలయును. ఎవనికి పుత్రుఁడు పుట్టెనో, ఈమంత్రపాఠముచే నీయజమానుఁడు) తనపుత్రునియందుఁ

దేజోరూపమయిన బ్రహ్మవర్చస్సును సంపాదింపఁ జేయుచున్నాఁడు. (తన్తుశబ్దము పుట్టినపుత్రునిఁ దెలుపునదియు, నముపైన్నయను అదశ్యబ్దము పుట్టఁబోవు పుత్రునిఁ దెలుపునదియు, నీమంత్రభాగము వ్యవస్థను జేయుచున్నది.)

అష్టమానువాకము సమాప్తము.

— * —

## అనువాకము ౯.

౧౪-౨ ౧ అగ్నిహోత్రం జుహోతియదేవకించ యజమానస్య స్వంతస్యైవత

౨ ద్రేతః సించతిప్రజననేప్రజననగ్ం హివాఅగ్నిః రథౌషధీరన్తగతాదహాతి

తాస్తతోభూయసీః ప్రజాయన్తే ౩ యత్సాయంజుహోతి రేతఏవతత్సి

ఞ్చతిప్రైవ ప్రాతస్తనేన జనయతిత ౪ ద్రేతఃసిక్తం నత్వష్టావికృతం

ప్రజాయతే యావచ్ఛోవై రేతసః సిక్తస్య ।

౧ (వాక్యాన్తరముచే విధించఁబడినపాలు, పెరుగుమొదలగు ద్రవ్యములచే) నగ్నిహోత్రమును (కర్మను నిత్యము చేయుహోమముపేరు) చేయవలయును. యజమానునకుఁ బాలు మొదలగుద్రవ్యము (అగ్నియందు హోమము చేయఁబడినది) కలదో! అది (నశించదు.) ఆయజమానునకే ధనమై యుంటున్నది. ౨ రేతస్సు సంతానమునకుఁ గారణమయిన యోనియందుంచఁబడినదై యుంటున్నది. అగ్ని ప్రజోత్పాదకమగు యోనిస్వరూపముకదా! (అనగా—సంతాన కారణమగు యోని

యందు రేతస్సుంచఁబడినదై యేవిధముగ నుంటున్నదో! ఆవిధముగా నగ్ని యందు హోమము చేయంబడిన ద్రవ్యముంటున్నది. ౩ విచారించఁగా (గ్రీష్మ కాలమునందు దావాగ్ని) సమీపమును బొందినదై యోషధులను దహించు చున్నది. అయినను (వర్ష కాలము రాగానే) ఆయోషధులు అధికములుగా మొలుచు చున్నవి. (కావున నగ్ని యుత్పాదకుఁడు అనుమాట సత్యమని తా॥) ౪ దేనిని సాయంకాలమునందు హోమముచేయుదురో; అది రేతస్సేచన సమానము. దేనిని ప్రాతఃకాలమున హోమము చేయుదురో! అది యుత్పాదనసమానము (సేచనము= తడుపుట, లేక-రేతస్సునుంచుట, ఉత్పాదనము=పుట్టించుట.) ౫ దీని యర్థము తరువాయి పంచాశత్తులో వ్రాయంబడును.

పంచాశత్తు ౨.

౧౨౩. త్వష్టారూపాణి వికరోతి తావచ్ఛోవై తత్ప్రజాయత ఏషవై దైవ్యస్త్వష్టా

యోయజతే బహ్వీభిరుపతిష్ఠతే రేతసవవసిక్త్వస్యబహు శోరూపాణివికరోతి

౨ సప్రైవజాయతేశ్వః శ్వోభూయాన్భవతి యఏవంవిద్వా నగ్నిముపతిష్ఠతే

౩ zహర్దేవానామాసీ ద్రాత్రిరసురాణాం తేzసురాయద్దేవానాం విత్తం వే

ద్యమాసీత్తేనసహ ।

౧ (లోకములో యోనియం) దుంచఁబడిన రేతస్సువిశ్వకర్మచే విలక్ష ణముగాఁ జేయఁ బడినచో, ప్రజోత్పత్తియే కలుగుటలేదు. ఆవిశ్వకర్మ యెన్ని రూపముల నుద్దేశించి రేతస్సునసేక విధములుగాఁజేయునో! అన్నిరూపములు పుట్టు చున్నవి. యేయజమానుఁడు యాగము చేయుచున్నాఁడో! ఆయజమానుండు దేవ

తలచే ననుగ్రహింపఁబడిన విశ్వకర్మయగుచున్నాడు. (కావున ననేక రూపములు చేయుటకై యనేకులతో సేవించు చున్నాడు. (యోనియందుంచఁబడిన రేతస్సు యొక్క రూపము లనేకవిధములుగా విలక్షణముగాఁ జేయుచున్నాడు.) ౨ ఏయజమానుఁడీవిధముగాఁ దెలిసికొనినవాఁడై యగ్నిని సేవించునో! ఆయజమానుఁడు సంతానమును బుట్టించు చున్నాడు. ప్రతిదిన ముత్తరోత్తరాభివృద్ధి కలవాఁడగు చున్నాడు. 3 ఈవాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు 3.

౯౮౪. రాత్రింప్రావిశన్తే దేవాహీనా అమన్యన్త తేఽపశ్య న్నాగ్నేయీరాత్రి రాగ్నేయాః పశవఇమమేవాగ్నిగ్ం స్తవామసనః స్తుతఃపశూన్పున ర్దాస్యతీతి తేఽగ్నిమస్తువన్త్సఏభ్యఃస్తుతోరాత్రియా అధ్యహారభి పశూన్నిరార్జత్తేదేవాః పశూన్విత్త్వా కామాగ్ంఅకుర్వతయ ఏవంవిద్వానగ్ని ముపతిష్ఠతేపశు మా న్భవతి॥

౧ పగలు దేవతల (భాగ)మాయెను. రాత్రి రాక్షసుల (భాగ)మయినది. పొందుటకు యోగ్యమగు దేవతయొక్క యేవస్తురూప ధనముకలదో! దానితోగూడ రాక్షసులు రాత్రినిఁబ్రవేశించిరి. (చీకటి యందెచ్చటికో పోయిరని తా॥) (మనము పశురూపధన) హీనులమని యాదేవతలు తలచిరి. రాత్రి యగ్ని సంబంధమయినది, పశువులగ్నిసంబంధము లైనవి. ఈయగ్నినేస్తోత్రము చేయుదము. స్తోత్రము చేయఁబడిన యాయగ్నిహోత్రుఁడు మనకుఁబశువులను మరల నివ్వఁగలవాఁడని యా దేవతలాలోచించిరి. ఆదేవతలు అగ్నిని స్తోత్రముచేసిరి. ఆయగ్ని

హోత్రుఁడు స్తోత్రము చేయంబడినవాఁడై యాదేవతలకొఱకు పశువులను రాత్రినుండి తీసికొనివచ్చి పగటియందుఁబొందించెను. ఆదేవతలు పశువులనుబొంది ఎవఁడీవిధముగాఁ దెలిసికొనినవాఁడై యగ్నిని సేవించునో! వాఁడు పశురూపధనము కలవాఁడగునని కోరికలనుజేసిరి. (ఇట్లుకోరిరి అనిభావము.) రాత్రియందుఅగ్ని ప్రకాశమధికముగనుండును. కావునరాత్రియాగ్నేయి యనియుఁబశువుల కగ్నిస్వామికావున పశువులు ఆగ్నేయములనియుఁ జెప్పఁబడుచున్నది.

పంచాశత్తు ౪.

౧౮౪. ఆదిత్యోవా అస్మాల్లోకాదముం లోకమైత్సోఽముంలోకంగత్వాపునరిమం లోకమభ్యధ్యాయత్స ఇమంలోకమాగత్యమృత్యో రబిభేన్మృత్యుసంయుత ఇవహ్యయంలోకః సోఽమన్యతే మమేవాగ్నిగ్ంస్తవాని సమాస్తుతః సువర్గం లోకంగమయిష్యతీతిసోఽగ్నిమస్తౌత్సవనగ్ంస్తుతః సువర్గంలోకమగమయద్యః

౧ సూర్యుఁడీలోకమునుండి స్వర్గలోకమునకు వెళ్ళెను. ఆయాదిత్యుఁడుస్వర్గ లోకమునుఁబొంది మఱల నీభూలోకమునుధ్యానించెను. ఆతఁడీలోకమునుఁగూర్చి వచ్చి మృత్యువువలన భయమొందెను. ఈభూలోకము మృత్యువుతోఁ గూడుకొని యుండునుగదా! ఈఅగ్నినే స్తోత్రముచేయుదును. ఆతడుస్తోత్రము చేయఁబడిన వాఁడై స్వర్గలోకమును బొందించఁగలడని తలచెను. ఆయాదిత్యుఁడు (అవిధముగ) నగ్నినిస్తోత్రముచేసెను. ఆయగ్నిదేవుఁడు స్తోత్రముచేయఁబడినవాఁడై ఈ యాదిత్యు నిస్వర్గలోకమునుఁ బొందించెను. ఎవఁడీవిధముగఁ దెలిసికొనినవాఁడై యగ్నిని సేవించునో, వాడుస్వర్గలోకమునే పొందుచున్నాఁడు. సమస్తమగు నాయువునుఁ బొందును.

పంచాశత్తు ౫.

౧౮౬. ఏవంవిద్వానగ్ని ముపతిష్ఠతే సువర్గమేవలోకమేతి సర్వమాయురేత్య ౨ భివాఏషోఽగ్నీ ఆరోహతి యఏనా వుపతిష్ఠతే యథాఖలువై శ్రేయానభ్యారూఢః కామయతే తథాకరోతి ౩ నక్తముపతిష్ఠతే నప్రాతఃసగ్ం హినక్తం వ్రతాని సృజ్యన్తేసహశ్రేయాగ్ంశ్చ పాపీయాగ్ంశ్చాఽఽ సాతేజ్యోతిర్వా అగ్నిస్తమోరాత్రిర్యత్ ॥

౧ ఈ వాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ఎవఁడు ఆహవనీయ,గార్హపత్యాగ్నులను సేవించుచున్నాడో, వాఁడుఆహవనీయ, గార్హపత్యాగ్నులరెంటిని స్వాధీనముగాఁ జేసికొనుచున్నాడు. యేవిధముగ లోకమునందు (మొదటనధముఁడై విద్యాదులచే నే) నధికుఁడను కాగలననితలచునో, ఆవిధముగ నీయజమానుఁ డగ్న్యుపస్థానముచేఁ దనకుత్తమ స్థానమునుఁ జేసికొనుచున్నాడు. ౩ రాత్రియందగ్నిని సేవించవలెను. ప్రాతఃకాలమున సేవించగూడదు. రాత్రియందు (చీకటిగావున) కర్మలు సంకీర్ణము లగుచున్నవి. (శాస్త్రీయముగనను ష్ఠింపబడిన) వ్రతవిశేషము శ్రేయస్కరమగుచున్నది. లేనిచోఁ బాపకర మగుచున్నది. జ్యోతిస్సు, అగ్ని ఈరెండునుగూడనున్నవి. రాత్రియందగ్నిని సేవించుచున్నాడు కావున జ్యోతిస్సుచేతను, అగ్నిచేతను రాత్రిప్రయుక్తమగు తమోదోషమును పోఁగొట్టుచున్నాడు. పగటియందు చీకటియను దోషములేదు కావున నుపస్థాన మవసరములేదని కొందరిపూర్వపక్షము. (ఉపస్థానము=సేవ లేక ప్రార్థన.)

—*—

పంచాశత్తు ౬.

౧౬౭. నక్త ముపతిష్ఠతే జ్యోతిషైవ తమస్తర ౨ త్యుపస్థేయో౽గ్నీ 3 ర్నోపస్థేయా 3 ఇత్యాహుర్మనుష్యా యేన్వై వయో౽హర హరాహృత్యాథైనం యాచ తిసఇన్వై వతముపార్చ్ఛ త్యథకో దేవాన హర హర్యాచిష్యతీతి తస్మాన్నోప స్థేయో 3 ౽థోఖల్వాహు రాశిషేవై కం యజమానో యజతఇత్యేషా ఖలువై ॥

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ఇచ్చట పుతము విచారార్థము. అగ్ని యుపస్థేయము ( సేవించఁదగినది )కాదని కొందరు చెప్పుచున్నారు. లోకమునందు మనుజుఁడేయయిన రాజుకొరకు నేదోఒకఫలము నెవఁడు కానుకగాఁదీసికొనివచ్చి పిమ్మటప్రతిదినము ఈరాజును క్షేత్రధనాధికమును యాచించునో! వాఁడురాజును పీడించుచున్నవాఁడే యగుచున్నాడు. ఇదియిట్లుండగా గొప్పప్రభావముకల దేవతలను ప్రతిదినమెవఁడు యాచించగలడు? కావుననగ్ని సేవించఁదగినది కాదని - రెండవపూర్వపక్షము. ప్రాతఃకాలమున మాత్రమే యగ్ని సేవించఁదగినదికాదని మొదటిపూర్వపక్షము. ఎపుడునుసేవించరాదని రెండవపూర్వపక్షము. అనివివేకము. ) 3 ఇచ్చట సిద్ధాంతము చెప్పంబడుచున్నది. అథో శబ్దముపూర్వపక్షమును నిరాకరించునది. ( తనకపేక్షితమగు సర్వమును గోరుటకే ) ప్రజాపతిసమానుండును, సర్వదేవాత్మకుండునగు నగ్నిని యజమానుఁడు యాచించు చున్నాడని పండితులం చెప్పుచున్నారు. ఆహితాగ్నియొక్క మంత్రము అగ్నిని స్తోత్రము చేయుచున్నదికావున నగ్ని సేవించఁదగినది. లోకమునందుఁగూడ రాజు యొక్క చిత్తవృత్తి నెఱుంగక నసమయమునందు యాచించినచో నపరాధమేయగును. ప్రశంశాపూర్వకముగాఁగాని, వినోదపూర్వకముగాఁగాని, సంతోషమునుబుట్టించి

యాచించినచో, నుత్సాహవంతుండగు నారాజు అడిగినదానికంటె నధికముగానెట్లు యిచ్చుచున్నాడో! ఆవిధముగానే ఆహితాగ్నికి మంత్రముచే స్తోత్రముచేయుటయే యాచ్ఞ. ఆయాచ్ఞ ప్రశంసాపూర్వక మగుటచే నపరాధము కానేరదు. అత్యన్త సంతోషముకొరకే యగుచున్నది. కావున నగ్ని సేవింపందగినదియేయని సిద్ధాన్తము.

పంచాశత్తు ౭.

౧౮౮. ఆహితాగ్నే రాశీర్యదగ్ని ముపతిష్ఠతే తస్మాదుపస్థేయః ౨ ప్రజాపతిః పశూ
నసృజత తేసృష్టా అహోరాత్రే ప్రావిశన్తాంఛన్దో భిరన్వ విన్దద్యచ్ఛన్దోభి రుపతి
ష్ఠతే స్వమేవత దన్విచ్ఛతి ౩ నతత్రజామ్యస్త్యాహుర్యోz హరహరుప
తిష్ఠత ఇతి ౪ యోవా అగ్నిం ప్రత్యఙుపతిష్ఠతే ప్రత్యేనమోషతి యః పరా
ఙ్విష్వఙ్ప్రజయా పశుభి రేతికవాతిర్యఙ్ఙి వోపతిష్ఠేతనైనం ప్రత్యోషతి నవి
ష్వఙ్ప్రజయా పశుభి రేతి ॥

౧ ఈ వాక్యార్థము పైపఞ్చాశత్తులో వ్రాయంబడినది. ౨ ప్రజాపతిపశువు లనుబుట్టించెను. ఆసృజింపంబడిన పశువు లహోరాత్రములను బ్రవేశించినవి. (అహోరాత్ర దేవతలచే దాచంబడినవని తా) ఋక్కులచే (నగ్నిని) స్తోత్రముచేసి నచో, ఆపశువులనుఋక్కులచే దెలిసికొనును. ఋక్కులచే స్తోత్రముచేయుట అష్టవసువులను వెదకుటకొఱకగుచున్నది. ౩ ఎవండగ్నినిం బ్రతిదినము సేవించునో! ఆయుపస్థానమునందు (వానికి) ఆలస్యముండదు. ౪ ఎవండగ్నిని ప్రత్యఙ్ముఖుండై (సేవించునో) వీనినీయగ్ని ప్రతికూలముగ దహించును. ఎవండు పరాఙ్ము

ఖుఁడై (సేవించునో) ఆయజమానుఁడు సంతానముతోను, పశువులతోను, వియుక్తుఁడగును. ఎవఁడుకొంచెము ముఖమువంచినవాఁడై సేవించునో! ఆ యజమానుని అగ్ని ప్రతికూలముగా ధహింపఁడు. యజమానుఁడును సంతానముతోను పశువులతోను వియుక్తుఁడుకాడు.

నవమానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౧౦.

౧౫౯. మమనామ ప్రథమంజాతవేదః పితామాతా చదధతుర్యదగ్రే తత్వంబిభృహిపునరామదైతో స్తవాహంనామబిభరాణ్యగ్నే ౨ మమనామతవచజాతవేదోవాససీఇవవివసానో యేచరావః। ఆయుషేత్వం జీవసేవయం యథాయథం విపరిదధా వహైపునస్తే। 3 నమోzగ్నయేz ప్రతివిద్ధాయనమోzనా ధృష్టాయనమః సమ్రాజే। అషాఢః ॥

౧ ఓ జాతవేదుఁడా! (అగ్నీ!) నాకుమొదట తలిదండ్రులు ఏపేరును జేసిరో! ఆపేరును నాపునరాగమనపర్యన్తము నీవుధరించుము. ఓ యగ్నీ! నేనుకూడా నీపేరుధరించుదును. (నీవిచ్చటవైకల్యమును బోగొట్టుచు నాకార్యమునుసాధించుము. నీపేరునుధరించుచున్న నాకుఁబోవుచున్నప్రదేశమునందువైకల్యమే సంభవించదనిభావము,) ౨ ఓ యగ్నీ! నాకు "దేవదత్త" యను పేరు

ను, నీకు "వహ్నా" యనుపేరును ఏవికలవో వాటినిమార్పుచేసి పరస్పర వస్త్రములవలె వ్యత్యాసముగా నుంటున్నవారలమై సంచరింతము. (పిమ్మట) ఆపేర్లను పూర్వమువలె (నీపేరునునీవును, నాపేరును నేనును) మార్పుచేసి యాయుర్వృద్ధికొఱకు, ధనాదిసమృద్ధికొఱకును ధరింతము. ౩ (ఎవ్వనిచేతను) కొట్టఁబడని యగ్నికొఱకు నమస్కారము. (ఎవ్వనిచేతను) తిరస్కరించఁబడని యగ్నికొఱకు నమస్కారము. బాగుగాఁబ్రకాశించుచున్న యగ్నికొఱకు నమస్కారము. ఈ యగ్ని యపరిమితాన్నము కలవాఁడు. సర్వమును జయించువాఁడు. (స్వయముగా) సహనశీలుఁడు. శ్రేష్ఠుఁడు. సంగీతాదికళలందు మిక్కిలినేర్పరి.

పంచాశత్తు ౨.

౧౯౦. ౧ అగ్నిర్బృహద్వయా విశ్వజిత్సహన్త్యః శ్రేష్ఠోగంధర్వః। ౨ త్వత్పి
తారో అగ్నేదేవాస్త్వామాహుతయస్త్వద్వివాచనాః। సంమామాయు
షాసంగౌపత్యేన సుహితేమాధాః। ౩ అయమగ్నిః శ్రేష్ఠతమోఽయం
భగవత్తమోఽయగ్ం సహస్రసాతమః। అస్మాఅస్తుసువీర్యమ్। ౪ మ
నోజ్యోతిర్జుషతామాజ్యం విచ్ఛిన్నంయజ్ఞగ్ం సమిమందధాతుయా ఇష్టా
ఉషసో నిమ్రుచశ్చతాః సందధామి హవిషాఘృతేన। ౫ పయస్వతీ
రోషధయః॥

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ దేవతలు నీవు పాలకుండవుగాఁగలవారు. నిన్నుఁబొందినయాహుతులుకలవారు. నిన్నేప్రకటిం

చువారు. ఓయగ్నీ! నన్ను దీర్ఘాయువుతోఁగలుపుము. గోవులకుస్వామినిగాఁగలుపుము బాగుగాహితమగు పురుషార్థమునందు నన్నుస్థాపించుము. (ప్రఖ్యాపయితా = ప్రకటనచేయువాఁడు.) 3 ఈయగ్ని మిక్కిలిశ్రేష్ఠుఁడు. ఈయగ్నియతిశయముగా నైశ్వర్యాది సంపత్తుకలవాఁడు. (భగవత్తమః) ఈయగ్ని సహస్రసంఖ్యకల ధనమును దానముచేయువారిలో మిక్కిలిదాత. అట్టియగ్ని యనుగ్రహమువలన నీయజమానుఁడనగు నాకొఱకు గొప్పసామర్థ్యముండుఁగాక (భగవత్తమః = సను నైశ్వర్యము, ధనము, యశస్సు, సంపత్తు, జ్ఞానము, వైరాగ్యము, ఈయారును భగపదమునకర్థములు. ఈయారుచు కలవాఁడే భగవంతుఁడు. ఇవియందరికంటె నతిశయముగాఁగలవాఁడు భగవత్తముఁడు. అని పురాణప్రసిద్ధమయిన యర్థమని. భాష్యము. భూతముల యుత్పత్తిని, ప్రళయమును, అగతిని, గతిని, విద్యను, దెలిసికొనినవాఁడు భగవంతుడని మఱియొకయర్థముకూడ భాష్యములోఁగలదు ౪ ఇందుఁబూర్వార్థము "భూమిర్భూమ్నా" అను యనువాకమునందు వ్యాఖ్యానము చేయఁబడినవి. ఏవి ప్రాతఃకాలమునందలి యాహుతులు, సాయంకాలమునందలియాహుతులు కలవో వాటినన్నిఁటిని ఈయాజ్యరూపమగు హవిస్సుచేనవిచ్ఛిన్నముగాఁ జేయుచున్నను ౫ ఈవాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు 3.

౧౯౧. పయస్వద్వీరుధాంపయః అపాంపయసో యత్పయస్తేనమామింద్రసగ్ంసృజ

౨ అగ్నేవ్రతపతే వ్రతంచరిష్యామి తచ్ఛకేయంతన్మేరాధ్యతామ్ 3

అగ్నిగ్ంహోతారమిహ హతగ్ంహువేదేవాన్యజ్ఞి యానిహయావహామహే।

ఆయన్తుదేవాః సుమనస్యమానావియన్తు దేవాహవిషోమేఅస్య। ౪ కస్త్వా

యున_క్తి సత్వాయునక్తు౫ యానిఘుర్మే కపాలాన్యుపచిన్వన్తి ॥3॥

౧ ఓషధులు సారముకలవి. తీగలయొక్క సారముకలవి. ఉదకములలో (నేసారముకలదో) గోవు మొదలగువాని క్షీరముయొక్క సారమేది (కలదో) ఓ యింద్రా ! ఆసారముతో నన్నుగూర్పుము.
౨ వ్రతములకుఁబ్రభువగు నోయగ్నీ! వ్రతమును (కర్మ) చేతును. ఆకర్మచేయుటకు సమర్థుఁడను కాగలను. నాకర్మ సమృద్ధమగుఁగాక ౩ ఈకర్మయందు దేవతల నాహ్వానము చేయునట్టి యగ్నినిఁ బిలుచుచున్నాను. ఈకర్మయందు ఏదేవతల నుద్దేశించి హోమము చేయుచున్నారమో! యజ్ఞసంబంధులగు నాదేవతలను గూడఁబిలుచుచున్నాను. పిలువఁబడిన యాదేవతలుకూడ మంచిమనస్సుకలవారై వత్తురుగాక. (వచ్చియు) నాహవిస్సును భక్షింతురుగాక. ౪ ఓయజ్ఞమా! ప్రజాపతి నిన్ను (అంతటను) యోగ్యముగాఁజేయుఁగాక. (కావున నిచ్చటఁగూడ) ఆ ప్రజాపతియేనిన్ను యోగ్యముగాఁజేయుఁగాక. ౫ ఈవాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౪.

౧౫౨. ౧ వేధసః । పూష్ణస్త్వాపి వ్రతఇన్ద్రవాయూ విముఞ్చతామ్। ౨ అభి

న్నోఘర్మోజీరదానుర్యత ఆత్తస్తదగన్పునః। ఇధ్మోవేదిః పరిధయశ్చ

సర్వేయజ్ఞస్యాzzయురను సంచరన్తి । ౩ త్రయస్త్రింశత్తన్తవోయే

వితత్నిరేయ ఇమంయజ్ఞగ్ం స్వధయాదదన్తేతేషాం ఛిన్నంప్రత్యేతద్ద

ధామిస్వాహా ఘర్మోదేవాగ్ంఅప్యేతు ॥

౧ బ్రహ్మసమానులు, హోమకులునగు ఋత్విక్కు లేపెంకుల నగ్నియం దుఁగాచుచున్నారో, వాటినన్నిఁటిని వ్రతముసమాప్తమయినదగుచుండగా నింద్ర వాయువులు విడుచుదురుగాక. ౨ కాచఁబడిన ఈకపాలము వేరుగా గన్పించు చున్నను మంత్రసామర్థ్యమువలన భిన్నముకానిదిగానే కన్పట్టుచున్నది. ఏ కార ణమువలన నీకపాలము పురోడాశముద్వారా యజ్ఞమునకు) జీవనమునిచ్చునట్టిదో ఎవఁడితరుని దీవించుచున్నాఁడో, వాఁడు స్వయముగ నెట్లుభిన్నుఁడగును? అని భావము. ఏమట్టినుండి (కారణమునుండి) కపాలము పుట్టినదో మఱల నాకార ణమందేయణఁగినది. (కారణరూప మృదాకారముగాఁ బ్రకాశించుచున్నది అని) దీనివలన సత్కార్యవాదము స్ఫురించుచున్నది. ఇధ్మము, వేదియు, పరిధియు, (మొదలగునవి) అన్నియుయజ్ఞముయొక్క యాయువుననుకరించి సంచరించుచున్నవి. 3 నాల్గవకాండయందు "ప్రజాపతిర్మనసా" అనుయనువాకమునందు యిష్టకోప ధానముకొఱకు యజ్ఞతనువులనుపేరుగల ముప్పదిమూఁడు మంత్రములు చెప్పఁ బడినవి. ఆమంత్రములచేఁ జెప్పఁబడిన యజ్ఞతనువులిచ్చట తంతుస్థానీయములు. దారములచే వస్త్రమేవిధముగ నిర్మింపఁబడునో ఆవిధముగ నీయజ్ఞతనువులు యజ్ఞమును విస్తరింపఁజేయును.) ముప్పది మూడగు నేయజ్ఞతనువులు (యజ్ఞమును) విస్తరింపఁజేసినవో ఏ ఋత్విగాదులు హావిస్సుచే నీ యజ్ఞము ననుష్ఠించుచున్నారో ఆప్రజాపతి మొదలగు యజ్ఞాభిమాని దేవతలయొక్కయు, ఋత్విగాదియజ్ఞాంగముల యొక్కయు, మధ్యయందేస్వరూపము విచ్ఛిన్నమైనదో, ఆస్వరూపమును విచ్ఛిత్తి లేనిదానినిగాఁ జేయుచున్నాను. (కావున) బాగుగా విచ్ఛిత్తిలేకుండగఁ జేయబడి నదియు, కాచబడినదియు నగుయజ్ఞాఙ్గవిశేషము (కపాలము) దేవతలనుగూడఁబొం దుఁగాక. (కపాలము=పెంకు)

దశమానువాకముసమాప్తము

—:-o-:—

అనువాకము ౧౧.

౯౩. వైశ్వానరోన ఊత్యాzz ప్రయాతుపరావతః। అగ్నిరుక్థేనవాహసా। ౨ ఋతావానం వైశ్వానరమృతస్యజ్యోతిషస్పతిమ్। అజస్రంఘర్మమీమహే ౩ వైశ్వానరస్యదగ్ంసనాభ్యో బృహదరిణాదేకః స్వపస్యయాకవిః ఉభాపిత రామహయన్న జాయతాగ్నిర్ద్యావా పృథివీభూరిరేతసా। ౪ పృష్టోదివిపృష్టో అగ్నిః పృథివ్యాంపృష్టోవిశ్వా ఓషధీరావివేశ। వైశ్వానరః సహసాపృ ష్టోఅగ్నిః సనోదివాసః।

౧ సమస్తజనులకుపకారియగు నగ్నీ!రక్షణనిమిత్తమై దూరదేశమునుండియు బొందించుటకు సమర్థమైనట్టియు, నుత్థానపూర్వకమగు నాగమనముచే మమ్ముం గూర్చివచ్చుగాక. (ఉత్థానము=లేచుట) ౨ సత్యవంతుఁడైనట్టియు, నభీష్టఫల ప్రకాశకమగు యజ్ఞమునకుఁ బాలకుఁడైనట్టియు, నెల్లప్పుడుఁ బ్రకాశించుచున్నట్టి వైశ్వానరాగ్నిని మేము పొందగలము. (వైశ్వానరః = సమస్తజనులకుపకారి అని వ్యుత్పత్తి.) ౩ బుద్ధిమంతుఁడగు నొక యజమానుఁడు మంచికర్మయగుటచే వైశ్వానరయాగ సంబంధములైన క్రియలవలన గొప్పఫలమునొందును. ఈ యగ్ని ద్యావాభూమిస్వరూపులును గొప్పరేతస్సు కలవారునగు తల్లి తండ్రులనిద్దరిని లోకపూజ్యులనుగాఁ జేయుచుఁదాను పుట్టెను. (కావున నీ వైశ్వానరయాగము నకు గొప్పఫలయుక్తమనిభావము.) ౪ ఈ యగ్ని యాదిత్యరూపముచే ద్యులోకమం దున్నవాడు. భూలోకమునందు (దాహ, పాక, ప్రకాశములనుచేయుటచే) నున్నవాఁడును, స్పృశించుచున్నవాఁడనై సర్వౌషధులను బ్రవేశించెను. వైశ్వా

నరాగ్నిబలముచే (గూడుకొనినవాడు. అట్టియగ్ని మమ్ము(బగటియందు పాపము నుండిరక్షించుగాక. ఆయగ్ని రాత్రియందుకూడ మమ్మురక్షించు(గాక.

పంచాశత్తు ౨.

౧౯౪. ౧ ఓమగపాతునక్తమ్ ౨ జాతోయదగ్నే భువనావ్యఖ్యః పశుంనగోపాఇర్యఃపరిజ్మా। వైశ్వానరబ్రహ్మణేవిన్దగాతుం యూయంపాతస్వస్తిభిః సదానః। ౩ త్వమగ్నేశోచిషా శోశుచాన ఆరోదసీ అపృణాజాయమానః। త్వందేవాగ్ం అభిశస్తేరముఞ్చో వైశ్వానరజాతవేదో మహిత్వా। ౪ అస్మాకమగ్నే మఘవత్సుధారయానామి క్షత్రమజరగ్ం సువీర్యమ్। వయంజయేమ శతినగ్ం సహస్రిణంవైశ్వానర॥

౧ ఓయగ్నీ! అన్నమునకుపయోగించుచున్నట్టియు, నంతటనుపోవునట్టి నీవు పుట్టినవాఁడవైయై, లోకములను ( తేజస్సుచే ) విశేషముగా, గోపాలకులు పశువులనువలె ప్రకటనచేసితివి. ( గోపాలకుఁడు అనాయాసముగానే ఈపశువు ఈతనిదనియేవిధముగాఁ బ్రకటనచేయునో! ఆవిధముగాననిభావము. ) ఇటువంటివాఁడవు కావున నోవైశ్వానరాగ్నీ! గొప్పదగు నీకర్మకొరకు మార్గమును బొందుము. మీరెల్లప్పుడు శ్రేయస్సులచే మమ్మురక్షించుడు. ( మీరుఅను భవవచనము పూజార్థము. ) ౨ ఓయగ్నీ! నీవు బాగుగాఁ బ్రకాశించుచున్నవాఁడవై పుట్టుచునే ద్యావాభూములను ప్రకాశముచే నంతటను నిండించినవాఁడవగుచున్నావు. పుట్టిన జగత్తును గుర్తెరిఁగినవైశ్వానరాగ్నీ! నీవుస్వమహిమచే ఋత్విక్కులను బాపము

నుండివిడిపించుము॥ 3 ఓయగ్నీ! (ఎవ్వనికిని) నమస్కారము చేయని స్వభావము కలిగినట్టియు, ముసలితనము లేనట్టియు, భగ్నముకాని సామర్థ్యముకల పాలకుఁడగు పురుషుని ఇంద్రులయందు స్థాపించుము. (ఇంద్రసమీపము నందున్న వానినిఁగాఁ జేయుమనిభావము.) ఓవైశ్వానరాగ్నీ! నీరక్షణచే మేముకూడా అనేకులతోఁగూడు కొనిన యన్నమును జయింతుము.

పంచాశత్తు 3.

౧౯౫. వాజమగ్నే తవోతిభిః ౧ వైశ్వానరస్య సుమతౌస్యామ రాజాహికం భువనానామభిశ్రీః ఇతోజాతో విశ్వమిదం విచష్టేవైశ్వానరోయతతే సూర్యేణ ౨ అవతేహేడోవరుణ నమోభిరవ యజ్ఞేభిరీమహేహవిర్భిః క్షయన్న స్మభ్యమసురప్రచేతో రాజన్నేనాగ్ంసి శిశ్రథః కృతాని 3 ఉదుత్తమం వరుణపాశమస్మ దవాధమం విమధ్యమగ్ం శ్రథాయ। అథా వయమాదిత్య॥

౧ మేమువైశ్వానరాగ్నియొక్క యనుగ్రహబుద్ధి యందుందుము. పొందఁబడిన సంపత్తుకల వైశ్వానరాగ్ని సమస్త లోకములకుఁ బ్రకాశకుఁడుకదా! ఈకారణమువలననే పుట్టినంతలోనే ఈప్రపంచమును విశేషముగాఁ బ్రకటనచేయుచున్నాఁడు. ఈవైశ్వానరాగ్ని సూర్యరూపముచే (పగటియందు) సంచరించుచున్నాడు. ౨ ఓ వరుణుఁడా! నమస్కారములచేతను, యజ్ఞవిశేషములచేతను, నీకోపమును బోఁగొట్టుదుము. ఓశత్రువులను బోఁగొట్టుటకు సమర్థుఁడా! ఓ ప్రకాశిం

చుచున్నవాఁడా! మాకొఱకు నిపసించుచు, మాచేఁజేయఁబడిన పాపమును బోఁగొట్టుము. 3 ఓవరుణుఁడా! ఉత్తమాంగమగు శిరస్సునందు ( స్థాపించఁబడిన యీ) పాశము నెత్తి పోఁగొట్టుము. పాదమునందలి పాశమును విప్పిపోఁగొట్టుము. మధ్య దేశమునందలి పాశమును ఛేదనముచేయుము. సూర్యసమానుఁడవగు నోవరుణుఁడా! పాశత్రయనాశానన్తరము మేము పాపరహితులమగుచు నీయొక్క కర్మయందఖండత్వ ముకొఱకు యోగ్యులమగుదుము.

## పంచాశత్తు ౪.

౧౯౬ వ్రతేతవానాగసో అదితయేస్యామ ౧ దధిక్రావ్ణోఅకారిషం జిష్ణోరశ్వస్య వాజినః। సురభినోముఖాకరత్ప్రణఆయూగ్ంషితారిషత్। ౨ ఆదధిక్రాశ్శవ సాపఞ్చకృష్టీః సూర్యఇవజ్యోతిషాzపస్తతాన। సహస్రసాః శతసావాజ్య ర్వాపృణక్తు మధ్వాసమిమావచాగ్ంసి। 3 అగ్నిర్మూర్ధాభువః। ౪ మరు తోయద్ధవోదివః సుమ్నాయన్తోహవామహే। ఆతూనః ॥౪॥

౧ జయశీలుఁడు,వ్యాపించువాఁడు, అన్నముకలవాఁడునగు దధిక్ర(పెఱుగునుబొందు పాడనివ్యుత్పత్తి) యను దేవునకు (నేను) కర్మను జేసితిని. ఆ దేవుఁడు మాముఖమును సుగంధముతోఁ గూడుకొనునట్లుగాఁ జేయుఁగాక. మాయాయువులను వృద్ధినొందించుఁ గాక. ౨ సహస్రసంఖ్యకల ధనము నిచ్చునట్టియు, నన్నముకలిగినట్టియుఁ గర్మభూమి యందుఁ బోవుచున్నట్టి యీదధిక్రయను దేవుఁడు అయిదవనిషాదవర్ణముతో గూడిన నాలుగు వర్ణములచే, నైదువిధములగు మనుష్యులకు నన్నము గలుగఁజేసి సూర్యుఁడేవిధముగాఁ గిరణముచే (భూరసమును దీసికొని వర్షాకాలమునందు)

ఉదకమును విస్తరింపఁ జేయుచున్నాఁడో! ఆవిధముగా విస్తరింపఁ జేయుచున్నాడు అట్టి దధిక్రయను దేవుఁడు మధురములయిన నాయీస్తుతిరూపవాక్కు-ల నంగీకరించుఁగాక. ౩ ఇది యాగ్నేయహవిస్సునందు యాజ్యాపురోనువాక్యల యొక్క ప్రతీకద్వయము. ఇందు "అగ్నిర్మూర్ధా" అనునది "ఉపప్రయన్త" అను యనువాకమున వ్యాఖ్యానము చేయఁబడినది. "భువః" అనునది (యాజ్యానువాక్య) నాల్గవయష్టకమునందు వ్యాఖ్యానము చేయఁబడును. ౪ ఓమరుద్గణములారా! ఏకారణము వలన (మేము) సుఖమును గోరుచున్న వారమై ద్యులోకమునుండి మిమ్ముఁ బిలిచితిమో! (ఆకారణమువలన) పిలువఁబడినమీరు మమ్ముఁ బొందుడు.

పంచాశత్తు ౫.

౧౯౭. ఉపగన్త న ౧ యావశ్శర్మశశమా నాయసన్తి త్రిధాతూని దాశుషేయచ్ఛతాధి అస్మభ్యంతానిమరుతో వియన్తరయింనో ధత్తవృషణః సువీరమ్ ౨ ఆదితిర్న ఉరుష్యత్వదితిః శర్మయచ్ఛతు అదితిః పాత్వగ్ంహసః ౩ మహీమూషుమాతరగ్ం సువ్రతానామృతస్య పత్నీమవసేహువేమ తువిక్షత్రామజరన్తీ మురూచీగ్ం సుశర్మాణమదితిగ్ం సుప్రణీతిమ్ ౪ సుత్రామాణం పృథివీం ద్యామనేహసగ్ం సుశర్మాణమదితిగ్ం సుప్రణీతిమ్। దైవీంనావగ్ంస్వరిత్రామనాగసమస్రవన్తీ మారుహేమా స్వస్తయే। ౫ ఇమాగ్ంసునావమారుహగ్ంశతారిత్రాగ్ంశతస్ఫ్యమ్। అచ్ఛిద్రాంపారయిష్ణుమ్ ॥

౧ ఓ మరుద్గణములారా! మిమ్ము సేవించువానికొఱకిచ్చుటకై (సంపాదింపఁబడిన యేధనములుకలవో! ముల్లోకములందున్న యేసుఖములను హవిస్సు నిచ్చువానికొఱకధికమగునట్లుగా నిచ్చుచున్నారో! వాటినన్నిఁటిని మాకొసంగుడు. (మఱియు) నభిమతఫలమును వర్షించునోమరుద్గణములారా! ధనమును,శోభనపుత్రుని మాకొసఁగుడు. ౨ భూమి మమ్ము (శత్రువులనుండి) రక్షించుఁగాక. భూమి సుఖమునిచ్చుఁగాక. భూమి పాశములేనిదై రక్షించుఁగాక. 3 పూజ్యురాలును మంచికర్మలుకల పురుషులకుఁ దల్లివలె హితముసేయునదియు, సత్యమునకుఁ బాలకురాలును, అనేకరాజులచేఁ బాలింపఁబడినదియు, (ఎల్లపుడు) ముసలితనము లేనిదియు, విస్తీర్ణమగు గమనము గలదియు, మంచి సుఖముతోఁ గూడుకొనినదియు, సుఖముగాఁ గర్మల బొదించునదియునగు భూదేవతనే మారక్షణకొఱకు బాగుగాఁ బిలుతుము. ౪ బాగుగా రక్షించునదియు, విస్తీర్ణమయినదియు, ప్రకాశించుచున్నదియుఁ, గాలస్వరూపమైనదియు, (చిరకాలముండుననితా।) దేవనిర్మితమైన నావయైనదియు, (మనుజనిర్మితమగు నావ సముద్రపైభాగమున నేవిధముగానుండునో! (దేవనిర్మితమగు భూమియనునావ మహాజలమునకుఁ బైభాగమున నుంటున్నదని భావము) బాగుగా శత్రువులనుండి రక్షించునదియుఁ, బాపరహితురాలైనదియు, ఛిద్రరహితురాలునగు భూదేవతను క్షేమముకొఱకుఁ బొందుదుము (ఛిద్రము=కన్నము) ౫ రక్షకములగు నూరుఆయుధములు కలదియు, స్ఫ్యసదృశములగు నూరు తరణదండములు (ఓడగడుపుతెడ్లు) కలదియు కన్నములేనిదియు, నభీష్టఫలమున కంతమును బొందించుటకు సమర్థురాలునగు నీ భూమిని నావతోసమానమైన దానినిగాఁబొందినవాఁడనైతిని.—

ఇట్లు ప్రథమాష్టకమునఁ బంచమప్రపాఠకము సమాప్తము.

—*—

## ప్రపాఠకము ౬.

### అనువాకము ౧.

౧౯౮. ౧ సంత్వాసిఞ్చామి యజుషాప్రజామాయుర్ధనంచ। బృహస్పతిప్రసూతో యజమాన ఇహమారిషత్ ౨ ఆజ్యమసి సత్యమసి సత్యస్యాధ్యక్షమసి హవిరసి వైశ్వానరం వైశ్వదేవ ముత్పూత శుష్మగ్ం సత్యౌజాఃసహోఽసి సహమానమసి సహస్వారాతీః సహస్వారాతీయతః సహస్వపృతనాః సహస్వపృతన్యతః। సహస్రవీర్యమసి తన్మాజిన్వాఽఽజ్యస్యాఽఽజ్యమసి సత్యస్యసత్యమసి సత్యాయుః ॥౧॥

౧ ఓ యాజ్యమా! బృహస్పతిచేఁ బ్రేరణచేయఁబడిన నేను సంతానమును ఆయువును, ధనమును సంపాదింతును. నిన్ను ఈమంత్రముచేఁ బాత్రయందు బాగుగాఁ దడుపుచున్నాను. ఈ కర్మయందు యజమానుఁడు హింసింపఁబడకుండుఁగాక! ౨ ఓ యాజ్యమా! (కర్మలలో నడిపించువాఁడవు అగుచున్నావు.) (నేతిచే హోమాధారమగునగ్ని ప్రజ్వలించుచున్నదై పొందఁబడుచున్నదని భావము.) కర్మఫలము నివ్వఁదగుదువు. (సాధనమని తా) సత్పురుషఁగు ఋత్విజులకు కర్మస్వామి వగుచున్నావు. (జ్యోతిష్టోమమునందున్న ఋత్విజులు యజమానునితోఁ బదునేడుగురు) సత్పురుషులు పరస్పరము ద్రోహశంకను పోఁగొట్టుకొనుటకై తానూనప్త్రమను అజ్యమున తాకుచున్నారు. ఆస్పర్శ

సత్పురుషులకర్మ. ఆకర్మకు స్వామివగుచున్నావు అనిభావము. ప్రధానముగా హోమము చేయఁబడుదానవగుచున్నావు. సమస్తజనులకు ( భోజ్యమగుటచే) సంబంధివగుచున్నావు. సమస్తదేవతలకు (హవిస్సవగుటచే) సంబంధి వగుచున్నావు. సత్యమగు బలము కలదానవు. గొప్పబలము కలదానవు. శత్రువులను దిరస్కరించుటకు సమర్థమైనదానవు, శత్రుతిరస్కారముతో నున్నదానవునగు నీవు మాశత్రువులఁ దిరస్కరించుము. ఎవరు ప్రత్యక్షముగా శత్రుకర్మనుఁ జేయుటక సమర్థులై మనస్సుచేఁజేయుట నిచ్ఛయించుచున్నారో వారినిగూడ తిరస్కరించుము. శత్రుసేనలను దిరస్కరించుము. సేనలను సంపాదించుటకుఁ గోరుచున్న శత్రువులనుగూడ తిరస్కరించుము. అనేక విధమైన సామర్థ్యముకలదానవు. ఇట్టిస్వభావముకల ఓ యగ్ని ! (యాగముద్వారా) నన్ను సంతోషపెట్టుము. లౌకికరాజ్యమునకుగూడ ఆజ్యమగుచున్నావు. (అనగాముఖ్యమనిభావము) లౌకికఫలసాధనమగు కృష్యాదికమునకు స్వామివగుచున్నావు. సత్యమగునాయువుకలదానవు. (ఆజ్యముచే గలిగిన కర్మచేరాబోవు శరీరమునందేయాయువుపొందింపబడుచున్నదో యాయాయుస్సుస్థిరమైనదికావున ఇచ్చటసత్యాయుష్త్వముచెప్పఁబడినది.) సత్యఫలముకలదానవు. అటువంటినిన్ను కంటితోఁజూచుచున్నాను. అటువంటినిన్నుఁ బొందుచున్నాను.

పంచాశత్తు ౩.

౧౯౯. అసిసత్యశుష్మమసి సత్యేనత్వాఽభిఘారయామి తస్యతేభక్షీయ ౨ పఞ్చా
నాంత్వావాతానాంయన్త్రాయ ధర్త్రాయ గృహ్ణామి పఞ్చానాంత్వర్తూనాం
యన్త్రాయ ధర్త్రాయ గృహ్ణామి పఞ్చానాం త్వాదిశాం యన్త్రాయ ధర్త్రాయ
గృహ్ణామి పఞ్చానాంత్వా పఞ్చజనానాం యన్త్రాయ ధర్త్రాయ గృహ్ణామి

చరోస్త్వా పఞ్చబిలస్య యన్త్రాయ ధర్త్రాయ గృహ్ణామి బ్రహ్మణస్త్వా తేజసే యన్త్రాయ ధర్త్రాయ గృహ్ణామి క్షత్రస్య త్వౌజసే యన్త్రాయ ౨ ధర్త్రాయ గృహ్ణామి విశే త్వా యన్త్రాయ ధర్త్రాయ గృహ్ణామి సువీర్యాయ త్వా గృహ్ణామి సుప్రజాస్త్వాయ త్వా గృహ్ణామి రాయస్పోషాయ త్వా గృహ్ణామి బ్రహ్మవర్చసాయ త్వా గృహ్ణామి భూరస్మాకగ్ం హవిర్దేవానామాశిషో యజమానస్య దేవానాం త్వా దేవతాభ్యో గృహ్ణామి కామాయ త్వా గృహ్ణామి ।

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ తూర్పు మొదలు ఊర్ధ్వాన్తము ఐదుదిక్కులందుండు వాయువులనుకాని, శరీరమునందుండు ప్రాణాపాన, వ్యానో, దాన, సమాన, రూపవాయువులనుగాని స్వస్వవ్యాపారములందు నియమించుటకొఱకు జగత్తునుధరింపఁజేయుటయందలి కౌశల్యము (నేర్పరితనము) కొఱకును ఓ యాజ్యమా! నిన్ను గ్రహించుచున్నాను. ఈతరువాయి వాక్యముల యన్వయముకూడ నీవిధముగాఁ దెలిసికొనవలయును. ప్రతిపదార్థము మాత్రము వ్రాయఁబడుచున్నది. పఞ్చఋతువులు = ౧౨ మాసములకు నైదుఋతువులుగాఁ గూడ వ్యవహారము వేదప్రసిద్ధము. పఞ్చదిశః=ఊర్ధ్వదిక్కుతో గలిపి తూర్పు మొదలగు నాలుగు దిక్కులు. పఞ్చజనాః = దేవ మనుష్య అసుర రక్ష గంధర్వులు. చరుః = పాకాధారమగుస్థాలి. ఇదియైదురంధ్రములు కల్గియుండుట కల్పప్రసిద్ధము. బ్రహ్మణః= బ్రాహ్మణజాతియొక్క. తేజః = బ్రహ్మవర్చస్సు. క్షత్రస్య = క్షత్రియజాతియొక్క. ఓజః = యుద్ధసామర్థ్యము. విశే= వైశ్యజాతి సంబంధియగు కృషివాణిజ్యాదికము యొక్క,

(అనిష్పన్న్యస్తముగాఁ జెప్పవలయును.) సువీర్యమ్=అందరికిదమతమ వ్యాపారములందలి సామర్థ్యాతిశయము. సుప్రజాస్త్వమ్ = మంచి సంతానము కలిగియుండుట. రాయస్పోషః = ధనపుష్టి బ్రహ్మవర్చసమ్ = వేదశాస్త్రపరిజ్ఞానము "భూరస్మాకగ్ం హవిః" ఇత్యాదివాక్యమున కర్థముఁ వ్రాయఁబడుచున్నది. (ఓ యాజ్యమా! నీవు) మాశ్రేయస్సు కొఱకుఁగమ్ము. దేవతలకు హవిస్సువుకమ్ము. యజమానుని యాశీస్సువగుము. దేవతలదృప్తిపఱచునట్టి నిన్ను దేవతలకొఱకు గ్రహించుచున్నాను. (ఓ యాజ్యమా! హవిస్సును గ్రహించు దేవతలు నిన్నునేవిధముగాఁ గోరుచున్నారో అటువంటి.) దేవతల కామముకొఱకు నిన్ను గ్రహించుచున్నాను.

ప్రథమానువాకము సమాప్తము.

—*0*—

## అనువాకము ౨.

౨౦౦. ధ్రువోఽసి ధ్రువోఽహగ్ం సజాతేషు భూయాసంధీరశ్చేత్తా వసువిదుగ్రోఽస్యుగ్రోఽహగ్ం సజాతేషు భూయాసముగ్రశ్చేత్తా వసువిదభి భూరస్యభిభూరహగ్ం సజాతేషు భూయాసమభి భూశ్చేత్తావసువి ౨ ద్యునజ్మిత్వా బ్రహ్మణా దైవ్యేన హవ్యాయాస్మైవోఢ వేజాతవేదః। ౩ ఇధ్మానాస్త్వా సుప్రజసః సువీరా జ్యోగ్జీవేమ బలిహృతోవయంతే। యన్మేఅగ్నే అస్య యజ్ఞస్యరిష్యాత్ ।

౧ (ఓ మధ్యమపరిధీ ! నీవు) స్థిరమైనదానవగుచున్నావు. (అటువంటి నిన్ను మంత్రపూర్వకముగ సంస్కారము చేయుటచే) నేనుకూడ జ్ఞాతులలో స్థిరుఁడను కాగలను. (మఱియు ధైర్యవంతుఁడను రాక్షసులనుజంపుటను, (ఎట్లో) తెలిసికొనిన వాడను, ధనవంతుఁ)డను కాగలను. (ఓ దక్షిణపరిధీ ! నీవు రాక్షసులఁ జంపుటకు) తీక్ష్ణమగుచున్నావు (నిన్ను మంత్రపూర్వకముగ సంస్కరించుటచే) నేనును జ్ఞాతులలోఁ దీక్ష్ణుఁడను ఇత్యాదిపూర్వవత్ (ఓ యుత్తరపరిధీ ! నీవు రాక్షసులఁ) దిరస్కరించువాడను ఇత్యాదిపూర్వవత్. ౨ ఓ యగ్నీ ! దేవయోగ్యమగు మంత్రముచే నిన్ను ఈకర్మయందు హవిస్సును వహించుటకు యోగ్యునిగాఁ జేయుచున్నాను. ౩ఓ యగ్నీ ! నిన్నుఁ బ్రజ్వలింపఁ జేయుచున్న మేముశోభనమగు సంతానము కలవారము, శోభనములగు భృత్యులుకలవారమునై నీకుఁ బూజనుచేయుచుఁ జాల కాలము జీవింతుము.

## పంచాశత్తు ౩.

౨౦౧. యద్వాసన్నా దాజ్యస్యోతవిష్ణో। తేనహాన్మిసపత్నం దుర్మరాయుమైనం దధామి నిర్‌ఋత్యా ఉపస్థే। ౨ భూర్భువః సువ 3 రుచ్ఛుష్మో అగ్నేయజమానాయైధినిశుష్మో అభిదాసతే। అగ్నే దేవేద్ధ మన్విద్ధమన్ద్రజిహ్వ ర మర్త్యస్యతే హోతర్మూర్ధన్నా జిఘర్మి రాయస్పోషాయ సుప్రజాస్త్వాయసు వీర్యాయ ॥ మనోzసిప్రా జాపత్యంమనసా మాభూతేనాzzవిశ ౬ వాగ సైన్ద్రీ సపత్నక్షయణీ॥

౧ ఓయగ్నీ! ఏనా యజ్ఞముయొక్క యేబర్హిరాదికమో, (రాక్షసాదులచే) నశింపజేయఁబడినదగునో ఆజ్యమునకుఁగూడ సంబంధియగు నేస్వల్పబిందుసముదాయము (జుహువులోనిది) క్రిందబడునో, ఓవ్యాపకుఁడా! ఆనశింపఁబడినదానిచేతను క్రిందఁబడినదానిచేతను, శత్రువును చంపుదును. చంపుటకు శక్యుఁడు కాని శత్రువును పాపదేవతయొక్క తొడయందు స్థాపించుచున్నాను ౨ భూః — భువః — సువః — లోకత్రయవాచకములు. ఈహవిస్సులు లోకత్రయ స్వరూపములుగా స్తోత్రము చేయఁబడుచున్నవి. ౩ దేవతలచే ప్రకాశించుచున్నవాఁడా! కోపముచేఁ బ్రకాశించుచున్నవాఁడా! సంతోషకారణమైన నాలుకలు గలవాఁడా! ఓ యగ్నీ! యజమానునికొఱకు వ్యక్తమైన బలము కలవాడవుకమ్ము. శత్రువును దిరస్కరించు బలము కలవాడవుకమ్ము. (శత్రుకార్యములందు బలము నుపయోగించవలదని తా॥) ఇచట యజమానుననుగ్రహించుటకు, శత్రువును నిగ్రహించుటకు, అగ్నినాలుగుసంబోధనలచేఁ బ్రోత్సహింపబడినవాఁడు. ౪ దేవతల నాహ్వానముచేయునోయగ్నీ! మరణములేని నీశిరస్సునందు (యజమానుని) ధనపుష్టికొఱకు, మంచి సంతోషముకొఱకు, శోభనబలము కొఱకును, ఘృతాదికమును స్రవింపఁజేయుచున్నాను. ౫ (స్రువమునకు సంబంధించిన యాఘారమా!) నీవు మనస్సువు. ప్రజాపతి సంబంధివి యగుచున్నావు. ప్రజాపతిసృష్టమగు యజ్ఞముతో నాయందుఁ బ్రవేశింపుము. (స్రువము = నెయ్యి మొదలగుహవిస్సు హోమము చేయుటకు సాధనము. ఆఘారము = ఒకానొక నేతిధారకుపేరు.) ౬ (ఓ స్రుక్కునకు సంబంధించిన యాఘారమా!) నీవు యింద్రునిచే వ్యవహరింపఁబడుచున్నట్టియు, శత్రువులను నశింపఁ జేయునట్టి వాక్కువగుచున్నావు. అటువంటి వాక్కుతోను, చక్షురాదీంద్రియములతోను, నాయందుఁ బ్రవేశింపుము. (స్రుక్కు = ఇదియు స్రువమువంటి యజ్ఞాంగము.)

—*—

పంచాశత్తు 3.

౨౦౨. వాచామేన్ద్రియేణాऽऽవిశ ౧ వసన్తమృతూనాం ప్రీణామి సమాప్రీతః
ప్రీణాతు గ్రీష్మమృతూనాం ప్రీణామి సమాప్రీతః ప్రీణాతు వర్షాఋతూ
నాం ప్రీణామి తా మా ప్రీతాః ప్రీణన్తు శరదమృ
తూనాం ప్రీణామి సామాప్రీతా ప్రీణాతు హేమన్తశిశిరా వృతూనాం
ప్రీణామి తౌ మా ప్రీతౌ ప్రీణీతా ౨ మగ్నీషోమ యోరహం దేవయజ్యా
యాచక్షుష్మా న్భూయాస 3 మగ్నేరహం దేవయజ్యయాऽన్నాదో భూ
యాసమ్ ॥

(ఇచట వసన్త, గ్రీష్మ, వర్ష, శరత్, హేమన్తశిశిర, ఈ యైదు ఋతు వాచకపదములు సమిత్, ఇడ, బర్హి, తనూనపాత్, స్వాహాకార ఈ యైదు ప్రయాజా (యాగా) భిమాన దేవతలను చెప్పుచున్నవి. కావున వసన్తాదిపదములకు సమిద్యాగాది ప్రయాజాభిమాన దేవతలు అర్థమని యెఱుంగవలయును.) ఋతువులలోని సమిధలనభిమానించిన దేవతను (నేను) సంతోషపెట్టుచున్నాను. ఆ దేవత సంతోషించినదై నన్ను సంతోషపెట్టుగాక. గ్రీష్మాది పదములకుఁగూడ యీ విధముగానే అర్థమూహ్యము. ౨ అగ్నీషోమదేవతల సంబంధమైన దేవయాగముచే నేను చూపు గలవాడనగుదును. 3 (దర్శ పూర్ణమాసలలోఁ ప్రధానయాగములకు అగ్ని దేవత కావున) అగ్నిసంబంధియగు దేవయాగముచే నే నన్నము దినువాఁడనగుదును.

—:-0-:—

పంచాశత్తు ౫.

౨౦౩. దభ్ధిరస్యదబ్ధో భూయాసమముం దభేయ ౨ మగ్నీషోమయోరహం దేవ యజ్యయా వృత్రహాభూయాస ౩ మిన్ద్రాగ్ని యోరహందేవ యజ్యయేన్ద్రి యావ్యన్నా దో భూయాస ౪ మిన్ద్రస్యా హందేవ యజ్యయేన్ద్రియా వీభూ యాసం ౫ మహేన్ద్రస్యాహం దేవయజ్యయాజేమానం మహిమానంగమే య ౬ మగ్నేః స్విష్టకృతోzహం దేవయజ్యయాzz యుష్మాన్యజ్ఞేన ప్రతి ష్ఠాంగమేయమ్ ॥

౧ (ఓ యుపాంశు యాగదేవతా ! నీవు మాచేద్వేషింపఁ బడినవానికి) హింసకుఁడ వగుచున్నావు. (నీ యనుగ్రహమువలన శత్రువులచే) హింసితుఁడను కాను. ఈ శత్రువును చంపుదును. ౨ అగ్నీషోమదేవతల సంబంధమైన దేవయాగముచే నేను శత్రువును చంపువాడను కాగలను. ౩ ఇంద్రాగ్నుల సంబంధమైన దేవయాగముచే నేనింద్రియవంతుఁడను, (వీర్యవంతుడను) అన్నభక్షకుఁడను కాగలను. ౪ ఇంద్రుని సంబంధియగు దేవయాగముచే నింద్రియముతో కూడు కొనినవాడను కాగలను. ౫ మహేంద్రుని సంబంధియైన దేవయాగముచే నేను జయశీలతను, మహత్త్వమును పొందుదును. ౬ శ్విష్టకృత్తగు నగ్ని సంబంధియైన దేవయాగముచే నేను ఆయుష్మంతుఁడనై యజ్ఞముచేతఁ బ్రతిష్ఠను పొందుదును.

ద్వితీయానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౩.

౨౦౪. అగ్నిర్మా దురిష్టాత్పాతు సవితాఽఘశగ్ంసాత్ ౨ ద్యోమేఽన్తిదూరేఽ రాతీయతితమేతేన జేషగ్ం ౩ సురూపవర్షవర్ణ ఏహీమాన్భద్రాన్దుర్యాగ్ం అభ్యేహిమామను వ్రతాన్యే శీర్షాణిమృడ్ఢ్వమిడ ఏహ్యదిత ఏహిసరస్వత్యే హిరన్తిరసి రమతిరసి సూనర్యసిజుష్టే జుష్టింతేఽశీయోపహూత ఉపహవమ్॥

౧ దురిష్టమునుండి యగ్నినన్ను రక్షించుగాక. పాపవంతమైన రాక్షసాది సముదాయమునుండి సూర్యుఁడు నన్ను రక్షించుగాక. (దురిష్టము = మంత్రలోపము వలనగాని, క్రియాలోపము వలనగాని, సిద్ధమైన దుష్కర్మ యని తా.) ౨ ఏరాక్షసాది సముదాయము నాసమీపమునగాని, దూరమునగాని శత్రుభావమును కోరుచున్నదో, ఆశత్రుసముదాయము నీ యజమానభాగమైన యిడచేత జయింతును, (ఇడ= హోమము చేయగా మిగిలిన హావిర్విశేషము.) ౩ శోభనమగు శృంగపృచ్ఛాదిరూపము, ఘృతరూపమగు వర్షము, శుక్ల, కృష్ణ, కపిలత్వాది వర్ణములుకల ఓ యిడాదేవతా ! ఈ మాసంబంధములగు శాస్త్రోక్తయజ్ఞ సాధనములతో సంపూర్ణములైన యజ్ఞగృహములను గూర్చిరమ్ము, నన్ను నుద్దేశించి యీయజ్ఞవ్రతము నందనుకూలమైనదానవగుచు రమ్ము. (ఓ యిడావిశేషములారా ! మీరు) మాశిరస్సులను స్నేహపూర్వకముగ వాసనచూచుటచే మిక్కిలిశోధనము చేయుడు. (ఈఇడయొక్క పేర్లు స్పష్టముగ నిచ్చటచెప్పబడుచున్నవి.) ఓ యిడా ! రమ్ము ఓ యదితీ! సరస్వతీ! రమ్ము. రన్తివగుచున్నావు. రమతివగుచున్నావు సూనరివగుచున్నావు. ఓప్రియమైన యిడా! నీప్రీతినిపొందుదును. రమ్మనిమాచే ననుజ్ఞను పొందినయిడా! నేనుకూడ నీయనుజ్ఞను పొందుదును. ఈ యజ్ఞమునకు ఫలప్రార్థనారూపమై యేయాశీస్సుకలదో, ఆ యాశీస్సునాకు సత్యమగుగాక. అనాదరమునుచేయని మనస్సుచే నాఫలమును

(సాధించుటకు నీయనుగ్రహమువలన) సమర్థుఁడను కాగలను. నాచేననుష్ఠింపఁబడిన యీయజ్ఞము (క్రమముగా) స్వర్గము నధిష్ఠించుగాక. (యజ్ఞము నధిష్ఠించి యేస్వర్గమునందు హవిస్సులఁదిను దేవతలు నివసించుచున్నారో, ఆ) స్వర్గమునుపొందుగాక. ఏది దేవతలకు హవిర్భోజనశాలనుఁ గూర్చిపోవునట్టిమార్గమో, ఆమార్గముచే (ఈ యజ్ఞము) దేవతలనుఁ గూడపొందుగాక. (ఈయజ్ఞముచే సంతోషించినవాఁడై యింద్రుఁడు మాయందు (మఱియొక యజ్ఞము ననుష్ఠించుటకై) చక్షురాది పాటవమును స్థాపించుగాక. యజ్ఞసాధనములగు ధనములు (చేయఁబడబోవు) యజ్ఞములు మమ్ము నాశ్రయించుగాక. ఆయజ్ఞఫలములగు నాశీస్సులు మాయందుండుగాక. అటువంటి ప్రియమగు నీవు మమ్ముఁ గూర్చి శత్రువులకు హింసకమైనదానవు, ధనముకలదానవు కమ్ము. (ఇడ= హవిశ్శేషము.)

పంచాశత్తు ౨.

౨౦౫. తేఽశీయసామే సత్యాఽఽశీరస్య యజ్ఞస్య భూయాదరేడతా మనసాతచ్ఛకేయం యజ్ఞోదివగ్ంరోహతు యజ్ఞోదివంగచ్ఛతు యోదేవయానః పన్థాస్తేనయజ్ఞోదేవాగ్ం అప్యేత్వస్మా స్వింద్రఇన్ద్రియం దధా త్వస్మాన్రాయ ఉతయజ్ఞాః సచన్తామస్మా సుసన్త్వాశిషః సానః ప్రియాసుప్రతూర్తిర్మఘోనీ ౨ జుష్టిరసి జుషస్వనో జుష్టానః।

౧ దీని యర్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ దీనియర్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు 3.

౨౦౬. అసిజుష్టింతే గమేయం ౨ మనోజ్యోతిర్జుషతామా జ్యంవిచ్ఛిన్నం యజ్ఞగ్ం సమిమందధాతు। బృహస్పతిస్తనుతా మిమంనోవిశ్వేదేవా ఇహమాదయన్తామ్। ౨ బ్రధ్నపిన్వస్వ దదతోమే మాక్షాయి కుర్వతోమే మోపదస ౪ ప్రజాపతేర్భాగోఽ స్యూర్జస్వాన్పయ స్వాన్ప్రాణాపానౌ మేపాహి సమానవ్యానౌ మేపాహ్యుదానవ్యానౌ మేపాహ్యక్షితోఽ స్యక్షిత్యైత్వామామేక్షేష్ఠా అముత్రాముష్మిల్లోకే॥

౧ ఓ యిడా! నీవు ప్రీతిరూపమగుచున్నావు. మమ్ము సంతోషపెట్టుము. మాచేసేవింపఁ బడినదానవగుచున్నావు. నీప్రీతిని పొందుదును ౨ మానసీయుఁడయిన యగ్ని (ఆయా యాహుతులందలి) యాజ్యమును సేవించుఁగాక. (ఏదోయొక వైకల్యముచే) విచ్ఛిన్నమయిన యీయజ్ఞమును (వైకల్యములేకుండఁగా) సమకూర్చుగాక. బృహస్పతి స్వయముగానే యీయజ్ఞమును విస్తరింపఁజేయుఁగాక. సమస్తదేవత లీయజ్ఞమునందుఁ దృప్తినొందుదురుగాక. 3 ఓయజ్ఞపురుషా! (ఈ ఋత్విక్కులను) సంతోషపెట్టుము. ధనమునిచ్చుచున్న నాయొక్కధనము క్షీణించకుండుఁగాక, యాగముసేయుచున్న నాసామర్థ్యము క్షీణించకుండుఁగాక. (మఱల మఱల వృద్ధినొందుఁగాకయని భావము.) ౪ (ఓ యన్వాహార్యమా!) బలముకలిగినట్టియు, పాలవలె రుచికలిగినట్టియు నీవు ప్రజాపతి భాగమగుచున్నావు. నా ప్రాణాపానవాయువులను రక్షించుము. నా సమాన, వ్యాన వాయువులను రక్షించుము. నా యుదాన, వ్యానవాయువులను రక్షించుము. (నీవు) క్షీణించనిదానవగుచున్నావు. (కావున) క్షయము లేకుండుటకయి నిన్ను నిచ్చుచున్నాను. పర

లోకమునందు నాభోగములొఱకు క్షీణతనొందకుము. (కావున నేనుకూడ) పర లోకమునందు నిన్ను (స్వేచ్ఛగా ననుభవింతును) (అన్వాహార్యము=ఋత్విజులు భక్షించునట్టి శేషించిన హవిర్విశేషము)

తృతీయానువాకము సమాప్తము.

—*—

అ ను వా క ము ౪.

౨౦౭. బర్హిషోఽహం దేవయజ్యయా ప్రజావాన్భూయాసంనరాశగ్ంస స్యా హం దేవయజ్యయా పశుమాన్భూయాసమగ్నేః స్విష్టకృతోఽహం దేవయ జ్యయాఽఽయుష్మాన్యజ్ఞేన ప్రతిష్ఠాం గమేయ (౨) మగ్నేరహముజ్జితి మనూ జ్జేషగ్ం సోమస్యాహ ముజ్జితిమనూజ్జేష మగ్నేరహ ముజ్జితి మనూజ్జేషమగ్నీ షోమయోరహ ముజ్జితి మనూజ్జేషమిన్ద్రాగ్నియోరహముజ్జితి మనూజ్జేష మిన్ద్రస్యాహమ్

౧ (బర్హి, నరాశంస, స్విష్టకృచ్ఛబ్దములు అనూయాజదేవతలగు నగ్ని విశేషములను దెలుపునట్టివి.) బర్హిర్దేవతాసంబధమగు దేవయాగముచే నేను సంతానవంతుండనగుదును. నరాశంస దేవతాసంబంధమగు దేవయాగముచేనేను పశువులు కలవాఁడనగుదును. శేషించిన స్విష్టకృన్మంత్రమిదివరలో తెలుపఁబడెను.

(ప్రయాజ, అనూయాజ అన్నవి హోమములు.) ౨ ఆజ్యభాగాది దేవతలగు నగ్న్యాదులు హవిస్సును సేవించి ఆహవిస్సుచేఁ బోషింపఁబడి యజ్ఞవిరోధులయిన రాక్షసులఁ దిరస్కరించినవారయి యుత్కృష్టమగు జయమునందిరి. వారియొక్క జయమునసుసరించి యజమానుఁడనగు నేనుకూడ శత్రువులఁ దిరస్కరించి యుత్కృష్టమగు జయమొందితినని తా ॥ (ఈమంత్రమునకు దండాన్వయము సులభము కావున తాత్పర్యముమాత్రము వర్ణింపఁబడినది.

పంచాశత్తు ౨.

౨౦౮. ఉజ్జితిమ నూజ్జేషం మహేన్ద్రిస్యాహ ముజ్జితిమ నూజ్జేషమగ్నేః స్విష్టకృ
తోఽహ ముజ్జితిమ నూజ్జేషం ౨ వాజస్యమా ప్రసవేనోద్గ్రాభేణో దగ్రభీత్
అథాసపత్నాగ్ం ఇన్ద్రోమేని గ్రాభేణాధరాగ్ం అకః ఉద్గ్రాభంచనిగ్రా
భంచబ్రహ్మ దేవాఅవీవృధన్ అథాసపత్నా నిన్ద్రాగ్నీమే విషూచీనాన్వ్యస్య
తాన్ (3) ఏమాఅగ్మన్నా శిషోదోహకామా ఇన్ద్రవన్తః ॥ ౨॥

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ఇంద్రుఁడన్నమనకు గారణమగుటచేతను స్రువము (హోమముచేయు సాధనము - గరిటెవంటిది - కఱ్ఱది) నూర్ధ్వముగా గ్రహించుటచేతను నన్నుత్కర్ష నొందించెను. పిమ్మట (స్రుచమును) క్రిందుగా గ్రహించుటచే నాశత్రువులను క్రిందుగా (తిరస్కృతులనుగాఁ) జేసెను. దేవతలు దృఢమయిన యూర్ధ్వగ్రహణమును, అధోగ్రహణమును వృద్ధినొందించిరి. పిమ్మటనంతటను పరుగిడుచున్న నాశత్రువులను

నశింపఁజేయుచురుగాక. 3 ఈయాశీస్సులు నన్నుఁబొందునుగాక. మేముకూడ నాయురాది దోహమును గోరుచున్నవారమును, ఆఫలమునిచ్చు నింద్రునిసేవించుచున్నాము. (ఆసేవచే) పుత్ర పౌత్రాదిసంతానమును, కోఁఅఁబడుచున్న యన్నమును, ఆయువును (కామధేను సదృశుఁడగు నింద్రునినుండి) పితుకుదుము.

పంచాశత్తు 3.

౨౧౯. వసామహేధుక్షీమహి ప్రజామిషమ్ (౨) రోహితేనత్వాఽగ్నిర్దేవతాంగమయతుహారిభ్యాం త్వేన్ద్రో దేవతాంగమయ త్వేత శేనత్వా సూర్యోదేవతాంగమయతు (3) వితేముఞ్చామి రశనావిరశ్మీన్వి యోక్త్రాయాని పరిచర్తనానిధత్తా దస్మాసు ద్రవిణం యచ్చభద్రం ప్రణోబ్రూ తాద్భాగధాన్దేవతాసు (ర) విష్ణోః శంయోరహం దేవయజ్యయాయజ్ఞేన ప్రతిష్ఠాంగమేయగ్ం (౫) సోమస్యాహం దేవయజ్యయా ॥3॥

౧ ఈ వాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ (రోహిత, హారి, ఏతశ, శబ్దములు క్రమముగా నగ్ని, ఇంద్ర, సూర్య, గుఱ్రములను తెలుపునవి.) ఓ ప్రస్తరమా! అగ్నియొక్క గుఱ్రముచే నగ్నినిన్ను దేవత్వమునుఁబొందించుఁగాక, ఇంద్రునియొక్క గుఱ్రముచే నింద్రుఁడు నిన్ను దేవత్వముఁబొందించుఁగాక. సూర్యునియొక్క గుఱ్రముచే సూర్యుఁడు నిన్ను దేవత్వమునుబొందించుఁగాక. (ప్రస్తరము = దర్భముష్టివిశేషము.) 3 ఓ యగ్నీ! నీకు

బంధనహేతువులగు ఏజీనును, కిల్బిషమును, త్రాటినిధరించితివో! వాటిని విడుచు చున్నాను. (ఈవిడచిపెట్టుటచే సంతుష్టుడవై) మాయందు ధనమునుంచుము. ఇంకనేది యన్నపానాదికము కలదో! దానినిఁగూడ మాయందుంచుము. (మాహవిస్సును భుజించు) దేవతలకు హవిస్సు నిచ్చునట్టిమమ్ములను గొప్పగాఁ జెప్పుము. ౪ వ్యాపనశీలుఁడగు బృహస్పతి పుత్రసంబంధియగు దేవయాగముచే సంపూర్ణయజ్ఞముచేత గలిగిన ప్రతిష్టను పొందుము. ౫ ఈ వాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౪.

౨౧౦. సురేతా రేతో ధిషీయత్వష్టురహం దేవయజ్యయా పశూనాగ్ం రూపంపుషే యం దేవానాం పత్నీరగ్నిర్గృహపతిర్యజ్ఞస్యమిథునంత యోరహం దేవయజ్యయా మిథునేన ప్రభూయాసం (౨) వేదోzసివిత్తిరసి విదేయకర్మాసికరు ణమసిక్రియాసగ్ం సనిరసి సనితాzసి సనేయం ఘృతవన్తం కులాయి నగ్ం రాయస్పోషగ్ం సహస్రిణం వేదోదదాతువాజినమ్ ॥౫॥

౧ (నాలుగైన పత్నీసంయాజలకుఁ గ్రమముగా, సోముఁడు, త్వష్ట, దేవపత్నులు, గృహపతియగు నగ్నియు, దేవతలు.) సోమునిసంబంధియగు దేవయాగముచే నేను మంచిరేతస్సు కలవాఁడనై రేతస్సును ధరించుదును. త్వష్ట సంబంధియగు దేవయాగముచే నేను పశువుల రూపమును పోషింతును. దేవపత్నులు, గృహపతియగు నగ్నియు, యజ్ఞమునకు మిథునము (జంట) వారిసంబంధమైన దేవయాగముచే నేను పుత్రపుత్రీ (మిథున) రూపముగా కాగలను. (పత్నీసంయాజ

లు = యాగవిశేషములు.) ౨ ఓ దర్భమయమా ! నీవు "వేద" మనుపేరుకల దానవగుచున్నావు, (అనగా) ద్రవ్యలాభమునకు సాధనమగుచున్నావు. (ఆసాధనముచే నేను ధనమును) పొందుదును. కర్మయను పేరుకలదానవగుచున్నావు. (అనగా క్రియతే = (అనేనేతి,) కరణమ్, అనువ్యుత్పత్తిచే వేదిని) తుడుచుటకు సాధనమగుచున్నావు. (దానిచే) సమ్మార్జనము (= తుడుచుట) చేయుదును. సనివను (= ధనమునకు దాతయని వ్యు॥) పేరుకల దానవగుచున్నావు. (కావున నీయనుగ్రహముచే) ఋత్విగాదులకొఱకు ధనమునివ్వగలను. మఱియు వేదనామము కలనీవు నాకొఱకు, భోజనసాధన సమృద్ధమయినట్టియు, నివసించుటకాధారమగు బహుగృహములు కలిగినట్టియు, సహస్రాది సంఖ్యతోఁ గూడుకొనినట్టియు, భోజ్యమయిన యన్నముతో సమృద్ధమయినట్టి, ధనపుష్టి నొసఁగుదువుగాక. దర్భమయము = దర్భలకట్ట)

చతుర్థానువాకము సమాప్తము.



## అనువాకము ౫.

౨౧౧. ఆప్యాయతాం ధ్రువాఘృతేన యజ్ఞంయజ్ఞంప్రతిదేవయద్భ్యః సూర్యాయా ఊధోఽదిత్యా ఉపస్థఉరుధారా పృథివీయజ్ఞే అస్మిన్ (౨) ప్రజాపతేర్వి భాన్నామ లోకస్తస్మిగ్ంస్త్వా దధామి సహయజమానేన (3) సదసిసన్మే భూయాః సర్వ౼సి సర్వంమే భూయాః పూర్ణమసి పూర్ణంమే భూయా

అక్షితమసి మామేక్షేష్ఠాః (౪) ప్రాచ్యాందిశి దేవాఋత్విజోమార్జయన్తాం దక్షిణాయామ్ ॥౧॥

౧ ఆయాయాహుతినింగూర్చి దేవతలనుద్దేశించి హోమముచేయుటకుఁ గోరుచున్న ఋత్విక్కులకొఱకు సమర్థమగునేతిచేత ధ్రువనూర్యనిభార్యయొక్క పాలతోనిండిన స్తనమువలె మఱల మఱల నిండింపఁబడిన దగుఁగాక. (మఱియు వేదిరూపమయిన భూమియొక్కమధ్య (తొడ) యందున్న ధ్రువమహాధార కలదై విస్తీర్ణమయినదగుచు నీయజ్ఞమునందు బాగుగా నిండింపఁబడుఁగాక. (ధ్రువ=నేతిని హోమముచేయుటకు సాధనమయిన యజ్ఞాంగవిశేషము. ౨ విభాఙ్ లోకము ప్రజాపతి సంబంధమయినది. (అనగాఁగర్మభూమి యగుటచే యజమానులకు విశేషముగాఁ బ్రకాశించునది కావున భూలోకమనిభావము,) ఆలోకమునందు యజమానునితోఁగూడ నిన్ను (ధ్రువను) స్థాపించుచున్నాను. ౩ ఓపూర్ణపాత్రా! నీవు) శోభనమగుచున్నావు. (కావున) నాకు (ఫలమునిచ్చుటచే) శోభనమగుము. తూర్పుమొదలు సమస్తదిక్కులవఱకు వ్యాపించుచున్నావు. (కావున నాకపేక్షితమగు) సమస్తకార్యములఁజేయుటకు సమర్థమగుము. (ఉదకములచే) నిండినదానవగుచున్నావు. (కావున నాప్రయోజనమును) సంపూర్ణముగాఁ జేయుటకు సన్నద్ధమగుదానవగుము. (పూర్ణమగుటచే) క్షయములేనిదాన వగుచున్నావు. (కావున) నాకార్యముఁ జేయుటయందు క్షయమును పొందకుము.

౪ ఈవాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౨.

౨౧౨. (౧) దిశిమాసాః పితరోమార్జయన్తాం ప్రతీచ్యాం దిశిగృహాః పశవో

మార్జయన్తా ముదీచ్యాం దిశ్యాప ఓషధయో వనస్పతయో మార్జయన్తా మూర్ధ్వాయాందిశి యజ్ఞః సంవత్సరో యజ్ఞపతిర్మార్జయన్తాం (౨) విష్ణోః క్రమోఽస్యభి మాతిహా గాయత్రేణ ఛందసా పృథివీమను విక్రమేనిర్భక్తః సయంద్విష్మో విష్ణోః క్రమోఽస్యభి శస్తిహా త్రైష్టుభేన ఛందసాఽన్తరిక్ష మనువిక్రమే నిర్భక్తః సయంద్విష్మోవిష్ణోః క్రమోఽస్యరాతీ యతో హన్తా జాగతేన ఛందసాదివ మనువిక్రమే నిర్భక్తః సయంద్విష్మో విష్ణోః క్రమోఽసి శత్రూయతో హన్తాఽఽనుష్టుభేనఛంద సాదిశోఽను విక్రమేనిర్భక్తః సయం ద్విష్మః (౨)

౧ తూర్పుదిక్కునందు దేవతలు, ఋత్విజులు శుద్ధిచేయుదురుగాక. దక్షిణ దిక్కునందు మాసాభిమానులగు పురుషులు, పితృదేవతలు శుద్ధిచేయుదురుగాక. పశ్చిమదిక్కునందు గృహాభిమానులయిన పురుషులు, పశ్వభిమానులయిన పురుషులు శుద్ధిచేయుదురుగాక. ఉత్తరదిక్కునందు ఉదకములు, వనస్పతీజన్యములైన యోషధులు శుద్ధిచేయుగాక. ఊర్ధ్వదిక్కునందు యాగము, సంవత్సరాభిమాన దేవతయు, యజమానుఁడును, శుద్ధిచేయుదురుగాక. (వనస్పతి = చెట్లు) ౨ (ఇచట యజమానుఁడు తనయాత్మను విష్ణువుగా భావనచేసికొనవలయును. నాలుగుపాదములయొక్క ప్రదేశములను పృథివ్యాదిలోకములనుగా భావనచేయువలయును. గాయత్ర్యాది ఛందోభిమానదేవతలు ఆపాదప్రదేశమున కనుగ్రాహకములు అభిమాతిశబ్దము నరకమునిచ్చునట్టి పాపమునుఁ జెప్పునది. ఇతరులచే నాపాదింపఁబడిన యపరాధము అభిశస్తియనఁబడెను.) ఓ మొదటిపాద ప్రదేశమా!

నీవు పాపమును బోఁగొట్టు విష్ణుమూర్తియొక్క పాదమగుచున్నావు. గాయత్రీ ఛందోభిమాన దేవతచే ననుగ్రహింపఁ బడిననేను పాదప్రదేశరూపమగు భూమిన నుసరించి పాపమునుంచు చున్నాను. ఏ పాపమును ద్వేషించుచున్నామో యాపాపము ఈ ప్రదేశమునుండి పోఁగొట్టఁబడినది. (ఓ రెండవ పాదప్రదేశమా !) నీవు ఇతరులచే నాపాదింపఁబడిన అపవాదమునుఁబోఁగొట్టు విష్ణుమూర్తియొక్క పాదమగుచున్నావు. త్రిష్టుప్ఛందోభిమాన దేవతచే ననుగ్రహింపబడిన నేను అంతరిక్షలోకము ననుసరించి పాదమునుంచుచున్నాను. ఏయపవాదమును మేము ద్వేషించుచున్నామో ఆయపవాదము యీ పాదప్రదేమునుండి పోఁగొట్టఁబడినది. (ఓ మూఁడవ పాదప్రదేశమా ! నీవు) ద్రవ్యలాభనివారణమును గోరుచున్న విరోధులకు నాశకుఁడగు విష్ణుమూర్తియొక్క పాదమగుచున్నావు. జగతీఛందోభిమానదేవతచే ననుగ్రహింపబడిన నేను స్వర్గముననుసరించి పాదము నుంచుచున్నాను. ఏ విరోధిని మేము ద్వేషించుచున్నామో యావిరోధి ఈపాదప్రదేశమునుండి పోఁగొట్టఁబడెను. (ఓ నాల్గవ పాదప్రదేశమా ! నీవు) హింసనుఁగోరుచున్న శత్రువునకు నాశకుఁడగు విష్ణుమూర్తియొక్క పాదమగుచున్నావు. అనుష్టుప్ఛందోభిమాన దేవతచే ననుగ్రహింపఁబడిననేను దిక్కుల ననుసరించి పాదమునుంచుచున్నాను. ఏహింసనుగోరు శత్రువునుమేము ద్వేషించుచున్నామో ఆశత్రువు ఈ పాదప్రదేశమునుండి పోఁగొట్టఁబడెను.

పఞ్చమానువాకము సమాప్తము

—:-o-:—

## అనువాకము ౬.

౨౧౩. అగన్మ సువః సువరగన్మ సందృశస్తే మాచ్ఛిత్సి యత్తే తపస్తస్మై తే మాఽఽ
వృక్షి (౨) సుభూరసి శ్రేష్ఠో రశ్మీనామాయుర్ధా అస్యాయుర్మే ధేహి వర్చో
ధా అసి వర్చో మయి ధేహి (౩) దమహమముం భ్రాతృవ్యమాభ్యో
దిగ్భ్యోఽస్యై దివోఽస్మాదన్తరిక్షాదస్యై పృథివ్యా అస్మాదన్నాద్యాన్నిర్భ
జామి నిర్భక్తః స యం ద్విష్మః ॥౧॥

౧ ( ఇచట మొదటిసువశ్శబ్దముచే కర్మఫలభోగభూమియు, రెండవ సువశ్శబ్దముచే మోక్షద్వారభూతమగు నాదిత్యలోకమును చెప్పఁబడుచున్నది. ఓ యాహావనీయమా! నీయనుగ్రహము వలన పుత్రపౌత్రాదులతో కూడుకొనిన మేము మొదట ) ఫలభోగస్థానమును పొందితిమి. పిమ్మట మోక్షద్వారమగు నాదిత్యలోకమును పొందితిమి. నీకటాక్షమునుండి విచ్ఛిన్నుఁడను కాను. నీకొఱకేతపస్సు (మాచేఁ జేయఁబడెనో) ఆతపస్సుకొఱకు నీ యనుగ్రహమువలన అన్నిచోట్ల చెడకుందును. ఓ సూర్యుఁడా! నీవు బాగుగా నుదయించుచున్నవాడవగుచున్నావు. కిరణములుకల చంద్రాదులలో శ్రేష్ఠుఁడవగుచున్నావు. ఆయువును స్థాపించువాడవగుచున్నావు. (కావున) నాయందాయువును స్థాపించుము. బ్రహ్మవర్చస్సునకు స్థాపకుఁడవగుచున్నావు. నాయందు బ్రహ్మవర్చస్సును స్థాపించుము. 3 ఏనాశత్రువు పృథివ్యాది లోకత్రయమునందు తూర్పుమొదలైన దిక్కులందు నిరోధముఁ జేయుచున్నాడో, నాయన్నమునుగూడ నపహరించఁ గోరుచున్నాడో ) ఈనాశత్రువును నేను యీదిక్కులనుండియు, నీస్వర్గమునుండియు, నీయంతరిక్షమునుండియు, నీభూమినుండియు, నీయన్నమునుండియు

తొలంగించుచున్నాను. ఏశత్రువును మేము ద్వేషించుచున్నామో, ఆశత్రువు కూడఁ (దొలంగింపఁబడెను.)

పఞ్చాశత్తు ౨.

౨౧౮. సంజ్యోతిషాభూవ (౨) మైన్ద్రీమావృత మన్వావర్తే (౩) సమహం ప్రజయా సంమయాప్రజాసమహగ్ం రాయస్పోషేణ సంమయా రాయస్పోషః (౪) సమిద్ధో అగ్నే మేదీదిహి సమేద్ధా తే అగ్నేదీద్యాసం (౫) వసుమాన్యజ్ఞో వసీయాన్భూయాస (౬) మగ్న ఆయూగ్ంషి పవస ఆసువోర్జమిషం చనః ఆరే బాధస్వదుచ్ఛునాం అగ్నేపవస్వ స్వపా అస్మేవర్చః సువీర్యమ్ ॥ ౨॥

౧ (నేనాదిత్యుని) జ్యోతిస్సుతో కలిసికొనిన వాఁడను కాగలను. ౨ ఆదిత్య సంబంధమగు నావర్తము (తిరుగుట) ననుసరించి (నేనుకూడ) ప్రదక్షిణముగా తిరుగుదును. ౩ నేను సంతానముతో గూడుకొనిన వాఁడనగుదును. సంతానము కూడ నాతోఁగలసికొనినదగుగాక. నేనుధనపుష్టితో గలిసికొనినవాఁడనగుదును. ధనసమృద్ధికూడ నాతోఁగలిసికొనుగాక. ౪ ఓయగ్నీ! ఈసమిధచే ప్రజ్వలింపఁ జేయఁబడిన నీవు నాకొఱకు ప్రకాశింపుము. నిన్ను ప్రజ్వలింపఁజేసిన నేనుగూడ (నీయనుగ్రహమువలన) ప్రకాశకుఁడను కాగలను. ౫ ఈయజ్ఞము (నీయనుగ్రహము వలన) ధనముకలది. (నేనుకూడ నీయనుగ్రహమువలన) మిక్కిలి ధనవంతుఁడను కాగలను. ౬ ఓయగ్నీ! (పుత్రపౌత్రాదులతోఁగూడుకొనిన) మాయాయుపులను పవి

త్రము చేయుచున్నావు. (అపమృత్యువును పోగొట్టుచున్నావని భావము.) మాకు బలమును, అన్నమును, నొసగుము. శత్రుసేనను దూరమునందు నిరాకరించుము. ఓయగ్నీ! నీవు చక్కనియుదకము కలవాఁడవగుచు మమ్ము శోధనము చేయుము. నాయందు బ్రహ్మవర్చస్సును, వ్యవహారసామర్థ్యమును, పుష్టిని, ధనమును స్థాపించుము.

## పంచాశత్తు ౭.

౨౧౫. దధత్పోషగ్ం రయింమయి, (౧) అగ్నేగృహపతేసు గృహపతిరహంత్వ యా గృహపతినా భూయాసగ్ం సుగృహపతిర్మయాత్వం గృహపతి నాభూయాః శతగ్ం హిమాస్తామాశిష మాశాసేత న్తవే జ్యోతిష్మతీం తామాశిష మాశాసేzముష్మై జ్యోతిష్మతీం (౨) కస్త్వాయునక్తి సత్వావిముఞ్చతు (3) గ్నేవ్రతపతే వ్రతమచారిషం తదశకం తన్మేzరాధి (౪) యజ్ఞోబభూవసఆ ॥3॥

౧ (గార్హపత్యాగ్ని గృహమునందెల్లపుడు ధరింపఁబడుచుండును కావున గృహపతియని వ్యవహరింపఁబడుచున్నది) ఓగృహపతివగునోయగ్నీ! గృహపతివగు నీచే ననుగ్రహింపఁబడిన నేను బాగుగా గృహపతినికాగలను. నీవుకూడ గృహపతి నగు నాచేఁబూజింపఁబడినవాఁడవై బాగుగా గృహపతివగుము. నూరు సంవత్సరము లగ్నినిఁ బ్రజ్వలింపఁ జేయుచున్న నేను కలుగఁబోవు బహుపుత్రోత్పత్తి ప్రకాశ

నసమర్థమగు నాశీస్సును కోరుచున్నాను. ఈ పుట్టినపుత్రుని కొఱకు బాగుగా బుద్ధినివికసింపఁజేయు సామర్థ్యముకల యాశీస్సును గోరుచున్నాను. ౨ (ఓయజ్ఞమా! పూర్వమే) ప్రజాపతి నిన్ను దగునట్లుజేసెనో, ఆప్రజాపతి నిన్ను విడచును గాక. ౩ యజ్ఞమునకుఁ బాలకుఁడవగు నో యగ్నీ! (నీయనుగ్రహము వలననీ) వ్రతము నాచరించితిని. వ్రతమును (సమాప్తిఁజేయుటకు) సమర్థుఁడనైతిని. నాసంబంధమైన యీవ్రతము సమృద్ధమయినది. ౪ ఈ వాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౪.

౨౧౬. (౧) బభూవన ప్రజజ్ఞేసవావృధే, సదేవానామధి పతిర్బభూవసో అస్మాగ్ం అధిపతీన్కరోతువయగ్ం స్యామపతయో రయీణాం (౨) గోమాగ్ంఅగ్నేz విమాగ్ం అశ్వీయజ్ఞోనృవత్సఖా సదమిదప్రమృష్యః ఇడావాగ్ం ఏషోఅసుర ప్రజావాన్దీర్ఘోరయిః పృథుబుధ్నః సభావాన్ ॥౪॥

౧ (ఇప్పుడనుష్ఠింపఁబడిన) యజ్ఞము సంపూర్ణమయినది. ఆయజ్ఞము (మఱల) తిరిగివచ్చుగాక. ఆయజ్ఞము (ఆలస్యములేకుండగా ననుష్ఠించు మమ్ము) దెలిసికొనెను. ఆయజ్ఞము (మాటిమాటికి ననుష్ఠించుటచే) వృద్ధినొందుఁగాక. ఆయజ్ఞము దేవతలకధికముగాఁ బాలించునదియగుఁగాక। ఆయజ్ఞము మమ్ముఁగూడ నధికముగా ననుష్ఠానమునకుఁ బాలకులనుగాఁజేయుఁగాక। మేముకూడా (ఆయజ్ఞపురుషుని యనుగ్రహమువలన) యజ్ఞసాధనములగు ధనములకుఁ బ్రభువులముకాగలము. ఓప్రాణపన్నమయిననోయగ్నీ! మఱల మఱల గోరబడుచున్న యీయజ్ఞము అనేక

గోవులుకలదియు, అనేకమేకలుకలదియు, అనేకగుఱ్ఱములు కలదియు, ఋత్విగ్రూపు లగు మనుష్యులతోఁ గూడుకొనిన దేవతలు స్నేహితులుగాఁ గలదియు, నెప్పుడును తిరస్కృతము కానిదియు, నన్నము కలదియు, ననేకసంతానముల నిచ్చునదియు, నవిచ్ఛిన్నమయినదియు, (మఱలమఱల ననుష్ఠించుటచే) ననేకధనములతోఁ గూడుకొనినదియు, మంత్రములందు, అనుష్ఠానములందు వైకల్యములేనిదియు, (వికలముకాని యజ్ఞమును చూచుటకుఁ గోరుచున్న) విద్వత్సభతోఁ గూడుకొనినదియు నగుఁగాక.

షష్ఠానువాకము సమాప్తము.



## అనువాకము ౭.

౨౧౭. యథా॒ వై స॑మృతసో॒మా ఏ॒వం వా ఏ॒తే స॑మృతయ॒జ్ఞా యద్ద॑ర్శపూర్ణ॒మా॒

సౌ కస్య॒ వాఽ హ దే॒వ య॒జ్ఞమాగ॒చ్ఛన్తి॒ కస్య॒ వా న బ॒హూనాం॑ యజమా॒

నానాం॒ యో వై దే॒వతాః॒ పూర్వః॒ పరిగృ॒హ్ణాతి॒ స ఏ॒నాః॒ శ్వోభూ॒తే యజత

(౧) ఏ॒తద్వై దే॒వానా॑మా॒యత॑నం॒ యదా॑హవ॒నీయో॑ఽన్త॒రాఽగ్నీ ప॒శూనాం॒

గార్హ॑పత్యో మను॒ష్యా॑ణామన్వా॒హార్యపచనఽ పి॒తృణా॒ (౨) మ॒గ్నిం గృ॑హ్ణాతి॒

స్వ ఏ॒వాఽఽయత॑నే దే॒వతాః॒ పరి ॥౧॥

౧ ఒకకాలము నందేవిధముగా అనేక సోమయాగములు ప్రాప్తములగునో ఈ విధముగనే యనేక యజమానులయొక్క దర్శపూర్ణమాసయాగములు (ఒకే కాలమునందు సంప్రాప్తములగును. ఇట్టి సమయమున) ఏయజమానునియొక్క యజ్ఞమును గూర్చి దేవతలు వత్తురు? ఎవనియొక్క యజ్ఞమునకురారు? (అనిసందేహము. దీనికి సమాధానము) అనేక యజమానులలో నేయజమానుఁడు (ఇతర యజమానుల కంటె) పూర్వమేప్రవృత్తుఁడై దేవతల నాహ్వానించు చున్నాఁడో నాయజమానుఁడు ఈదేవతల నుద్దేశించి మరునాడు యాగము చేయుటకర్హుఁడగు చున్నాడు. (యజమానులందరు ఒకే పర్యాయము దేవతాహ్వానమందు ప్రవృత్తులైనచో పూర్వసందేహ మనివార్యమేగదా అని యనవచ్చును. కాని యాగమనగా నుద్దేశత్యాగ మాత్రమే. అనగాఫలానా దేవతకీ హవిస్సునిచ్చుచున్నానని వస్తువును విడుచుటేయాగముగనుక దేవతల యాగమనము లేకుండగనే యాగానుష్ఠానము జరుపవచ్చును. అని ఒకసమాధానము. లేదా యోగ సామర్థ్యముచేతనే అనేక శరీరములఁ దాల్చి దేవత లన్నియజ్ఞములం దొకేపర్యాయము పోవుదురు. అని వ్యాసమహర్షితన బ్రహ్మసూత్రగ్రంథమున దేవతాధికరణమునందు "విరోధః కర్మణీతిచేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్" అని స్పష్టముగా సూత్రించెను.) ౨ ఏహవనీయాగ్ని కలదో అది దేవతలకుస్థానము. ఆహవనీయ, గార్హపత్యాగ్నులమధ్యప్రదేశము పశువులకుస్థానము. మనుజులకు గార్హపత్యాగ్నిస్థానము. అన్వాహార్యపాకమునకాధారమగు దక్షిణాగ్ని పితృదేవతలకుస్థానము. ౩ ఏయజమానుడగ్నినిగ్రహించునో ఆతఁడు తనస్థానమునందే దేవతలను పరిగ్రహించవలయును. ఆదేవతలనుద్దేశించి పరదినమున యాగము చేయువలయును.

పంచాశత్తు ౨.

౨౧. గృహ్ణాతి తాః శ్వోభూతే యజతే (౧) వ్రతేన వైమేధ్యోఽగ్ని ర్వ్రతపతిర్బ్రా

హ్మణో వ్రతభృ (౨) ద్ర్వతము పైష్యన్నృూ యాదగ్నే వ్రతపతే వ్రతం
చరిష్యామీత్య(3) గ్నిర్వై దేవానాం వ్రతపతి స్తస్మా ఏవప్రతిప్రోచ్య వ్రత
మాలభతే (౪) బర్హిషాపూర్ణమాసే వ్రతముపైతి వత్సైరమావాస్యాయా
మేతద్ధ్యేతయోరా యతన (౫) ముప స్తీర్యః పూర్వశ్చాగ్నిర పరశ్చేత్యాహు
(౬) ర్మనుష్యాః ॥౨॥

౧ వ్రతమును స్వీకరించుటచేతనే వ్రతపతియగు నీయగ్ని యాగమునకు యోగ్యుఁడగుచున్నాడు. బ్రాహ్మణుఁడగు యజమానుడు కూడ వ్రతమును స్వీకరించుచున్నాడు. ౨ ఈమంత్రము వెనుకటి ప్రపాఠకమునందలి "మమనామ" అను యనువాకమునందు వ్యాఖ్యానము చేయఁబడినది. 3 దేవతలలో నగ్నికదా! వ్రతపతి అతనికొఱకే తిరిగి చెప్పి వ్రతము నారంభించవలయును. ౪ బర్హిరాహరణముచే (నుపలక్షితమయిన యస్తమయకాలమునందు) పూర్ణిమనాడు వ్రతము నారంభించవలయును. దూడలను తోలుసమయమునందమావాస్యనాడు (వ్రతము నారంభించవలయును.) ఈకాలద్వయము ఈ తిథులంకుచిత స్థానము. ౫ఆహవనీయాగ్నియు, గార్హపత్యాగ్నియు నుపస్తరణము (పఱచుట-) చేయఁదగినవని చెప్పుచున్నారు. ౬ ఈపదమునకు తరువాయిపంచాశత్తులోఁజేర్చి యర్థమువ్రాయఁబడును,

పంచాశత్తు 3.

మూ. (౧) ఇన్ద్ర ఉప స్తీర్ణమిచ్ఛ నిత్తిము దేవాయేషాంనవా వసానముపాస్మి

ఖోఽధ్వర్యక్ష్యమాణే దేవతా వసన్తియ ఏవంవిద్వానగ్ని ముపస్తృణాతి (౨) యజమానేన గ్రామ్యాశ్చ పశవోఽవరుధ్యా ఆరణ్యాశ్చేత్యాహుర్య ద్గ్రామ్యా నుపవసతి తేన గ్రామ్యాన వరున్ధేయ దారణ్యస్యాశ్నాతి తేనాఽఽ రణ్యాన్య దనాశ్వా నుపవసేత్పితృ దేవత్యః స్యా (3) దారణ్యస్యాశ్నా తీన్ద్రియమ్ ॥3॥

౧ (అతిదరిద్రులగు) మనుజులుకూడా (సీతవాతాది బాధపరిహారము నకై) తృణాదికముతోఁ గప్పఁబడిన గృహమును కోరుచున్నారుకదా! (మహా ప్రభావముకల) దేవతలవిషయమై యేమిచెప్పవలయును! ఏ దేవతలయొక్క యిచ్ఛా నుసారముగ నప్పుడప్పుడు నూతనగృహము సిద్ధమగుచున్నదో! ఏయజమానుఁ డీవిధముగఁ దెలిసికొనియగ్నిని ఉపస్తరణము చేయునో! ఈయజమానుఁడు పరదినమున యాగమును చేయఁబోవు చుండగాఁ బూర్వదినమున నాయజమానునియందు దేవ తలు నివసించుచున్నారు. ౨ యజమానునిచే నారణ్యపశువులు, గ్రామ్యపశువులు సంపాదించఁదగినవని (బుద్ధిమన్తులు) చెప్పుచున్నారు. గ్రామ్యములైన వ్రీహ్యాదు లనుగూర్చి భోజనమును విడచినచో, ఆ వర్జనముచే గ్రామ్యపశువులను సంపాదించు చున్నాడు. ఆరణ్యమైన నీవారాదికముయొక్క యన్నమును భుజించినచో, ఆభోజ నముచే నారణ్యపశువులను సంపాదించుచున్నాడు. ఈయుభయవిధభోజనమును విడచి, యుపవాసముచేసినచో, నీవ్రతవిశేషము పితృదేవతలు దేవతలుగాఁగల దగును. పితృదేవతలు ఉపవసించినశ్రాద్ధకర్త నభినందించు చున్నారుకదా! (ఆర ణ్యములు-గ్రామ్యములుఅని పశువులు రెండువిధములు. ఇందు రెండుగిట్టలుకల జం తువులు, కుక్కలు, పక్షులు, సరీసృపములు, ఏనుగులు, కోతులు, నాదేయములు, ఈయేడును ఆరణ్యములు, గోవులు, గుర్రములు, మేకలు, గొఱ్ఱెలు, ఒంటెలు,

పురుషులు, గాడిదలు, ఈయేడును గ్రామ్యపశువులు-అనివివరణము—) ౩ ఈవా క్యార్థము పయిపంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౪.

౨౬౦. వా ఆరణ్య మిన్ద్రియమేవాzzత్మన్ధత్తే ౨ యదనాశ్వానుపవసేత్క్షోధుకః స్యాద్యదశ్నీయాద్రుద్రోzస్యపశూనభిమన్యేతా ౩ పోzశ్నాతి ౪ తన్నే వాశితం నేవానశితం నక్షోధుకోభవతినాస్యరుద్రః పశూనభిమన్యతే ౫ వజ్రోవైయజ్ఞః క్షుత్ఖలువైమనుష్యస్యభ్రాతృవ్యో యదనాశ్వానుపవసతి వజ్రేణైవసాక్షాత్క్షుధం భ్రాతృవ్యగ్ంహన్తి ॥

౧ ఇంద్రియాభివృద్ధి హేతువగు నారణ్యధాన్యమును భోజనముచేసినచో, నాఅరణ్యధాన్యము, ఇంద్రియాభివృద్ధిని, ఆత్మయందు గలుగఁజేయును. ౨ ఉభయవిధ భోజనముచేయక నుపవసించినచో, నాకలి యేస్వభావము కలవాఁడగును భోజనము చేసినచో రుద్రుఁడు వీనియొక్క పశువులనుచంపును. ౩ ఉదకములను త్రాగవలయును. ౪ (ఉదకములను త్రాగినచో) నాయుదకపానము (అదనము లేదుకావున అశితముకాదు. (ఆకలితీరునుకావున) అవశితముకాదు. (ఈదోషద్వయములేదు కావున) నితఁడు ఆకలియేస్వభావము గాఁగలవాఁడుకాడు. ఇతని యొక్క పశువులను రుద్రుండుచంపడు. ౫ (నరకపాతాద్యనిష్టములను బోగొట్టుటచే) యజ్ఞము వజ్రముకదా! మనుష్యునకాకలి శత్రువుకదా! ఉభయవిధభోజనము చేయక నుపవశించినచో, యాగాంగభూతమగు నుపవాసలక్షణమయిన వజ్ర

ముచేతనే, భావిజన్మయందుఁ బొందఁబడునాకలి రూపమయిన ముఖ్యశత్రువును చంపును. (అనఁగానీయజ్ఞముచే భావిజన్మయందన్నమధికముగా లభించుననిభావము

సప్తమానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౮.

౨౨౧, యోవై శ్రద్ధామ నారభ్యయజ్ఞేన యజతేనాస్యేష్టాయ శ్రద్దధతే ౨ ప్ర ప్రణయతి శ్రద్ధావాఆపః శ్రద్ధామేవాzz రభ్యయజ్ఞేనయజత ఉభయేzస్య దేవమనుష్యా ఇష్టాయశ్రద్దధతే ౩ తదాహురతి వాపతావంర్తే నేద న్త్యే తివాచంమనోవావై తానాతినేదన్తీతి ౪ మనసాప్రణయతీ ౫ యం వైమనః॥

౧ ఏ యజమానుఁడు (మనస్సునందు దేవతావిషయమయిన) శ్రద్ధ నవలంబించక, నాహుతిచే యజ్ఞముచేయునో! వీనియాగముకొఱకు (దేవతలు, ఋత్విక్కులు) విశ్వాసముఁజూపరు. ౨ ఉదకములను ప్రణయనము చేయవలయును. ఉదకములు శ్రద్ధాహేతువులుకదా! ప్రణయనము = మంత్రముచే సంస్కరించుట. (స్నానపానాదికముచే దేవపూజాదులందు మనస్సు నిశ్చలముగా నుండునుకావున నుదకములకు శ్రద్ధాహేతుత్వము వర్ణింపఁబడినది.) శ్రద్ధనవలంబించి యాహుతిచే యాగము చేయవలయును. ఇతనియాగముకొరకు దేవతలు - ఋత్విజులనెడు మనుజులు విశ్వాసముఁజూపుదురు. 3 ఉదకప్రణయనము విషయమై కొందరు పెద్దలీవిధముగాఁ జెప్పుచున్నారు! ఈయుదకములు (శరీరముయొక్క) వృత్తినతిక్ర

మించుచున్నవి. వాక్కునుగూడా నతిక్రమించుచున్నవి. ( అనఁగాఁ ప్రవహించుచున్న నద్యాదియుదకములను నివారించుట శరీరముచేఁగాని, వాక్కుచేఁగాని సాధ్యము కానేరదనిభావము ) మనస్సును మాత్రమతిక్రమించుట లేదు. ( కారణముముందుస్పష్ట మగును. ) ౪ మనస్సుచే ( భూమిని ధ్యానించుచు నుదకములను ) ప్రణయనము చేయవలయును. ౫ ఈవాక్యార్థము తరువాయిపంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౨.

౨౨౨. అనయైవైనాః ప్రణయ ౨ త్యసకన్నహావిర్భవతి యఏవంవేద 3 యజ్ఞా యుధానిసంభరతి యజ్ఞోవైయజ్ఞా యుధానియజ్ఞ మేవతత్సంభరతి ౪ య దేకమేకగ్ం సంభరేత్పితృ దేవత్యా నిస్యుర్యత్సహ సర్వాణి మానుషాణి ౫ ద్వేద్వేసంభరతియాః జ్యానువాక్యయో రేవ రూపంకరో త్యథోమిధునమే వ ౬ యోవైదశయజ్ఞాయుధానివేదముఖతో౭ స్యయజ్ఞఃకల్పతే ౮ స్ఫ్యః॥

౧ ఈ భూమియే మనస్సు. (భూమివలె వ్యాపించును కావున మనస్సునకు పృథివీభావము వర్ణింపఁబడినది.) దీనిచేతనే ఈయుదకములను ప్రణయనము చేయవలయును. (నద్యాది యుదకములు పృథివి నతిక్రమించలేవని భావము.) ౨ ఎవఁడీవిధముగఁ దెలిసికొనునో ! (వాఁడు) నిర్దుష్టమయిన హవిస్సుకలవాఁడ గుచున్నాడు. 3 యజ్ఞాయుధముల (నధ్వర్యుఁడు) సంపాదించ వలయును. (యజ్ఞసాధకములగుటచే స్ఫ్యకపాలాదులు యజ్ఞాయుధములని వ్యవహరింపఁబడు చున్నవి. సాధ్యసాధనముల కభేదవ్యవహారముచే) యజ్ఞమే యజ్ఞాయుధములు.

(యజ్ఞాయుధములను సంపాదించుటచే) యజ్ఞమునే సంపాదించినవాఁడగును. ౪ ఒక్కొక్కదానిని సంపాదించినచో నాకర్మలు పితృసంయుక్తములగును. అన్నిటినికూడా ప్రయోగించినచో నది మనుష్యసంయుక్తములగును. (కావున నీప్రయోగము కూడదని భావము. ౫ ఒక్కొక్కపర్యాయము రెండింటిని సంపాదించవలయును. (ఈవిధముగాఁ జేసినచో) యాజ్యానువాక్యల హోమకర్మవిశేషముల రూపముచు చేసినట్లగును. స్త్రీపురుషాత్మక మిథునమునే చేసినట్లగును. ౬. ఏ యజమానుఁడు యాగారంభమునందు పదియాయుధములు (ముందుచెప్పఁబోవునవి సంపాదించవలయునని) తెలిసికొనునో! వీనియజ్ఞము (నిర్విఘ్నముగా ననుష్ఠించుటకు) సమర్థమగుచున్నది. ౭ ఈపదము తరువాయి పంచాశత్తులోఁ జేర్చివివరింపఁబడును.

పంచాశత్తు ౩.

౨౨౩. చకపాలానిచాగ్నిహోత్రహవణీ చశూర్పంచ కృష్ణాజినం చశమ్యాచోలూ ఖలంచముసలంచదృషచ్చో పలాచైతానివైదశ యజ్ఞాయుధానియ ఏవంవే దముఖతోZ శ్యయజ్ఞఃకల్పతే ౨ యోవైదేవేభ్యః ప్రతిప్రోచ్య యజ్ఞేనయజ తేజుషన్తేZస్యదేవాహవ్యగ్ం ౩ హావిర్నిరుప్యమాణ మభిమన్త్రయేతాగ్ని గ్ంహోతారమిహాతగ్ం హువక్షతి ॥

౧ స్ఫ్యః=యజ్ఞఖడ్గవిశేషము. అగ్నిహోత్రహవణీ= హవిస్సునుంచుటకు సాధనమైన కాష్ఠపాత్ర. శూర్పం=చాట, శమ్యా=గదాకారమైన కాష్ఠము. ఉలూఖలం = రోలు. ముసలం= రోకలి, దృషత్-ఉపలా=ఈరెండును రాళ్లభేదములు

కపాలం-కృష్ణాజినం=(స్పష్టమ్.) ఈపదియజ్ఞాయుధములను యాగారంభమునం దేయజమానుఁడు (సంపాదించవలయునని) తెలిసికొనెనో, వీనియొక్క-యజ్ఞము (నిర్విఘ్నముగా ననుష్ఠించుటకు) సమర్థమగుచున్నది. ౨ ఏయజమానుఁడు దేవతలకొఱకు హోమము చేయుదునని వినిపించి ఆహుతిచే యాగము చేయునో, వీనియొక్క-హవ్యమును దేవతలు గ్రహించుచున్నారు. ఉంచఁబడిన హవిస్సును మంత్రములచే సంస్కరింపవలయును. దేవతల నాహ్వానించు నాయగ్నిని ఈయజ్ఞమునందు ( నేను) పిలుచుచున్నాను. దేవతలకొఱకు వినిపించి హవిస్సుచే యాగము చేయవలయును. ఈయజమానునియొక్క- హవిస్సును దేవతలు భక్షించుదురు.

పంచాశత్తు ౪.

౨౨౪, దేవేభ్య ఏవప్రతిప్రోచ్యయజ్ఞేనయజతే జుషన్తేఽస్యదేవాహవ్య ౧ మేషవై
యజ్ఞస్యాగ్రహోగృహీ త్వైవయజ్ఞేనయజతే ౨ తదుదిత్వావా చంయచ్ఛతి
యజ్ఞస్యధృత్యా ౩ అథోమనసావై ప్రజాపతిర్యజ్ఞమతనుతమన సైవతద్యజ్ఞం
తనుతేరక్షసామనన్వవచారాయ ౪ యోవైయజ్ఞం యోగఆగతే యున
క్తియుఙ్క్తేయుఞ్జానేషుకస్త్వాయునక్తి సత్వాయునక్త్వి త్యాహప్రజాపతి
ర్వైకః ప్రజాపతినైవైనం యునక్తియుఙ్క్తేయుఞ్జానేషు ॥౪॥

౧ ఈమంత్రప్రయోగము యజ్ఞముయొక్క- స్వీకారరూపము. ఈమంత్రప్రయోగమున గ్రహించియే హవిస్సుచే యాగముచేయవలయును. ౨ ఆయభిమన్త్రిణ వాక్యమునుచ్చరించి యజ్ఞముయొక్క-ధృతి ( గట్టితనము ) కొఱకు

వాక్కును నియమింపవలయును. (వాఙ్నియమ మవలంబింపవలయు ననితా...)
3 ప్రజాపతి మనస్సుచేతనే రాక్షసులయొక్క ప్రచారము లేకుండుటకై యజ్ఞమును చేసెను. కావున రాక్షసప్రచారము లేకుండుటకై మనస్సుచేతనే యజ్ఞముచేయ వలయును. (కర్మయాగముకన్న మానసికారాధన శ్రేయమనితా...) ౪ ఏయజమానుఁడు యజ్ఞయోగకాలము సమీపించిన దగుచుండగా యజ్ఞమును చేయునో! యాగము చేయువారిలో నాయజమానుఁడు "యుజ్క్తే" అనుపదమునకు వాచ్యుఁడగుచున్నాడు. (యుజ్క్తే= యోగవంతుఁ డగుచున్నాడు. అనగా చేయదగిన) కాలములో యజ్ఞము చేయుచున్నాడు. (యోగము=సరియగు సమయము.) ౫ ఈమన్త్రము పూర్వ ప్రపాఠకమునందుఁ జెప్పఁబడెను. (ఏప్రజాపతి యెల్లప్పుడు సర్వయజమానులయొక్క యజ్ఞమును నియమించుచున్నాడో, ఆప్రజాపతియే యిప్పుడునాయజ్ఞమును, రథమునందు గుఱ్ఱమునువలె, సమకూర్చుగాక. అనితాత్పర్యము

— * —

## అనువాకము ౯.

౨౨౪. ప్రజాపతిర్యజ్ఞానసృజతాగ్నిహోత్రంచాగ్నిష్టోమం చపౌర్ణమాసీం చోక్థ్యం చామావాస్యాం చాతిరాత్రంచ తానుదమిమీత యావదగ్నిహోత్రమాసీత్తావానగ్నిష్టోమోయావతీ పౌర్ణమాసీతావానుక్థ్యోయావత్యమావాస్యాతావానతిరాత్రో య ఏవం విద్వానగ్నిహోత్రం జుహోతి యావదగ్నిష్టోమేనోపాప్నోతి తావదుపాఽఽప్నోతియఏవంవిద్వాన్పౌర్ణమాసీం యజతే యావదుక్థ్యే నోపాప్నోతి ॥౧॥

౧ అగ్నిహోత్రము, అగ్నిష్టోమము, పౌర్ణమాసి, ఉక్థ్యము, అమావాశ్య అతిరాత్రము, అను నీయారు యాగములను ప్రజాపతి జేసెను. వాటిని సమానముగాఁ బోల్చెను. (అగ్నిహోత్రము, పౌర్ణమాసి, అమావాస్య యాగము లల్ప ద్రవ్యసాధ్యములు. అల్ప ఫలమునిచ్చునవి. మిగిలిన మూఁడుయాగము లధిక ద్రవ్యసాధ్యములు. అధిక ఫలము నిచ్చునవి. ఈయుభయ విధయజ్ఞములను ప్రజాపతిసృష్టించి, కనిష్టపుత్రునియందు తండ్రి యనుగ్రహించునట్లు నగ్నిహోత్రాది యాగత్రయము అల్పద్రవ్య సాధ్యములని వాటియందనుగ్రహించి యాజేంటిని మూఁడు జతలుగాఁజేసి తూచెనని భావము. (ప్రజాపతి యనుగ్రహము వలన) అగ్ని హోత్రయాగ మెంతఫలముకలదాయెనో, అగ్నిష్టోమ మంతఫలవంతమైనది. పౌర్ణమాసియాగ మెంతఫలముకలదైనదో, ఉక్థ్యయాగమట్టిదే యైనది. అమావాస్యయాగముతో నతిరాత్రయాగము సమానఫలవన్తమైనది. ౨ ఏయజమానుఁడీ విధముగఁ దెలిసికొనినవాఁడై యగ్నిహోత్రయాగమును చేయునో, (ఆయజమానుఁడు) అగ్నిష్టోమమువలన వచ్చు ఫలమును పొందును. ఎవఁడీవిధముగఁ దెలిసికొనినవాఁడై పౌర్ణమాసీ యాగమునుఁ జేయునో, (వాఁడు)ఉక్థ్యయాగము వలన వచ్చుఫలమును పొందును. ఎవఁడీవిధముగఁ దెలిసికొనినవాఁడై యమావాస్య యాగమునుఁ జేయునో ! (వాఁడు) అతిరాత్ర యాగమువలన వచ్చుఫలమును పొందును.

## పంచాశత్తు ౨.

౨౬. తావదుపాఽఽప్నోతి యఏవంవిద్వానమా వాస్యాంయజతే యావదతిరాత్రేణోపాప్నోతి తావదుపాఽఽప్నోతి (౧) పరమేష్ఠినోవా ఏషయజ్ఞోఽగ్రఆసీత్తేన సేపరమాంకాష్ఠా మగచ్ఛత్తేన ప్రజాపతిం నిరవాసాయ యత్తేన

ప్రజాపతిః పరమాం కాష్ఠామగచ్ఛత్తేనేన్ద్రోనిరవాసాయయత్తేనేన్ద్రః
పరమాంకాష్ఠా మగచ్ఛత్తేనాగ్నీషోమా నిరవాసాయయత్తేనాగ్నీషోమా
పరమాంకాష్ఠా మగచ్ఛతాంయః ॥

౧ సత్యలోకమునందున్నట్టియు, పూర్వకల్పమునందు (యజమానుఁడుగానున్న బ్రహ్మచేత) ఈదర్శపూర్ణమాసయజ్ఞము ప్రారంభింపఁబడెను. (ఈశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠితమైన) యాయాగముచే నాయజమానుఁడు బ్రహ్మపదవి నొందెను. ఆబ్రహ్మ ఆయుత్తమఫలమునిచ్చు దర్శపూర్ణమాసయాగోపదేశముచే (దక్షుని) సంతోషపెట్టెను. ఆయజమానుఁడును (ఆజన్మయందు యజమానుఁడుగానుండి) అయ్యనుష్ఠానముచే దక్షత్వస్థానమునుఁ బొందెను. ఆదర్శపూర్ణమాసయాగోపదేశముచే (ప్రస్తుతమున్న)యింద్రుని (ఆయుష్ఠానమునకై) ప్రేరణచేసెను. ఆయజమానుఁడును యింద్రపదవిని బొందెను. ఆదర్శపూర్ణమాసయాగోపదేశముచే (ప్రస్తుతమున్న) నగ్నీషోములనుఁ బ్రేరణచేసెను. వారును అగ్నీషోముల స్థానమును పొందిరి. ఏయజమానుఁడీవిధముగఁ దెలిసికొనినవాఁడై దర్శపూర్ణమాసయాగముల ననుష్ఠించునో ఆయజమానుఁడు ఉత్కృష్టస్థానమునే పొందును.

పంచాశత్తు 3.

౨౨౭, ఏవంవిద్వాన్దర్శపూర్ణమాసాయజతేపరమామేవకాష్ఠాం గచ్ఛతి ౧

రేహావై ప్రజాతేనయజ్ఞేనయజతే ప్రప్రజయాపశుభిర్మిథునైర్జాయతే ద్వాదశ
మాసాః సంవత్సరో ద్వాదశద్వన్ద్వాని దర్శపూర్ణమాసయోస్తాని సం

పాద్యానీత్యాహ ౨ ర్వత్సంచోపావసృజత్యుఖాం చాధిశ్రయత్యవచహన్తి దృషదాచసమాహన్త్యధిచవపతే కపాలానిచోపదధాతి పురోడాశంచ ॥3॥

౧ ఏయజమానుఁడు హవిస్సుచే యాగముచేయునో, ఆయజమానుఁడు సంతానముతోను, పశువులతోను, పుత్రపౌత్రులతోను స్త్రీపురుష ద్వంద్వములు కలవాఁడగును. పండ్రెండు (౧౨) మాసములు సంవత్సరమగుచున్నది. దర్శపూర్ణమాసయాగములకును (చెప్పఁబోవు) పండ్రెండు జతలున్నవి-ఆజత సంపాదించవలయును. (పండ్రెండు మాసములతోఁ గూడుకొనిన సంవత్సరమువలె, పండ్రెండు ద్వంద్వములతో గూడుకొనిన దర్శపూర్ణమాస యాగములుకూడ విస్తరించినవని భావము ౨ (గోవును పాలనుపితుకుటకై నధ్వర్యుఁడు "అయత్ష్మావ ప్రజయా" అనుమంత్రముచే మెడత్రాటినుండి) దూడను విడువవలయును. (౨. పాలను కాచుటకై "మాతరిశ్వనోఘర్మః" అను మంత్రముచే గార్హపత్యాగ్ని యందు) "ఉఖ" అను పాత్రనుంచవలయును. (3. "అవరక్షోదివః") అను మంత్రోచ్చారణముచే ధాన్యమును) దంచవలయును. ("ఇషమావద" అనుమంత్రముచే) రాళ్లను తుడువవలయును. (౫. "దేవస్యత్వ" ఇత్యాది మంత్రముచే (పిండి చేయుటకయి బియ్యమును రాతియందు) నూరవలయును. (౬ "ధ్రువమసి" ఇత్యాది మంత్రములచే పురోడాశమును వండుటకొఱకు అగ్నియందు కపాలములను) వెచ్చబెట్టవలయును. (౭ "ఘర్మోzసి" అను మంత్రముచే నాకపాలములయందు) పురోడాశమునుంచవలయును. (అగ్నిస్తే తేజః అనుమంత్రముచే నాహవనీయాగ్నియందు) ఆజ్యమునుంచవలయును. (౬ ముందుచేయఁబోవు వేదిస్థానమునందు "పృథివిదేవయజని" ఇత్యాది మంత్రములచే ) స్తంబయజువును (బర్హిస్సు కట్టను) ఉంచవలయును. ౬ "అరరుస్తేదివమ్" అను మంత్రముచే నాగ్నీధ్రుడు ఉత్కర ప్రదేశము ( వేదివేయుచోటు ) నందున్న గడ్డిపోచలు మొదలుగాగలవాటిని దోసిలిచే) సేకరించవలయును. ( ౧౦."వసవస్త్వా పరిగృహ్ణన్తు"

అనుమంత్రములచే) వేదినినిర్మించవలయును. "ఆశాసానా" అనుమంత్రముచే (త్రాటిచేత) భార్యను కట్టవలయును (అనగా నడుముకు దర్భల త్రాటిని చుట్టవలయునని తా ॥) ౧౨. "ఋతసదస్థా" అనుమంత్రముచే "స్ఫ్య" అను యజ్ఞఖడ్గముచే గీయబడిన గీటునందు) ప్రోక్షణపాత్రల నుంచవలయును. ("అగ్నిర్జిహ్వాసి" అనుమంత్రముచే పూర్వోక్త గీటునందు) ఆజ్యము నుంచవలయును.

### పంచాశత్తు ౪.

౨౨౫. అధిశ్రయత్యాజ్యంచస్తంబయజుశ్చ హరత్యభిచగృహ్ణాతి వేదించపరిగృహ్ణాతి పత్నీంచసంనహ్యతి ప్రోక్షణీశ్చాఽఽసాదయత్యాజ్యంచై (౨) తానివై ద్వాదశద్వంద్వాని దర్శపూర్ణమాసయోస్తాని యఏవగ్ం సంపాద్య యజతే ప్రజాతేనైవయజ్ఞేన యజతేప్రప్రజయా పశుభిర్మిథునైర్జాయతే ॥

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తు (3 వ) తోఁజేర్చి వివరింపఁబడినది

౨ దర్శపూర్ణమాస యాగములకీ పండ్రెండుద్వంద్వములు (విధింపఁబడినవి.) వాటినెవఁడీవిధముగ సంపాదించి యాగముచేయునో, (వాఁడు) విస్తృతమగు హవిస్సుచే యజ్ఞముచేయుచున్నాడు. మేలైన సంతానముతోను, పశువులతోను, పుత్రపుత్రికా రూపమయిన జతలతోను గూడుచున్నాడు.

నవమానువాకము సమాప్తము.



అనువాకము ౧౦.

౨౭. ధ్రువోఽసి ధ్రువోఽహగ్ం సజాతేషు భూయాసమిత్యాహ ధ్రువా నేవైనాన్కురు తఉగ్రోఽ స్యుగ్రోఽ హగ్ం సజాతేషు భూయాసమిత్యాహ ప్రతివాదినమేవైనాన్కురు తేఽభి భూరస్యభిభూరహగ్ం సజాతేషు భూయాస మిత్యాహయ ఏవైనం ప్రత్యుత్పిపీ తేతముపాస్యతే (౨)యునజ్మి త్వా బ్రహ్మణా దైవ్యేనే త్యాహైష వా అగ్నేర్యోగ స్తేన ।

౧ (ఈ మంత్రములు ఈ ప్రపాఠకమునందలి ౨వ యనువాకమునకు వ్యాఖ్యానము వంటివైనందున, "ఇత్యాహ" అను పదమువరకుగల భాగమున కాయనువాకమునందే వ్యాఖ్యానము చేయఁబడినది కావున వెనుక వ్రాయని పదములకే యిచ్చట వివరణము చేయఁబడును.) "ధ్రువోసి భూయాసమ్" అని ప్రార్థించుటచే (యజమానుడుతన) జ్ఞాతులను స్థిరులనుగాఁ జేయుచున్నాడు "ఉగ్రోఽసి" ఇత్యాది ప్రార్థనచే నీజ్ఞాతులనెదిరించని వారినిగాఁ జేయుచున్నాఁడు. ఎవఁడీయజమానుని ప్రతికూలుఁడై నశింపఁజేయుట కిచ్ఛయించుచున్నాడో ! "అభిభూరసి" ఇత్యాది ప్రార్థనచే వానిని (యజమానుఁడు) ధిక్కరించుచున్నాడు. ౨ "యునజ్మిత్వా" ఇత్యాదికముచే నీమంత్రపాఠమే యగ్నియొక్క యోగము. ఆయోగముచే నీయజమానుని (మంత్రపాఠము) కలుపుచున్నది.

పంచాశత్తు ౨.

౨౩౦. ఏవైనంయునక్తి ౧ యజ్ఞస్యవ్వైసమృద్ధేన దేవాః సువర్గం లోకమాయన్య

జ్ఞస్యవ్యృద్ధేనాసురానపరాz భావయన్యస్మై అగ్నేఅన్యయజ్ఞస్యరిష్యా దితా హాయజ్ఞస్యైవతత్సమృద్ధేనయజమానః సువర్గంలోకమేతి యజ్ఞస్యవ్యృద్ధేన భ్రాతృవ్యాన్ప రాభావయ ౨ త్యగ్నిహోత్రమేతాభిర్వ్యాహృతీభిరుప సాదయే ౩ ద్యజ్ఞముఖంవా అగ్నిహోత్రం బ్రహ్మైతావ్యా హృతయో యజ్ఞముఖఏవబ్రహ్మ ॥

౧ (యజ్ఞమునకు సమృద్ధమనియు, వ్యృద్ధమనియు, రెండంశములు కలవు. అందు యథాశాస్త్రముగా ననుష్ఠించిన యంశము సమృద్ధము. శాస్త్రీయముకానిది వ్యృద్ధము.) యజ్ఞముయొక్క సమృద్ధముచే దేవతలు స్వర్గలోకమును పొందిరి. యజ్ఞముయొక్క వ్యృద్ధముచే రాక్షసులను తిరస్కరింపఁజేసిరి. "యస్మైఅగ్నే" అని చెప్పుటచే యజ్ఞముయొక్క సమృద్ధముచేతనే యజమానుఁడు స్వర్గలోకమును పొందుచున్నాడు. యజ్ఞముయొక్క వ్యృద్ధముచే శత్రువులను తిరస్కరింపఁజేయుచున్నాఁడు ౨ "భూఃభువఃసువః" ఈవ్యాహృతులచే నగ్నిహోత్రమును ఉపసాదనము చేయవలయును. (వ్యాహృతులు = ఇదియొక సంజ్ఞ.) ఉపసాదనము = నిలుపుట ॥
౩ అగ్నిహోత్రము యజ్ఞముఖమగుచున్నది. ఈ (పూర్వోక్త) వ్యాహృతులు బ్రహ్మయగుచున్నవి. (కావున పూర్వవిధముగా నుపసాదనము చేసినచో) యజ్ఞముఖమునందే బ్రహ్మ నుంచుచున్నాడని తా॥

పంచాశత్తు ౩.

౨౩౧. కురుతే ౧ సంవత్సరే పర్యాగత ఏతాభిరేవో పసాదయే ౨ ద్బ్రహ్మణై

వోభయతః సంవత్సరం పరిగృహ్ణాతి ౩ దర్శపూర్ణమాసౌ చాతుర్మాస్యా న్యాలభమాన ఏతాభిర్వ్యాహృతీ భిర్హవీగ్ం ష్యాసాదయేద్యజ్ఞముఖం వై దర్శపూర్ణ మాసౌచాతుర్మాస్యాని బ్రహ్మైతా వ్యాహృతయో యజ్ఞముఖ ఏవబ్రహ్మ కురుతేసంవత్సరే పర్యాగత ఏతాభిరేవాzz సాదయేద్బ్రహ్మణై వోభయతః సంవత్సరం పరిగృహ్ణాతి ౪ యద్వైయజ్ఞస్య సామ్నాక్రియతే రాష్ట్రమ్॥ 3

౧ (అగ్నిహోత్రారంభ దినము మొదలు) సంవత్సరము వచ్చినదగుచుండగా (అనఁగా నారంభదినము నందును, సంవత్సరాంతము నందును, అని తా) ఈ వ్యాహృతులచే నుపసాదనము చేయవలయును. ౨ (ఇట్లుచేసినచో) బ్రహ్మచేతనే యజమానుఁడు సంవత్సరమును గ్రహించు చున్నాడని తా॥ 3 (అగ్నిహోత్రకర్మయందువలె మఱియొక కర్మయందుఁగూడ వ్యాహృతులచే నాసాదనము విధింపఁబడుచున్నది.) దర్శపూర్ణమాసలు, చాతుర్మాస్యలు అను కర్మలను చేయఁదలచినవాఁడు ఈ వ్యాహృతులచే హవిస్సుల నాసాదనము చేయవలయును దర్శపూర్ణమాసలు, చాతుర్మాస్యలును, యజ్ఞమే (యగుచున్నవి) ఈ (పూర్వోక్త) వ్యాహృతులు బ్రహ్మ (యగుచున్నవి.) (ఇట్లుచేసినచో) యజ్ఞముఖమునందే బ్రహ్మను ఉంచిన వాఁడగుచున్నాడు. సంవత్సరమురాగా నీవ్యాహృతులచే (హవిస్సు) నాసాదనము చేయవలయును. (అప్పుడు) బ్రహ్మచేతనేసంవత్సరమును గ్రహించిన వాడగుచున్నాడు. ౪ ఈ వాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౪.

౨౩ ౨. యజ్ఞస్యాzzశీర్గచ్ఛతి యదృచావిశం యజ్ఞస్యాzzశీర్గచ్ఛత్యథ బ్రాహ్మ
ణోzనాశీర్కేణ యజ్ఞేనయజతే సామిధేనీరను వక్ష్యన్నేతావ్యాహృతీః
పురస్తాద్దధ్యా ద్బ్రహ్మైవప్రతి పదంకురుతేతథా బ్రాహ్మణః సాశీర్కేణ
యజ్ఞేనయజతే ౨ యంకామయేత యజమానం భ్రాతృవ్యమస్య యజ్ఞ
స్యాzzశీర్గచ్ఛేదితి తస్యైతావ్యాహృతీః పురోనువాక్యాయాం దధ్యాద్భ్రా
తృవ్యదేవత్యావై పురోనువాక్యా భ్రాతృవ్యమేవాస్య యజ్ఞస్య।

౧ (పూర్వమువలెనే కర్మాంతరమునందుఁగూడ వ్యాహృతులు విధింపఁబడుచున్నవి) యజ్ఞముయొక్క యంగము సామముచేఁ జేయఁబడినచో! (తత్సాధ్యమయిన) యజ్ఞముయొక్కఫలము రాష్ట్రమును పొందును. (రాష్ట్రమునందు సస్యాభివృద్ధి కలుగునని భావము) యజ్ఞాంగము ఋక్కుచేఁ జేయఁబడినచో ! తత్సాధ్యమయిన యజ్ఞఫలము సంతానమును పొందును. (సంతానమునకాయు రారోగ్యాదికము వృద్ధియగునని భావము.) (అట్లుచేసినచో) బ్రాహ్మణుఁడు ఫలరహితమయిన యజ్ఞముచే యాగముచేసిన వాఁడగును. (ఫలమునిచ్చు యజుస్సులచేఁ జేయలేదుకావున అని తా॥ (కావున హోత) సామిధేనులను (మంత్రవిశేషములు) కూడాచెప్పుచు నీవ్యాహృతులను పఠింపవలయును. (ఇట్లుచేసినచో) బ్రహ్మరూపమయిన సామిధేనుల ప్రారంభమును చేసినవాఁడగును. (మఱియు) యజమానుఁడు ఫలవంతమయిన యజ్ఞముచేత యాగము చేసినవాఁడగును. ౨ ఈ యజ్ఞఫలము శత్రువును పొందుఁగాక. అని యేయజమానునిగూర్చి హోత

(ద్వేషమువలన) కోరునో ! ఆ యజమానుని యాగమునందు పురోనువాక్యయందు వ్యాహృతులను ప్రయోగించ వలయును. పురోనువాక్య శత్రుదేవతాకము కావున ఈ యజ్ఞఫలము శత్రువునే పొందును.

పంచాశత్తు ౫౪.

౨౩౩. ఆశీర్గచ్ఛతి ౧ యాన్కామయేత యజమానాన్త్సమావత్యేనాన్యజ్ఞస్యాఽఽ శీర్గచ్ఛేదితి తేషామే తా వ్యాహృతీః పురోనువాక్యాయా అర్ధర్చ ఏకాం దధ్యాద్యాజ్యాయై పురస్తాదేకాం యాజ్యాయా అర్ధర్చ ఏకాం తథైనాన్త్సమావతీ యజ్ఞస్యాఽఽశీర్గచ్ఛతి ౨ యథా వై పర్జన్యః సువృష్టం వర్షత్యేవం యజ్ఞో యజమానాయ వర్షతి స్థలయోదకం పరిగృహ్ణన్త్యాశిషా యజ్ఞం యజమానః పరిగృహ్ణాతి ౩ మనోఽసి ప్రాజాపత్యమ్॥ ౫౪

౧ యజ్ఞఫలము యజమానులందఱకు సమానముగా గలుగుఁగాక యని యేయజమానుల కొఱకు హోతకోఱునో! ఆయజమానుల యాగమునందు (హోత) ఈవ్యాహృతులను (ఈవిధముగా) పఠింపవలయును. - పురోనువాక్య యొక్కయర్ధర్చ ( ఋక్కులో సగముభాగము.) చెప్పఁబడినదగుచుండగా మొదటి వ్యాహృతిని, యాజ్యానువాక్యకుఁబూర్వము రెండవవ్యాహృతిని, యాజ్యానువాక్యయొక్క యర్ధర్చ చెప్పఁబడిన దగుచుండఁగా మూఁడవవ్యాహృతిని (పఠింపవలయును.) ఇట్లు చేసినచో యజ్ఞఫలము సమస్తయజమానులకు సమానముగాగల్గును. ౨ ఏవిధముగా మేఘము (వడపాతములేకుండగా సర్వదేశములం

దును) సస్యాభివృద్ధిని చేయుటకర్హమయిన వర్షముకురియుచున్నదో! ఆవిధము గానే (యీపూర్వోక్త వ్యాహృతులతోఁ గూడుకొనిన) యజ్ఞము సమస్తయజమాన సముదాయమునకు మంచిఫలమును సమానముగా నిచ్చుచున్నది. (ఆ సువృష్టిచే నదులునిండఁగా సర్వజనులు) కాలువద్వారా ఉదకము నేవిధముగాతీసుకొనుచున్నారో! అట్లే యజమానసంఘము సమానయాగఫలమును బొందుచున్నది. 3 ఈవాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౬.

౨౩౮. మనసామాభూతే నాऽऽవిశేత్యాహమనో వై ప్రాజాపత్యం ప్రాజాపత్యో యజ్ఞోమనఏవ యజ్ఞమాత్మన్ధత్తేవాగ్ సైన్ద్రీసపత్నక్షయ ణీవాచామేన్ద్రియేణాऽऽవిశేత్యాహైన్ద్రీవై వాగ్వాచమేవైన్ద్రీమాత్మన్ధత్తే॥

౧ "మనోऽసి ప్రాజాపత్యగ" ఇత్యాది మంత్రపాఠముచే మనస్సు ప్రజాపతి సంబంధియనియు, యజ్ఞము (కూడ) ప్రజాపతి సంబంధియయ్యెను. (ప్రజాపతి సృజించినందున) మనోయజ్ఞములను ఆత్మయందుస్థాపించినవాఁడగును. వాక్కు (ఇంద్రునిచే వ్యవహరింపఁబడినది.) ఐన్ద్రి (కావున) "వాచామేన్ద్రియేణ" ఇత్యాది మంత్రపాఠముచే నింద్రునిచే వ్యవహరింపఁబడిన వాక్కును ఆత్మయందు స్థాపించుకొనుచున్నాడు.

దశమానువాకముసమాప్తము.

---:-౦-:---

## అనువాకము ౧౧.

౨౩౫. యో వై సప్తదశం ప్రజాపతిం యజ్ఞమన్వాయత్తం వేద ప్రతి యజ్ఞేన తిష్ఠతి॥
న యజ్ఞాద్భ్రంశత ౨ ఆశ్రావయేతి చతురక్షరమస్తు శ్రౌషడితి చతురక్షరం
యజేతి ద్వ్యక్షరం యే యజామహ ఇతి పఞ్చాక్షరం ద్వ్యక్షరో వషట్కార
ఏష వై సప్తదశః ప్రజాపతిర్యజ్ఞమన్వాయత్తో య ఏవం వేద ప్రతి యజ్ఞేన తిష్ఠతి
న యజ్ఞాద్భ్రంశతే ౩ యో వై యజ్ఞస్య ప్రాయణం ప్రతిష్ఠామ్॥

౧ ఏయజమానుఁడు పదునేడక్షరములతోఁ గూడుకొనినట్టియు, యజ్ఞము ననుసరించినట్టియు, (అన్నియజ్ఞములం దనుగతముగానున్నదని భావము.) ప్రజాపతిచేత సృజింపఁబడు మంత్రసముదాయమును తెలిసికొనునో! ఆయజమానుఁడు యజ్ఞముచేఁ బ్రతిష్ఠితుఁడగుచున్నాఁడు. యజ్ఞమునుండి భ్రష్టుఁడగుటలేదు. ౨ "ఆశ్రావయ" అను నాల్గక్షరములుకల మంత్రము. "అస్తుశ్రౌషట్" అను నాల్గక్షరముల మంత్రము. "యజ" అను రెండక్షరముల మంత్రము. "యేయజామహే" అను ఐదక్షరముల మంత్రము. "వషట్" అను రెండక్షరముల మంత్రము కలసి యీమంత్రసముదాయము ౧౭ పదునేడక్షరములుకలది. ప్రజాపతిచే సృజింపఁబడినదియు, యజ్ఞము ననుసరించినదియు నగు నీమంత్రసముదాయము నేయజమానుఁడు తెలిసికొనునో! (ఆయజమానుఁడు) యజ్ఞముచే బ్రతిష్ఠితుఁడగుచున్నాఁడు. యజ్ఞమునుండి భ్రష్టుఁడగుటలేదు. ౩ ఈవాక్యార్థము తరువాయి పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౨.

౨౩౬. ౧ ఉదయనం వేదప్రతిష్ఠితే నార్తిష్ఠేన యజ్ఞేనసగ్ంస్థాంగచ్ఛత్యా
౨ శ్రావయాస్తు శ్రౌషడ్యజయే యజామహేవ షట్కార ఏతద్వై యజ్ఞ
స్య ప్రాయణమేషా ప్రతిష్ఠితముదయనం యఏవం వేదప్రతిష్ఠితేనార్తిష్ఠేన
యజ్ఞేన సగ్ంస్థాంగచ్ఛతి ౩ యోవై సూనృతాయైదోహం వేదదుహ
ఏవైనాం ౪ యజ్ఞోవై సూనృతాఽఽ శ్రావయేత్యేవైనామహ్వాదస్తు ॥

౧ ఏయజమానుఁడు యజ్ఞముయొక్క ప్రారంభమును, మధ్యను, సమాప్తిని తెలిసికొనునో! ఆతఁడు అంగసహితమయినదియు, లోపము లేనిదియునగు నాయజ్ఞముచే ఫలసమాప్తిని పొందుచున్నాడు. ౨ "ఆశ్రావయ" "అస్తుశ్రౌషట్" "యజ" "యేయజామహే", "వషట్" ఈమంత్రపంచకములో మొదటి మంత్రము యజ్ఞముయొక్క ప్రారంభము. ౨-౩-౪ మంత్రములు- యజ్ఞముయొక్క ప్రతిష్ఠ, (మధ్యయని తా॥) ఐదవమంత్రము యజ్ఞముయొక్క సమాప్తి. ఎవఁడీవిధముగాఁ దెలిసికొనునో! (వాఁడు) సర్వాంగములతోఁగూడి లోపము లేని యజ్ఞముచే ఫలపర్యవసానమును పొందును. ౩ ఏయజమానుఁడు సత్యప్రియరూపమగు వాక్కుకొఱకు దోహన (పితుకుట) ప్రకారమును తెలిసికొనునో! (వాఁడవశ్యముగా) నీవాక్కును పితుకుచున్నాడు. (మంచివాక్కులు కలవాఁడగునని తా॥ ౪ ఈవాక్యార్థము తరువాయి మంత్రములో వ్రాయఁబడును.

పంచాశత్తు ౩.

౨౩౭. ౧ శ్రౌషడిత్యుపావాస్రాగ్వృజేత్యుదనైషీ ద్యేయజామహ ఇత్యుపాసద్వ

షట్కారేణ దోగ్ధ్యేషవై సూనృతాయై దోహోయఏవం వేదదుహ ఏ్వైనాం ౨ దేవావైసత్ర మాసతతేషాం దిశోzదస్యన్త ఏతామార్ద్రాం పఙ్త్కిమపశ్యన్నాశ్రావయేతి పురోవాత మజనయన్నస్తు శ్రౌషడిత్యభ్రగం సమప్లావయన్యజేతి విద్యుతమ్॥

౧ యజ్ఞమే సత్యప్రియమయినవాక్కు. "ఆశ్రావయ" అను మంత్రపాఠముచే (యజమానుఁడు సత్యప్రియవాక్స్వరూపమగు యజ్ఞమేయైన యావులు) పిలుచుచున్నాడు. "అస్తుశ్రౌషట్" అను మంత్రపాఠముచే దూడనువిడుచుచున్నాడు. "యజ" అనుమంత్రపాఠముచే బాలకుండ నెత్తుచున్నాడు. "యేయజామహే" అను మంత్రపాఠముచేఁ గూర్చుచున్నాడు. "వషట్" అను మంత్రపాఠముచే బాలను పితుకుచున్నాడు. ఇదియే సత్యప్రేమ వాక్స్వరూపమగు యజ్ఞముయొక్క దోహనము(=పితుకుట) ఏయజమానుఁడీవిధముగాఁ దెలిసికొనునో! వాఁడీవాక్కును పితుకుచున్నాడని భావము. (లోకములో గోవును పాలుపితుకుటకు ముందుగా నేదో యొక యాహారమును పెట్టుటకై నాయాపేర్లచేఁ బిలుచుట ప్రసిద్ధము. ఆవిధముగానే యిచ్చట యజ్ఞమను ఆవునకు "ఆశ్రావయ" ఇత్యాదిమంత్రములచే బిలుచుట మొదలగునవి వర్ణింపఁబడినవి ) ౨ దేవతలుసత్రయాగమును పొందిరి. వారికేదో యొక వైకల్యప్రయుక్తమగు వర్షలేమివలన) దిక్కులందు పంటలు క్షీణించినవి. (ఆపరిహారమునకై దేవతలు) వర్షమునకు గారణమగు నీమంత్రపంక్తిని చూచిరి. "ఆశ్రావయ" అను మంత్రముచే వాయువును పుట్టించిరి. "అస్తుశ్రౌషట్" అను మంత్రముచే నాకాశమును తెలిసికొనిరి. "యజ" అనుమంత్రముచే మెఱుపును పుట్టించిరి. "యేయజామహే" అను మంత్రముచే వర్షమును కురిపించిరి. "వషట్" అను మంత్రముచే నురుములను పుట్టించిరి. ఆమంత్రపంచకమువలనకదా! ఆదేవతల

కొఱకు దిక్కులందలి సస్యములు వృద్ధినొందినవి, ఎవ్వఁడీవిధముగాఁ దెలిసికొనునో? వీనికొఱకు దిక్కులందలి పైరులు వృద్ధినొందుచున్నవి.

పంచాశత్తు ౪.

౨౩౨. ౧ అజనయన్త్యేయ జామహాఇతి ప్రావర్షయన్నభ్యస్తు నయన్వ షట్కారేణ తతో వై తేభ్యో దిశః ప్రాప్యాయన్తయ ఏవం వేదప్రాప్యాన్మైదిశః ప్యాయ న్తే ౨ ప్రజాపతింత్వో వేదప్రజాపతిస్త్వం వేదయం ప్రజాపతిర్వేదస పుణ్యోభవ ౩ త్యేమవైఛన్దస్యః ప్రజాపతిరాశ్రావయాస్తు శ్రౌషడ్యజ యేయజామహేవ షట్కారోయ ఏవం వేదపుణ్యోభవతి ౪ వసన్తమ్ ॥

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ఒక యజమానుఁడు పదియేడక్షరముల రూపుఁడగు ప్రజాపతిని తెలిసికొనెను. ప్రజాపతియు నా తెలిసికొనిన యజమానునిఁ దెలిసికొనెను. (అనుగ్రహించెననితా॥) ప్రజాపతి యేయజమానునిఁ దెలిసికొనెనో, ఆయజమానుఁడు (ఇతరయజమానులకంటె) నుత్కృష్టుఁడగుచున్నాఁడు. ౩ "ఆశ్రావయ" "అస్తుశ్రౌషట్" "యజ" "యేయజామహే" "వషట్" ఈపదియేడక్షరముల రూపమునను్న ప్రజాపతి వేదములలోసారముగా సిద్ధమాయెను. ఎవఁడుప్రజాపతిని వేదసారముగాఁ దెలిసి కొనునో, (వాఁడు) ఉత్కృష్టుఁడగుచున్నాఁడు. ౪ ఈపదార్థము తరువాయిపంచాశత్తు లోఁ జేర్చివ్రాయఁబడును.

పంచాశత్తు ౫.

౨౩౯. ౧ ఋతూనాంప్రీణా మిత్యాహర్తవో వై ప్రయాజా ఋతూనేవ ప్రీణా

తి తేఽస్మైప్రీతా యథాపూర్వంకల్పన్తే కల్పన్తేఽస్మా ఋతవో యఏవం

వేదా ౨ గ్నీషోమయోరహం దేవయజ్యయా చక్షుష్మాన్భూయా

సమిత్యాహాగ్నీ షోమాంభ్యాంవై యజ్ఞశ్చక్షుష్మాన్తాభ్యామేవ చక్షురా

త్మన్ధత్తే ౩ ఽగ్నేరహం దేవయజ్యయాఽన్నాదో భూయాసమిత్యా

హాగ్నిర్వై దేవానామన్నాదస్తేనైవ ॥

౧ ఋతువులే ప్రయాజలు. "వసన్తమృతూనామ్" అను మంత్రపాఠము చే (యజమానుఁడు) ఋతువులనే సంతోషపెట్టుచున్నాడు. అవిసంతోషించినవై ఈయజమానుని కొఱకు సమానముగా (తమ తమ కాలమున కుచితములైన పుష్పోత్పత్తి సంతాపము- వృష్టి, మొదలగు లక్షణములతోఁ గూడుకొనినవై యగుచున్నవి. ఎవఁడీవిధముగాఁ దెలిసికొనునో! వానికొఱకుఁగూడ ఈఋతువులు పూర్వోక్తలక్షణయుక్తములగు చున్నవి. ౨ "అగ్నీషోమయో" రిత్యాది మంత్ర పాఠముచే నగ్నీషోమ దేవతలచే యజ్ఞము కన్నులుకలదగును ఆదేవతలచేతనే (యజమానుఁడు) తనయందు చక్షుస్సును ధరించుచున్నాడు. ౩ అగ్నేరహం ఇత్యాది మంత్రముచే నగ్నియే దేవతలలో నధికముగా నన్నము తినువాడని (తెలియుచున్నది) ఆఅగ్నిచేతనే (యజమానుఁడు) తనయాత్మయందు అన్నము తినుశక్తిని ధరించుచున్నాడు.

పంచాశత్తు ౬.

౨౮౦. అన్నాద్యమాత్మన్ధత్తే ౧ దబ్ధిరస్య దబ్ధోభూయాస మముం దభేయ మిత్యాహైతయా వైదబ్ధ్యా దేవా అసురాన దభ్నువన్తయైవ భ్రాతృవ్యం దభ్నోత్య ౨ గ్నీషోమయోరహం దేవ యజ్యయా వృత్రహా భూయాస మిత్యాహాగ్నీ షోమాభ్యాం వా ఇన్ద్రో వృత్రమహన్తాభ్యా మేవ భ్రాతృ వ్యగ్ంస్తృణుత ౩ ఇన్ద్రాగ్నియోరహం దేవయజ్యయేన్ద్రియా వ్యన్నా దోభూయాస మిత్యాహేన్ద్రియా వ్యేవాన్నాదో భవతి ౪ న్ద్రస్య॥

౧ "దబ్ధిరస్యదబ్ధోభూయాస" మిత్యాది మంత్రపాఠముచే దేవతలు ఈ (యుపాంశుయాజరూపము—వైరినాశకమునగు) ఖడ్గముచేత రాక్షసులను చంపిరి. ఆయుపాంశు యాజరూపమగు ఖడ్గముచేతనే (యజమానుఁడు) శత్రువులను చంపు చున్నాఁడు. (ఉపాంశుయాజ=మంత్రవిశేషము.) ౨ "అగ్నీషోమయోరహమ్" అనిచెప్పుటచే నగ్నీషోమదేవతలచేతనే యింద్రుడు వృత్రాసురుని చంపెను. (ఆయగ్నీషోమదేవతలచేతనే యజమానుఁడుకూడ) శత్రువును చంపుచున్నాఁడు. (వృత్రాసురుఁడు అగ్నీషోమదేవతలను దంతములచేఁ గరచెనట. అప్పుడు ఇంద్రు డావృత్రునియందు శీతజ్వరమును, తాపమును ప్రయోగించెనట. ఆజ్వరతాపములు వృత్రునిఁ జంపెనట. అనిగాథ. ఇది రెండవయష్టకమున స్పష్టముగా వ్రాయఁబడును. ౩ "ఇన్ద్రాగ్నియో" రిత్యాది మంత్రపాఠముచే నింద్రియ-న్తుఁడేయన్నాదుఁడగు చున్నాఁడు. (అన్నదః=అన్నముతినువాఁడు.) ౪ ఈపదార్థము తరువాయిపంచాశత్తు లోఁ జేర్చి వ్రాయఁబడును.

పంచాశత్తు ౭.

౨౮౧. ౧ అహందేవ యజ్యయేన్ద్రియావీభూ యాసమిత్యాహేన్ద్రియావ్యేవ భవతి ౨ మహేన్ద్రస్యాహం దేవయజ్యయాజేమానం మహిమానం గమేయ మిత్యాహాజేమానమేవమహిమానం గచ్ఛ ౩ త్యగ్నేః స్విష్టకృతోఽహం దేవయజ్యయాఽఽయుష్మాన్యజ్ఞేన ప్రతిష్ఠాం గమేయ మిత్యాహాఽఽయురేవాఽఽత్మన్ధత్తేప్రతియజ్ఞేనతిష్ఠతి॥

౧ "ఇన్ద్రస్యాహం దేవయజ్యయా" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) ఇంద్రియవంతుడగుచున్నాఁడు. ౨ "మహేన్ద్రస్యాహ" మిత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) జయశీలతను, మహిమను పొందుచున్నాఁడు. ౩ "అగ్నేః స్విష్టకృతోఽహ" మిత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) ఆయువునే యాత్మయందు ధరించుచున్నాఁడు. యజ్ఞముచేఁబ్రతిష్ఠావన్తుడగుచున్నాఁడు. (ఈపైమంత్రములలో "ఇత్యాహ" అను పదమువరకుండు వాక్యములు వెనుకటి యనువాకములలో వచ్చియున్నవేకావున నావాక్యములకిచ్చట మఱల దండాన్వయము వ్రాయలేదు. ఇక ముందుఁగాబోవునట్టి యిటువంటి మంత్రములలోఁ గూడ నీవిధముగానే వ్రాయబడునని యెఱుంగవలయును. ఈదండాన్వయము మొదటి యంకెగుర్తును బట్టి వెనుకటిఆమంత్రముననే "ఇత్యాహ" వఱకు ఉన్నమంత్రము పఠించితే ఆఫలమని సర్వత్రా యెఱుంగునది॥

ఏకాదశానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౧౨.

౨౪౨. ౧ ఇన్ద్రంవో విశ్వతస్పరిహ వామహేజనేభ్యః। అస్మాకమస్తు కేవలః।
ఇన్ద్రంనరో నేమధితా హవన్తేయత్పార్యాయు నజతేధియస్తాః। శూరో
నృషాతా శవసశ్చకాన ఆగోమతివ్రజే భజాత్వంనః। ౩ ఇన్ద్రియాణిశత
క్రతోయా తేజనేషు పఞ్చసు। ఇన్ద్రతానితఆవృణే। ౪ అనుతేదాయి
మహఇన్ద్రియాయ సత్రా తేవిశ్వమనువృత్రహత్యే। అను।

౧ ఓఋత్విగ్యజమానులారా! మీకు (పుత్రపౌత్రాదిసంపత్తి కొఱకు సమస్త జగత్తునకుపైనున్న (ఉత్కృష్టము) యింద్రునిఁ బిలుచు చున్నాము. (ఆయింద్రుడు) మనకసాధారణుఁడగుగాక. (ఇతరయజమానులకంటె మనయందధికమయిన యనుగ్రహముఁను చూపుఁగాకఅనితా॥) ౨ అగ్నిచయనమును చేయు మనుజులు (అగ్ని మొదలగు దేవతలతోఁగూడ హవిస్సుయొక్క) సగభాగమును ధరించుటకై నింద్రునిఁ బిలుచుచున్నారు. ఏకారణమువలన నగ్నిష్టోమమును గూర్చియర్థులయిన యజమానులా యగ్నిష్టోమముల ననుష్ఠించుచున్నారో! అటువంటి యో యింద్రుడా! నీవు శత్రువులచేఁ దిరస్కరింపఁ బడనివాఁడవు, మనుజుల కంటెను (ధన) దాతవు, (మా) బలమునకుఁ బ్రకాశకుడవునై మమ్మునీక గోవులసంఘము నందు స్థాపించుము. ౩ ఓ యింద్రుఁడా। (నిషాదవర్ణముతో) నైదగు బ్రాహ్మణాది వర్ణములందు నీ (యనుగ్రహము వలన) ఏ సామర్థ్యములున్నవో! ఓ యింద్రుడా! ఆ సమస్త సామర్థ్యములను నీ (యనుగ్రహము వలన) అంతటను గ్రహించుచున్నాను. ౪ ఓ యాగము చేయఁదగిన యింద్రుఁడా! (దేవతలందరి కంటె) నధి

క్షుఁడవగు నీకొఱకు వృత్రాసురవధ ననుసరించి నీబలమునకై యాగములందు సమస్త హవిస్సు ఇవ్వఁబడుచున్నది. (మఱియు) నీక్షత్రియత్వ జాత్యభిమానము ననుసరించు నీస్వభావము ననుసరించియు, శత్రువులదిరస్కరించు నీ స్వభావము ననుసరించియు, (నీకొఱకు మాటిమాటికి హవిస్సు ఇవ్వఁబడుచున్నది.

పఞ్చాశత్తు ౨.

౨౪౩. ౧ క్షత్రమను సహోయజత్రేన్ద్ర దేవేభిరనుతే నృషహ్యే ౨ ఆయస్మిన్నప్తవాసవా స్తిష్ఠన్తి స్వారుహోయథా ఋషిర్హ దీర్ఘశ్రుత్తమ ఇన్ద్రస్యఘర్మో అతిథిః 3 ఆమాసుపక్వమైరయ ఆసూర్యగ్ం రోహయోదివి। ఘర్మం నసామం తపతాసువృక్తిభిర్జుష్టం గిర్వణసేగిరః ౪ ఇన్ద్రమిద్గాథినో బృహదిన్ద్రమర్కేభిరర్కిణః। ఇన్ద్రంవాణీరనూషత ౫ గాయన్తిత్వా గాయత్రిణః ॥ ౨

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ స్వయముగనే (ప్రేరణము లేకుండగనే రథమును) వహించుచున్నవి వలెనున్న సప్తాశ్వములు ఏయాదిత్యుని యందుంటున్నవో, (ఆ యాదిత్యుఁడు) అతీంద్రియజ్ఞానికదా! లోకత్రయమును ప్రకాశింపఁజేయుటచే మిక్కిలిప్రసిద్ధమగు కీర్తికలవాఁడు. అటువంటి ప్రకాశించుచున్న (యాదిత్యుఁడు) ఇంద్రునికతిథి. (అనగా నప్పుడప్పుడు తనయభీష్టమును యాచించుటకు వచ్చువాఁడుకావున అటువంటి యింద్రుని మహిమచెప్ప శక్యముకాదుకదా! అనిభావము.) 3 ఓ యింద్రుఁడా! నీవు, ఫలపాకము లేని యోషధులందు మంచిపాకముతోఁ గూడుకొనన ఫలమును (వర్షముద్వారా)

సంపాదించినవాఁడ వైతివి. (తిరుగుటకు సామర్థ్యమునిచ్చుటచే) నాకాశమునందు సూర్యునధిష్ఠింపఁ జేసితివి. (ఓ యజమానులారా! ఇంద్రునకు) ప్రియమగు పురోడాశరూప హవిస్సును హుంకార ప్రస్తావాది శోభనభక్తి యుక్తములగు సామములచే ఘర్మమునువలె (ఘర్మమని యొక హోమము) నుష్ఠుగా హుతము చేయుడు. వాక్కులచే స్తోత్రము చేయఁదగు నింద్రుని కొఱకు స్తుతిరూపములయిన వాక్కులను ప్రయోగింపుడు. ఠ సామగాయకులు గొప్పసామముచే నింద్రునే స్తోత్రముచేసిరి. బహ్వృచులు ఋక్కులచే నింద్రునిస్తోత్రము చేసిరి. ఇతరములయిన (యజూరూపములయిన) వాక్కులుకూడ ఇంద్రుని స్తోత్రముచేసినవి. (బహ్వృచులు ఋక్శాఖీయులు.) ౫ ఈ వాక్యార్థము 3వ పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు 3.

౨౮౮. ౧ అర్చన్త్యర్క మర్కిణః ॥ బ్రహ్మాణస్త్వా శతక్రత వుద్వగ్ం శమివయేమిరే ౨ అగ్ం హోముచే ప్రభరేమా మనీషా మోషిష్ఠదాన్నే సుమతిం గృణానాః ఇదమిన్ద్ర ప్రతిహవ్యం గృభాయసత్యాః సన్తుయజమానస్య కామాః 3 వివే వయన్మాధివణా జజాన స్తవై పురాపార్యాదిన్ద్ర మహ్నః ॥ అగ్ం హసోయ త్ర పీపరద్య థానోనావేవ యాన్తముభయే హవన్తే ౪ ప్రసమ్రాజం ప్రథమ మధ్వరాణామ్ ॥3॥

౧ ఓయింద్రుఁడా! గాయత్రీసామలతోఁ గూడుకొనిన యుద్గాతలు నిన్ను

గానము చేయుచున్నారు. బహ్వృచులు (నిన్ను) స్తోత్రముచేయుచున్నారు. అధ్వర్యులుకూడ నిన్ను వంశమునువలె వృద్ధినొందించుచున్నారు. కులాచారాదులచే వంశము నేవిధముగ వృద్ధినొందింతురో, ఆవిధముగానని భావము.) ౨ స్తోత్రము చేయుచున్న మేము (గ్రీష్మకాలములో దావాగ్నిచే నత్యన్తము దగ్ధములైన భూప్రదేశములకొఱకు వర్షాకాలమునందు) వర్షమునిచ్చునట్టియు, పాపమునుండి విడిపించునట్టియు, (నీకొఱకు మంచి మననముతోఁ గూడుకొనిన బుద్ధిని స్వీకరించుచున్నాము. ఓయింద్రుడా! ఈవిడువబడుచున్న హవిస్సును ప్రతిగ్రహింపుము. దానిచే యజమానుని కాలములు సత్య (=ఫలవంత) ములగుఁ గాక. 3 పూర్వోక్తమగు బుద్ధి నన్నుఁ బ్రవేశించినదికావున నేను మంచిబుద్ధి కలవాఁడనగుచున్నాను. (కనుకనే) ఉత్తమమయిన మరణ దివసముకంటె బూర్వ మింద్రుని స్తోత్రము చేయుదును (మరణపర్యన్తము స్తోత్రముచేయుదునని భావము.) ఏబుద్ధియుండగా నింద్రుఁడు మమ్ము పాపమునుండిదాటించెనో, (ఆబుద్ధియని పూర్వాన్వయము,) నదియందుఁ బోవుచున్ననావికుని ఒడ్డులందున్న పురుషులు మమ్ము దాటించుమని లోకమునందేవిధముగాఁ బిలుతురో (ఆ విధముగానని పూర్వాన్వయము.) ౪ ఈవాక్యార్థము ౪౪ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౪.

౨౪౫ ౧ అగ్ం హోముచం వృషభం యజ్ఞియానామ్ అపాం నపాతమశ్వినా హయన్త మస్మిన్నర ఇన్ద్రియం ధత్తమోజః। ౨ వినఇన్ద్ర మృధోజహినీచా యచ్ఛ పృతన్యతః। అధస్పద. తమీం కృధియోఅస్మాగ్ం అభిదాసతి 3 ఇన్ద్ర క్షత్రమభి వామమోజోఽ జాయథా వృషభచర్షణీనామ్ అపాను దోజనమ

మిత్రయస్తమురుం దేవేభ్యో అకృణోరు లోకమ్ । ౪ మృగోనభీమః కుచ రోగిరిష్ఠాః పరావతః ॥౪॥

౧ ఓ ఋత్విజులారా ! బాగుగాఁ బ్రకాశించువాఁడును, అగ్నిష్టోమాది యాగములకు ముఖ్యదేవుఁడును, పాపమునుండి విడిపించువాఁడును, యజ్ఞసంబంధిఫలములను వర్షించువాఁడును, వర్షరూపములగు నుదకములకు నాశకుఁడుకాని వాఁడును, ఐశ్వర్యమును పొందించు వాఁడునగు నింద్రుని గొప్పగా (సేవింపుడు) (ఓ యశ్వినీదేవతలారా ! ఈ యజమానునియందు కన్ను మొదలగు నింద్రియముల పటుత్వమును, బలమును స్థాపింపుడు. ౨ ఓ యింద్రుఁడా ! మా శత్రువులను విశేషముగా విడువుము. మమ్ముఁజంపుటకు సేననుకోరుచున్న శత్రువులను నీచులనుగాఁ జేయుము. ఇంకనెవఁడు మమ్ముక్షీణింపఁ జేయుచున్నాడో, వానిని గూడమాపాదములందు నమస్కరింపఁబడిన శిరస్సుకల వానినిగాఁ జేయుము. 3 ఓ యింద్రుఁడా ! సేవింపఁదగిన రక్షణమును, మాబలమును, ఉద్దేశించి (ఇది యంతయు సంపాదించుటకు పుట్టితివి. మనుజులకుఁ గామములను వర్షించునట్టి యో యింద్రుఁడా ! శత్రుత్వమును జూపిన జనుని తిరస్కరించిన వాఁడవగు చున్నావు. హావిస్సునిచ్చుట మొదలగు వ్యవహారములను చేయు యజమానుల కొఱకు భోగస్థానమును చేసినవాఁడవే యగుచున్నావు. ౪ ఈ వాక్యార్థము ౫వ పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౫.

౨౪౬. ౧ ఆజగామా పరస్యాః । స్నృకగంసగంశాయ పవిమిన్ద్రతిగ్మం విశ

త్రూన్త్సాహి విమృధోనుదస్వ। ౨ విశత్రూన్విమృధోను దవివృత్రస్య హనూరుజ ॥ విమన్యుమిన్ద్ర భామితోఽమిత్ర స్యాభిదాసతః। ౩ త్రాతారమిన్ద్ర మవితారమిన్ద్రగ్ం హవేహవే సుహవగ్ం శూరమిన్ద్రమ్। హువేను శక్రం పురుహూత మిన్ద్రగ్ం స్వస్తినో మఘవాధాత్విన్ద్రః ౪ మా తేఽస్యామ్ ॥౫॥

౧ ఓ యింద్రుఁడా! (నీవు) భయంకరమును, జంతువులను హింసించుట మొదలగు దుష్టాచరణ స్వభావముకలదియు నగు, పర్వతమునందుండు సింహ వ్యాఘ్రాది క్రూరజంతువులవలె, గొప్పదూరముండి (మాశత్రువును చంపుటకు) వచ్చినవాఁడవైతివి. శత్రుశరీరములందు సంచరించు స్వభావముకల తీక్ష్ణమయిన వజ్రాయుధమును బాగుగా పదునుకలదానినిగాఁ జేసి శత్రువులను కొట్టుము. యుద్ధముచేయు శత్రువులను విశేషముగా నిరాకరింపుము. ౨. ఓ యింద్రుఁడా! శత్రువులను విశేషముగాఁ బోగొట్టుము. యుద్ధము చేయు శత్రువులను కూడ విశేషముగా నిరాకరింపుము. వృత్రాసురుని దవడలను విశేషముగా భగ్నము చేయుము. నీవు కోపించినవాఁడవగుచు మమ్ము క్షీణింపఁజేయు శత్రువులకోపమును విశేషముగా భగ్నము చేయుము. ౩ (శృఙ్ఖల = సంకెళ్లు) బంధమునుండి రక్షించునట్టి యింద్రునిఁ బిలుచుచున్నాను. భటుల యవరోధము (అడ్డు) నుండిరక్షించునట్టి యింద్రునిఁ బిలుచుచున్నాను. బంధించువారిని, అడ్డగించువారిని తిరస్కరించుటయందు సమర్థుఁడును, ప్రతిహవనమునందు సుఖముగాఁ బిలుచుటకు శక్యుఁడునగు నింద్రునిఁ బిలుచుచున్నాను. సమస్త కార్యములందు శక్తియుక్తుఁడును, బహుయజమానులచేఁ బిలువఁబడువాఁడునగు నింద్రునిఁ బిలుచుచున్నాను. ధనవన్తుఁడగు నింద్రుఁడు మాకు మంగళము (అవినాశము) నిచ్చుఁగాక. ౪ దీని యర్థము ౬వ పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౬.

౨౮౭. ౧ నహసావన్న రిష్టావఘాయ భూమహరివః పరాదై్రతాయస్వనోzవృకేభిస్వ
రూథైసవప్రియాసః సూరిషుస్యామ। ౨ అనవస్తే రథమశ్వాయ తక్షన్త్వష్టా
వజ్రం పురుహూతద్యుమన్తమ్ బ్రహ్మాణ ఇన్ద్రం మహయన్తో అర్కైరవర్ధ
యన్నహయే హన్తవాఉ ౩ వృష్ణేయత్తే వృషణో అర్కమర్చాని న్ద్రగ్రావా
ణో అదితిః సజోషాః అనశ్వాసో యేపవయోz రథా ఇన్ద్రేషితా అభ్యవర్త
న్త దస్యూన్ ॥౬॥

౧ ఓబలవన్తుఁడవగు నింద్రుడా! ఈరక్షణమునకై( జేయఁబడుచున్న యాగ
మందు విఘ్నము మాకు రాకుండుఁగాక. ఓయశ్వములతోఁ గూడుకొనిన యింద్రు
డా! (నిన్ను) తిరస్కరించుటకు మేము సమర్థులము కాకుందుముగాక. నీవు మమ్ము
హింసకులు లేని గృహములచే రక్షింపుము. అటువంటి గృహములనిమ్ము. పండి
తులగు యజమానులందు మేము ప్రియమయిన వారలమగుదుముగాక. ౨
అనేకయజమానులచేఁ బిలువఁబడిన యోయింద్రుడా! నీరథమును, గుఱ్ఱమును కలు
పుటకు మనుజులు సంస్కరించుదురుగాక. త్వష్టయు ప్రకాశవన్తమగు వజ్రాయుధ
మును సంస్కరించుగాక. (చెక్కుఁగాక) బ్రాహ్మణులగు ఋత్విజులు పూజా సాధనము
లగు మంత్రములచే నింద్రుని బూజించుచున్నవారై మహాయజ్ఞ ప్రతిబన్ధకమగు
పాపము నవశ్యము పోగొట్టుటకై వృద్ధినొందింతురుగాక. ౩ కోరికలను వర్షించు
నట్టి నీకు సంబంధించినదియుఁ, బూజనీయమును ఫలములను వర్షించునదియునగు

యాగమును సన్నె, పాత్రము మొదలగు యాగసాధన పదార్థములు ఎప్పుడు అలంకరించుచున్నవో ! అప్పుడు వేదిరూపమగు భూమి (నీతో) సమానప్రీతికలదగుఁ గాక. ఇంద్రునిచేఁ బ్రేరణచేయఁబడిన యేవజ్రాయుధములు కలవో, (అవికూడ) రథాపేక్ష లేనివియు, గుఱ్ఱముల యపేక్ష లేనివియునై మహాయజ్ఞమును పొందుటకుఁ బ్రతిబన్ధకులగు రాక్షసుల నుద్దేశించి చంపుటకుఁ బ్రవర్తించుగాక.

ఇట్లు ప్రథమాష్టకమున షష్ఠప్రపాఠకము ముగిసినది.



## ప్రపాఠకము ౬.

### అనువాకము ౧.

౨౮౯. పాకయజ్ఞం వా అన్వాహితాగ్నేః పశవ ఉపతిష్ఠన్త ఇడా ఖలు వై పాకయజ్ఞః సైషాఽన్తరా ప్రయాజానూయాజాన్య జమానస్య లోకేఽవహితా ౧ తామాహ్రియమాణామభిమన్త్రయేత సురూపవర్షవర్ణ ఏహీతి పశవో వా ఇడా పశూనేవోప హ్వయతే ౩ యజ్ఞం వై దేవా అదుహ్రన్యజ్ఞోఽసురాꣳ అదుహత్తేఽసురా యజ్ఞదుగ్ధాః పరాభవన్యో వై యజ్ఞస్య దోహం విద్వాన్॥

౧ (సప్తవిధములగు పాకయజ్ఞములలో నొకానొక) యాహితాగ్ని యొక్క పాకయజ్ఞమునను సరించి గోవు మొదలగు పశువు లుంటున్నవి. (బ్రహ్మ యందు హోమము చేయఁబడుచున్నది కావున) ఇడాభక్షణమే పాకయజ్ఞము కదా! ఆ యీ యిడ యజమానునకు (ఫలసాధనమగు) యజ్ఞమునందు ప్రయాజానుయాజల మధ్యయందు స్థిరమైనది. (ప్రయాజ- ఆజ్యభాగ- ప్రధానస్విష్టకృత్తులకుఁదరువాతను, అనూయాజలకంటెఁ బూర్వమందును, యిడ యనుష్ఠింపఁబడిన దనిభావము. ప్రయాజ- అనూయాజ- ఆజ్యభాగ- ప్రధానస్విష్టకృత్తులు = అవాంతరకర్మ విశేషములు. ఇడ = హవిర్విశేషము.) ౨ (హోతృసమీపమును) పొందింపఁబడుచున్న యిడను "సురూపవర్షవర్ణ!" రమ్ము- అని యభిమంత్రించవలయును. పశువులే యిడ. (కావున) పశువులను పిలిచినవాఁడగును. (యిడపశువులుగా వర్ణింపఁబడినది.) సురూపవర్షవర్ణ = దీనియర్థము పూర్వోక్తము. ౩ (మొదట) దేవతలు యజ్ఞమును పితికిరి. (అనఁగా దానినుండి ఫలమును గ్రహించుటచే

శూన్యముగాఁజేసిరని భావము ) ఆయజ్ఞము రాక్షసులను పితికినది. (రాక్షసులనుండి సారముతీయుటచే శూన్యముగాఁ జేసినదని భావము) యజ్ఞమునుండిపితుకఁబడిన యారాక్షసులు తిరస్కరింపఁబడిరి ఏయజమానుఁడు (దేవతలుచేసిన యజ్ఞదోహమును, యజ్ఞముచేసిన రాక్షసదోహమును) తెలిసికొనినవాఁడై యాగముచేయునో! ఆయజమానుఁడు ఇతరయజమానునిఁగూడ పితుకుచున్నాడు. (శూన్యముగాఁ జేయుచున్నాడని తా ॥) ఈ మంత్రము ప్రశంసారూపమగుటవలన నితరయజమానున కేమియుహానిలేదని యెఱుంగవలయును.)

పంచాశత్తు ౨.

౨౮౯. యజతేప్యన్యం యజమానందుహే ౧ సామేసత్యాఽఽశీరస్య యజ్ఞస్య భూయాదిత్యాహైష వైయజ్ఞస్య దోహస్తేనైవైనందుహే ౨ ప్రత్తావైగౌర్దుహే ప్రత్తేడా యజమానాయదుహ ఏతేవాఇడాయైస్తనా ఇడోపహూతేతి వాయుర్వత్సో ౩ యర్హిహోతేడా ముపహ్వయేతతర్హి యజమానోహోతా రమీక్షమాణో వాయుంమనసా ధ్యాయేత్ ॥

౧ ("ఉపహూతాఽయం యజమాన" ఇత్యాదికముచేఁ జెప్పఁబడిన యేయాశీస్సుకలదో !) (ఈయనువాకము మొదటినుండి అచ్చటచ్చట చెప్పిన పశ్వాదిలాభరూప) ఈ యజ్ఞసంబంధమయిన యా యాశీస్సునాకు సత్యమగుగాక. అని చెప్పుటచే నీయాశీస్సే యజ్ఞము యొక్క దోహము. ఆ దోహముచేతనే (యజమానుఁడు) ఇతరయజమానుని బితుకుచున్నాను. (దోహము = పితుకుట లేక సారము

దీయుట) ౨ గోవు (దూడ పాలుత్రాగుటచే) స్రవించినపాలుకల పొదుగు కలదై (ఏవిధముగా) పాలను స్రవింపఁ జేయుచున్నదో! (ఆవిధముగానే) ఇడ స్రవించునట్టి ఫలముకలదై యజమానుని కొఱకు ఫలమును పితుకుచున్నది. "ఇడోపహూతా" ఇత్యాది మంత్రభాగములు ఆ యిడకు స్తనములు. (స్తనముల వంటివని తా॥) వాయువు దూడ (ఇచ్చట ఇడ గోవుగాను మంత్రవిశేషములు పొదుగులుగాను, వాయువుదూడగాను వర్ణింపఁబడినవి.) 3 ఏకాలమునందు హోత యిడను పిలుచుచున్నాఁడో, ఆకాలమునందు యజమానుఁడు హోతను చూచుచున్నవాఁడై వాయువును మనస్సుచే ధ్యానము చేయవలయును. (అట్లు చేయగా) దూడను తల్లి కొఱకు విడచినవాఁడగుచున్నాఁడు.

పంచాశత్తు ౩.

౨౫౦. మాత్రేవత్సము పావసృజతి ౧ సర్వేణవై యజ్ఞేనదేవాః సువర్గం లోకమాయన్పాకయజ్ఞేన మనురశ్రామ్యత్సే డామనుముపావర్తత తాం దేవాసురావ్యహ్వయన్తప్రతీచీం దేవాః పరాచీమసురాః సాదేవాను పావర్తతపశవోవై తద్దేవానవృణతపశవోఽసురానజహు ౨ ర్యం కామయే తాపశుమాన్స్యాదితిపరాచీం తస్యేడాముపహ్వయే తాపశుమానేవభవతి 3 యమ్॥

౧(మనువుతోఁ గూడుకొనిన) దేవతలందరు సంపూర్ణమయిన దర్శపూర్ణ యాగముచే స్వర్గలోకమును పొందుటకుద్యుక్తులైరి. (వారిలో) మనువు పాక యజ్ఞముచే నలసినవాఁడాయెను. (దీనివలన మనువు హోతయగుచు నిడను పిలుచుటయందే తత్పరుఁడాయెనని తెలియుచున్నది) ఆ ఇడ (తనను పిలుచుటయందు

ఆసక్తుడయిన)మనువును పొందెను. దానినిజూచి దేవతలు, రాక్షసులు, పరస్పరవ్యత్యయముగా(ఒకమాట కొకమాటగా) బిలిచిరి. దేవతలు అభిముఖముగాను, రాక్షసులు విముఖముగాను ఆహ్వానించిరి. ఆయిడ దేవతలను పొందినది. ఇడారూపములగు పశువులా దేవతలను పొందినవి. రాక్షసులను విడిచిపెట్టినవి. ౨ (హోత) ఏయజమానునిగూర్చి పశుహీనుడు కావలయునని గోరునో వానికిఇడనువిముఖముగా ౩ నాహ్వానించవలయును. (అప్పుడాయజమానుడు) పశుశూన్యుడేయగుచున్నాఁడు. (హోత)పశువులుకలవాడు అగుగాక,. అని ఏయజమానునిగూర్చికోరునో వానికిఇడ నభిముఖముగా నాహ్వానించవలెను. (ఇట్లు చేయగా యజమానుడు) పశువులు కలవాడేయగుచున్నాడు.

## పంచాశత్తు ౪.

౨౮౧. కామయేతపశుమాన్స్యా దితిప్రతీచీం తస్యేడాముపహ్వయే తపశుమానేవ
భవతి ౨ బ్రహ్మవాదినో వదన్తిసత్వా ఇడాముపహ్వయేతయ ఇడాము
పహూయాఽఽత్మానమిడాయాము పహ్వయేతేతి ౩ సానః ప్రియాసు
ప్రతూర్తిర్మఘోనీత్యాహే డామేవో పహూయాఽఽత్మాన మిడాయా
ముపహ్వయతే ౪ వ్యస్తమివవాఏతద్యజ్ఞస్యయది డాసామి ప్రాశ్నన్తి॥

౧ ఈవాక్యార్థము పైవాక్యములోఁ జేర్చివ్రాయఁబడినది. ౨ ఏబుద్ధిమంతుఁడు ఇడను "ఇడఏహి" "అదితఏహి" ఇత్యాది మంత్రములచేఁ బిలిచి యాయిడయందు దనయాత్మను యోజన (కలుపుట) చేయుచున్నాఁడో! ఆతఁడే ఇడ వైన నిన్ను (శాస్త్రీ)యముగా పిలుచునని వేదార్థవిచారముచేయు విద్వాంసులు

చెప్పుచున్నారు. ౩ "సానః ప్రియా" ఇత్యాది మంత్రపాఠముచే నిడను నాహ్వా నించి యిడయందాత్మను యోజనచేసిన వాఁడగును. ౪ ఈవాక్యార్థము ౯వ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౫.

౨౫ ౨. ౧ సామిమార్జయన్త ఏతత్ప్రతివా అసురాణాం యజ్ఞేవ్యచ్ఛిద్యత బ్రహ్మణా దేవాః సమదధు ౨ ర్బృహస్పతి స్తనుతామిమం నఇత్యాహ బ్రహ్మవై దేవానాం బృహస్పతి ర్బ్రహ్మణైవయజ్ఞగ్ం సందధాతి ౩ విచ్ఛిన్నం యజ్ఞగ్ం సమిమం దధాత్వి త్యాహ సంతత్యై ౪ విశ్వేదేవా ఇహమాద యన్తా మిత్యాహ సం తత్యైవయజ్ఞం దేవేభ్యోఽనుదిశతి ౫ యాం వై

౧ (వెనుకటి పంచాశత్తులోని చివరవాక్యమునకు, ఈపంచాశత్తులో మొదటి వాక్యమునకును, చేర్చి యిచ్చుటనే యర్థము వ్రాయఁబడుచున్నది.) (యజ్ఞమధ్య మందు) ఇడను భక్షించుటయు, మార్జనము=(ఉదకముచే శిరస్సునందు ప్రోక్షించుట) చేసికొనుటయు నేదికలదో! ఈచేయుటచే యజ్ఞముయొక్క యంగము చెడిపోవు చున్నది. (ఇట్లుచేయుటచే రాక్షసుల యజ్ఞము విచ్ఛిన్న (చెడిపోవుట) మయినది.) దేవతలు (అప్రమత్తులై) బ్రహ్మచే (విచ్ఛిన్నములైన యజ్ఞభాగములయొక్క) సంధానముం జేసిరి, (సంధానము=కలుపుట ) ౨ దేవతలలో బృహస్పతియే బ్రహ్మ. "బృహస్పతిస్తనుతా" మిత్యాది మంత్రపాఠముచేత, బ్రహ్మచేతనే (యజమానుఁడు) యజ్ఞమును సంధానము చేసినవాఁడగును ౩ విచ్ఛేదములేకుండుటకై ఈవిచ్ఛిన్న మయిన యజ్ఞమును సంధానము చేయవలయునని శ్రుతిచెప్పినది. ౪ "విశ్వేదేవా

ఇహా" ఇత్యాది మంత్రపాఠముచే, (యజ్ఞముయొక్క సంతతి యెడతెగకుండుట) చేతనే (యజమానుఁడు) దేవతలకొఱకు యజ్ఞమునిచ్చుచున్నాఁడు. (అనితా॥) ౫ ఈ పదము ౬వ పంచాశత్తులోఁజేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు౬.

౨౫౩. యజ్ఞే దక్షిణాందదాతి తామస్యపశవోఽను సంక్రామన్తి సఏష ఈజానోఽ పశుర్భావుకోయజమానేన ఖలువై తత్కార్యమిత్యాహుర్యథాదేవ త్రా దత్తంకుర్వీతాఽఽత్మన్పశూన్రమయేతేతి ౨ బ్రధ్నపిన్వస్వేత్యాహ యజ్ఞో వై బ్రధ్నోయజ్ఞమేవతన్మహయత్యథో దేవత్రైవదత్తం కురుతఆత్మన్ప శూన్రమయతే ౩ దదతోమే మాక్షాయీత్యా హాక్షితిమేవోపైతి ౪ కుర్వతోమే మోపదసదిత్యా హాభూమానమేవోపైతి॥

౧ ఏయజమానుఁడు యజ్ఞమునందు (ఋత్విక్కుల కొఱకు) దక్షిణనిచ్చుచున్నాఁడో! ఈ యజమానుని యొక్క పశువులా దక్షిణను అనుసరించుచున్నవి. ఆయా యజమానుఁడు యాగము చేయుచున్నవాఁడై, పశురహితుఁడై యగుచున్నాఁడు (కావున) తనచే నివ్వఁబడిన దక్షిణాద్రవ్యము దేవతలం దేవిధముగా నుండునో; పశువులు తనయందు దేవిధముగాఁ (చేసినచో) ప్రీతి చెందుచున్నవో, యజమానునిచేనావిధము చేయవలయునని (బుద్ధిమంతులు) చెప్పుచున్నారు. ౨ యజ్ఞమే బ్రధ్నపదార్థము. "బ్రధ్నపిన్వస్వ" (ఓయజ్ఞమా! సంతోషించుము) అనుమంత్రపాఠముచే యజ్ఞమునే పూజించినట్లగును. మఱియుఁ

దనచేనివ్వఁబడిన దక్షిణాద్రవ్యము దేవతలందే యివ్వఁబడినదగుచున్నది. పశువు లను తనయందు రమింపఁజేయుచున్నవాఁడగుచున్నాఁడు. ౩ దానము చేయు చున్న నా (దక్షిణాద్రవ్యము) క్షీణింపకుండుఁగాకయని ప్రార్థించుటచే దక్షిణ అక్షయమగుచున్నది. ౪ "కుర్వతోమే" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) అభివృద్ధిలక్షణమగు వృద్ధినే పొందుచున్నాఁడు.

ప్రథమానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౨.

౨౧౪. ౧ సగ్ం శ్రవాహసౌవర్చనసస్సు మిశ్జమా పోదితిమువాచ ౨ యత్సె త్రిణాగ్ం హోతాఽభూః కామిడాముపాహ్వథాఇతి ౩ తాముపాహ్వ ఇతిహోవాచయా ప్రాణేనదేవా, న్దాధారవ్యానేన మనుష్యానపానేన పితౄనితి ౪ ఛినత్తిసానఛినత్తీ౩ఇతి ౫ ఛినత్తీతిహోవాచ ౬ శరీరం వా అస్యైతముపాహ్వథాఇతిహోవాచ ౭ గౌర్వై॥

౧ సువర్చనస పుత్రుఁడగు సంశ్రవుఁడనుఋషి ఉపోదితపుత్రుఁడగు తుమిం జుఁడను ఋషిని (ఈవిధముగా) ప్రశ్నించెను. ౨ హోమము చేయువారిలో (నీవు) ఎప్పుడు హోతవయితివి? ఏమిగుణముకల యిడను పిలిచితివి? (ఇది ప్రశ్న) ౩ ఏయిడ ప్రాణవాయువుచే దేవతలను, వ్యానవాయువుచే మనుజులను, అపానవాయువుచే పితృదేవతలను ధరించినదో! ఆయిడను పిలిచితినని (తుమింజుఁడు

సమాధానము) చెప్పెను. (ఇది సమాధానము) ౪ (నీచే నాహ్వానింపఁబడిన) ఆయిడ (గోరూపమయినదగుచు దక్షిణగాఁ దీసికొనినవారిని ప్రతిగ్రహదోషముచే) నశింపఁజేయునా? లేక చేయదా? (ఇది మఱొకప్రశ్న ఇడయనునది యొకయాగదేవత. ఇడ-పింగళయను నాడియనుకొనరాదు.) ౫ నాశనముచేయునని (తుమింజుఁడు) సమాధానము చెప్పెను. ౬ ఈయిడాదేవతయొక్క శరీరముమాత్రము నీచే నాహ్వానింపఁబడినది. (ముఖ్యదేవతమాత్రము కాదని) ప్రశ్నించెను. ౭ ఈపనము రెండవ పంచాశత్తులోఁ జేర్చి వివరింపఁబడును.

పఞ్చాశత్తు ౨.

౨౫౫. అస్యై శరీరం గాంవావతౌ తత్పర్యవదతాం ౨ యాయజ్ఞే దీయతే సా
ప్రాణేన దేవాంన్దాధారయ యామనుష్యా జీవన్తి సావ్యానేన మనుష్యా
న్యాం పితృభ్యోఘ్నన్తి సాఽపానేన పితౄ ౩ న్యఏవంవేద పశుమాన్భవ
త్య ౪ థ వై తాముపాహ్వ ఇతిహోవాచ యాప్రజాః ప్రభవన్తీః ప్రత్యాభవతీ
త్య ౫ న్నం వాఅస్యైతత్ ।

౧ గోవే యిడయొక్క శరీరము. (కావున) ఇడయొక్క శరీరమగుగోవునే (తెలిసికొనినవారయి పూర్వోక్తములగు ఛినత్తీత్యాదిక ప్రశ్నోత్తరములచే) నిందించిరి. ౨ (గోరూపమయిన) యేయిడాదేవత యజ్ఞమునందు (దక్షిణగా) నివ్వఁబడుచున్నదో! ఆ యిడాదేవత ప్రాణసమానమయిన ముఖ్యవ్యాపారముచే దేవతలను ధరింపఁజేయుచున్నది. ఏ యిడారూపమయినగోవుచే మనుజులు జీవించుచున్నారో! ఆయిడ వ్యానసమానమగు మధ్యమవృత్తిచే (=వ్యాపారము) మనుజులను ధరింపఁ

జేయుచున్నది. (అష్టకాశ్రాద్ధమునందు) ఏ గోరూపమయినయిడను పితృదేవతలకై హింసించుచున్నారో ! ఆయిడ పితృదేవతల నపానసమానమయిన యధమవృత్తిచే (వ్యాపారము) ధరింపఁజేయుచున్నది. (అనగా- దేవతలు గోవుచేవిధముగాను హింసించరు కావున యిడ వారినిముఖ్యవృత్తిచేతను, మనుజులుగోవునుండి పాలుపితుకుచున్నారు కావున వారినిమధ్యమవృత్తిచేతను, పితృదేవతలకై అష్టకాశ్రాద్ధమునందు గోవునుహింసింతురు కావున వారిని అపానసమానమగు నధమవృత్తిచేతను ధరింపఁజేసినదని భావము.) (ఇచట పశుబలి యధమమని సూచింపఁ బడినదనవచ్చును) 3 ఎవఁడీవిధముగాఁ దెలిసికొనునో ! (వాఁడు) పశురూపసమృద్ధి కలవాఁడగుచున్నాడు. ౪ ఏ యిడప్రభువులైన ప్రజలను గూర్చి యభిముఖముగా నుండునో ! ఆ యిడను పిలిచితినని (తుమింజుడు) సమాధానము చెప్పెను. ౫ ఈ యిడ యొక్క యన్నమేదికలదో ! దానిని మాత్రము పిలిచితివి. (ముఖ్యమయిన యిడను కాదు) అని (సంశ్రవుఁడు మఱల) ప్రశ్నించెను

పంచాశత్తు ౩.

౨౫౬. ఉపాహ్వాథా౩ఇతి హో౭వాచౌ ౧ షధయో వాఅస్యా అన్నమోషధయో వై ప్రజాః ప్రభవన్తీః ప్రత్యాభవన్తి ౨ యఏవంవేదాన్నాదోభవత్య 3 థవైతా ముపాహ్వా౩ఇతిహో౭వాచ యాప్రజాః పరాభవన్తీ రనుగృహ్ణాతిప్రత్యాభవన్తీ ర్గృహ్ణాతీతి ౪ ప్రతిష్ఠాం వాఅస్యైతదు పాహ్వాథా౩ఇతిహో౭వాచే ౫ యంవాఅస్యై ప్రతిష్ఠా ॥3॥

౨ ఓషధులే యీయిడయొక్క యన్నము. ఓషధులే ప్రభువులగు ప్రజలను

గూర్చి యభిముఖముగానుంటున్నవి. (ప్రజలగృహములందు ఓషధులయిన వ్రీహు లుంటున్నవని తా॥ వ్రీహి = ధాన్యములు.) ౨ ఎవఁడీవిధముగాఁ దెలిసికొనునో ! (వాఁడు) న్నమును దినువాఁడగుచున్నాఁడు. ౩ ఏ యిడ (రోగముచే) తిరస్కరింప బడుచున్న ప్రజలను (తనయందుంచుకొని) అనుగ్రహించుచున్నదో, బాధితులయిన యా ప్రజలను (అభీష్టస్థానము నిచ్చుటచే) గ్రహించుచున్నదో, ఆ యిడను పిలిచితి వని (తుమింజుఁడు) పలికెను. ౪ ఈ యిడయొక్క ప్రతిష్ఠారూపమయిన భూమినే యాహ్వానించితివి. (ముఖ్యమయిన యిడనుకాదు) అని స. శ్రవుఁడు (మఱల) పలికెను. (ప్రతిష్ఠా = ఈ భూమియందు గోరూపమయిన యిడ యుంటున్నది కావున, ఈ యిడకుఁబ్రతిష్ఠయని నిర్వచనము) ౫ ఈ వాక్యార్థము ౪వ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౪

౨౫౭. ఇయంవై ప్రజాః పరాభవన్తీ రనుగృహ్ణాతి ప్రత్యాభవన్తీ ర్గృహ్ణాతి ౨

యఏవంవేద ప్రత్యేవతిష్ఠత్య ౩ త్వన్వై తాముపాహ్వా ఇతిహోవాచ యస్యై

నిక్రమణే ఘృతంప్రజాః సంజీవన్తీః పిబన్తీతి ౪ ఛినత్తి సాన ఛినత్తి ౩ ఇతి

౫ నఛినత్తీతి హోవాచప్రతుజనయతీత్యై ౬ షవాఇడామ పాహ్వాధాఇతి

హోవాచ ౭ వృష్టిర్వాఇడా వృష్ట్యైవై నిక్రమణేఘృతం ప్రజాః

సంజీవన్తీః పిబన్తి యఏవంవేద ప్రైవజాయతేఽన్నాదో భవతి॥

౧ ఈ భూమియే యాయిడయొక్క ప్రతిష్ఠ. ఈ భూరూపమయినయిడ తిర

సత్కృతులగు ప్రజలను అనుగ్రహించుచున్నది. ప్రభువులగు ప్రజలనభిముఖముగా గ్రహించుచున్నది. ౨ ఎవఁడీవిధముగాఁ దెలిసికొనుచున్నాఁడో, (వాఁడు) ప్రతిష్ఠావన్తుఁడగుచున్నాఁడు. ౩ ఏ వృష్టిరూపమయిన యిడయొక్క పతనము (భూమిమీఁద పడుట) కలుగుచుండగా, స్రవించుచున్న యుదకము జీవనమును కోరునట్టి ప్రజలను బ్రతికించుచున్నదో, ఆయిడను పిలిచితినని (తుమింజుఁడు మఱల) పలికెను. ౪ ఆవృష్టిరూపమయిన యిడ (తనను దక్షిణగా గ్రహించిన వారిని) నశింపఁజేయుచున్నదా? లేక నశింపఁజేయుటలేదా ? (అని సంశ్రవుఁడు పూర్వమువలె మఱల ప్రశ్నించెను. ౫ (ఈవృష్టిరూపమయిన) యిడ నశింపఁజేయదు. మఱియు (సస్యాదికమును) పుట్టించుచున్నదని (తుమింజుఁడు సమాధానమిచ్చెను. అనఁగా, గవాన్నభూములకు వలె నీవృష్టిరూపమయిన యిడను దక్షిణగా గ్రహించుటలేదు కావున, ప్రతిగ్రహరూపదోషము లేకుండుటచే నశింపఁజేయదని వర్ణింపఁబడినది.) ౬ ఈవృష్టిరూపమయిన యిడను చెప్పునట్టి నీవేముఖ్యమయిన యిడను పిలిచితివని (సంశ్రవుఁడు తుమింజునిఁ గూర్చి) పలికెను. ౭ వృష్టియే యిడ. వృష్టియొక్క పతనము కలుగుచుండగా స్రవించుచున్న యుదకము జీవనార్థులగు ప్రజలను జీవింపఁజేయుచున్నది. ఎవఁడీ విధముగాఁ దెలిసికొనుచున్నాఁడో, (అతఁడు) గొప్పగాఁ బుట్టుచున్నాఁడు. (మఱియు) అన్నమును తినువాఁడగుచున్నాడు.

ద్వితీయానువాకముసమాప్తము.

—*—

## అనువాకము ౩.

౨౫. పరోక్షంవా అన్యేదేవా ఇజ్యన్తే ప్రత్యక్షమన్యేయద్యజతే యఏవదేవాః

పరోక్షమిజ్యన్తే తానేవతేద్యజతి ౨ యదన్వా హార్యమాహారత్యేతే వై దేవాః ప్రత్యక్షం యద్బ్రాహ్మణా స్తానేవ తేన ప్రీణాత్య ౩ థోదక్షిణై వాస్యైషాzథో యజ్ఞస్యై వఛిద్రమపిదధాతి ౪ యద్వై యజ్ఞస్యక్రూరం యద్విలిష్టం తదన్వా హార్యేణ॥

౧ కొందరు దేవతలు పరోక్షముగా (కంటికిఁ గానరాకయే) యాగముచేయఁ బడుచున్నారు. మఱికొందరు ప్రత్యక్షముగా యాగము చేయఁబడు చున్నారో! వారినిగూర్చియే (ఆయజమానుఁడు) యాగము చేసినవాఁడగుచున్నాఁడు. (యాగము చేయఁబడుచున్నారు = యాగములో నుద్దేశింపఁ బడుచున్నారు. ఇంద్రాదిదేవతలు కనపడరు కావున ఆ యాగము పరోక్షము. పరోక్షము = కంటికిఁగనపడనిది. ఋత్విక్కులు కంటికిఁ గనపడుచుందురు కావున వారినుద్దేశించి చేసినయాగము ప్రత్యక్షమగును.) ౨ (ఋత్విజులకొఱకు) అన్వాహార్యము నివ్వవలయును బ్రాహ్మణులెవ్వరు కలరో! ఋత్విగ్రూప దేవతలే ప్రత్యక్షముగా నుంటున్నారు. ఆయన్వాహార్యదానముచే బ్రాహ్మణులనే (యజమానుఁడు) సంతోషపెట్టుచున్నాఁడు. (అన్వాహార్యము = పక్వమయిన యన్నము.) ౩ మఱియునీయజ్ఞమునకు ఈ యన్వాహార్యమే దక్షిణ. యజ్ఞముయొక్క ఛిద్రమును (లోపమును) కూడా పోగొట్టును. ౪ యజ్ఞముయొక్క యధికమయిన యంగమేదికలదో! న్యూనమయిన (= అల్పమయిన) యంగమేదికలదో! అది యుభయము. అన్వాహార్య (దాన) ముచే ననుకూలముగా సరిపుచ్చుచున్నాఁడు. కావుననే యన్వాహార్యమున కన్వాహార్యశబ్ద వ్యవహారము. (అన్వాహ్రియతే = అనుకూల్యేన సమాధీయతే అనేనేతి అన్వాహార్యః అనివ్యుత్పత్తి.)

పంచాశత్తు ౨.

౨౫౯. అన్వాహారతి తదన్వాహార్యస్యాన్వాహార్యత్వం ౧ దేవదూతా వా ఏ తే యదృత్విజో యదన్వాహార్యమాహారతి దేవదూతానేవ ప్రీణాతి ౨ ప్రజాపతిర్దేవేభ్యో యజ్ఞా న్వ్యాదిశత్సరి రిచానో ఽ మన్యత సఏతమన్వా హార్యమ భక్తమ పశ్యత్తమాత్మన్న ధత్త సవా ఏష ప్రాజాపత్యో యద న్వాహార్యో యస్యైవం విదుషో ఽన్వాహార్యఆహ్రియతే సాక్షాదేవ ప్రజాపతి మృధ్నోతి ౩ పరిమితో నిరుప్యో ఽపరిమితః ప్రజాపతిః ప్రజాపతేః॥

౧ ఋత్విజులెవరు కలరో, వీరు దేవదూతలు. (అనఁగా దూతలవలె దేవతలకు హోమముద్వారా హవిస్సునందిచ్చువారని తా॥) ఈ ఋత్విజుల కన్వాహార్యము దానముచేసినచో, (యజమానుఁడు) దేవదూతలనే సంతోషపరచిన వాఁడగుచు న్నాడు. ౨ ప్రజాపతి అగ్న్యాది దేవతల కొఱకు ఆగ్నేయ – అగ్నీషోమీయ పురో డాశములుకల యజ్ఞముల నిచ్చెను. (అప్పుడా) ప్రజాపతి తనను యాగరహితుని గాఁదలచెను. (పిమ్మట) నాతఁడు అన్వాహార్యమును విభజింపఁబడని (ఇవ్వఁబడని) దానినిగాఁ జూచెను. ఆయన్వాహార్యమును (పక్వాన్నమును) తనయందుంచుకొనెను. అన్వాహార్యమేదికలదో, ఆ యీ యన్వాహార్యము ప్రజాపతి దేవతాకమయినది. ఈ విధముగాఁ దెలిసికొనిన యేయజమానుని యన్వాహార్యము (ఋత్విజులకొఱకు) ఇవ్వఁబడునో, ఆయజమానుఁడు ప్రజాపతిని సంతోషపెట్టుచున్నాఁడు. ౩ (ఋత్విజు లకొఱకు) నిర్వాపము చేయఁబడిన యన్వాహార్యము (ప్రజాపతి దేవతాకముకావున) అపరిమితము. (బహుళమని తా॥) ప్రజాపతి (సర్వదేవతాస్వామి కావున) అపరిమితు

ము (గొప్పవాడని తా॥) ఈ నిర్వాపము చేయఁబడిన (సమర్పింపఁబడిన) యన్వాహార్యము ప్రజాపతియొక్క సంతోషము కొఱకగుచున్నది.

పంచాశత్తు 3.

౨౬౦. అష్ట్యే ౧ దేవావై యద్యజ్ఞేఽకుర్వత తదసురా అకుర్వత తే దేవా ఏతం ప్రాజాపత్యమన్వాహార్యమ పశ్యన్తమ న్వాహరన్త తతో దేవా అభవన్పరాఽసురా యస్యైవం విదుషోఽన్వాహార్య ఆహ్రియతే భవత్యాత్మనా పరాఽస్య భ్రాతృవ్యో భవతి ౨ యజ్ఞేనవా ఇష్టీ పక్వేన పూర్తీ యస్యైవం విదుషోన్వాహార్య ఆహ్రియతే స త్వే వేష్టాపూర్తీ 3 ప్రజాపతేర్భాగోఽసి ॥3॥

౧ దేవతలు (పూర్వము) యజ్ఞమునందు దేనిననుష్ఠించిరో, రాక్షసులు (కూడ) దానిని చేసిరి. (అప్పుడు) ఆ దేవతలు ఈ ప్రజాపతి దేవతాకమయిన యన్వాహార్యమును జూచిరి. దానిని సంపాదించిరి. దానివలన నా దేవతలు విజయవన్తులైరి. అన్వాహార్యమును సంపాదించక పోవుటచే) రాక్షసులు తిరస్కృతులైరి. ఈవిధముగా నెఱిఁగిన యేయజమానుని యన్వాహార్యము (ఋత్విజులకొఱకి) వ్వఁబడునో, ఇతని శత్రువు తనచేఁ దిరస్కృతుఁడగుచున్నాడు. ౨ (యజమానుఁడు) యజ్ఞముచే (నిష్టకర్మను= ఆగ్నేయాది శ్రౌతకర్మను) చేసినవాఁడగుచున్నాడు. అన్వాహార్యముచే బూర్తకర్మ (దిగుడుబావులు త్రవ్వించుట మొదలగు స్మార్తకర్మ)ను చేసినవాడగుచున్నాడు. ఈవిధముగా నెఱింగిన యే యజమానుని యన్వాహార్యము దానము చేయఁబడునో, వాఁడే ఇష్టాపూర్తి (పూర్వోక్తములయిన యిష్టాపూర్తకర్మలు చేసిన వాఁడు) అగుచున్నాడు. 3 ఈ వాక్యార్థము ౨౮ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౪.

౨౬౧. ౧ ఇత్యాహ ప్రజాపతిమేవ భాగధేయేన సమర్ధయతి ౨ ఊర్జస్వా
న్పయస్వానిత్యాహోర్జమేవాస్మిన్పయో దధాతి ౩ ప్రాణాపానౌ మే
పాహి సమానవ్యానౌ మే పాహీత్యాహాఽఽశిషమేవైతామాశాస్తే
౪ అక్షితోఽస్యక్షిత్యై త్వా మా మే క్షేష్ఠా అముత్రాముష్మింల్లోక ఇత్యా
హ క్షీయతే వా అముష్మింల్లోకేఽన్నమితః ప్రదానగ్ంహ్యముష్మింల్లోకే
ప్రజా ఉపజీవన్తి యదేవమభిమృశత్యక్షితిమేవైనద్గమయతి నాస్యాముష్మిం
ల్లోకేఽన్నం క్షీయతే ॥

౧ (ఓ యన్వాహార్యమా ! నీవు) ప్రజాపతికి భాగమగుచున్నావు. అనిచెప్పుటచే (యజమానుఁడు) అన్వాహార్య భాగముచే ప్రజాపతినే సంతోషపెట్టుచున్నాడు. ౨ "ఊర్జస్వాన్" ఇత్యాది మంత్రపాఠముచే (నన్వాహార్యము) ఈయజమానునియందు పాలవలె నిష్టమైన బలమును ధరింపఁజేయుచున్నది. ౩ (ఓ యన్వాహార్యమా ! నీవు) నా ప్రాణాపాన వాయువులను రక్షించుము. అనిచెప్పుటచే నీయాశీస్సునే (యజమానుఁడు) కోరుచున్నాఁడు. (ఈ ప్రాణాపానాది పాలనమే యాశీర్వాదమని తా॥) ౪ (ఓ యన్వాహార్యమా ! నీవు) నాశనము లేనిదానవగుచున్నావు. (నీకు) నాశనము లేకుండుటకై నిన్నుఁదాకుచున్నాను. (అభిమృశామి) స్వర్గలోకమునందు నాకు (నీవు) క్షీణించకుము. అని మంత్రము చెప్పుచున్నది. పరలోకమునందన్నముక్షీణించుచున్నది. ఇచ్చట దానము చేయఁబడిన యన్నమునే ప్రజలు స్వర్గమునందు భుజించుచున్నారుకదా ! పూర్వోక్తమంత్రపాఠముచే నన్వాహార్యమునభి

మర్శనము (త్రాకుట) చేసినచో, నీయభిమర్శనము (అన్వాహార్యమునకు) అక్షయమును పొందించుచున్నది. ఇట్టి యజమానునకు యన్నము పరలోకమునందు క్షీణించదు.

తృతీయానువాకము సమాప్తము.

—*—

అనువాకము. ౪.

౨౮౨. ౧ బర్హిషోఽహం దేవయజ్యయా ప్రజావాన్భూయాస మిత్యాహబర్హిషా వై ప్రజాపతిః ప్రజా అసృజత తేనైవ ప్రజాః సృజతే నరాశగ్ంసస్యాహం దేవయజ్యయా పశుమాన్భూయాస మిత్యా హానరాశగ్ంసేన వై ప్రజాపతిః పశూనసృజత తేనైవ పశూన్త్సృజతేఽగ్నేః స్విష్టకృతోఽహం దేవయజ్యయాఽఽయుష్మాన్యజ్ఞేన ప్రతిష్ఠాం గమేయమిత్యా హాఽఽయురేవాఽఽత్మన్ధత్తే ప్రతియజ్ఞేనతిష్ఠతి ౨ దర్శపూర్ణమాసయోః ॥౧॥

౧ (ఈమంత్రములు ౭వ ప్రపాఠకమునందలి ౪వయనువాకమునందుఁ జెప్పబడినవే. వాటికిచ్చట శ్రుతియే వ్యాఖ్యానము చేయుచున్నది. అచ్చటచెప్పఁబడని వాక్యములకు మాత్రమిచ్చట అర్థము వ్రాయఁబడుచున్నది.) "బర్హిషోఽహం దేవయజ్యయా" అనుమంత్రపాఠము చేతఁ బ్రజాపతి బర్హిర్యాగానుమంత్రణము చేఁ బ్రజలను సృజించెను. దానిచేతనే ప్రజలను సృజించుచున్నాడు. "నరాశగ్ంస్యాహమ్"

ఇత్యాది మంత్రపాఠముచేఁ ప్రజాపతి నరాశంస యాగాను మంత్రణముచేతఁ బశువులను సృజించెను. (ఇప్పుడును) ఆ యనుమంత్రణముచేతనే పశువులను సృజించుచున్నాఁడు. "అగ్నేః స్విష్టకృతోఽహమ్" ఇత్యాది మంత్రపాఠముచేతఁ బ్రజాపతి యాయువు నాత్మయందు ధరించెను యజ్ఞముచేఁ బ్రతిష్ఠావన్తుఁడగుచున్నాఁడు. ("ఇత్యాహ" వరకుండుపదములకు ౮వయనువాకమునందు దండాన్వయము వ్రాయఁబడినది.) ౨ ఈపదము ౨వపంచాశత్తులో వివరింపఁబడును.

## పంచాశత్తు ౨.

౨౬ . ౧ వై దేవా ఉజ్జితిమ నూదజయన్దర్శ పూర్ణమాసాభ్యా మసురాన పానుదన్తా
గ్నేరహముజ్జితిమనూజ్జేష మిత్యాహ దర్శ పూర్ణమాసయో రేవ దేవతానాం
యజమాన ఉజ్జితిమనూజ్జయతి దర్శపూర్ణమాసాభ్యాం భ్రాతృవ్యానప నుదతే
౨ వాజవతీభ్యాం వ్యూహత్యన్నం వై వాజోఽన్నమే వావరున్ధే ౩ ద్వాభ్యాం
ప్రతిష్ఠిత్యై ర యో వై యజ్ఞస్య ద్వావదోహా విద్వాన్యజత ఉభయతః ॥ ౨॥

౧ దర్శపూర్ణమాస యాగములయొక్క మహత్త్వననుసరించి దేవతలుత్కర్ష నుపొందిరి. దర్శపూర్ణమాస యాగములచే రాక్షసులను పోగొట్టిరి. "అగ్నేరహ" మిత్యాది మంత్రపాఠముచే యజమానుఁడు దేవతల యుత్కర్షననుసరించి యుత్కర్ష నుపొందుచున్నాఁడు. దర్శపూర్ణమాసయాగములచే శత్రువులను పోగొట్టుచున్నాఁడు. ౩ "వాజ" అను పదముకల మంత్రములచే (నధ్వర్యుఁడు వేయునన్వాహార్యమును) అనుమంత్రణము చేయవలయును. (అనుమంత్రణము = మంత్రోచ్చారణముచే

సంస్కరించుట.) 3 ప్రతిష్ఠాసిద్ధికై రెండు మంత్రములచే (ననుమంత్రణము చేయ వలయును. ౪ ఈ వాక్యార్థము 3వ పంచాశత్తులోఁ జేర్చివ్రాయఁబడును.

పంచాశత్తు ౨.

౨౬౪. ౧ ఏవ యజ్ఞం దుహేపురస్తాచ్చ పరిష్టాచ్చ ఏవాఅన్యే యజ్ఞస్య దోహాఇడాయా మన్యే ౨ యద్వా రిహోతా యజమానస్యనామ గృహ్ణీయాత్తద్వా రిబ్రూయాదా దేనూ అగ్నన్నాశిషో దోహాకామాఇతిసగం స్తుతా ఏవదేవతాదుహేఽథో ఉభయత ఏవయజ్ఞం దుహేపురస్తాచ్చ పరిష్టాచ్చ 3 రోహితే సత్యాఽగ్నిర్దేవతాం గమయత్విత్యాహై తే వైదేవాశ్యాః ॥3॥

౧ ఈచెప్పఁబోవు "ఏమాఅగ్నన్ని" త్యాది మంత్రపాఠము యజ్ఞమునకొక దోహమనియు, (బూర్వమిడయందుఁ జెప్పిన "సామేసత్యాఽఽశీ" ఇత్యాది మంత్ర పాఠము మఱొక దోహమనియు నెఱుంగవలయును. (దోహములనగా — ఫల వంతములయిన పాలపెరుగులవంటి పదార్థములు )ఏయజమానుఁడు యజ్ఞముయొక్క రెండు (పూర్వోక్త) దోహములను తెలిసికొనినవాఁడై యాగముచేయునో, అతఁడు యజ్ఞమును రెండువైపులందును ఫలమును పితుకుచున్నవాఁడగుచున్నాడు. (ఈదోహములు) పూర్వమునందును, ఇకముందును, (చెప్పఁబడియున్నవి.) ౨ హోత యెప్పుడు (సూక్తవాకమును పఠించుచు) యజమానుని నామధేయము నుచ్చరించుచున్నాడో, అప్పుడు, ఈయాశీస్సులు మమ్ముఁ బొందుగాక. మేముకూడ ఆయువు మొదలగు దోహముచు గోరినవారమై యింద్రునిసేవించుదుము. అను

అర్థముకల "ఏమాగ్మన్నాశిషో" ఇత్యాది మంత్రపాఠము నుచ్చరించవలయును. (హోతచే) స్తోత్రముచేయఁబడిన సర్వదేవతలను (యజమానుడీ మంత్రపాఠముచే) పిలుచుచున్నాడు. (దేవతలవలనఁ దనకోరికలను సంపాదించుకొనుచున్నాడని తా) మఱియుఁ బూర్వోక్తమగు నిడాకాలీన దోహమును, ఇప్పటి "ఏమాగ్మన్" అను దోహమును ఈయుభయమునుఁ బిలుచుచున్నవాఁడగుచున్నాడు. ౩ ఈ వాక్యార్థము ౮వ పంచాశత్తులోఁ జేర్చి వ్రాయఁబడును.

## పంచాశత్తు ౮.

౨౬౫. ౧ యజమానః ప్రస్తరోయదేతైః ప్రస్తరంప్రహరతి దేవాశ్వైరేవ
యజమానగ్ం సువర్గంలోకం గమయతి ౨ వితేముఞ్చామి రశనావిరశ్మీ
నిత్యాహైషవా అగ్నేర్విమోకస్తేనైవైనం విముఞ్చతి ౩ విష్ణోః శం
యోరహం దేవయజ్యయా యజ్ఞేన ప్రతిష్ఠాంగమేయ మిత్యాహ యజ్ఞో
వై విష్ణుర్యజ్ఞ ఏవాన్తతః ప్రతితిష్ఠతి ౪ సోమస్యాహం దేవయజ్యయా
సురేతాః ॥

౧ "రోహితేన" ఇత్యాది మంత్రపాఠముచే, ఈ రోహిత, హరి,ఏతశ్శబ్దము లచేఁ జెప్పఁబడు గుఱ్ఱము దేవతాశ్వములనియు, యజమానుఁడు ప్రస్తరమనియుఁ దెలియుచున్నది. వీటిచేఁ బ్రస్తరమును అనుమంత్రణముచేసినచో దేవాశ్వముల చేతనే (యనుమంత్రణము) యజమానుని స్వర్గమును పొందించుచున్నది. (ప్రస్తరముకూడ యజమానునివలె యాగసాధనము కావున ప్రస్తరమునందు యజమా

నాభేదమారోపింపఁ బడినది.) ౨ "విత్తేముఞ్చామి" ఇత్యాది మంత్రపాఠముచే నిది పరిధియొక్క విమోకమని (తెలియుచున్నది) ఆ మంత్రపాఠముచేతనే యీ పరిధిని విడువ వలయును. (పరిధి = అగ్నికి చుట్టువేసిన వానిలోనొక సమిధ) ప్రస్తర = దర్భలకట్ట) ౩ యజ్ఞమే విష్ణువు. (విష్ణువువలె ఫలమునిచ్చునదని తా॥) "విష్ణోరహమ్" ఇత్యాది మంత్రపాఠముచే సమాప్తికాలములో యజ్ఞమునందే (యజమానుఁడు) ప్రతిష్ఠావన్తుఁడగుచున్నాఁడు. ౪ ఈ వాక్యార్థము ౯వ పంచాశత్తులోఁ జేర్చి వ్రాయఁబడును.

## పంచాశత్తు ౯.

౨౬౬. ౧ రేతోధిషీ యేత్యాహాసోమో వై రేతోధాస్తేనైవ రేతఆత్మన్ధత్తే ౨ త్వష్టురహం దేవయజ్యయా పశూనాగ్ం రూపంపుషే యమిత్యాహ త్వష్టా వై పశూనాం మిథునానాగ్ం రూపకృత్తేనైవ పశూనాగ్ం రూపమాత్మన్ధత్తే ౩ దేవానాం పత్నీరగ్నిర్గృహపతిర్యజ్ఞస్య మిథునన్తయోరహం దేవయజ్యయా మిథునేన ప్రభూయాసమిత్యాహైతస్మాద్వై మిథునాత్ప్రజాపతిర్మిథునేన॥౯॥

౧ "సోమస్యాహమ్" ఇత్యాది మంత్రముచే, సోముఁడు రేతస్సునుధరింపఁజేయువాఁడని (తెలియుచున్నది,) ఆ మంత్రపాఠముచేతనే (యజమానుఁడు) తనయందు రేతస్సు ధరించుచున్నాఁడు. (సోముని యనుగ్రహమువలన రేతోధారణ మగుచున్నదని తా॥) ౨ "త్వష్టురహం" ఇత్యాది మంత్రము త్వష్టయేమిథునము (జంట) లగు పశువులయొక్క రూపమును చేయువాఁడని చెప్పుచున్నది. ఆ మంత్రపాఠముచే (యజమానుఁడు) తనయందు పశువుల రూపమును ధరించుచున్నాఁడు.

౩ "దేవానాం పత్నీరగ్నిర్గృహపతిః" ఇత్యాది మంత్రము ఈ మిథునమువలన ప్రజాపతి మిథునముచేఁ బుట్టెను ఆమంత్రపాఠము (అనుమంత్రణము) చే యజమానుఁడు మిథునముచేఁ బుట్టుచున్నాఁడు. (దేవతల పత్నియు, నగ్నియు, నిచ్చట జంటయని యెఱుంగవలయును.

పంచాశత్తు ౬.

౨౬౭. ప్రాజాయత తస్మాద్దేవయజమానో మిథునేన ప్రజాయతే ౧ వేదోఽసి విత్తిరసి విదేయేత్యాహ వేదేన వై దేవా అసురాణాం విత్తం వేద్యమవిన్దన్తద్వేదస్య వేదత్వం ౨ యద్యద్భ్రాతృవ్యస్యాభిధ్యాయేత్తస్య నామ గృహ్ణీయాత్త దేవాస్య సర్వం వృఙ్క్తే ౩ ఘృతవన్తం కులాయినగ్ం రాయస్పోషగ్ం సహస్రిణం వేదో దదాతు వాజినమిత్యాహ ప్రసహస్రం పశూనాప్నోత్యా ౪ ఽఽస్య ప్రజాయాం వాజీ జాయతే య ఏవం వేద ॥

౧ "వేదోఽసి విత్తిరసి" ఇత్యాది మంత్రపాఠముచే దేవతలు రాక్షసుల విత్తము, వేద్యము అను ధనద్వయము వేదముచేతఁ బొందిరని (తెలియుచున్నది) కావున వేదమునకు "వేద" అను వ్యవహారము. (అనఁగా విద్యతే విత్తమనేనేతి = దీనిచే ధనము పొందఁబడుచున్నది. కావున వేదః అని చెప్పఁబడుచున్నది. వేదము = దర్భలకట్టకుఁ బేరు. విత్తము = పూర్వలబ్ధమయిన ధనము. వేద్యము = ముందు రాఁబోవు ధనము.) ౨ శత్రువుయొక్క గృహము మొదలయిన యే ధనము కలదో, యజమానుఁడు దానినంతయుఁ దనకుఁ గావలయునని ధ్యానము చేసినచో, (అప్పుడా) శత్రువుయొక్క పేరును "వేదోఽసి" ఇత్యాది మంత్రమధ్యమందుఁ జేర్చి పఠించవలయును.

అప్పుడీ శత్రువుయొక్క సర్వస్వమును (యజమానుఁడు) హరించుచున్నాడు. ౩ "ఘృతవన్తం కులాయినమ్" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు అనేకపశువులను పొందుచున్నాడు. ౪ ఎవఁడీ విధముగాఁ దెలిసికొనునో, వానియొక్క సంతతియందు బుత్రుఁడంతటను, అన్నసమృద్ధుఁడై పుట్టుచున్నాడు.

చతుర్థానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౫.

౩౬౮. ౧ ధ్రువాం వై రిచ్యమానాం యజ్ఞోఽనురిచ్యతే యజ్ఞం యజమానో
యజమానం ప్రజా ధ్రువామాప్యాయమానాం యజ్ఞోఽన్వాప్యాయతే
యజ్ఞం యజమానో యజమానం ప్రజా ౨ ఆప్యాయతాం ధ్రువా ఘృతే
నేత్యాహ ధ్రువామేవాఽఽప్యాయయతి తామాప్యాయమానాం యజ్ఞో
న్వాప్యాయతే యజ్ఞం యజమానో యజమానం ప్రజాః ౩ ప్రజాపతే
ర్విభాన్నామ లోకస్తస్మిగ్ంస్త్వా దధామి సహ యజమానేనేతి ॥

౧ శూన్యమయిన (హోమసాధనమగు) ధ్రువయను పాత్రననుసరించి యజ్ఞము శూన్యమగుచున్నది. (అనఁగా ఫలశూన్యమగుచున్నదని తా॥) యజ్ఞముననుసరించి యజమానుఁడు ఫలశూన్యుఁడగుచున్నాడు. యజమానుననుసరించి ప్రజలు శూన్యులగుచున్నారు. (ఆజ్యముచే) నిండింపఁబడిన ధ్రువననుసరించి యజ్ఞము, యజ్ఞముననుసరించి యజమానుఁడు, యజమానుననుసరించి ప్రజలు సంతృప్తులగుచున్నారు.

(ఫలవన్తులగుచున్నారని తా॥) ౨ "ఆప్యాయతాం ధ్రువా" ఇత్యాది మంత్రపాఠము చే (యజమానుఁడు) ధ్రువనే నిండింపుచున్నాఁడు. నిండింపఁబడుచున్న యాధ్రువ ననుసరించి యజ్ఞము నిండింపఁబడుచున్నది. యజ్ఞమునను సరించి యజమానుఁడు, యజమానుననుసరించి ప్రజలు ఫలవన్తులగు చున్నారు. ౩ "ప్రజాపతేర్విభాన్నామ" ఇత్యాది మంత్రము "విభాన్" అను లోకము ప్రజాపతి సంబంధియని చెప్పుచున్నది. ఆలోకమునందే యీయజమానభాగము (హోమము చేయఁగామిగిలిన హవిర్భాగము) ను యజమానుఁడగు తనతోఁగూడ నుంచుచున్నాఁడు. (ఉపప్రపాఠకమునందలి మంత్రములనే ఈయనువాకము వ్యాఖ్యానము చేయుచున్నది.)

పంచాశత్తు ౨.

౨౬౯, ఆహోయంవై ప్రజాపతే ర్విభాన్నామలోకస్తస్మిన్నే వైనందధాతి సహ యజమానేన ౧ రిచ్యతఇవవా ఏతద్యద్యజతే యద్యజమానభాగం ప్రాశ్నాత్యాత్మానమేవప్రీణాత్యే ౨ తావాన్వైయజ్ఞో యావాన్యజమాన భాగో యజ్ఞోయజమానో యద్యజమానభాగం ప్రాశ్నాతి యజ్ఞ ఏవ యజ్ఞం ప్రతిష్ఠాపయత్యే ౩ తద్వైసూయవసగ్ం సోదకం యద్బర్హిశ్చా పశ్చైతత్।

౧ యాగము చేయుచున్నాఁడనుటయేదికలదో! దీనిచే (యజమానుఁడు) శూన్యుఁడగుచున్నాఁడు. యజమానభాగమును తిన్నచో, దనయాత్మనే సంతోషపెట్టుకొనుచున్నాఁడు. (ఈయజమానభాగము భక్షించుటచే యాగమువలన గలిగిన కష్టమును పోగొట్టుకొనునని తా॥) ౨ యజమానభాగము కల యజ్ఞమెంతకలదో,

ఇదియే(భూలోకమునందు యజమానునకుపయుక్తమయిన) యజ్ఞము. (మిగిలిన భాగమును దేవతలు, ఋత్విక్కులును, భక్షింతురని తా॥) యజమానభాగమును (యజమానుఁడు) తినినచో యజ్ఞమునందే యజ్ఞమును ప్రతిష్ఠింపఁజేసినవాఁ డగుచున్నాఁడు. బర్హిస్సు ఉదకము—ఏదికలదో, (బర్హిస్సునేఁ గప్పఁబడియుండుటచే) నీవేది మంచిబర్హిస్సుతోఁగూడుకొనినదియు, నుదకముతోఁగూడుకొనినదియు నగుచున్నది. వేదియేది కలదో, ఈవేదియజమానునకు స్థానము.

## పంచాశత్తు 3.

౨౭౦. యజమా స్యాऽऽయతనం యద్వేది ౧ ర్యత్పూర్ణపాత్రమన్తర్వేదినిన యతిస్వఏవాఽఽయతనే నూయవన్సగ్ంం సోదకంకురుతే ౨ సదసి సన్నే భూయా ఇత్యాహాऽऽపోవై యజ్ఞఆపో మృతం యజ్ఞమేవామృతమాత్మ న్ధత్తే ౩ సర్వాణివై భూతాని వ్రతముపయన్తమనూపయన్తి ప్రాచ్యాం దిశి దేవా ఋత్విజోమార్జయన్తామిత్యా హైషవై దర్శపూర్ణమాసయో రవభృథః ॥

౧ పూర్ణపాత్రను వేది మధ్యయందుంచినచో, (యజమానుఁడు)తన స్థానమునందే తృణసమృద్ధిని, ఉదకసమృద్ధిని చేసినవాఁడగుచున్నాఁడు. (పూర్ణపాత్ర=ఉదకముతో నిండినపాత్రవిశేషము. వేది, బర్హిస్సు, ఇత్యాది పదములు పూర్వము వ్యాఖ్యానము చేయఁబడినవి.) ౨ ఉదకములే (యజ్ఞసాధనములగుట వలన) యజ్ఞము ఉదకములు (జీవన కారణములగుటవలన) అమృతస్వరూపములు. (కావున ఉదకము నుద్దేశించి) "సదసిసన్మే" ఇత్యాదిమంత్రపాఠముచే (యజమానుఁడు) తనయందమృ

తిమును ధరింపఁజేసిన వాఁడగుచున్నాడు. 3 యజ్ఞవ్రతమును పొందుచున్న యజమానుననుసరించి దేవపిత్రాది సర్వభూతములు వ్రతమును ప్రారంభించుచున్నారు. ఏ దేవపిత్రాది ప్రాణులు వ్రతమునను ష్ఠించుచున్న యీ యజమానుననుసరించి (వ్రతమును) ప్రారంభించుచున్నారో ! ఇదియే దర్శపూర్ణమాస యాగములయొక్క యవభృథము. "ప్రాచ్యాందిశి" ఇత్యాది మార్జనమును చెప్పు మంత్రపాఠముచే (యజమానుఁడు) ఆ సర్వప్రాణులతోఁగూడా నవభృథమును పొందుచున్నాడు. (అవభృథము = వ్రతముయొక్క యంత్య దివసమునందుఁ జేయు కర్మవిశేషము.)

## పంచాశత్తు ౪.

౨౭౧. యాన్వావైనం భూతానివ్రతము పయన్తమనూపయన్తి తైరేవసహావభృథమవైతి ౧ విష్ణుముఖావై దేవాశ్ఛన్దోభిరిమాఁల్లోకాననపజయ్యమభ్యజయన్యద్విష్ణుక్రమాన్ క్రమతే విష్ణురేవభూత్వా యజమానశ్ఛన్దోభిరిమాఁల్లోకానన పజయ్యమభిజయతి ౨ విష్ణోః క్రమోఽస్యభిమాతిహేత్యాహ గాయత్రీవై పృథివీ త్రైష్టుభమన్తరిక్షం జాగతీ ద్యౌరానుష్టుభీర్దిశశ్ఛన్దోభిరేవేమాఁల్లోకాన్యథా పూర్వమభిజయతి ॥౪॥

౧ దేవతలు విష్ణువును ముఖ్యముగాఁ జేసికొనినవారై ఛన్దోభిమాని దేవతలతోఁగూడా ఈ లోకములనితరులచే జయించుటకు శక్యముకానట్లుగా జయించిరి. యజమానుఁడు విష్ణువుయొక్క పాదప్రదేశములను (౩వ ప్రపాఠకమునందలి ౫వ యనువాకమునందు చెప్పిన విధముగా) పృథివ్యాది లోకములనుగా భావనచేసినచో (తాను) విష్ణువేయై గాయత్ర్యాది ఛన్దోభిమానదేవతలచే నీ లోకములనితరులచే

జయింపశక్యముకానట్లుగా జయించుచున్నాడు. ౨ పృథివి గాయత్రీఛన్దోభిమాన దేవత స్వామిగాఁగలది. అంతరిక్షము త్రిష్టుప్ఛన్దోభిమాన దేవతాకము. ద్యులోకము జగతీఛన్దోభిమాన దేవతాకము. దిక్కులు అనుష్టుప్ ఛన్దోభిమాన దేవతాకములు. "విష్ణోః క్రమోఽసి" ఇత్యాది మంత్రపాఠముచేఁ బూర్వోక్త విధముగా (యజమానుఁడు) ఈలోకములను జయించుచున్నాడు. (దేవతాకము = దేవతగాఁగలది.)

పంచమానువాకము సమాప్తము.

—:-o-:—

## అనువాకము ౬.

౨౭౨. ౧ అగన్మసువః సువరగన్మేత్యాహానువర్గమేవలోకమేతి ౨ సంద్రశస్తేమాభిత్సియత్తే తప స్తస్మైతేమాఽఽవృక్షీ త్యాహాయథాయజుర్వైత ౩ సుభూరసి శ్రేష్ఠోరశ్మీనామాయుర్ధా అస్యాయుర్మే ధేహీత్యాహాఽఽశిషమేవైతామాశాస్తే ౪ ప్రవాఏషోఽస్మాల్లోకాచ్చ్యవతేయః ॥౧॥

౧ (ఈ యనువాకమునందలి మంత్రములన్నియు ౬వ ప్రపాఠకమునందలి ౩వ యనువాకమునకు వ్యాఖ్యాన ప్రాయము.) "అగన్మ" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) స్వర్గలోకమును పొందుచున్నాడు. ౨ "సంద్రశస్తేమాభిత్సి" ఇత్యాది మంత్రపాఠముచే నేది తెలియంబడుచున్నదో, ఇది యజుస్సునతిక్రమించకయే ప్రార్థింపఁ బడుచున్నది. ౩ "సుభూరసి రశ్మీనామ్" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) ("నాకు ఆయువునిమ్ము") ఇత్యాది

రూపమయిన యాశీస్సును కోరుచున్నాడు. (ఈ మంత్రములన్నిటికి ౬ ప్ర- ౬ అనువాకమునందే దండాన్వయము వ్రాయఁబడినది కావున మఱల నీయనువాకము వ్రాయుట విరమింపఁ బడినది) ౮ ఈ వాక్యార్థము ౨వ పంచాశత్తులో వ్రాయబడును

పంచాశత్తు ౨.

౨౭౩. విష్ణుక్రమాన్క్రమతే సువర్గాయహిలోకాయ విష్ణుక్రమాః క్రమ్యన్తే బ్రహ్మవాదినోవదన్తి సత్త్వైవిష్ణుక్రమాన్క్రమేతయ ఇమాల్లోకాన్భ్రాతృవ్యస్యవృత్వా పునరిమం లోకం ప్రత్యవరోహేది ౨ త్యేషవా అస్యలోకస్యప్రత్యవరోహోయదా హేదమహామముం భ్రాతృవ్యమాభ్యోదిగ్భ్య స్యైదివ ఇతీమానేవ లోకాన్భ్రాతృవ్యస్యనం విద్యాపునరిమం లోకం ప్రత్యవరోహతి సమ్॥

౧ ఏ యజమానుఁడు (పూర్వోక్త)విష్ణుక్రమములను పొందుచున్నాఁడో, ఆయజమానుఁడీ లోకమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. విష్ణుక్రమ (పాదప్రదేశ) ములఁజెప్పునట్టి మంత్రములు స్వర్గలోకముకొఱకు సమర్థములగుచున్నవని బ్రహ్మజ్ఞులు చెప్పుచున్నారు. ఏ యజమానుఁడు శత్రుసంబంధులగు నీలోకములను (అతనినిఁబోగొట్టుటద్వారా) సంపాదించి (స్వర్గలోకమును పొందినపిమ్మటకూడా) ఈ లోకమునధిష్ఠించునో, ఆ యజమానుఁడే విష్ణుక్రమములను పొందినవాఁడగును. (నేర్పరియని తా) ౨ "ఇదమహా.......దివే" అనుమంత్రపాఠమేదికలదో, ఈ పాఠమే ఈ భూలోక

సంబంధియగు ప్రత్యవరోహము (= దిగుట) ఈ దిక్కులకొఱకు, ఈ ద్యులోకము కొఱకు, నేనీశత్రువునునిరాకరించుదును") అనియీ మంత్రపాఠమునకర్థము. ఈమంత్రపాఠముచే (నీ యజమానుఁడు) శత్రువుయొక్క యీ లోకములను పొంది (స్వర్గారోహమునకుఁ బిమ్మట) మఱల నీలోకమును పొందుచున్నాడు.

## పంచాశత్తు 3.

౨౭౪. జ్యోతిషాఽభూవమిత్యాహాస్మిన్నేవ లోకే ప్రతితిష్ఠత్యై ౨ న్ద్రీమావృతమ
న్వావర్త ఇత్యాహాసౌ వా ఆదిత్య ఇంద్రస్తస్యైవాఽఽవృతమనుపర్యావర్తతే
౩ దక్షిణా పర్యావర్తతే స్వమేవ వీర్య మనుపర్యావర్తతే తస్మాద్దక్షిణోఽర్ధ
ఆత్మనో వీర్యావత్తరోఽథో ఆదిత్యస్యైవాఽఽవృత మనుపర్యావర్తతే ౪ స
మహం ప్రజయా సం మయా ప్రజేత్యాహాఽఽశిషమ్ ॥

౧ "సంజ్యోతిషా" అను మంత్రపాఠముచే (యజమానుఁడు) ఈలోకమునందే ప్రతిష్ఠావంతుఁడగుచున్నాడు. ౨ ఈయాదిత్యుఁడే (ఐశ్వర్యసంబంధమువలన) ఇంద్రుడగుచున్నాడు. "ఐన్ద్రీమావృత" ఇత్యాది మంత్రపాఠముచే (యజమానుఁడు) ఆసూర్యునియొక్క తిరుగుట (ప్రదక్షిణము) ననుసరించి ప్రదక్షిణము చేయుచున్నాడు. 3 ప్రదక్షిణముగా (కుడివైపునుండి ఎడమభాగమునకు) తిరుగవలయును. (ఇట్లు చేసినచో) తనబలముననుసరించి ప్రదక్షిణము చేసినవాఁడగుచున్నాడు. కావున (పురుషునకు) కుడివగభాగము బలముకలది. (కావుననే లోకములో సర్వవ్యాపారములందుఁ బురుషునకుఁ గుడిచేతికే ఎక్కువ బలమున్నట్లుగాగన్పట్టుచున్నది.) శేషము పూర్వోక్తము. ౪ "సమహం ప్రజయా" ఇత్యాది మంత్రపాఠముచే (తానేవిధము

గా సంతానముతోఁ కలిసికొనునో, సంతానముకూడ తనతోఁగలిసికొనునుగాక, (అనునట్టి) ఈయాశీస్సునే (యజమానుఁడు) కోరుచున్నాడు.

పంచాశత్తు ౭.

౨౭౪. ఏవైతామాశాస్తే ౧ సమిద్ధో అగ్నే మే దీదిహి సమేద్ధా తే అగ్నే దీద్యాసమిత్యాహ యథాయజురేవైత ౨ ద్వసుమాన్యజ్ఞో వసీ యాన్భూయాసమిత్యాహాఽఽశిషమే వైతామాశాస్తే ౩ బహు వై గార్హపత్యస్యాన్తే మిశ్రమివచర్యత ఆగ్నిపావమానీభ్యాం గార్హపత్యము పతిష్ఠతే పునాత్యేవాగ్నిం పునీతఆత్మానం ద్వాభ్యాం ప్రతిష్ఠిత్యై ౪ అగ్నేగృహపత ఇత్యాహ।

౧ "సమిద్ధో అగ్నే" ఇత్యాది మంత్రపాఠముచే యజుస్సునతిక్రమించకయే సమిదాధానము (అగ్నిలో సమిధను మొదటనుంచుకర్మ) చెప్పఁబడినది. ౨ "వసుమాన్యజ్ఞో వసీయాన్" ఇత్యాదిమంత్రపాఠముచే (యజమానుఁడు "నేనుఎక్కువగా ధనవంతుఁడనుకాఁగలను" అనునట్టి)యీయాశీస్సును కోరుచున్నాఁడు. ౩ (యజమానునిచేనుష్ఠింపఁబడుచున్న) గార్హపత్యాగ్నియొక్క సమీపమునందు బహువిధమయిన పాపములతోఁ గూడుకొనినదివలె (యజమానునిచే హోమకర్మ చేయఁబడుచున్నది. కావున తత్పరిహారమునకై) అగ్ని-వాయువులు, దేవతలుగాఁగలఋక్కులచే గార్హపత్యాగ్నిని సేవించవలయును. (అట్లుచేసిన-చో యజమానుఁడు పూర్వోక్తములగు) రెండు ఋక్కులచేతను ప్రతిష్ఠకొఱకు అగ్నిని పవిత్రముచేయుచున్నాఁడు. తనను పవిత్రముచేసుకొనుచున్నాఁడు. ౪ ఈవాక్యార్థము ౫వపంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౫.

౩౭౬. యథాయజురేవైతచ్ఛతగ్ం హిమాఇత్యాహ శతంత్వాహేమంతా నింధిషీ

యేతి వావైతదాహ పుత్రస్యనామగృహ్ణాత్యన్నా దమేవైనం కరోతి తామా

శివమాశాసేతంతవే జ్యోతిష్మతీ మితిబ్రూయాద్యస్య పుత్రోzజాతః స్యా

త్తేజస్వ్యేవాస్య బ్రహ్మవర్చసీపుత్రోజాయతే తామాశివమాశాసేఽము

ష్మైజ్యోతిష్మతీమితిబ్రూయాద్యస్యపుత్రః ॥

౧ ("అగ్నే గృహపతే" "శతగ్ంహిమాః" "తంతవే జ్యోతిష్మతీమ్" "తామాశివమాశాసే" ఇత్యాదిమంత్రములు ప్ర ౬. అను ౬. నందు వ్యాఖ్యానింపఁబడినవే. సమన్వయముమాత్ర మిచ్చుట వ్రాయఁబడుచున్నది) అగ్నేగృహపతే అను మంత్రపాఠముచే యజుస్సు నతిక్రమించకయే యగ్ని ప్రార్థన చేయఁబడినది. "ఓయగ్నీ! నిన్ను నూరుసంవత్సరములు ప్రజ్వాలింపఁజేయుదును" అనునర్థము కల శతగ్ంహిమా అను మంత్రపాఠముచేఁ బుత్రుని పేరు నుచ్చరింపవలయును. (అట్లుచేసినచో) ఈపుత్రుని అన్నవంతునిగాఁజేసిన వాఁడగుచున్నాఁడు. తామా శివమా... జ్యోతిష్మతీమ్ అని యుచ్చరింపవలయును. (ఇట్లుచేసినచో) ఎవనికిఁ బుత్రుఁడు పుట్టలేదో ఆతనికి తేజోవంతుఁడును, బ్రహ్మవర్చస్సు కలవాఁడునగు పుత్రుఁడు పుట్టుచున్నాఁడు. తామాశివ... అముష్మైజ్యోతిష్మతీమ్ అనియుచ్చరింపవలయును. (ఇట్లుచేసినచో) ఎవనికిఁబుత్రుఁడు పుట్టెనో, ఈపుత్రునియందు (యజమానుఁడు) తేజస్సును, బ్రహ్మవర్చస్సును ధరింపఁజేయుచున్నాఁడు.

పంచాశత్తు ౬.

౨౭౭. జాతఃస్యాత్తేజఏవాస్మిన్బ్రహ్మవర్చసం దధాతి ౧ యోవైయజ్ఞంప్రయుజ్య
నవిముఞ్చత్యప్రతిష్ఠానోవైసభవతికస్త్వాయునక్తి సత్వా విముఞ్చ త్విత్యాహ
ప్రజాపతిర్వైకః ప్రజాపతినైవైనంయునక్తి ప్రజాపతినా విముఞ్చతిప్రతిష్ఠి
త్యా ౨ ఈశ్వరం వైవ్రతమవిసృష్టం ప్రదహోఽగ్నే వ్రతపతేవ్రతమచారి
షమిత్యాహ వ్రతమేవ ॥

౧ ఏయజమానుఁడు యజ్ఞవ్రతమువారంభించి (ఆవ్రతమును) విడువఁడో ఆతఁడు ప్రతిష్ఠను పొందనివాఁడేయగుచున్నాఁడు. ప్రజాపతియే "క" అను శబ్దార్థము. "కస్త్వాయునక్తి" ఇత్యాదిమంత్రపాఠముచే (యజమానుఁడు) ప్రజాపతి చేతనే ఈయజ్ఞము నారంభించినవాఁ డగుచున్నాఁడు. ప్రతిష్ఠకొఱకుఁ బ్రజాపతి చేత (యజ్ఞవ్రతమును) విడుచుచున్నాఁడు. (యజ్ఞదీక్షను విడుచుచున్నాడనితా॥)
౨ (ఆరంభింపఁబడినదగుచు) యజ్ఞవ్రతము విడువఁబడనిచో, (యజమానుని) దగ్ధముచేయుటకొఱకు సమర్థమగుచున్నది "అగ్నేవ్రతపతే"ఇత్యాది (వ్రతవిసర్జన) మంత్రపాఠముచే యజమానుఁడు దాహాభావరూప శాంతికొఱకు వ్రతమునేవిడుచుచున్నాఁడు. (ఈమంత్రముచే వ్రతదీక్షను విడిచినచో నావ్రతము యజమానునిఁ దగులపెట్టదని భావము.)

పంచాశత్తు ౭.

౨౭౮. విసృజతే శాన్త్యా అప్రదాహాయ ౧ పరాఙ్ వావయజ్ఞఏతి ననివర్తతే

పునర్యోవైయజ్ఞస్యపునరాలమ్భం విద్వాన్యజతే తమభినివర్తతే ౨ యజ్ఞో బభూవస ఆబభూవే త్యాహైష వై యజ్ఞస్యపునరాలమ్భస్తేనైవైనం పునరాలభతే ౩ ऽనవరుద్ధావా ఏతస్య విరాడ్యఆహితాగ్నిః సన్నసభః పశవః ఖలువైబ్రాహ్మణస్యసభే ౪ ష్ట్వాప్రాఙుత్క్రమ్య బ్రూయాద్గోమాగ్ం అగ్నేऽవిమాగ్ం అశ్వీయజ్ఞ ఇత్యవసభాగ్ం రున్ధేప్రసహస్రం పశూనాప్నోత్యాऽస్య ప్రజాయాం వాజీజాయతే॥

౧ యజ్ఞము విముఖమేయై (పునరాలంభమును చేయని యజమానునిఁగూర్చి) మఱలుటలేదు. (యజ్ఞమును పునః పునఃఆచరించుటకు సమర్థుడగుటలేదని భావము) ఏయజమానుఁడు యజ్ఞముయొక్క పునరాలంభమును తెలిసికొనినవాడై యాగము చేయుచున్నాడో, ఆయజమానునిఁగూర్చి (యజ్ఞము) మఱలుచున్నది. (ఈయజమానుఁడు మాటిమాటికి యజ్ఞము ననుష్ఠించుచున్నాడని తా॥) ౨ "యజ్ఞోబభూవ ఆబభూవ" అను ఈమంత్రపాఠమే యజ్ఞముయొక్క పునరాలంభమంత్రము. ఆ మంత్రపాఠముచేతనే (యజమానుఁడు) ఈయజ్ఞమునుగూర్చి (యజ్ఞమునందని తా॥) పునరాలంభము చేయవలయును. ౩ ఏయజమానుఁడు ఆహితాగ్నియైనను సభారహితుడైనచో, నితనియొక్క విశేషముగాఁ బ్రకాశించుచున్న సభ యస్వాధీనమగుచున్నది. (ఆసభ యేదనగా) బ్రాహ్మణునకు (యజ్ఞనిష్పాదకములగు) పశువు లేకదా! సభ. (అనఁగా బ్రాహ్మణసభ మంత్రులు, భటులు మొదలగు వారితోఁ గూడుకొనిన రాజసభవలె నుండదనియు, యజ్ఞసంపాదకములగు పశువులే సీబ్రాహ్మణునకు సభయనియు, యజ్ఞసంభారములే సంపత్తియనియుఁ దెలియుచున్నది.) ౪ (యజమానుఁడు) ఇష్టినాచరించి తూర్పుముఖముగా లేచినవాడై ఓయగ్నీ( యజ్ఞము అనేకగోవులుకలదియు, ననేకములైనగొఱ్ఱెలుకలదియు, ననేకములయిన గుఱ్ఱములు

కలదియు నగుచున్నదనిపలుకవలయును. (అట్లుచ్చరించినచో నాయజమానుఁడు) సభను పొందుచున్నాఁడు. అనేకములగు పశువులను పొందుచున్నాఁడు. ఇతనిసంతతి యందన్నవంతుఁడైన పుత్త్రుఁడు పుట్టుచున్నాఁడు.

షష్ఠానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౭.

౨౭౯. దేవసవితః ప్రసువ యజ్ఞంప్రసువ యజ్ఞపతింభగాయదివ్యో గంధర్వః కేత
పూః కేతంనః పునాతువాచస్పతి ర్వాచమద్యస్వదాతినః ౨ ఇంద్రస్యవజ్రో
ఽసి వార్త్రఘ్న స్త్వయాఽయం వృత్రంవధ్యాత్ ౩ వాజస్యనుప్రసవేమా
తరంమహీమదితింనామ వచసాకరామహే యస్యామిదంవిశ్వంభువనమావివేశ.
తస్యాంనోదేవః సవితాధర్మసావిషత్ ౪ అప్సు॥

౧ ప్రేరకుఁడవు, అన్తర్యామివి, యగునో సూర్యుఁడా! మావాజపేయ యజ్ఞమును ప్రవర్తింపఁజేయుము. అనుష్ఠానమనెడు ఐశ్వర్యముకొఱకు యజమానుని ప్రవర్తింపఁజేయుము. స్వర్గమునందున్న యే గంధర్వుఁడు (సూర్యుని యనుగ్రహము వలన) ప్రాణులవిజ్ఞానములను శోధించుచున్నాఁడో, ఆతఁడు మావాజపేయవిజ్ఞానమును శోధించుగాక. బృహస్పతియు నీకర్మయందు మమ్ము (వాజపేయ మంత్రములను పఠింపఁజేయుఁగాక. ౨ (ఓరథమా! నీవు) శత్రువులనశింపఁ జేయునట్టి వజ్రమగుచున్నావు. నీతో (నీసహాయముచే) ఈ యజమానుఁడు శత్రువులను వధించు

గాక. ౩ అన్నముయొక్క పుట్టుకలే కారణమయినట్టియు, నన్నమును కలిగింపఁజేయునట్టియు, వేదియనెడు భూమిని ఖండింపతగని దానినిగా వాక్కుచే (మేము) స్తోత్రము చేయుచున్నాము. ఏ భూమియందీ సమస్త భూతసముదాయము ప్రవేశించియుంటున్నదో, ఆ పృథివియందు మాయొక్క ధారణము (ధరించుట) ను ప్రేరకుఁడు అన్తర్యామియు నగు సూర్యుఁడు తెలిసికొనుగాక. ౪ ఈ పదము ౨వ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౨.

౨౫౦. అంతరమృతమప్సు భేషజమపాముత ప్రశస్తిష్వశ్వాభవథ వాజినః ౨ వాయుర్వాత్వామనుర్వాత్వా గంధర్వాః సప్తవిగ్ంశతిః । తేఅగ్రే అశ్వమాయుంజం తే అస్మింజవమాऽదధుః ౩ అపాంనపాదాశు హేమన్య ఊర్మిః కకుద్మాన్ప్రతూర్తిర్వాజసాతమస్తేనాయం వాజగ్ం సేత్ ౪ విష్ణోః క్రమోऽసి విష్ణోః క్రాన్తమసి విష్ణోర్విక్రాన్తమస్య ౫ జ్యాన్యజ్యావభితో రథం యాధ్వానం వాతాగ్రమనుసం చరన్తా దూరేహేతి రిన్ద్రియావాన్పతత్రీ తేనోऽగ్నయః పప్రయః పారయన్తు॥

౧ ఉదకములలో మధ్యయందు, అపమృత్యు నివారకమును, రోగనివారకమునగు సారముంటున్నది. ఓ యన్నముకల గుఱ్ఱములారా! ఉదకసంబంధులుగాన్ని, లేక ప్రశస్తలములయిన గుణవత్వ ప్రశంసలగదుఁగాని మీరు సంబంధము కలవారలు కండు. ౨ (ఓ యశ్వమా!) వాయువు, మనువు, పదునైదుగురు గంధర్వులు

మొత్తము పదునేడుగు (రెవరుకలరో,) వారందరు మాకంటెం బూర్వము అశ్వ (మగు నిన్ను రథమునందు సమకూర్చిరి. (మఱల వారు) ఈ గుఱ్ఱమునందు (వెను కటి భాగమును తడుముట మొదలగు నుపచారములచే) వేగమును సంపాదించిరి.
3 జలముయొక్క మజ్జకిని నాశనము చేయుదానవును, వేగమైననడకలదానవు నగు నో యశ్వమా ! (జలమునందు) ఏ యాల మూత్రపురమువలె నున్నదో, (మునుగుటచే సంభవించిన యుపద్రవమును) బోఁగొట్టునదియో, (పైగున కుపకారక మగుటచే) నతిశయముగా నన్నమునిచ్చునదియో, (నీపృష్ఠమునందు లగ్నమయిన) యాలచే మా కన్నమును సాధించుము. ౪ (యజమానుఁడ నగు నా మొదటి పాదప్రదేశమా ! నీవు) వ్యాపనశీలుఁడగు విష్ణుమూర్తి (మొదటి పాదమునుంచుటచే) జయించఁబడిన భూలోకమగుచున్నావు. (ఓ రెండవ పాదప్రదేశమా ! నీవు) విష్ణుమూర్తియొక్క రెండవ పాదమునుంచుటచే) జయించఁబడిన యంతరిక్ష లోకమగు చున్నావు. (ఓ మూఁడవ పాదప్రదేశమా ! నీవు) విష్ణుమూర్తియొక్క (మూఁడవ పాదము నుంచుటచే) జయించఁబడిన స్వర్గలోకమగు చున్నావు. ౫ రథమునకిరువైపుల చిహ్నములైన చక్రములు ధ్వనితోఁగూడికొనిన గాలియెదుటి భాగమును నతిక్రమిం చినడచుచున్నవి. దూరము నందాయుధము కలిగినట్టియు, వీర్యముకలిగినట్టియు, గోరిన యర్థమునొసఁగునట్టి యా యగ్నులు (మమ్ముఁ బరుగిడుట కవధియగు స్థానమును) పొందింతురుగాక.

సప్తమానువాకము సమాప్తము.

—*—

## అనువాకము. ౮.

౨౫౧. దేవస్యాహగ్ం సవితుః ప్రసవేబృహస్పతినా వాజజితావాజం జేషం

౨ దేవస్యాహగ్ం సవితుః ప్రసవేబృహస్పతినా వాజజితా వర్షిష్ఠం నాకగ్ంరుహేయ ౩ మిన్ద్రా౧యవాచం వదతేన్ద్ర౧ంవాజం జాతయతేన్ద్రో౧ వాజమజయిత్ ౪ అశ్వాజనివాజనివాజేషు వాజినీవత్యశ్వాన్త్సమత్సు వాజయ ౫ అర్వా౽సి సప్తిరసి వాజ్యసి ౬ వాజినోవాజం ధావత మరుతాం ప్రసవేజయతవి యోజనామి మిమీధ్వమధ్వనః స్కభ్నీత॥

౧ అన్నమును జయించునట్టి బృహస్పతిచే ననుగ్రహింపఁబడిన నేను ప్రేరకుఁడు, అన్తర్యామియు నగు సూర్యుని యొక్క యాజ్ఞయుండగా, నన్నమును జయించుదును. ౨ అన్నమును జయించునట్టి బృహస్పతిచే ననుగ్రహింపఁ బడిన నేను ప్రేరకుఁడు, అన్తర్యామియు నగు సూర్యునియొక్క యాజ్ఞయుండగా నతిశయముగా వృద్ధికలస్వర్గమును పొందుదును. ౩ (ఓ బ్రాహ్మణులారా!) యజమానునికొఱకాశీర్వాదరూపమగు వాక్కునుచెప్పుడు. అన్నము విషయమై యజమానుని జయమును పొందించుడు. యజమానుఁడన్నమును జయించుగాక. (ఇచ్చట ఇంద్రశబ్దము యాగమనే యైశ్వర్యముండుటచే యజమానునిఁ దెలుపుచున్నది.) ౪ గుఱ్ఱమును తోలునట్టియు, (విజయముచే) నన్నము నిచ్చునట్టియు, వేగవన్తములయిన గుఱ్ఱములు కలిగినట్టియో కొరడా! అన్నములు నిమిత్తములగు చుండగా (నీవు) గుఱ్ఱములను యుద్ధములందుఁ బొందింపుము. ౫ (ఓ గుఱ్ఱమా! నీవు) రాక్షసులను వహించు (అర్వ) గుఱ్ఱమగుచున్నావు. మనుష్యులను మోయు (సప్తి) గుఱ్ఱమగుచున్నావు. గంధర్వులనుమోయు (వాజి) గుఱ్ఱమగు చున్నావు, ౬ (ఓ గుఱ్ఱములారా! అన్నమును సంపాదించుటకు (శీఘ్రముగా) పరుగిడుడు. మరుద్గణముల యనుజ్ఞయుండగా నన్నమును జయింపుడు. విశేషముగా ననేకక్రోశులను (త్వరగాఁ బోవుటచే) స్వల్పమైన వాటినిగాఁ జేయుడు. (మఱియు) మార్గములను (శీఘ్రముగాఁ

బోవుటచే) బింకిగాఁ జేయును. మార్గముయొక్క సమాప్తినిఁ బొందుడు.

పఞ్చాశత్తు ౨.

౫౦-౨. కాష్ఠాంగచ్ఛత ౧ వాజేవాజేఽవతవాజినో నోధనేషువిప్రాఅమృతాఋతజ్ఞాః। అస్యమధ్వః పిబత మాదయధ్వం తృప్తాయాతపథిభిర్దేవయానైః ౨ తే నోఅర్వంతో హవనశ్రుతో హవం విశ్వేశృణ్వంతువాజినః ౩ మితద్రవః సహస్రసా మేధసాతా సనిష్యవః। మహోయేరత్నగ్ం సమిధేషు జభ్రిరేశం నోభవంతువాజినో హవేషు ౪ దేవతా తామితద్రవః స్వర్కాః। జమ్భయంతోఽహింవృకగ్ం రక్షాగ్ంసిసనేమ్యస్మదుయవన్ ।

౧ ఓ గుఱ్ఱములారా! ఆ యా యన్నము నిమిత్తమును, ధననిమిత్తమును, మమ్ము రక్షించుడు. (బ్రాహ్మణుల వలె (స్నానముచే) శుద్ధులును, మరణశూన్యులును, సత్యమగు గన్తవ్య దేశమును, తెలిసికొనుచున్న యశ్వాభిమానులగు నో దేవతలాలా! ఈ యజమానునియొక్క నీవార ధాన్యసంబంధమగు చరురసమును ద్రావుడు. ((త్రాగియు) సంతుష్టులు కండు. (తృప్తులగుచు) దేవమార్గముచేఁ బోదగిన దేశమును గూర్చిపొండు. ౨ గమనమునందు నిపుణములును, మా యాహ్వానమును వినునవియు, నన్నము కలవియు నైన యాగుఱ్ఱములు (మా) మాటనువినుఁగాక. ౩ గొప్పమార్గమునుకూడ నల్పమైనదానినిగా నడచునట్టియు, గొప్పయన్నరాశికి దాతలైనట్టియు, యజ్ఞము నిచ్చునవియు, మాయందు ద్రవ్యమును దానము చేయుటను కోరుచున్నవియు నైన యే గుఱ్ఱములు యుద్ధములందధికమగు (శత్రు)

ధనము నపహరించినవాఁడ, ఆ గుఱ్ఱములు మాకు సుఖమును చేయునవి యగుఁగాక.
౮ దేవతలను గూర్చితిగుచున్నట్టియుఁ గొప్పమార్గమునుగూడ స్వల్పమార్గమునుగా నడచుచున్నట్టియు, (శీఘ్రముగా నడచుటచే) బాగుగాఁ బూజింపఁదగినట్టి యీ గుఱ్ఱములు, సర్పములవలెను, అరణ్యమునందలి కుక్కలవలెను, బాధకులగు రాక్షసుల నునశింపఁ జేయుచున్నవై శీఘ్రముగానే మానుండి రోగములను పోగొట్టునవగుగాక.

## పంచాశత్తు 3.

౪౮3. అభీవాఃౚ ఏమస్యవాజీక్షిపణింతురణ్యతి గ్రీవాయాంబద్ధో అపికక్షఆసని క్రతుందధిక్రాఅనుసంతవీత్వత్పథామజ్కాఁగ్ం స్వన్వాపనీఫణత్ ౨ ఉత స్మాస్యద్రవతస్తురణ్యతః పర్ణంనవేరనువాతి ప్రగర్ధినః। శ్యేనస్యేవధ్రజతో అంకసంపరిదధిక్రావ్ణః సహోర్జాతరిత్రతః 3 ఆమావాజస్యప్రసవోజగమ్యా దాద్యావాపృథివీవిశ్వశంభూ। ఆమాగంతాంపితరా॥

౧ కంఠమునందును, చంకయందును, ముఖమునందును, (ఆ యా స్థానముల కుచితములగు త్రాళ్లచే) గట్టఁబడినదగుచు నీగుఱ్ఱము మార్గమున కడ్డమైన రాళ్లనతిక్రమించునదియు, సారథియొక్క యభిప్రాయము ననుసరించుచున్నదియు, వంకరగానుస్, ఎత్తుపల్లములుగాను, ఉన్నమార్గముయొక్క ప్రదేశములను వంకరలేనిగాను సమముగాను, చేయుచున్నదియునై కొరడాను తొందరపెట్టుచున్నది. ౨ మఱియుఁ బోవుచున్నదియు, తొందరచేయుచున్నదియు, సరిహద్దును పొందుటకుఁ, గోరుచున్నదియుఁ. బోవుచున్న డేగకువలె శీఘ్రముగాఁ బోవుచున్నదియు, నత్యన్త బలముతోఁ గూడ త్వరగా దాటుచున్నదియు నగు నీ గుఱ్ఱము

యొక్క శృంగార చిహ్నమయిన వస్త్రచామరాదికము సమస్త దేహము నందుంటు న్నదై, శీఘ్రముగాఁ బోవుచున్న పక్షియొక్క రెక్కవలె (పోవుచున్న గుఱ్ఱము) నెగర వేయుచున్నదిగాఁ గన్పట్టుచున్నదై వెళ్లుచున్నది ౩ అన్నముయొక్క యుత్పత్తినన్నుఁ గూర్చివచ్చుఁగాక. ద్యావాభూములునమస్తజగత్తునకు సుఖమునుకోరుచున్నవై నన్నుఁ గూర్చి వత్తురుగాక. సోముఁడుకూడ నా దేవజన్మకొఱకు నన్నుఁగూర్చి వచ్చుగాక.

## పంచాశత్తు ౪.

౬౮౪. మాతరాచాఽఽమాసోమో అమృతత్వాయగమ్యాత్ ౧ వాజినో వాజ జితోవాజగ్ంసరిష్యన్తోవాజంజేష్యంతోబృహస్పతేర్భాగమవజిఘ్రత ౨ వాజినో నో వాజజితో వాజగ్ం సస్రువాగ్ం సోవాజం జిగివాగ్ం సోబృహస్పతే ర్భాగేనిమృడ్ఢ్వ ౩ మియం వః సానత్యాసంధాఽ భూ ద్యామిన్ద్రేణ సమధధ్వ ౪ మజీజిపత వనస్పత యఇన్ద్రం వాజంముచ్యధ్వమ్॥

౧ అన్నమును జయించుటకు సన్నద్ధములయిన యో గుఱ్ఱములారా! అన్నమును (జయించుటకు యుద్ధభూమినిఁ గూర్చి) పరుగిడఁబోవుచున్నట్టియు, నన్నమును జయించునట్టి (మీరు) బృహస్పతియొక్క యీ(చరు) భాగమును వాసనచూడుడు. ౨ అన్నమును జయించుటకు సన్నద్ధములయిన-యో గుఱ్ఱములారా! అన్నమును గూర్చి పరుగిడుచున్నట్టియు, నన్నమునుగూర్చి జయమును చేయుచున్నట్టి మీరు బృహస్పతియొక్క భాగమునందుఁ బరిశుద్ధులగుడు ౩ ఓ రథములారా! "యుద్ధమును గూర్చి పరుగిడుదుము" అను యీ ప్రతిజ్ఞ (యేదికలదో, ఆ ప్రతిజ్ఞ సత్యమ

యినది. ఏ ప్రతిజ్ఞ నింద్రానుగ్రహముచే బాగుగా ధరించిరో, ౪ ఓ వనస్పతి వికారములగు (కొయ్యతో నిర్మింపఁబడిన) దుందుభులారా ! (వాద్యవిశేషములని తా) అన్నమునుద్దేశించి యాగస్వామియగు యజమానుని జయింపఁజేసితిరి. (అటువంటి మీరు పూర్వము కట్టబడిన ప్రదేశమునుండి) విముక్తులగుడు.

అష్టమానువాకము సమాప్తము.

---

## అనువాకము ౯.

౨౫౫. ౧ క్షత్రస్యోల్బమసి క్షత్రస్యయోనిరసి ౨ జాయఏహి సువోరోహావరో హావహిసువరహాం నావుభయోః సువోరోక్ష్యామి ౩ వాజశ్చ ప్రసవ శ్చా పిజశ్చ క్రతుశ్చ సువశ్చ మూర్ధాచవ్యశ్నియశ్చాzz న్త్యా యనశ్చా న్త్యశ్చ భౌవనశ్చ భువనశ్చాధిపతిశ్చ ౪ ఆయుర్యజ్ఞేనకల్పతాం ప్రాణో యజ్ఞేనకల్పతామపానః॥

౧ ఓదర్భమయమగువస్త్రమా! నీవు) రాజస్థానీయుఁడగు యజమానున కావరణ మగుచున్నావు. పట్టపుదేవీస్థానీయమగు పత్నీశరీరము యొక్క చలిని పోగొట్టుటకు గారణమగుచున్నావు. ౨ ఓ భార్యా !రమ్ము. స్వర్గమునధిష్ఠింపుము. (ఈవాక్యము భార్యది) మనయిద్దరిలో నేను స్వర్గమునధిష్టించ గలను. (ఈ వాక్యము యజమానునిది ) ౩ వాజః ఇత్యాది ౧౨ శబ్దములు క్రమముగా చైత్రాది ౧౨ మాసములను దెలుపునవి. ఈ పండ్రెండు మాసములు (హోమకాలమునందు) సంతోషించు

గాక. (చకారములు పరస్పర సముచ్చయార్థకములు) ౧ “వాజః ౨ ప్రసవః ౩ అపిజః ౪ క్రతుః ౫ సువః ౬ మూర్ధా ౭ వ్యశ్నియః ౮ అన్త్యాయనః ౯ అన్త్యః ౧౦ భౌవనః ౧౧ భువనః ౧౨ అధిపతిః” అని పదవిభాగము. ౪ ఈ వాక్యార్థము ౨వ పంచాశత్తులో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౨.

౨౬. యజ్ఞేనకల్పతాంవ్యానో యజ్ఞేనకల్పతాంచక్షుర్యజ్ఞేనకల్పతాగ్ం శ్రోత్రంయజ్ఞేనకల్పతాంమనోయజ్ఞేనకల్పతాం వాగ్యజ్ఞేనకల్పతామాత్మా యజ్ఞేనకల్పతాంయజ్ఞోయజ్ఞేనకల్పతాగ్ం ౨ సువర్దేవాగ్ం అగన్మామృతా అభూమ ప్రజాపతేః ప్రజాఅభూమ ౩ సమహంప్రజయా సంమయాప్రజాసమహాగ్ం రాయస్పోషేణ సంమయారాయస్పోషో ౪ ऽన్నాయత్వాऽన్నాద్యాయత్వా వాజాయత్వా వాజజిత్యాయైత్వా ౫ ऽమృతమసి పుష్టిరసి ప్రజననమసి ॥

౧ యజ్ఞసంబంధమగు యూపారోహణముచే నాయువు స్వప్రయోజన సమర్థమగు గాక. ప్రాణాపానాది వాక్యములకుఁగూడ నీవిధముగానే యన్వయము చెప్పుకొనవలెను. ప్రాణః=హృదయమునందుండు (ప్రాణ) వాయువు, అపానః=గుదమునందుండు (అపాన) యయువు, వ్యానః=సర్వశరీరమునందు వ్యాపించియుండు (వ్యాన) వాయువు. చక్షుః, శ్రోత్రమ్ ఇవి ప్రసిద్ధార్థకములు. మనః=విమర్శాత్మక మ

యిన యంతఃకరణము. వాక్ = వాగింద్రియము, ఆత్మా = జీవుఁడు, యజ్ఞః = స్వర్గాదిసాధనమయిన కర్మవిశేషము. ౨ మేము స్వర్గమునందుండు దేవతలను పొందితిమి (పొందియు) దేవతలమైతిమి (కావున) ప్రజాపతికిఁ బ్రీతివిషయక ప్రజల మయిన మేము ఈభూలోకమునందు యజ్ఞానుష్ఠానము నందాసక్తుల మైతిమి. ౩ నేను సంతానముతోఁగలిసి కొందునుగాక. సంతానము నాతోఁ గలిసికొనునుగాక. నేను ధనసమృద్ధితోఁగలిసికొందునుగాక. ధనసమృద్ధినాతోఁ గలిసికొనునుగాక. ౪ సామాన్యజనులుభుజించునది యన్నమనియు, రాజులు, మంత్రులు భుజించునది యన్నాద్యమనియు, అపూపములు మొదలగు విశేషముతోఁ గూడుకొనిన యన్నము వాజమనియుఁ, సమస్తమయిన యన్నమును సంపాదించుట వాజజితియనియు, భేదము నెఱుంగవలయును. (ఓయజమానుఁడా!) అన్నముకొఱకు నిన్ను హింసించుచున్నాను. (ఇట్లే) అన్నాద్యముకొఱకు, వాజముకొఱకు, వాజజితికొఱకును, నిన్ను హింసించుచున్నాను. ౫ (ఓ బంగారమా! నీవు) నాశనములేని దానవగుచున్నావు. (ఓ బస్తాజినమా! నీవు) పుష్టివగుచున్నావు. అనేకులను పుట్టించు దానవగుచున్నావు.

నవమానువాకము సమాప్తము.

---

అనువాకము ౧౦.

౩౭. వాజస్యేమం ప్రసవస్సుషువే అగ్రేసోమగ్ం రాజానమోషధీ ష్వప్సు। తా అస్మభ్యం మధుమతీర్భవన్తువయగ్ం రాష్ట్రే జాగ్రియామపురోహితాః ౨ వాజస్యేదంప్రసవ ఆబభూవేమాచ విశ్వాభువనానిసర్వతః। సవిరాజం పర్యేతిప్రజానన్ప్రజాం పుష్టిం వర్ధయమానోఅస్మే ౩ వాజస్యేమాం

ప్రసవశ్శ్రీయేదివమిమాచ విశ్వాభువనానిసమ్రాట్। అదిత్సన్తం దాపయతు ప్రజానన్రయిమ్॥

౧ అన్నమును బుట్టించునట్టి పరమేశ్వరుఁడు ఓషధులలోను, ఉదకములలోను సారభూతమగు నీసోమలతారూపమైన, ప్రకాశించుచున్న పదార్థమును సృష్ట్యాదియందు పుట్టించెను. ఆయోషధులు, ఉదకములును మాకొఱకు మాధుర్యముతోఁగూడుకొనినవై యుండుగాక. మేముకూడ (నీ) రాష్ట్రమునందు (యాగము ననుష్ఠించుటవలన) నాయకులమై జాగరూకులమగుదుము. ౨ అన్నమునకు తృప్తి గలిగించు పరమేశ్వరుఁడీ(యనుష్ఠింపబడుచున్న) కర్మనుఁబుట్టించెను. ఈసర్వభూతములనంతటను పుట్టించెను. ఆపరమేశ్వరుఁడు మాకొఱకు సంతానమును, ధనపుష్టి వృద్ధిని (బొందించుచున్నవాఁడు, మాయభిప్రాయమునుఁ దెలిసికొనుచున్నవాడునై హోమము చేయఁబడుచున్న యన్నము సంతతనుఁబొందుగాక. ౩ అన్నమును బుట్టించు పరమేశ్వరుఁడీద్యులోకమును, ఈ(యితరములగు) సమస్తలోకములనాశ్రయించెను. సమస్తలోకములకు రాజై హవిస్సునిచ్చుటకిష్టపడని నన్ను (నాబుద్ధిప్రేరణచే) హవిస్సునిప్పింపచేయుగాక. (పిమ్మట) మాకొఱకు సమస్తపుత్రపౌత్రాదులు గల ధనమును నియమముగా నిచ్చుఁగాక.

పంచాశత్తు ౨.

౨౦౮. చనః సర్వవీరాన్నియచ్ఛతు ౧ అగ్నేఅచ్ఛావదేహనః ప్రతినః సుమనా భవ। ప్రణోయచ్ఛభువస్పతే ధనదాఅసినస్త్వమ్ ౨ ప్రణోయచ్ఛత్వర్యమా ప్రభగః ప్రబృహస్పతిః। ప్రదేవాః ప్రోతసూనృతా ప్రవాగ్దేవీదదాతు

నః 3 అర్యమణం బృహస్పతిమిన్ద్రం దానాయ చోదయ వాచంవిష్ణుగ్ం సరస్వతీగ్ం సవితారమ్॥

౧ ఓయగ్నీ! ఈకర్మయందు మాకభిముఖముగా హితమును జెప్పుము. మమ్ముఁగూర్చి కరుణాపూరిత మనస్సుకలవాఁడవగుము. ఓభూపతీ! మాకొఱకధికముగా (ధనమును)నిమ్ము. నీవు మాకు ధనమునిచ్చు వాఁడవగుచున్నావుకదా! సూర్యుఁడు మాకొఱకు (ధనము) నధికముగానిచ్చుఁగాక. ఇంద్రుఁడు మాకొఱకు ధనము నధికముగ నిచ్చుఁగాక. బృహస్పతి మాకొఱకు ధనము నధికముగ నిచ్చుగాక. ఇతరదేవతలందరు మాకొఱకు ధనమును నధికముగ నొసంగుదురుగాక. మఱియుఁ బ్రియవాక్కున కభిమానియగు దేవత మాకొఱకు ధనము నధికముగ నిచ్చుగాక. వాక్సామాన్యమున కభిమానియగు దేవత మాకొఱకు ధనము నధికముగ నిచ్చుగాక. 3 (ఓయీశ్వరుఁడా! మఱల మాకు) ధనమునిచ్చుటకై సూర్యుని, బృహస్పతిని, ఇంద్రుని, ప్రియవాగభిమానదేవతను, విష్ణువును, సరస్వతిని, అన్నాధిపతియగు నంతర్యామిని, ప్రేరణచేయుము.

పంచాశత్తు 3.

౩౪౫. చవాజినమ్ ౧ సోమగ్ం రాజానం వరుణమగ్నిమన్వారభామహే ఆదిత్యాన్విష్ణుగ్ం సూర్యం బ్రహ్మాణంచబృహస్పతిమ్ ౨ దేవస్యత్వాసవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాగ్ం సరస్వత్యైవాచోయన్తుర్యన్త్రేణాగ్నేస్త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామీన్ద్రస్యబృహస్పతేస్త్వా

సామ్రాజ్యేనాభిషిఞ్చామి॥

౧ దీప్తివంతుడగు సోముని, వరుణుని, అగ్నిని, ఆదిత్యులను, విష్ణువును సూర్యుని, బ్రహ్మను, బృహస్పతిని, ననుసరించి (మేము కర్మ) నారంభించు చున్నాము. (కావున వారు మమ్ము ననుగ్రహింతురుగాక, అనితా॥) ౨ (ఓకృష్ణాజినమా ! =లేడితోలు. ప్రేరకుఁడు, అంతర్యామియు, నగు పరమేశ్వరుని యాజ్ఞ యుండగా నశ్వినీదేవతలయొక్క బాహువులచేతను, సూర్యుని హస్తములచేతను, వాగ్విశేష దేవతయొక్కయు, వాక్సామాన్య దేవతయొక్కయు, నన్తర్యామియొక్కయు, తేజస్సునిచ్చునగ్నియొక్కయు, నాజ్ఞచే సరస్వతికొఱకు సామ్రాజ్యమునిమిత్తమై నిన్నుఁదడుపుచున్నాను. ఇంద్రునియొక్కయు, బృహస్పతియొక్కయు నాజ్ఞచే సామ్రాజ్యమునిమిత్తమై నిన్నుఁదడుపుచున్నాను.

దశమానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౧౧.

౫౦. ౧ అగ్నిరేకాక్షరేణవాచ ముదజయదశ్వినా ద్వ్యక్షరేణ ప్రాణాపానా వుదజయతాం విష్ణుస్త్ర్యక్షరేణ త్రీల్లోకానుదజయత్సోమశ్చతురక్షరేణ చతుష్పదః పశూనుదజయత్పూషాపఞ్చాక్షరేణ పఙ్క్తిముదజయద్ధాతా షడక్షరేణ షడృతూనుదజయన్మరుతః సప్తాక్షరేణ సప్తపదాగ్ం శక్వ

రీముదజయన్బృహస్పతి రష్టాక్షరేణ గాయత్రీముదజయన్మిత్రో నవాక్షరేణ త్రివృతగ్ం స్తోమముదజయత్ వరుణో దశాక్షరేణ విరాజముదజయదింద్ర ఏకాదశాక్షరేణ త్రిష్టుభముదజయద్విశ్వే దేవా ద్వాదశాక్షరేణ జగతీముదజయన్వసవస్త్రయోదశాక్షరేణ త్రయోదశగ్ం స్తోమముదజయన్రుద్రాశ్చతుర్దశాక్షరేణ చతుర్దశగ్ం స్తోమముదజయన్నాదిత్యాః పఞ్చదశాక్షరేణ పఞ్చదశగ్ం స్తోమముదజయన్నదితిః షోడశాక్షరేణ షోడశగ్ం స్తోమముదజయత్ప్రజాపతిః సప్తదశాక్షరేణ సప్తదశగ్ం స్తోమముదజయత్ ॥

౧ "ఆశ్రావయ" ఇత్యాది సప్తదశ (౧౭) అక్షరములుగల మన్త్రసముదాయమునందు ఏకాక్షర, ద్వ్యక్షర ఇత్యాది భావనచే నాయామన్త్రములను పఠించితి తత్సామర్థ్యమువలన నగ్న్యాది దేవతలు వాక్కు మొదలగువాటిని జయించిరని, యీపైయనువాకమునకుఁ దాత్పర్యము.) ఏకాక్షరమన్త్రముచే నగ్ని వాక్కును జయించెను. రెండక్షరాల (అజపా) మన్త్రముచే నశ్వినీ దేవతలు ప్రాణాపానములను జయించిరి విష్ణువు మూఁడక్షరాల మన్త్రముచే మూఁడులోకములను జయించెను. సోముఁడు నాల్గక్షరముల మన్త్రముచే నాల్గుపాదములుకల పశువును జయించెను. పూష దేవుఁడు ఐదక్షరములుకల మన్త్రముచే పఙ్క్తిఛందస్సును జయించెను. బ్రహ్మ ఆరక్షరములమన్త్రముచే నారుఋతువులను |జయించెను. మరుత్తు లేడక్షరముల మన్త్రముచే నేడుపదములుకల శక్వరీఛందస్సును జయించిరి. బృహస్పతి యెనిమిదక్షరములమన్త్రముచే గాయత్రీఛందస్సును జయించెను మిత్రదేవుఁడు తొమ్మిదక్షరములమన్త్రముచే త్రివృత్ స్తోమమును (ఋక్సముదాయ

శేషమును) జయించెను. వరుణుఁడు పది అక్షరముల మన్త్రముచే విరాట్ ఛందస్సును జయించెను. ఇంద్రుఁడు పదునొకండక్షరములమన్త్రముచే త్రిష్టుప్ ఛందస్సును జయించెను. విశ్వేదేవతలు పండ్రెండక్షరములమన్త్రముచే జగతీఛందస్సును జయించిరి. వసువులు పదమూఁడక్షరములమన్త్రముచే త్రయోదశస్తోమమును జయించిరి. (త్రివృత్ సోమమునందలిబుక్కుల నావృత్తి చేయగా ౧౩వసంఖ్య సిద్ధమగును కావున త్రయోదశస్తోమమని చెప్పఁబడినది. ఇకముందు షోడశ సప్తదశ స్తోమములు నీ విధముగనే యెఱుంగవలయును.) రుద్రులు పదునాల్గక్షరముల మన్త్రముచే చతుర్దశ స్తోమమును జయించిరి. ఆదిత్యులు పదునైదక్షరముల మన్త్రముచే పఞ్చదశ స్తోమమును జయించిరి. అదితి పదునాఱక్షరముల మన్త్రముచే షోడశస్తోమమును జయించెను. ప్రజాపతి పదునేడక్షరముల మన్త్రముచే సప్తదశ స్తోత్రమును జయించెను. (ఇచట జయించుటనఁగా సంపాదించుటని సర్వత్ర తెలియవలె)

ఏకాదశానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము ౧౨.

౧. ఉపయామగృహీతోఽసి నృషదంత్వా ద్రుషదం భువనసదమిన్ద్రాయజుష్టం గృహ్ణామ్యేష తే యోనిరిన్ద్రాయత్వో ౨ పయామగృహీతోఽస్యప్సుషదం త్వా ఘృతసదం వ్యోమసదమిన్ద్రాయజుష్టంగృహ్ణామ్యేష తే యోనిరిన్ద్రాయత్వో ౩ పయామగృహీతోఽసిపృథివిషదం త్వాఽన్తరిక్షసదం నాక

సదమిన్ద్రాయజుష్టం గృహ్ణామ్యేష తే యోనిరిన్ద్రాయత్వా ౪ యే గ్రహాః
పఞ్చజనీనా యేషాం తిస్రః పరమజాః దైవ్యఃకోశః

౧ (ఓ మొదటియతిగ్రాహ్యామా! నీవు) పృథివీస్వరూపమగు పాత్రచే గ్రహింపఁబడిన దానవగుచున్నావు. మనుజులందు (స్వామివిగా) నున్నట్టియు, వనస్పతులందు (స్వామివిగా) నున్నట్టియు, లోకములందు (స్వామివిగా) నున్నట్టియు, నింద్రునికొఱకుఁ బ్రియమగు నిన్ను గ్రహించుచున్నాను. ఈప్రదేశము నీకు స్థానము. (కావున) నింద్రునికొఱకు నిన్ను (ఈస్థానమున) నుంచుచున్నాను. (అతిగ్రాహ్యము=సోమరసమునుంచు పాత్రవిశేషము.) ౨ (ఓ రెండవ యతిగ్రాహ్యామా! నీవు) పృథివీపాత్రచేఁ గ్రహింపఁబడితివి. ఉదకములందు (స్వామివిగా) నున్నట్టియు, నాద్యమునందు (స్వామివిగా) నున్నట్టియు, నాకాశమునందు (స్వామివిగా) నున్నట్టియు, నింద్రునికొఱకుఁ బ్రియమగు నిన్ను గ్రహించుచున్నాను. ఈ ప్రదేశము నీకు స్థానము. ఇంద్రునికై నిన్ను (ఈస్థానమున) నుంచుచున్నాను. ౩ (ఓ మూఁడవ యతిగ్రాహ్యామా! నీవు) పృథివీవికారమగు పాత్రచే గ్రహింపఁబడితివి. పృథివియందు (స్వామివిగా) నున్నట్టియు, నంతరిక్షమునందు(స్వామివిగా) నున్నట్టియు, స్వర్గమునందు (స్వామివిగా) నున్నట్టియు, నింద్రునికొఱకుఁ బ్రియమగు నిన్ను గ్రహించుచున్నాను. ఈ ప్రదేశము నీకు స్థానము. ఇంద్రునికయి నిన్ను (ఈ స్థానమున) నుంచుచున్నాను. ౪ (ఓ నాల్గవ యతిగ్రాహ్యామా!) ఏ యతిగ్రాహ్యరూప పాత్రలు దేవ, మనుష్య, అసుర, రాక్షస, గంధర్వులకు హితములో! ఏ గ్రహమునకు నాగ్నేయ, ఐంద్ర, సౌర్యములగు నతిగ్రాహ్యములు ప్రకృతులో! (వేటియొక్క ప్రభావముచే) ద్యులోకమునందున్న మేఘము వర్షాభిముఖముగాఁ జేయఁబడినదో! ఆ వివిధములగు హాను (దవడ) స్థానీయములైన పాత్రలతోఁగూడుకొనిన నతిగ్రాహ్యమును నిండించుటకొఱకు నన్నముతో సమానమయినదియు, బలమునిచ్చునదియు నగు సోమరసమును బాగుగా గ్రహిం

చుచున్నాను. ఈ ప్రదేశము నీకు స్థానము. ఇంద్రునికై నిన్ను (ఈస్థానమునం) దుంచుచున్నాను.

పంచాశత్తు ౨

౬౯-౨. సముద్భితః తేషాం విశ్రిపియాణామిషమూర్జగ్ం సమగ్రభీమేష తే యోని రిన్ద్రాయత్వా ౧ అపాగ్ం రసముద్వయసగ్ం సూర్యరశ్మిగ్ం సమాభృతమ్ అపాగ్ం రసస్యయోరసస్తం వోగృహ్ణామ్యుత్తమమేష తే యోనిరి న్ద్రాయత్వా ౨ అయావిష్ఠాజనయన్కర్వరాణి సహిఘృణి దురుర్వరా యగాతుః సప్రత్యుదైద్ధరుణో మధ్వోఅగ్రగ్ం స్వాయాం యత్తనువాం తనూమైరయత ఉపయామగృహీతోఽసి ప్రజాపతయేత్వాజుష్టం గృహ్ణామ్యేష తే యోనిః ప్రజాపతయేత్వా॥

౧ (ఓ యతిగ్రాహ్యములారా!) ఉదకములలో సారమైనట్టియు, జీవన హేతువుగాఁగలిగినట్టియు, (గాయత్రిచే ద్యులోకమునుండి) దీసికొనిరాఁబడిన ట్టియు, నుదకములలో శ్రేష్ఠమగు సోమలతకుఁగూడ సారమైనట్టియు, మీలో చివరదయిన గ్రహమును గ్రహించుచున్నాను. ఈ ప్రదేశము నీకుస్థానము. (ఈ స్థానమునందు) నిన్నునింద్రునికై నుంచుచున్నాను. (గ్రహము=సోమరసమునుంచు పాత్రవిశేషము.) ౨ ఈ ప్రజాపతి యిూకర్మలను సంపాదింపఁజేయుచు, విశేష ముగా నిచ్చుటనుంటున్నాఁడు. ఏ ప్రజాపతి ప్రకాశకుఁడై శ్రేష్ఠమగు కర్మఫలము

కొఱకు విస్తీర్ణమగు మార్గముగుచున్నాఁడో! ఆప్రజాపతి మధువగు కర్మఫలములను ధరింపఁజేయుచున్నవాఁడగుచు, మాసమీపమును గొప్పగాఁబొందుఁగాక. ఏ కారణమువలన తదశరీరమునందు (మా) శరీరమునుఁ బొందించుచున్నాఁడో! (ఆ కారణమువలన మేము ఫలమునుఁబొందుదుము.) (ఓ ప్రజాపతి సంబంధివగు సోమగ్రహమా! నీవు) పృథివీపాత్రచే గ్రహింపఁబడిన దానవగుచున్నావు. ప్రజాపతికొఱకుఁ బ్రియమగు నిన్ను గ్రహించుచున్నాను. ఈ ప్రదేశము నీకు స్థానము. ప్రజాపతికొఱకు నిన్ను (ఈ స్థానమునందు) ఉంచుచున్నాను.

ద్వాదశానువాకము సమాప్తము.

— * —

## అనువాకము ౧౩.

౫౯ 3. ౧ అన్వహమాసా అన్విద్వనాన్యనోషధీ రనుపర్వతాసః అన్విన్ద్రగ్‌ం రోదసీవావశానే అన్వాపోఅజిహాతజాయ మానమ్ ౨ అనుతేదాయి మహ ఇన్ద్రియాయసత్రాతే విశ్వమనువృత్రహత్యే అనుక్షత్రమను సహోయజత్రే న్ద్రదేవేభిరనుతే నృషహ్యే 3 ఇన్ద్రాణీమాసు నారి షుసుపత్నీమహామశ్రవమ్ నహ్యస్యాఅపరం చనజరసా।

౧ చైత్రాది మాసములు (మమ్మును గ్రహించుటకై) పుట్టుచున్న యింద్రుని ననుసరించి మమ్ముఁబొందినవి. వనములుపుట్టుచున్న యింద్రుననుసరించి మమ్ముఁ బొందినవి. ఓషధులు పుట్టుచున్న యింద్రుననుసరించి మమ్ముఁబొందినవి. పర్వతములు

పుట్టుచున్న యింద్రుననుసరించి మమ్ముఁబొందినవి. మనలనుఁ గోరుచున్న ద్యావాభూములు పుట్టుచున్న యింద్రుననుసరించి మమ్ముఁబొందినవి. ఉదకములు పుట్టుచున్న యింద్రుననుసరించి మమ్ముఁబొందినవి. ౨ (ఓ యాగము చేయఁదగిన యింద్రుఁడా!) సర్వదేవతలకంటెను నధికుండవగు నీకొఱకును, వృత్రాసురుని వధనిమిత్తమై నీయొక్క బలముకొఱకును, క్షత్రియజాత్యభిమానము గల్గుటకును, నీసహజమగు బలముననుసరించియు, శత్రువులందిరస్కరించు నీ స్వభావము ననుసరించియు, యాగములందగ్న్యాది దేవతలచే సమస్తమగు హవిస్సు క్రమముగా నివ్వఁబడుచున్నది. 3 ఈ దేవస్త్రీలలో (స్వామినియగు) నింద్రపత్నినిఁ బతివ్రతనుగా నేను వినియుంటిని ఇతరముకూడ నొకటికలదు. (ఏదనగా) ఈయింద్రపత్నియొక్కభర్త ముదిమిచేతఁజావడు.

## పంచాశత్తు ౨.

౨౯౮. మర తేపతిః ౧ నాహమిన్ద్రాణిరారణ సఖ్యుర్వృషాకపేర్ఋతే యస్యేదమ

ప్యగ్ం హవిః ప్రియందేవేషుగచ్ఛతి ౨ యోజాతఏవ ప్రథమోమనస్వా

న్దేవోదేవా న్క్రతునా పర్యభూషత్ యస్యశుష్మాద్రోదసీ అభ్యసే

తాం నృమ్ణస్యమహ్నాసజనాస ఇన్ద్రః 3 ఆ తేమహ ఇన్ద్రోత్యుగ్ర సమన్య

వో యత్సమర న్తసేనాః పతాతిదిద్యున్నర్యస్య బాహ్వోర్మా తే ॥ ౬॥

౧ ఓయింద్రపత్నీ! నేను నీప్రియుఁడగు నింద్రుఁడులేకుండగా నితరదేవు నెవరినిఁగూడ కీర్తించుటలేదు. ఏనాయొక్క యుదకమునందు అన్నపురోడాశాది హవిస్సు ప్రియమయి దేవతలందు బోవుచున్నదో! (దేవతలను బొందుచున్నదో)

(అటువంటిసేవని వెనుకటికన్వయము) ౨ ఏ దేవతయగు నింద్రుఁడు పుట్టుచునే (దేవతలలో) ముఖ్యుఁడును, ధైర్యముకలవాఁడునై వృత్రాసురవధరూపమగు కర్మచే నగ్న్యాద్ది దేవతలనతిక్రమించెనో ! ఎవనియొక్క బలమువలన ద్యావాభూములు భయపడినవో; ఓజనులారా! ఆయింద్రుఁడు తనబలముయొక్కమహిమచే (మిమ్ము రక్షించుగాక) ౩ ఉగ్రుఁడవగు నోయింద్రుఁడా! అంతటను నీయొక్క రక్షణము గొప్పదైనది. ఏరక్షణమువలన మీసేనలు (శత్రువులవిషయమై) కోపయుక్తము లగుచు బాగుగఁ గ్రీడించినవో! (శత్రుబలమును లెక్కింపలేదని భావము) మఱియు మనుష్యులకు హితుఁడవగు నీయొక్క బాహువులందలి ఖడ్గాదులకాంతి యంతటను బ్రసరించుచున్నది. నీమనస్సు అనేకముఖములుకలదిగా సంచరింపకుండుఁగాక!

పంచాశత్తు ౩.

౨౯౪. మనోవిష్వద్రియగ్విచారీత్ ౧ మానోమర్ధీరాభరా దద్ధితన్నః ప్రదాశుషే

దాతవేభూరియత్తే నవ్యేదేష్ణేశస్తే అస్మిన్తఉక్థే ప్రబ్రవామవయమిన్ద్ర

స్తువన్తః ఆతూభరమాకిరేతత్పరిష్ఠా ద్విద్మాహిత్వా వసుపతింవసూనామ్

ఇన్ద్రయత్తేమాహినం దత్రమస్త్యస్మభ్యం తద్ధర్యశ్వ॥

౧ ఓయింద్రుఁడా! మమ్మును, మాప్రజలను, కలహము కోరువారినిగాఁజేయకుము అధికముగా హవ్యమునిచ్చు యజమానునికొఱకు దానముచేయుటకయి నీసంబంధమగు నేధనము (సంచితము) కలదో దానినిఁదీసికొనిరమ్ము. తీసికొనివచ్చియు మాకొఱకిమ్ము. ఓయింద్రుఁడా! నూతనమయినట్టియు, దానసాధనమయినట్టియుఁ బ్రశస్తమగు నీకర్మయందు నీసంబంధియగు శస్త్రము (=స్తోత్రము)తో స్తోత్రముచేయుచున్న మేము అధికముగా బ్రార్థించుచున్నాము. ౨ ఓయిం

ద్రుఁడా! (నీవు) ధనమునుఁదీసికొనిరమ్ము. ఈ (తీసికొనిరాబడిన) ధనమితర స్థలమున నుండకుండుఁగాక. ఏకారణమువలన ధనములలో ధనపతిగాఁ దెలిసికొను చున్నారమో, ఓయింద్రుఁడా! నీసంబంధమయినట్టియు, మహనీయమయినట్టియు, నివ్వఁదగినదియునగు నీధనము (కలదో) ఓ హరియను పేరుకలగుఱ్ఱములతోఁ గూడుకొనిన యింద్రుఁడా ! ఆ ధనమును మాకొఱకిమ్ము.

పంచాశత్తు ౪.

౬. ప్రయన్ధి ౨ ప్రదాతారగ్ం హవామహ ఇన్ద్రమా హవిషా వయమ్ ఉభాహి
హస్తావసునా పృణస్వాZZ ప్రయచ్ఛ దక్షిణాదోత సవ్యాత్ ౨ ప్రదాతా
వజ్రీవృషభస్తురాషాట్ ఛుష్మీరాజావృత్రహా సోమపావా అస్మిన్యజ్ఞే బర్హి
ష్యా నిషద్యాథాభవ యజమానా యశంయోః ౩ ఇన్ద్రః సుత్రామాస్వ
వాగ్ం అవోభిః సుమృడీకో భవతు విశ్వవేదాః బాధతాం ద్వేషో అభయం
కృణోతు సువీర్యస్య ॥౪॥

౧ అధికముగా దానము చేయించు నింద్రుని హవిస్సుతోఁ గూడుకొనిన వారలమై మేము పిలుచుచున్నాము. ఓ యింద్రుఁడా ! రెండుహస్తములను ధనముచే నిండింపుము. నాకభిముఖముగాఁ గుడిచేతినుండియు, నెడమ చేతినుండియు, (ధనము) నొసఁగుము. ౨ అధికముగ దాతయైనట్టియు, వజ్రాయుధము కలిగినట్టియు, (వభిమతములగు ధనములను) వర్షించునట్టియు, (శత్రువునకు శీఘ్రముగాఁ) తిరస్కారకుఁడైనట్టియు, బలవంతుఁడైనట్టియుఁ, బ్రకాశించుచున్నట్టియు, వృత్రాసురునిఁజంపినట్టియు, సోమరసమునుఁ బానము చేయువాఁడవు నగు నీవీ యజ్ఞమునందలి (వేదియందు

పరుచఁబడిన) దర్భయందు కూర్చొని పిమ్మట నీయజమానుని కొఱకు సుఖమునుఁ జేయువాఁడ్వై యనిష్టమునుఁ బోఁగొట్టువాఁడవగుము. ౨ ఈ యింద్రుఁడు బాగు గరక్షించువాఁడును, ధనముకలవాఁడును, రక్షణచే సుఖమునుఁ జేయువాఁడును, (మాచేఁ జేయఁబడిన) సమస్త శుశ్రూషనుఁ దెలిసికొనిన వాఁడును నగుగాక. (మమ్ము) బాధించుచున్నట్టి శత్రువులను ద్వేషించుచున్న యా యింద్రుఁడు మాకభయము నిచ్చుఁగాక. (అతని ప్రభావము వలనమేము) శత్రువులఁ దిరస్కరించు సామర్థ్యమునకుఁ బ్రభువులమగుదుముఁ గాక.

పంచాశత్తు ౫.

అ౯ ౭. వతయః స్యామ ౧ తస్యవయగ్ం సుమతౌ యజ్ఞియస్యాపి భద్రే సౌమనసే స్యామ సుత్రామాస్వవాగ్ం ఇన్ద్రో౽అస్మే ఆరాచ్చిద్ ద్వేషః సనుతర్యు యోతు ౨ రేవతీర్నః సధమాద ఇన్ద్రే౽సన్తు తువివాజాః క్షుమన్తో యాభిర మేమ ౩ ప్రోష్వస్మై పురోరథమిన్ద్రా౽య శూషమర్చత అభీకేచిదులోకకృత్సఙ్గే సమత్సువృత్రహా స్మాకంబోధి చోదితానభన్తామన్యకేషామ్ జ్యాకాఅధి ధన్వసు ॥౫॥

౧ మేము యజ్ఞసంబంధియగు నాయింద్రుని యనుగ్రహయుక్తమగు మనస్సునందుండిన వారలమగుదుము. (మరియు) పరమమంగళమగు మనశ్శాంతి యందుండిన వారలమగుదుము. బాగుగరక్షించువాఁడును, ధనముకలవాఁడు నగు నా యింద్రుఁడు హవిస్సునిచ్చు మాశత్రువులను దూరముగాఁ బాఱఁదోలుఁగాక. ౨ ధనములు కలిగినట్టియు, మాతోఁగూడ సంతోషించుచున్నట్టియు, నన్నముతోఁగూడు కొనినట్టి యుదకములు మాస్వామియగు నింద్రునియందు (సుఖముకొఱ) కుండుగాక.

వే యుదకములతోఁ గూడ మేముధ్వనిఁజేయుచున్నవారమై (ఇంద్రుని స్తోత్రముచేయుచున్న వారమై) సంతోషించుదుమో! 3 ఇంద్రుని రక్షమున కెదుటనున్న బలము నధికముగఁ బూజించుడు. (పూజ యెట్లనగా?) ఈ యింద్రుఁడు వృత్రాసురునిఁ జంపినవాఁడు, యుద్ధములందు వీరభటులతోఁ గలిసినపుడు చంపనెదిరించిన శత్రువు మీఁద బడుచున్నాఁడు. (ఇదియే బలముయొక్క పూజ) ఆ విధముగఁ బూజింపఁ బడిన యింద్రుఁడు మాకు హితులఁ (బోగొట్టుటకొఱకుఁ) బ్రేరణచేయుచున్నవాఁడై సావధానుఁడగుఁగాక. నిందితులగు శత్రువుల ధనమునాశ్రయించి యుంటున్నవారలు (అల్లెత్రాళ్లు) తెగిపోవుఁగాక. (అల్లెత్రాఁడు = ధనుస్సునకుఁ గట్టినత్రాఁడు.)

త్రయోదశానువాకము సమాప్తము.

ఇట్లు ప్రథమాష్టకమున సప్తమ ప్రపాఠకము ముగిసినది.

—* 0 *—

ప్రపాఠకము ౮

అనువాకము ౨.

౫౮ ౮. ౧ అనుమత్యై పురోడాశమష్టాకపాలం నిర్వపతిధేనుర్దక్షిణాయే ప్రత్య
ఞ్చః శమ్యాయాఅవశీయన్తేతం నైరృతమేకకపాలం కృష్ణం వాసః
కృష్ణతూషందక్షిణా ౨ వీహిస్వాహాऽऽహుతిం జుషాణఏషతే నిరృతే
భాగో భూతేహవిష్మత్యసి ముఞ్చేమమగ్ంహసః స్వాహానమోయఇదం
చకారా ౩ ऽऽదిత్యం చరుంనిర్వపతివరో దక్షిణాऽఽగ్నావైష్ణవమేకా
దశకపాలం వామనోవహీదక్షిణాऽగ్నీషోమీయమ్॥

౧ (ఈప్రపాఠకమున "రాజసూయ" యాగము చెప్పఁబడుచున్నది. చతు ర్దశితోఁగూడుకొనిన పూర్ణిమకభిమానియగు దేవత "యనుమతిదేవత" యనిచెప్పఁ బడును.) అనుమతి దేవత కొఱకెనిమిదికపాలములలో సంస్కృతమగు పురోడాశ మును నిర్వాపము చేయవలయును. (ఈకర్మయందు) ధేనువు దక్షిణ. శమ్యకు వెనుక బియ్యపుపిండి నలుసులు క్రింద బడుచున్నవి. ఒక కపాలమునందు సంస్కృ తమైన నిరృతి దేవతగా గల ఆనలుసులను నిర్వాపము చేయవలయును. నల్లని యం చులుకల నల్లనివస్త్రి(మీకర్మయందు) దక్షిణ (నిర్వాపము=దేవతనుద్దేశించి హవిస్సు నగ్నియందుంచుట. (ధేనువు=పాడియావు) ౨ (ఓగార్హపత్యాగ్నీ!) (నీకొఱ) కివ్వఁబడిన యాహుతిని సేవించుచున్నవాఁడవై (దక్షిణదిక్కునుఁగూర్చి పోవనిచ్ఛయిం చుచున్న మమ్ము బాధింపకుము. ఓ నిరృతి (పాప) దేవతా! ఈ ఒక్క కపాలము

నందలి పురోడాశము నీకు భాగము. మాయొక్క ఐశ్వర్యదేవతా! హవిస్సుకల దానవగుచున్నావు. (కావున) నీ యజమానుని (దారిద్ర్యమునిచ్చు) పాపమునుండి విడువుము. ఏ గార్హపత్యాగ్ని (మాచే "ఏహి" యను శబ్దముచే ప్రార్థింపఁబడిన) యనుష్ఠానము నావిధముగానే జేసెనో! ఆ యగ్నికొఱకు హవిస్సు ఇవ్వఁబడినది. నమస్కారము కూడఁజేయఁబడినది. 3 ఈ వాక్యార్థము తరువాత పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౨.

అ. ౧ ఏకాదశకపాలగ్ం హిరణ్యం దక్షిణైంద్రమేకాదశకపాలమృషభోవహీ దక్షిణాఽఽగ్నేయమష్టాకపాలమైంద్రం దధ్యృషభోవహీ దక్షిణైంద్రాగ్నం ద్వాదశకపాలం వైశ్వదేవం చరుం ప్రథమజోవత్సోదక్షిణా సౌమ్యగ్ం శ్యామాకం చరుంవాసో దక్షిణా సరస్వత్యైచరుగ్ం సరస్వతేచరుం మిథునౌగావౌ దక్షిణా॥

౧ ఆదిత్య దేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. (ఈయాగమునందు) గోవుదక్షిణ. అగ్నావిష్ణువులు దేవతలుగా గల నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. పొట్టియెద్దు దక్షిణ అగ్నీషోములు దేవతలుగాఁ గల పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ఆవులకు గర్భము నిలుపఁదగిన యెద్దు దక్షిణ. అగ్నీంద్రులు దేవతలుగాఁ గల నెనిమిది కపాలములందు సంస్కృతమగు దధిని నిర్వాపము చేయవలయును. సేచనసమర్థమగుచు నండములు గల యెద్దు దక్షిణ. ఇంద్రాగ్నులు, విశ్వేదేవులు, దేవతలుగాఁ గల పండ్రెండు కపాలములందు

సంస్కృతమగు చరువును నిర్వాపము చేయవలయును. మొదట|పుట్టినదూడ దక్షిణ. సోముఁడు దేవతగాఁ గల శ్యామాకచరువును నిర్వాపము చేయవలయును వస్త్రము దక్షిణ. సరస్వతీ సరస్వద్దేవతల కొఱకు చరువును నిర్వాపము చేయవలయును. జంటగానున్న గోవులుదక్షిణ. (పైపంచాశత్తులోని మూడవవాక్యార్థమీ వాక్యార్థముతోఁ జేర్చి వ్రాయఁబడినది. సేచనము = గర్భము చేయుశక్తి. దధి = పెరుగు. చరువు = హవిర్విశేషము. శ్యామాకము = ధాన్యవిశేషము.)

ప్రథమానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౨.

౩౦౦. ౧ ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతిసౌమ్యం చరుగ్ం సావిత్రం ద్వాదశ కపాలగ్ం సారస్వతం చరుం పౌష్ణం చరుం మారుతగ్ం సప్తకపాలం వైశ్వదేవీమామిక్షాం ద్యావాపృథివ్యమేకకపాలమ్॥

౧ అగ్నిదేవతాకమగు నెనిమిదికపాలములందు సంస్కృతమయిన పురోడాశమును నిర్వాపము చేయవలయును. సోముఁడు దేవతగాఁగల చరువును నిర్వాపము చేయవలయును సవితృదేవతాకమగు పండ్రెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. సరస్వతిదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. పూషదేవతాకమగు చరువునునిర్వాపము చేయవలయును. మరుద్దేవతాకమగు నేడుకపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. విశ్వేదేవులు దేవతగాఁగల నామిక్షా.

ద్రవ్యమును నిర్వాపము చేయువలయును. ద్యావాభూములు దేవతలుగాఁగల యొకకపాలమునందు సంస్కృతమైన పురోడాశమును నిర్వాపము చేయువలయును. ( ఆమిక్ష=వేడిపాలలోఁ బెరుగుపోయగా విరిగిన విరుగు. )

ద్వితీయానువాకము సమాప్తము.

— * —

## అ ను వా క ము. ౩.

౩౦౧. ౧ ఐన్ద్రాగ్నమేకాదశకపాలం మారుతీమామిక్షాం వారుణీమామిక్షాం కాయమేకకపాలం ౨ ప్రఘాస్యాన్హవామహే మరుతో యజ్ఞవాహసః కరమ్భేణ సజోషసః ౩ మోషూణఇన్ద్ర పృత్సు దేవాస్తుస్మ తే శుష్మిన్నవయా మహీహ్యస్య మీఢుషోయవ్యా హవిష్మతో మరుతో వన్దతే గీః ౪ యద్గ్రామే యదరణ్యే యత్సభాయాం యదిన్ద్రియే। యచ్ఛూద్రే యదర్యేఏనశ్చకృమావయమ్। యదేకస్యాధి ధర్మణి తస్యావయజనమసి స్వాహా ౫ అక్రన్కర్మకర్మకృతః సహ వాచా మయోభువా। దేవేభ్యః కర్మకృత్వాఽస్తం ప్రేత సుదానవః॥

౧ ఇంద్రాగ్నులు దేవతగాఁగల పదునొకండు కపాలములందు సంస్కృతమైన పురోడాశమును (నిర్వాపము చేయువలయును.) మరుద్దేవతాకమగు నామిక్షను

(నిర్వాపము చేయవలయును.) వరుణదేవతాకమగు నామిక్షను నిర్వాపముచేయవల యును. ఒక కపాలమునందు సంస్కరింపఁబడిన ప్రజాపతి దేవతాకమగు పురోడాశ మును నిర్వాపము చేయవలయును ౨ వరుణపాశరూపమగు కర్మను నశింపఁ జేయుటకర్హులైనట్టియు, యజ్ఞమును వహించునట్టియు, కరమ్భముచే సమానప్రీతికల మరుత్తులనుఁ బిలుచుచున్నాము. (పెఱుగు, నెయ్యి కలసిన సక్తువులచే నిష్పాదిత మగు పాత్రసముదాయము "కరమ్భ" మనఁబడును. సక్తువులు=ఒకవిధమయిన ధాన్యవిశేషము పేలాలపిండి కావచ్చును.) ౩ ఓ దేవేంద్రుఁడా ! మమ్ము యుద్ధము లందు ప్రవర్తింపఁ జేయకుము. ఓ బలవంతుఁడా ! నీ (యనుగ్రహమువలన) ననిష్టము నాశనమగు గాక. వర్షముచేఁ దడుపుటకు సమర్థుఁడవగు నీ (యనుగ్రహము వలన) మాభూమి యవలు మొదలగు నిఖిలధాన్యములతోఁ గూడుకొనినది. (కావున ననిష్ట నాశకమని, తా॥) మాస్తుతిరూపకమగు వాక్కు కరమ్భపాత్రరూప హవిర్యుక్తులగు మరుత్తులను నమస్కారము చేయుచున్నది. ౪ (యజమానుఁడు. యజమానపత్ని, దాసజనము, మొదలగు మేము) గ్రామములోను, అరణ్యములోను, సభయందును, ఇంద్రియమునందును, శూద్రుని విషయములోను, వైశ్యుని విషయములోను, అధిక ముగాఁబాపముఁ జేసితిమో ! (ఓ కరంభ పాత్రసముదాయమా !) ఆ సమస్తమునకు నీవు నాశకమగుచున్నావు (కావున నిన్ను) ఇచ్చుచున్నాను. ౫ అధ్వర్యుఁడు, యజమానుఁడు, యజమానపత్నియు, మొదలగునందరు సుఖమును కలుగఁజేయునట్టి (మన్త్రోచ్చారణ రూపమగు) వాక్కుతోఁ గూడఁ గరంభపాత్ర హోమాం తమగు కర్మనుఁ జేసిరి. ఓ బాగుగ హవిస్సునిచ్చు నధ్వర్య ప్రభృతులారా ! దేవతల కొఱకు (కీ) కర్మనుఁజేసి స్వగృహమునుఁ గూర్చిపొండు.

తృతీయానువాకము సమాప్తము.

—*0*—

### అనువాకము ౪.

౩౦ ౨. అగ్నయేఽనీకవతే పురోడాశమష్టాకపాలం నిర్వపతిసాకగ్ం సూర్యేణో
ద్యతామరుద్భ్యః సాంతపనేభ్యోమధ్యందినే చరుం మరుద్భ్యోగృహమేధి
భ్యః సర్వాసాం దుగ్ధేసాయం చరుం ౨ పూర్ణాదర్విపరాపత సుపూర్ణా
పునరాపత। వస్నేవవిక్రీణావహా ఇషమూర్జగ్ం శతక్రతో। ౩ దేహిమే
దదామితే నిమేధేహినితేదధే। నిహారమిన్నిమేహరానిహారమ్॥

౧ సైన్యముకల యగ్ని కొఱకుదయించుచున్న సూర్యునితోఁగూడ (సూర్యో దయముకాలమునందని భావము.) నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమునునిర్వాపము చేయవలయును. అనిష్టమునశింపచేయు మరుద్దేవతలకొఱకు మధ్యాహ్నసమయమునందుచరువును (నిర్వాపము చేయవలయును) గృహమును, యజ్ఞమునుఁ బాలించునట్టి మరుద్దేవతలకొఱకు సాయంకాలమునందు (యజమానునియొక్క) సర్వగోవులను (పాలు) పితుకుసమయమున చరువును నిర్వాపము చేయవలయును. ౨ ఓ దర్వి! (నీవు బాణములనెగియుటలో) పూర్ణమగు చంద్రునిఁ గూర్చి వెళ్లుము. (అతని యనుగ్రహము వలనఁ గలిగిన బలముచే) బాగుగ నిండినదానవగుచురమ్ము. ఓ యింద్రుఁడా! ధనముచేతనువలె (శరనిష్కాసము చిమ్ముటనిచ్చి నీనుండి) అన్నమును, బలమును, కొనుచున్నాము. (దర్వి = హోమకాలమునందుపయోగించు పాత్రవిశేషము.) ౩ (ఓ యింద్రుఁడా!) నాకేది (కావలయునో, దానిని నీవు) ఒసఁగుము. నీకేది (కావలయునో! దానిని నేను) ఒసఁగుచున్నాను. (ఇచ్చియు) నా సమీపముననుంచుము. నీ సమీపమున (నే) నుంచెదను (ఈ యుభయ మొకసమయమునకాదు మరెప్పుడనగా) మఱల మఱల దీసికొనివచ్చియే నా సమీపమున నుంచుము. (నేనును) మఱల మఱల తీసికొనివచ్చియే నీసమీపమున నుంచుచున్నాను.

పంచాశత్తు ౨.

౨౦౩. నిహారామితే ౧ మరుద్భ్యః క్రీడిభ్యః పురోడాశగ్ం సప్తకపాలం నిర్వ
పతి సాకగ్ం సూర్యేణోద్య తాఽగ్నేయమష్టాకపాలం నిర్వపతిసౌమ్యం చ
రుగ్ంసావిత్రం ద్వాదశ కపాలగ్ం సారస్వతం చరుం పౌష్ణం చరుమైన్ద్రాగ్నే
మేకాదశ కపాలమైన్ద్రం చరుం వైశ్వకర్మణ మేకకపాలమ్ ॥ ౨॥

౧ క్రీడకల మరుద్దేవతల కొఱకునుదయించుచున్న సూర్యునితోఁ గూడ (అనగా సూర్యోదయ కాలమునందని భావము.) ఏడు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. అగ్ని దేవతవలన నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును (నిర్వాపము చేయవలయును. సోమదేవతకల చరువును నిర్వాపము చేయవలయును. సవిత దేవతగాఁ గలిగినట్టియు, నెనిమిదికపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపముచేయవలయును. సరస్వతి దేవతగాఁగల చరువును నిర్వాపము చేయవలయును. పూష దేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. ఇంద్రాగ్నులు దేవతలుగా గలిగినట్టి పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ఇంద్రుఁడు దేవతగాఁ గలిగినట్టి నొక కపాలమున సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును.

చతుర్థానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౫.

౩౦౪. సోమాయపితృమతే పురోడాశగ్ం షట్కపాలం నిర్వపతిపితృభ్యో బర్హి
షద్భ్యోధానాః పితృభ్యోఽగ్నిష్వాత్తేభ్యోఽభివాన్యాయై దుగ్ధేమన్థమే ౨
తత్తేతతయేచ త్వామన్వేతత్తే పితామహప్రపితామహ యేచత్వామన్వ ౩
త్రపితరో యథాభాగం మన్దధ్వగ్ం ౪ సుసందృశం త్వావయం మఘ
వన్తన్నిధీమహి। ప్రనూనం పూర్ణవన్ధురః స్తుతో యాసివశాగ్ం అను। యో
జాన్విన్ద్రతేహరీ॥

౧ పితృస్వామియగు సోమదేవతకొఱకు నారుకపాలములందు సంస్కృత మగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. యజ్ఞమునందున్న పితృదేవతలకొఱకు వేపినయవలను నిర్వాపము చేయవలయును. (ఇట్లుచేయగా) యజ్ఞము నందుండని పితరులకొఱకు దూడచచ్చినయావునుండి బియ్యపుపిండితోకలసిన పాలను పితుకవలయును. (అనగా నట్టిపాలను నిర్వాపచేయవలయుననితా॥ బర్హిషదః=ఈలోకమునందు యజ్ఞముచేసి పితృలోకమును పొందినవారు. అగ్నిష్వాత్తా=ఈలోకమునందు యజ్ఞముచేయక గృహస్థులుగానుండి పితృలోకమును పొందినవారు.) ౨ ఓ పితృదేవతా! నీకొఱకీపిండిగాచేయఁబడిన యన్నమివ్వబడినది. ఎవరు నిన్ననుసరించి యుంటున్నారో! (వారికిఁగూడ నీపిండాన్నమివ్వబడినది.) ఓపితామహుఁడా! ఈ యన్నము నీకివ్వబడినది. నిన్ననుసరించి ఎవరుంటున్నారో! (వారికిఁగూడ నివ్వబడినది.) ఓప్రపితామహుఁడా! (నీకీయన్నమివ్వబడినది.) ఎవరునిన్ననుసరించియుంటున్నారో! (వారికిఁగూడ నివ్వబడినది.) ౩ ఓపితృదేవతలారా! (మీకివ్వఁబడిన పిండములలో) మీమీభాగము నతిక్రమించకుండగా సంతుష్టులుకండు. ౪ ఓయింద్రుడా!

మంచికటాక్షవీక్షణముచే మమ్ముఁ జూచుచున్న నిన్ను మేము తృప్తిపఱచుచున్నారము. నీవుకూడ మాచేనివ్వఁబడిన హవిస్సుచే నిండింపఁబడిన రథముమీఁది భాగమున చేరినవాఁడవైమాచేస్తోత్రము చేయఁబడిన వాఁడవగుచు నభీష్టదేశముల నుద్దేశించి తరచుగా రాగలవు ఓయింద్రుడా ! నీయశ్వములు రథమునందు యుక్తములైనవికదా (కలిసికొనినవని తా॥)

## పంచాశత్తు ౨

౩౦౫. అక్షన్నమీమదన్తహ్యవ ప్రియా అధూషత అస్తోషతస్వభానవో విప్రానవిష్ఠయామతీ యోజాన్విన్ద్రతేహరీ ౧ అక్షన్పితరోz మీమదన్త పితరోzతీతృపన్తపితరోz మీమృజన్త పితరః ౨ పరేతపితరః సోమ్యా గమ్భీరైః పథిభిః పూర్వ్యైః అథాపిత్ౄన్త్సువిదత్రాగ్ం అపీతయమేన యేసధమాదం మదన్తి ౩ మనోన్వాహువామహే నారాశగ్ంసేన స్తోమేన పితౄణాం చమన్మభిః౪

౧ హవిస్సునుభుజించుచున్న పితృదేవతలు మిక్కిలి సంతోషించినారు. ఏకారణముచేఁ ప్రియములైన శిరస్సు మొదలగు నంగములను (హవిర్భోజన సౌకర్యముచే) కదలించిరో ! తమ తేజస్సుచేఁ ప్రకాశించుచున్న బ్రాహ్మణులు (భోజన తృప్తిచే) మిక్కిలి నూతనమగు బుద్ధిచే స్తోత్రముచేసినారు. ఓ యింద్రుఁడా ! నీగుఱ్ఱములు రథమునందు నియుక్తములైనవికదా ! ౨ హవిస్సును భుజించిన పితృదేవతలు (మమ్ము) సంతోషపెట్టిరి పితృదేవతలు (మమ్ము) తృప్తిపఱచిరి. పితృదేవతలు (మమ్ము) శోధించిరి. ౩ మంచి మనస్సుగల పితృదేవతలారా ! సులభములగు నన్నోదకములు కలవియు, పూర్వము చేయఁబడినవియు నగు మార్గముల చే తిరిగి

(మీగృహములఁ గూర్చి పొందు. పిమ్మట నా పితృలోకమునందు యమునితోఁగూడ నే పితరులు సంతోషించుచున్నారో (చిరకాలనివాసముచే నచటి వృత్తాంతములను) దెలిసికొనిన యా పితరురనుఁ గూడ పొందుము. ౮ మనుష్యులకు ప్రశంసాయోగ్యమగు వాక్యసమూహము చేతను, పితరులకుఁ గూడ మననీయములగు వాక్యముల చేతను, (పితృయజ్ఞానుష్ఠానము నందాసక్తమైన) మనస్సును శీఘ్రముగాఁ బిలుచున్నారము. (మననము = మాటిమాటికిఁ దలచుట)

### పంచాశత్తు ౩.

౩౦౬. నఏతుమనః పునః క్రత్వేదక్షాయజీవసే। జ్యోక్చసూర్యందృశే। ౨ పునర్నఃపిత
రోమనోదదాతుదైవ్యోజనః। జీవం వ్రాతగ్ం సచేమహి। ౩ యదన్తరి
క్షం పృథివీముతద్యాం యన్మాతరం పితరం వాజిహిగ్ంసిమ అగ్ని
ర్మాతస్మాదేనసోగార్హపత్యః ప్రముఞ్చతు దురితా యాని చకృమకరోతు
మామనేనసమ్॥

౧ కర్మానుష్ఠానముకొఱకు, వాయూసామర్థ్యముకొఱకు, జీవించుకొరకు, సూర్యునిజూచుకొరకు, యోగ్యమగుమనస్సువచ్చి మమ్మ మఱలఁ బొందుగాక. ౨ ఓపితృదేవతలారా! దేవసంబంధియగు పురుషసముదాయము మాకు (కర్మానుష్ఠానపరమగు) మనస్సును మాటిమాటికిచ్చుఁగాక. మేముగూడ సంవత్సరసమూహరూపమగు జీవనమును సేవించుదుము. ౩ అంతరిక్షలోకమును గాని, పృథివీలోకముఁగాని, లేక ద్యులోకముఁగాని, తల్లినిగాని, తండ్రినిగాని హింసించుటకిచ్ఛ

యించితిమనుట యేదికలదో ! ఆసమస్త పాపమునుండి గార్హపత్యాగ్ని నన్ను విడచునుగాక. ఇతరపాపములనుకూడ వేటిని చేసితినో, (వాటినుండికూడ విడుచునుగాక.) నన్ను పరహితునిగాఁ జేయుఁగాక.

పంచమానువాకము సమాప్తము.



## అనువాకము ౬.

౩౦౭. ప్రతిపూరుషమేకకపాలాన్నిర్వపత్యేకమతిరిక్తం ౨ యావన్తోగృహ్యాః స్మస్తేభ్యః కమకరం ౩ పశూనాగ్ం శర్మాసిశర్మయజమానస్యశర్మమే యచ్ఛ ౪ కవేవరుద్రోనద్వితీయాయతస్థ ౫ ఆఖుస్తేరుద్రపశుస్తం జుష స్వై ౬ ష తేరుద్రభాగః సహస్వస్రాఽమ్బికయాతం జుషస్వ ౭ భేషజం గవేఽశ్వాయ పురుషాయభేషజమథో అస్మభ్యం భేషజగ్ం సుభేషజమ్॥

౧ పూర్వము పురుషుల నుద్దేశించి మిగిలిన కపాలములందు సంస్కృతములయిన పురోడాశములను నిర్వాపము చేయవలయును. ౨ మనుష్యులమగు మేమెంతమంది (ఇచటనుంటిమో,) ఆ యందఱికొఱకును సుఖమునుఁ జేసితిని. ౩ (ఓ మాతా! ) (గడ్డిమొదలగు వస్తువులతోను, విత్తులతోను కూడుకొనుటచే) పశువులకు సుఖమగుచున్నావు. (కావున) యజమానునకు (అధ్వర్యుఁడనగు) నాకును సుఖమునిమ్ము. ౪ రుద్రుఁడొక్కఁడే (జగత్తునందున్నాఁడు. రెండవ రుద్రుఁడు లేదు. ౫ ఓ

రుద్రుఁడా! ఎలుక నీకు (ప్రియమగు) పశువు (కావున) దానిని సేవించుము ౬ ఓరుద్రుడా! ఈ యివ్వబడిన పురోడాశముల యంశము నీకివ్వబడుచున్న భాగము. ఆభాగమును, సోదరివలె హితమునుచేయు పార్వతితోఁగూడ సేవింపుము. ౭ ఓ రుద్రుడా! మా గోజాతి కారోగ్యమునుఁ (జేయుము) అశ్వజాతికారోగ్యమును (చేయుము) మాపురుషజాతి కారోగ్యమును చేయుము. పిమ్మట మాకుఁగూడ నారోగ్యమును (చేయుము.) తాత్కాలికరోగశాన్తిగాని, నిత్యమైన యారోగ్యము కాని, యెట్లగునో, అట్లుచేయుము. ఎద్దునకు నావునకును మంచిగమనమును సంపాదింపజేయుము.

పఞ్చాశత్తు ౨

౩౦౮. యథాఽసతి। సుగంమేషాయమేష్యా ౧ అవామ్బరుద్రమదిమహ్యావదేవం త్ర్యమ్బకమ్। యథానః శ్రేయసః కరద్యథానోవస్యసః కరద్యథానః పశుమతః కరద్యథానోవ్యవసాయయాత్। ౨ త్ర్యమ్బకం యజామహేసుగన్ధిం పుష్టివర్ధనమ్। ఉర్వారుకమివబన్ధ నాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్। ౩ ఏషతేరుద్రభాగస్తం జుషస్వతేనావసేన పరోమూజవతోఽతీహ్య ౪ వతతధన్వాపినాకహస్తః కృత్తివాసాః॥

౧ ఓపార్వతీ! రుద్రునుద్దేశించి పురోడాశావదానమునుఁ జేసితిమి. మూడు నేత్రములుకల దేవునుద్దేశించి పురోడాశావదానమునుఁ జేసితిమి. (ఆదరముకొఱకు రెండుపర్యాయములొకే యర్థముచెప్పఁబడినది) ఈరుద్రుఁడు మమ్ము (నధ్యయ

నాములచే) శ్రేష్ఠులనుగా నెట్లు చేయునో ! ధనముకలవారినిగా నెట్లు చేయునో ! గోవు లశ్వములుగలవారినిగా నెట్లు చేయునో ! శాస్త్రార్థనిశ్చయము కలవారినిగా నెట్లు చేయునో (అందుకై యవదానము చేయఁబడినదని భావము.) (పురోడాశావదానము = హోమము చేయుటకై పాత్రనుండి చేతిలోనికిఁ బురోడాశమును గ్రహించుట) ౨ మంచిశరీరగంధ, పుణ్యగంధములను కలిగినవాఁడును, శరీర ధనాదివిషయమగు పుష్టినివృద్ధినొందించువాఁడునగు త్రినేత్రునిఁబూజించుచున్నాము. దోసపండుతొడిమనుండివలె, మృత్యువునుండి నేను (ఈశ్వరానుగ్రహమువలన) విడిపింపఁబడగలను స్వర్గాదికమునుండి (చిరజీవితమునుండికాని) విడిపింపఁబడను. ౩ ఓరుద్రుడా ! ఈ(వ్రీహ్యాదికమునందు సన్నద్ధమగు) పురోడాశసంఘము నీకు భాగము. దానిని సేవింపుము. (దారిబత్తెమగుటచే నీకు రక్షకమగు) భాగముతోఁగూడుకొనినవాడవై మూజవత్తమను పేరుకల పర్వతముకంటె పరభాగమునందున్నవాఁడవై యతిక్రమించి వెళ్లుము. ౪ మావిరోధియగు పాపమునుఁ జంపుట కీరుద్రుఁడు పినాకమనుధనస్సు హస్తమునందు కలవాఁడును, (నారినిలాగుటచే) విస్తరింపఁ జేయఁబడిన ధనస్సుకలవాఁడును, చర్మము వస్త్రముగాఁగలవాఁడు నగుఁగాక.

షష్ఠానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౭.

౩౦౯. ఐన్ద్రాగ్నం ద్వాదశకపాలం వైశ్వదేవం చరుమిన్ద్రాయశునాసీరాయ పురోడాశం ద్వాదశకపాలం వాయవ్యంపయః సౌర్యమేకకపాలం ద్వాద

శిగవగ్ం సీరం దక్షిణాఽగ్నేయమష్టాకపాలం నిర్వపతి రౌద్రం గావీధుకం చరుమైన్ద్రం దధి వారుణం యవమయం చరుం వహినీ ధేనుర్దక్షిణా 3 యే దేవాః పురః సదోఽగ్నినేత్రా దక్షిణసదో యమనేత్రాః పశ్చాత్సదః సవితృనేత్రా ఉత్తరసదో వరుణనేత్రా ఉపరిషదో బృహస్పతినేత్రా రక్షోహణస్తే నః పాన్తు తే నోఽవన్తు తేభ్యః॥

౧ ఇన్ద్రాగ్నులు దేవతగాఁ గలిగినట్టియుఁ బన్రెండుకపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. విశ్వేదేవ దేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. వాయ్వాదిత్యులతోఁ గూడుకొనిన యింద్రుని కొఱకు పన్రెండుకపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. వాయుదేవతాకమగు పాలను నిర్వాపము చేయవలయును. ఒక కపాలమునందు సంస్కృతమైన సూర్యదేవతాకమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. పన్రెండు యెద్దులచే మోయబడుచున్న నాగలి (ఈకర్మకు) దక్షిణ. ౨ అగ్నిదేవతాకమగు నెనిమిదికపాలములందు సంస్కృతమగుపురోడాశమును నిర్వాపము చేయవలయును. రుద్రదేవతాకమైనట్టియు, నరణ్యధాన్యవిశేషముచే నిష్పన్నమగు చరువును నిర్వాపము చేయవలయును. ఇంద్రదేవతాకమగు పెరుగును నిర్వాపము చేయవలయును. వరుణదేవతాకమైన, యవమయమగు చరువును నిర్వాపము చేయవలయును. పృష్ఠభాగమున భారము వహించుచున్న యావు (ఈకర్మకు) దక్షిణ. 3 తూర్పుదిక్కునందున్న యగ్ని మొదలగు నే దేవతలు రాక్షసుల జంపువారలై (యుండిరో !) దక్షిణ దిక్కునందుండు యముఁడు మొదలగు దేవతలు రాక్షసులఁ జంపువారలై (యుండిరో!) పశ్చిమ దిక్కునందుండు సూర్యుఁడు మొదలగు దేవతలు రాక్షసులఁ జంపువారలై (యుండిరో!) ఉత్తరదిక్కునందుండు వరు

ణుఁడు మొదలగు నే దేవతయి రాక్షసులఁ జంపువారలై (యుండిరో!) ఊర్ధ్వభాగ మునందుండు బృహస్పతి మొదలగు నే దేవతలు రాక్షసులఁ జంపువారలై (యుండిరో!) ఆ దేవతలు మమ్మ (రాక్షసనివారణముచేసి) రక్షించుఁగాక. మఱల నాదేవతలు మమ్మ (ధర్మానుష్ఠానము కొఱకు) రక్షించుఁగాక. వారికొఱకు నమస్కారమగుఁగాక. వారికొఱకు (ఈహవ్యము) హుతమగుఁగాక.

## పంచాశత్తు ౨.

౩౧౦. నమస్తేభ్యః స్వాహా ౧ సమూఢగ్ం రక్షః సందగ్ధగ్ంరక్ష ఇదమహగ్ం రక్షోఽభిసంపహామ్య ౨ గ్నయేరక్షోఘ్నేస్వాహా యమాయసవిత్రే వరుణాయబృహస్పతయే దువస్వతేరక్షోఘ్నేస్వాహా ౩ ప్రష్టివాహీరథోదక్షిణా ౪ దేవస్యత్వాసవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాగ్ం రక్షసోవధం జుహోమిహతగ్ం రక్షోఽవధిష్మరక్షో ౫ యద్వస్తే తద్దక్షిణా॥

౧ (మాకుఁ బ్రతికూలమగు) రాక్షససముదాయము (నశింపఁజేయుటకు సమూహముగాఁ జేయఁబడినది. దగ్ధమైన రాక్షససముదాయమున కంతటనున్న భృత్యులను బాగుగా నేను దహింపఁజేయుచున్నాను. ౨ రాక్షససంహారియగు నగ్నికొఱకు (హవ్యము) హుతమగుగాక. (రాక్షసహన్తయగు) యమునికొఱకు (హవ్యము హుతమగుఁగాక.) (రాక్షససంహారియగు) సూర్యునికొఱకు (హవ్యము హుతమగుఁగాక.) (రాక్షససంహారియగు) వరుణునికొఱకు (హవ్యము హుతమగుగాక.) పరిచర్యగల బృహస్పతికొఱకు (హవ్యము హుతమగుఁగాక. పరిచర్య = సేవ.) ౩ మూఁడుగుఱ్ఱములచే మోయఁబడుచున్న రథము (పూర్వోక్తమగు కర్మ

యందు) దక్షిణా. ౮ (ప్రేరకుండు, అంతర్యామియునగు సూర్యునియాజ్ఞయుండగా, నశ్వినీదేవతలయొక్క బాహువులచేతను, పూషదేవతయొక్క హస్తములచేతను, రాక్షససముదాయముయొక్క వధ నుద్దేశించి హోమముచేయుచున్నాను. రాక్షససముదాయము చంపఁబడినది. రాక్షససముదాయమును చంపితిమి. ౯ (హోమకాలమునందు కప్పఁబడిన) వస్త్రమేదికలదో, ఆవస్త్రము (ఈకర్మయందు) దక్షిణా.

సప్తమానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౮.

౩౧౧. ధాత్రేపురోడాశం ద్వాదశకపాలం నిర్వపత్యనుమత్యైచరుగ్ం రాకా
యైచరుగ్ం సినీవాల్యైచరుం కుహ్వైచరుం మిథునౌగావౌదక్షిణా ఽ
గ్నావైష్ణవమేకాదశకపాలం నిర్వపత్యైన్ద్రావైష్ణవమేకాదశకపాలం వై
ష్ణవంత్రికపాలం వామనోవహీదక్షిణా ఽగ్నీషోమీయమేకాదశకపాలం
నిర్వపతీన్ద్రాసోమీయమేకాదశకపాలగ్ం సౌమ్యం చరుం బభ్రుర్దక్షిణా
సోమాపౌష్ణం చరుం నిర్వపత్యైన్ద్రాపౌష్ణంచరుం పౌష్ణం చరుగ్ంశ్యా
మోదక్షిణావైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపతిహిరణ్యం దక్షిణా
వారుణం యవమయం చరుమశ్వోదక్షిణా॥

౧ బ్రహ్మకొఱకు పం్రెడెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. అనుమతి దేవతకొఱకు చరువును నిర్వాపము చేయవలయును. రాకా దేవతకొఱకు చరువును నిర్వాపము చేయవలయును. సినీవాలీ దేవతకొఱకు చరువును నిర్వాపము చేయవలయును. కుహూ దేవతకొఱకు చరువును నిర్వాపము చేయవలయును. (ఈ కర్మయందు) జంటగానున్న గోవులు దక్షిణ. ౨ అగ్ని విష్ణువులు, దేవతగాగల పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ఇంద్రవిష్ణువులు దేవతగాగల పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. విష్ణువు దేవతగాగల మూఁడు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును (ఈ కర్మయందు) పొట్టియెద్దు దక్షిణ. అగ్నీషోములు దేవతగాఁగల పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును కపిలగోవు దక్షిణ. సోము, పూష, దేవులు దేవతగాఁగల చరువును నిర్వాపము చేయవలయును. ఇంద్ర పూషదేవుఁడు దేవతగాఁగల చరువును నిర్వాపము చేయవలయును. నల్లనిగోవు దక్షిణ. వైశ్వానరుఁడు (అగ్ని) దేవతగాగల పంౖరెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశము నిర్వాపము చేయవలయును. బంగారము దక్షిణ. వరుణుడు దేవతగాగల యవమయమగు చరువును నిర్వాపము చేయవలయును. గుఱ్ఱము దక్షిణ

అష్టమానువాకము సమాప్తము.

—।—*—।—

అనువాకము ౯.

౩౧౨, బార్హస్పత్యం చరుం నిర్వపతి బ్రహ్మణో గృహే శితిపృష్ఠో దక్షిణైన్ద్రమేకాద

కకపాలగ్ం రాజన్యస్యగృహఋషభోదక్షిణాZZదిత్యం చరుం మహిష్యై గృహేధేనుర్దక్షిణానైరృతం చరుం పరివృక్త్యైగృహేకృష్ణానాం వ్రీహీణాం నఖనిర్భిన్నం కృష్ణాకూటా దక్షిణాZZగ్నేయమష్టాకపాలగ్ం సేనాన్యో గృహేహిరణ్యం దక్షిణావారుణం దశకపాలగ్ం సూతస్యగృహే మహానిరష్టో దక్షిణామారుతగ్ం సప్తకపాలం గ్రామణ్యోగృహేపృశ్నిర్దక్షిణా సావిత్రం ద్వాదశకపాలమ్॥

౧ బ్రహ్మయను ఋత్విక్కుయొక్క గృహమునందు (రాజువెళ్ళి) బృహస్పతి దేవతగాఁగలచరువును నిర్వాపము చేయవలయును. వెండి (ఈకర్మయందు) దక్షిణ. రాజులయొక్క గృహమునందింద్రుఁడు దేవతగాఁగల పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ఎద్దుదక్షిణ. పట్టమహిషి (రాజపత్ని) యొక్క గృహమునందాదిత్యుఁడు దేవతగాఁగల చరువును నిర్వాపము చేయవలయును. పాలనిచ్చునట్టి యావుదక్షిణ. ప్రేమలేని రాజపత్నియొక్క గృహమునందు నిర్ఋతి దేవతగాఁ గలిగినట్టియు, నల్లని వ్రీహులు సంబంధమైనదియు, గోళ్ళచేవొలిచిన బియ్యము వలన వండిన చరువును నిర్వాపము చేయవలయును. విరిగిన కొమ్ములుగల యెద్దు దక్షిణ. సేనాని (సేనాపతి) గృహమునందగ్ని దేవతగాఁగల యెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. బంగారము దక్షిణ. సారథియొక్క గృహమునందు వరుణుఁడు దేవతగాఁగల పదికపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపముచేయవలయును నలగగొట్టబడిన వృషణములుఁగల యెద్దు దక్షిణ గ్రామాధికారియొక్క గృహమునందు మరుద్దేవతాకమగు నేడుకపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపముచేయవలయును. తెల్లనియెద్దుదక్షిణ. అంతఃపురా

ధ్యక్షుని (కంచుకి) యొక్క గృహమునందు సవితృదేవతాకమగు పండ్రెండుకపాల ములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. సంకీర్ణ వర్ణముకలగోవు దక్షిణ. కోశాధ్యక్షుని గృహమునందశ్వినీదేవతలు దేవతగాఁగల రెండుకపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును ఒకతల్లియందుఁబుట్టిన రెండుదూడలుదక్షిణ. రాజునకురావగిన, నారవభాగమును బ్రజలనుండి తీసికొనువానియొక్క గృహమునందు పూషదేవుఁడు దేవతగాఁగల చరువునునిర్వాపముచేయువలయును. నల్లనియెద్దుదక్షిణ జూదగానియొక్క గృహ మునందు ఆరణ్యకగోధుమములవలన నిష్పన్నమైన రుద్రదేవతాకమైన చరువును నిర్వాపము చేయవలయును. చిత్రవర్ణముకలిగినట్టియు, దీర్ఘమగుతోకగల జంతు విశేషముదక్షిణ. (ఇచట ప్రతికర్మయందును రాజేకర్తయని తెలుసుకొనవల యును)

## పంచాశత్తు ౨.

౩౧౩. ౧ క్షత్తుర్గృహఉపధ్వస్తో దక్షిణాఽఽశ్విన్నం ద్వికపాలగ్ం సంగ్రహీతుర్గృహే సవాత్యోదక్షిణాపౌష్ణం చరుం భాగదుఘస్యగృహే శ్యామోదక్షిణారౌ ద్రంగావీధుకం చరుమక్షావాపస్యగృహే శబలఉద్వారోదక్షిణే ౨ న్ద్రా౧య స్సుత్రామ్ణే పురోడాశమేకాదశకపాలం ప్రతినిర్వపతీన్ద్రా౧యాగం హోము చేz ౩ యం నోరాజా వృత్రహారాజా భూత్వావృత్రంవధ్యాన్మై ౪ త్రాబార్హస్పత్యం భవతిశ్వేతాయై శ్వేతవత్సాయై దుగ్ధేస్వయంమూర్తే స్వయంమథిత అజ్యఆశ్వత్థే।

౧ ఈవాక్యార్థము పైపంచాశత్తుతోఁజేర్చి వ్రాయఁబడునయినది. ౨ స్వర్గ్రహామునందు బాగుగఁబరిపాలించువాఁడును, పాపమునుండి విడిపించువాఁడునగు నింద్రునికొఱకు పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ౩ ఈ రాజసూయకర్త మనకు శత్రువును నశింపఁజేయుటకు సమర్థుఁడగురాజయి శత్రువును వధింపుఁగాక. ౪ ఈవాక్యార్థము ౩వ పంచాశత్తుతోఁజేర్చి వ్రాయఁబడును.

పంచాశత్తు ౩.

౩౧౪. పాత్రేచతుః స్రక్త్యేస్వయమవపన్నాయై శాఖాయైకర్ణాగ్ం శ్చాకర్ణాగ్ం శ్చతణ్డులాన్విచినుయాద్యేకర్ణాః సపయసిబార్హస్పత్యోయేzకర్ణాః సఆజ్యే మైత్రః స్వయం కృతావేదిర్భవతి స్వయం దినం బర్హిః స్వయం కృతఇధ్మః సైవశ్వేతాశ్వేతవత్సా దక్షిణా॥

౧ స్వయముగా మథింపఁబడినదియు, స్వయముగా మూర్కి భవించినదియు నగు తెల్లనిదూడగల తెల్లనియావుయొక్క పాలయందు, నాజ్యమునందును మిత్రదేవతాకమును, బృహస్పతిదేవతాకమునగు హవిస్సు అగుచున్నది. ( ఆజ్యమునందు మిత్రదేవతాకమగు హవిస్సనియు, పాలయందు బృహస్పతిదేవతాకమగు హవిస్సనియు భేదము ) తనంతటనేపడిన రావికొమ్మయొక్క చతురస్రమమయిన (నలుపలకలుగల) పాత్రయందు తునిగిపోవని బియ్యపుగింజలను, తునిగిపోయిన బియ్యపుగింజలను (హవిస్సుగా) నిష్పాదనము చేయవలయును. తునిగిన బియ్యపుగింజలు (=నూకలు) పాలయందుంచినచో నది బృహస్పతిదేవతాకమగు హవిస్సు

తునుగని బియ్యపుగింజలు నేతియందుంచి (హవిస్సుగాఁ జేసినచో) నది మిత్ర దేవతాకమగు హవిస్సు ఁగుచున్నది. వేది (శాస్త్రీయఖననము లేకుండగా) స్వయముగా నిర్మితమయి యుండవలయును. బర్హిస్సు (శాస్త్రీయఛేదనము లేకుండగా) స్వయముగా ఖండింపబడియుండవలయును. ఇధ్మముగూడ స్వయంకృతమయి యుండవలయును. తెల్లనిమూడకల యాతెల్లనియావే (ఈకర్మయందు) దక్షిణయగుచున్నది.

నవమానువాకము సమాప్తము.

అనువాకము ౧౦.

౩౧౫. అగ్నయే గృహపతయే పురోడాశమష్టాకపాలం నిర్వపతి కృష్ణానాం వ్రీహీణాగ్ం సోమాయవనస్పతయే శ్యామాకంచరుగ్ం సవిత్రేసత్య ప్రసవాయ పురోడాశం ద్వాదశకపాలమాశూనాం వ్రీహీణాగ్ం రుద్రాయ పశుపతయేగావీధుకంచరుంబృహస్పతయే వాచస్పతయే నైవారం చరుమిన్ద్రాయ జ్యేష్ఠాయ పురోడాశమేకాదశకపాలం మహావ్రీహీణాం మిత్రాయ సత్యాయాఽఽమ్బానాం చరుంవరుణాయధర్మపతయే యవమయంచరుగ్ం ౨ సవితా త్వా ప్రసవానాగ్ం సువతామగ్నిర్గృహపతీనాగ్ం సోమోవనస్పతీనాగ్ం రుద్రఃపశూనామ్ ॥

౧ గృహమునకుఁ బ్రభువగు నగ్నికొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. వనస్పతియగు సోమదేవతకొఱకు నల్లనివ్రీహులసంబంధమగు శ్యామాక (=చామలు) చరువునునిర్వా

పము చేయవలయును. అమోఘమయిన యనుజ్ఞకల సూర్యునికొఱకుఁ బంద్రెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. రెండుమాసములలో సిద్ధమగు వ్రీహుల (తోఁకలుగల్గి నల్లగానుండు ధాన్యము. నత్తికలనిపేరు) సంబంధమగు పురోడాశమును పశుపతియగు రుద్రునికొఱకు నిర్వాపము చేయవలయును. వాక్కునకుఁ బ్రభువగు బృహస్పతికొఱకు నీవారధాన్య (బీలధాన్యము అడవిలోఁబండినవి) సంబంధమగు చరువును నిర్వాపము చేయవలయును. గొప్పవాఁడగు నింద్రునికొఱకు బదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. స్థూలమగు బీజములుండు (మహా) వ్రీహుల (ముదుకధాన్యము) సంబంధమగు చరువును మిత్రదేవతకొఱకు నిర్వాపము చేయవలయును. అంబములను ధాన్యవిశేషసంబంధమగు చరువును సత్యదేవునికొఱకు నిర్వాపముచేయవలయును. ధర్మమునకుఁబ్రభువగు వరుణదేవునికొఱకు యవధాన్యవికారమగు చరువును నిర్వాపము చేయవలయును. ౨ ఈవాక్యార్థము ౨వపంచాశత్తుతోఁ జేర్చి వ్రాయఁబడును.

పంచాశత్తు ౨.

౩౧౬. ౧ బృహస్పతిర్వాచామిన్ద్రో జ్యేష్ఠానాం మిత్రః సత్యానాం వరుణో ధర్మ
పతీనాం యే దేవా దేవసువః స్థ త ఇమమాముష్యాయణమనమిత్రాయ సువ
ధ్వం మహతే క్షత్రాయ మహత ఆధిపత్యాయ మహతే జానరాజ్యాయై
౨ ష వో భరతా రాజా 3 సోమోఽస్మాకం బ్రాహ్మణానాగ్ం రాజా
౩ ప్రతిత్యన్నామ రాజ్యమధాయి స్వాం తనువం వరుణో అశిశ్రేచ్ఛుచేర్మి

ఋతస్యవ్రత్యా అభూమమామన్న హిమహాఋతస్యనామ సర్వేవ్రాతా వరుణ
స్యాభూమవివ్ మిత్రఏవైరరాతి మతారీదసూషుదన్త యజ్ఞియా ఋతే
నవ్యుత్రితో జరిమాణంన ఆనడ్వి ష్ణోః క్రమోఽసి విష్ణోః క్రాన్తమసి
విష్ణోర్విక్రాన్తమసి ॥ ౨॥

౧ (ఓ యజమానుఁడా !) సూర్యుఁడు నిన్ను (ఐశ్వర్యముకొఱకు) సమూజ్ఞల కు (స్వామినిగా) సంతతముఁ దెలుసుకొనుఁగాక. సోముఁడు (నిన్ను) వనస్పతులలో (స్వామినిగాఁ) దెలుసుకొనుఁగాక. రుద్రుఁడు (నిన్ను) పశువులకు (స్వామినిగా) దెలుసుకొనుఁగాక. బృహస్పతి (నిన్ను) వాక్కులకు (స్వామినిగాఁ) దెలుసుకొనుఁగాక. ఇంద్రుఁడు (నిన్ను) జ్యేష్ఠులలో (స్వామినిగాఁ) దెలుసుకొనుఁగాక. మిత్ర దేవుఁడు (నిన్ను) సత్యములకు (స్వామినిగాఁ) దెలుసుకొనుఁగాక. వరుణుఁడు(నిన్ను) ధర్మపతులలో (స్వామినిగాఁ) దెలుసుకొనుఁగాక. ఓ యగ్న్యాదిదేవతలారా! ఏ మీరు యజమానునకుఁ బ్రేరకులై యుండిరో ఆమీరీయజమానుని ఫలానావాని పుత్రునిగాను, ఈఫలానావాని పౌత్రునిగాను, శత్రురాహిత్యముకొఱకు, గొప్ప క్షత్రియకులముకొఱకు, గొప్పయాధిపత్యముకొఱకు, గొప్పదగు జనసంబంధియైన రాజ్యముకొఱకు అగునట్లూహింపుడు. (అట్టివానినిగాఁ జేయుఁడని తా॥) ౨ ఓ క్షత్రియ వైశ్యాదులారా! ఈయజమానుఁడు మీకురాజు. (ఈస్వామిని మీకుదగునట్లుగా సేవించుడనిభావము. 3 బ్రాహ్మణులమగు మాకు సోమదేవత రాజు. ౪ పూర్వము చెప్పఁబడిన- జానరాజ్యము (యజమానున కేవిధముగ నవ సరమగుచున్నదో ఆవిధముగా వరుణునిచే) బ్రతిష్ఠఁ జేయఁబడినది. వరుణుఁడు తనశరీరము నాశ్రయించెను. (ఇచ్చట వరుణ శబ్దముచే నగ్న్యాదిదేవతలుకూడ జెప్పఁబడుచున్నారు. అనగా యజమానునకు స్వామిత్వముసుఁ గలుగఁజేసినతమతమ శరీరముల నాశ్రయించినారని భావము.) మేముగూడఁబరిశుద్ధుఁడగు మిత్రదేవుని

యొక్క (యాజ్ఞచే) కర్మయోగ్యులమైతిమి కనుకనే యాజ్ఞాదులచే ననుజ్ఞం బొందఁబడిన మేము గొప్పయజ్ఞముయొక్క పేరును (రాజసూయమును జేసితిమను నామధేయమును) యెల్లప్పుడు తలచుచున్నాము. (మఱియు) ఋత్విక్కులందరు వరుణునియనుజ్ఞచే కర్మయోగ్యులైరి. మిత్రదేవుఁడున్ను ఆగమనములచే శత్రువును (మే మేవిధముగ శత్రువునతిక్రమించుదుమో! ఆవిధముగ) చేసెను. ఋత్విక్కులు యజ్ఞముచే రక్షింపఁబడిరి. బ్రాహ్మణాది వర్ణత్రయముచే విస్తరింపఁజేయఁబడినయగ్ని మాయొక్కముసలితనముచేనైన శైథిల్యమును (శరీరసంధులు సడలుట) విశేషముగాఁ బోగొట్టి యాయుస్సును కల్పించినాఁడు. ఈ మంత్రము వాజపేయమునందు రథసమీపగమన సందర్భములో వ్యాఖ్యానము చేయఁబడినది.

దశమానువాకము సమాప్తము.

— * —

## అనువాకము ౧౧.

3౧౭. అర్థేతః స్థాపాం పతిరసివృషాఽస్యూర్మిర్వృషసేనోఽసి వ్రజక్షితః స్థమరుతామోజః స్థసూర్యవర్చసః స్థసూర్యత్వచసః స్థమాన్దాః స్థవాశాః స్థశక్వరీః స్థవిశ్వభృతః స్థజనభృతః స్థాగ్నేస్తైజస్యాః స్థాపామోషధీనాగ్ంరసః స్థాపో దేవీర్మధుమతీరగృహ్ణ న్నూర్జస్వతీ రాజసూయాయ చితానాః। యాభిర్మిత్రావరుణా వభ్యషిఞ్చన్యాభిరిన్ద్ర మనయన్నత్యరాతీః। రాష్ట్రదాః స్థరాష్ట్రం దత్తస్వాహా రాష్ట్రదాః స్థరాష్ట్రమముష్మైదత్త॥

౧ (ఓ సరస్వతీనదీ సంబంధమగు నుదకములారా ! మీరు) ప్రయోజనము నుద్దేశించి యీ సరస్వతి నది సమీపము నుండి (యజ్ఞదేశముఁగూర్చి) వెళ్లుచున్న వారలగుదు. (ఓ సముద్రుఁడా ! నీవు) ఉదకములకుఁ బ్రభువగుచున్నావు (ఓ తరంగమా ! నీవు) తడుపుదానవగుచున్నావు. (ఓ తరంగమా ! నీవు) తడుపుటకు సమర్థమగు నుదకము కలదానవగుచున్నావు. (పురుషుఁడు కాని, పశువుకాని, నదినిదాటునపుడు పైభాగమునను, లోపలి భాగమునను, రెండలలు బయలుదేరును. ఆరెండలలు ఇచటఁ జెప్పఁబడినవి.) (ఓ బావియందలి యుదకములారా ! మీరు) గోవుల శాలవలె నివాసయోగ్యమగు కూప (=నూయి) స్థానమునందుంటున్నారు. (ఓ యుదకములారా ! మీరు) వాయువులయొక్క బలరూపములగుదు. (ఎండతోఁగూడుకొనిన వర్షసంబంధియగు నో యుదకములారా ! మీరు) సూర్యుఁడువలె వర్చస్సుకలవారగుదు. (ఓ సూర్యాది ప్రతిబింబమును గ్రహించు నుదకములారా ! మీరు) సూర్యుని యొక్క శరీరము ప్రతిబింబ రూపముగా కలవారగుదు. (ఓ స్థావరములగు నుదకములారా! గమనము లేకపోవుటచే) మందరూపులగుదు. (ఓ నీహారగతములగునుదకములారా! మీరు ) వశ్యులగుదు. (మంచు నదీప్రవాహమువలె మనుజగతిని బాధించదు కావుననిచట వశ్యత్వము (=లొంగుబాటు) వివక్షితమైనది (ఆవుయొక్క గర్భవేష్టనము (ఉల్బము) నందున్న యోయుదకములారా! మీరు ) గర్భరక్షణమునందు సమర్థులగుదు. ( ఓపాలయందుండు యుదకములారా! మీరు) ప్రపంచమును భరించువారలగుదు. (పాలచే ప్రాణిసముదాయము పోషింపఁబడుచున్నదని భావము ) ( ఓ పెరుగునందుండు యుదకములారా! మీరు ) జనులను భరించువారలగుదు. (నేతివలె ద్రవరూపములగు నోయుదకములారా! మీరు అగ్నియొక్క తేజస్సుతోనయిన వారలగుదు. ( మధుద్రవరూపులగు నోయుదకములారా! మీరు ) ఓషధులయొక్క రసములగుదు. రాజసూయము కొఱకు విచారించుచున్న ఋత్విక్కులు ప్రకాశించుచున్నట్టియు, మధురము లయినట్టియు నుదకములను గ్రహించిరి ఏయుదకములచే దేవతలు (పూర్వము) మిత్రావరుణదేవతల నభిషేకముచేసిరో, ఏయుదకములచే శత్రువుల నతిక్రమించి యింద్రునిఁ బొందిరో (అటువంటి యుదకములను గ్రహించిరని వెనుక కన్వయము ) (ఓయు

దకములారా! మీరు ) రాష్ట్రము నిచ్చువారలగుచున్నారు. ( కావున యజమానునికొఱకు రాష్ట్రము నొసంగుడు. ( మీరాకొఱకు బాగుగా హోమముచేయఁబడినవి. ( ఓయుదకములారా! మీరు ) రాష్ట్రము నిచ్చువారలగుచున్నారు. (కావున నీ రాము, యుధిష్ఠిరాది వర్మలకొఱకు రాష్ట్రము ) నొసంగుడు. (మూలములో లేని రాము, యుధిష్ఠిర అనుపేరులు భాష్యకారుఁడు వ్రాసినవి )

ఏకాదశానువాకము సమాప్తము.



## అనువాకము. ౧౨.

3.౧౮. ౧ దేవీరాపః సం మధుమతీర్మధుమతీభిః సృజ్యధ్వం మహి వర్చః క్షత్త్రి
యాయ వన్వానా ౨ అనాధృష్టాః సీదతోర్జస్వతీర్మహి వర్చః క్షత్త్రియాయ
దధతీర ౩ నిభృష్టమసి వాచో బన్ధుస్తపోజాః సోమస్య దాత్రమసి ౪ శుక్రా
వః శుక్రేణోత్పునామి చన్ద్రాశ్చన్ద్రేణామృతా అమృతేన స్వాహా రాజసూ
యాయ చితానాః ౫ సధమాదో ద్యుమ్నినీరూర్జ ఏతా అనిభృష్టా అపస్యు
వో వసానాః పస్త్యాసు చక్రే వరుణః సధస్థమపాగ్ం శిశుః ॥౧॥

౧ ఓయుదకములారా! దేవతాహ్వానశక్తియు, ననేకపాత్రలందు గ్రహింపఁబడినమీరు రాజుకొఱకు గొప్పతేజస్సును సంపాదించుచున్న వారలగుచు మ

స్వరము కలిసికొనును. ౨ ఓ యుదకములారా! (ఎవరిచేత) తిరస్కరింపఁబడని వారలు, జలముకలవారునై రాజులకు తేజస్సును సంపాదించుచున్న వారలగుచు నుండుడు. 3 (ఓబంగారమా! నీవు) (వహ్నిసంయోగమునందుఁగూడ) మిక్కిలికాచఁబడిన దానవగుటలేదు. (మరియు) వాక్కునకు బంధువగుచున్నావు. (బంగారము కలిగియుండుటచేతనే రాజామాత్యాదులవాక్కు సర్వులచే నాదరింపబడుచున్నదని భావము) సంతాపముకల యగ్నినుండి పుట్టినదానవగుచున్నావు. సోమమును (కొనుటకొఱకు) నీవివ్వఁబడితివి. ౪ ఓయుదకములారా! దీప్తిమంతములగు మిమ్ము దీప్తిమంతమగు బంగారముచేతను, నాహ్లాదకరములగుమిమ్ము నాహ్లాదకరుఁడగు చంద్రునిచేతను, నమృతమయములగు మిమ్ము నమృతముచేతను, స్వాహాకారముచే నంపాదింపఁబడిన హోమముతోఁ గూడుకొనిన రాజసూయ యాగముకొఱకు సంపాదింపఁ బడిన మిమ్ముఁ బవిత్రము చేయుచున్నాను. ౫ తల్లులుగానున్న తమకుఁబుత్ర సమానుఁడగు వరుణునకు నివాసములైనవి. తమలోనున్న వరుణునితోఁ గూడి యతనిని సంతోషపఱచు చున్నవి. ప్రకాశవన్తములు, ధనవంతములు నగుచు ఫలమును గలిగించునవి, (ధాన్యాదులవలె) వేఁపుటకుపయోగింపనివి, యగు నుదకములం గప్పుకొనుచు వరుణుఁడందు నివసించెను.

పంచాశత్తు ౨.

3౧౫. మాతృతమాస్వన్తః ౧ క్షత్రస్యోల్బమసి క్షత్రస్య యోనిరస్యా ౨

విన్నో అగ్నిర్గృహపతిరా విన్న ఇన్ద్రో వృద్ధశ్రవా అవిన్నః పూషా విశ్వవేదా

అవిన్నౌ మిత్రావరుణా వృతావృధావా విన్నే ద్యావాపృథివీ ధృతవ్రతే ఆవి

న్నా దేవ్యదితిర్విశ్వరూప్యా విన్నోZ యమసావా ముష్యాయణోZస్యాం విశ్య

స్మిన్రాష్ట్రే మహతే క్షత్రాయ మహత ఆధిపత్యాయ మహతే జానరాజ్యాయై

౪ ఏష వో భరతా రాజా సోమోఽస్మాకం బ్రాహ్మణానాగ్ం రాజా ౪ ప్రతిస్థ

౧. ఈ మంత్రము వాజపేయ ప్రకరణమునందు వ్యాఖ్యాతమైనది. ౨. అగ్ని (ఈకర్మచే) గృహపతిత్వమునుఁ బొందెను ఇంద్రుఁడు గొప్ప కీర్తినిఁ బొందెను పూషదేవత విజ్ఞానమునుఁ బొందెను. మిత్రావరుణదేవతలు సత్యవచనవృత్తినిఁ బొందిరి. ద్యావాభూములు నియమముగా సర్వస్వవ్యాపారరూపమగు వ్రతధారణమునుఁ బొందినవి. అదితి యగు దేవమాత సర్వదేవ శరీరములతోఁ గూడుకొని యుండుటనుఁ బొందెను. (దేవతారూపులగు ననేక పుత్రులను కనెనని భావము) ఈ యెదుటనున్న ఫలానా రాజకొడుకు - ఫలానారాజు మనుమఁడు నగు యజమానుఁడు యీ జనమునందు, ఈ రాష్ట్రము నందును, గొప్ప క్షత్రియ కులము కొఱకు, గొప్ప యాధిపత్యము కొఱకు, గొప్ప సార్వభౌమత్వము కొఱకును, సమర్థుఁ డగుటకుఁ బూర్వోక్త గుణములఁ బొందెను. ౩. ఈ మంత్రము వ్యాఖ్యాతమైనది. ౪. ఈ వాక్యార్థము 3 వ పంచాశత్తుతోఁ జేర్చి వ్యాఖ్యానము చేయఁబడును.

పంచాశత్తు 3.

3 ౨౦, ౧ వజ్రోఽసి వార్త్రఘ్నస్త్వయాఽయం వృత్రం వధ్యాచ్ఛ ౨ త్రుబాధ
నాః స్థ 3 పాతమా ప్రత్యఞ్చం పాతమా తిర్యఞ్చమన్వఞ్చం మా పాత
దిగ్భ్యో మా పాత విశ్వాభ్యో మా నాష్ట్రాభ్యః పాత ౪ హిరణ్యవర్ణా
వుషసాం విరోకేఽయః స్థూణావుదితౌ సూర్యస్యాఽఽరోహతం వరుణ
మిత్ర గర్తం తతశ్చక్షాథామదితిం దితించ॥

౧. (ఓ ధనస్సా! నీవు) ఇంద్రుని యొక్క వజ్రమువలె కొట్టుటకు సాధనమగుచున్నావు. (కావున) నీ యజమానుఁడు శత్రువునుఁ జంపుఁగాక. ౨. (ఓ బాణములారా! మీరు) శత్రువులకు బాధకులుకండు. ౩. ఎదుటనుండి బాణమును శత్రువు విడుచునపుడు కొట్టబడుచున్న యోధుఁడు బాణమునకుఁ బ్రత్యక్కుగా (ఎదుటగా) నుండును. ప్రక్కనుండి బాణమును విడుచునపుడు తిర్యక్కుగానుండును. వెనుకనుండి బాణమును విడుచునపుడు అన్వక్కుగా (ముందుగా) నుండును. (నా సంబంధములగు బాణములారా!) ప్రత్యక్కుగా నున్న నన్ను రక్షించుడు. తిర్యక్కుగానున్న నన్ను రక్షించుడు. అన్వక్కుగా నున్న నన్ను రక్షించుడు. (నా హస్తమునఁదలి యో బాణములారా!) సర్వదిక్కులనుండి నన్ను రక్షించుడు. సమస్తములగు, నాశహేతువులగు, శత్రువులు సేయుబాధలనుండి నన్ను రక్షించుడు. ౪. ఓ శత్రునివారించు వామహస్తమా! ఓ శత్రువులంజంపు దక్షిణహస్తమా! బంగారు వర్ణము కలిగినట్టియు, లోహస్తంభమువలె మిక్కిలి దృఢములగు మీరు సూర్యుని యొక్క యుభయకాలమున తెల్లవాఱునపుడు రథముయొక్క పై భాగము నధిష్ఠింపుడు.

ద్వాదశానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౧౩.

౩.౨౧. ౧ సమిధమాతిష్ఠగాయత్రీ త్వాఛన్దసామవతుత్రివృ త్త్సోమోరథన్తరగ్ం

సామాగ్నిర్దేవతా బ్రహ్మద్రవిణమ్ ౨ ఉగ్రామాతిష్ఠత్రిష్టుప్ త్వా ఛన్దసా

మవతు పఞ్చదశస్తోమోబృహత్సామే న్ద్రోదేవతాక్షత్త్రం ద్రవిణం

౩ విరాజమాతిష్ఠజగతీత్వా ఛన్దసామవతు సప్తదశః స్తోమోవైరూపగ్ం సామమరుతోదేవతా విడ్ద్రవిణము ౪ ఉదీచీమాతిష్ఠానుష్టుప్త్వా॥

౧. తూర్పుదిక్కు నాక్రమించి యుండుము. (అటువంటి) నిన్ను ఛన్దస్సులలో గాయత్రి రక్షించుఁగాక. స్తోమములలో త్రివృత్స్తోమము (మువ్మూఁడావృత్తిచేసిన స్తుతిమంత్ర సమూహము) రక్షించుఁగాక. సామలలో రథన్తరసామ రక్షించుఁగాక. దేవతలలో నగ్నిదేవత రక్షించుఁగాక. బ్రాహ్మణుఁడు నీధనమును రక్షించుఁగాక. ౨. దక్షిణదిక్కు నాశ్రయించి యుండుము. (అట్టి నిన్ను) ఛన్దస్సులలో త్రిష్టుప్ ఛన్దస్సు రక్షించుఁగాక. (స్తోమములలో) పంచదశస్తోమము రక్షించుఁగాక. (సామములలో) బృహత్సామము రక్షించుఁగాక. (దేవతలలో) నింద్రుఁడు రక్షించుఁగాక. నీ ధనమును రక్షించుఁగాక. ౩. పడమరదిక్కు నాక్రమించి యుండుము. ఛన్దస్సులలో జగతీ ఛన్దస్సు నిన్ను రక్షించుఁగాక. (స్తోమములలో) సప్తదశ స్తోమము రక్షించుఁగాక. (సామములలో) వైరూపసామము రక్షించుఁగాక. (దేవతలలో) మరుద్దేవత రక్షించుఁగాక. నీ ధనమును వైశ్యుఁడు రక్షించుఁగాక. (వైరూపమని సామమునేరు.) ౪. ఈ వాక్యార్థము రెండవ పంచాశత్తుతోఁ జేర్చి వ్యాఖ్యానము చేయఁబడును.

పంచాశత్తు ౨

౩ ౨ ౨. ఛందసామవత్వేకవిగ్ంశః స్తోమోవైరాజగ్ం సామమిత్రావరుణౌదేవతా బలంద్రవిణము ౨ ఊర్ధ్వామాతిష్ఠపఙ్క్తిస్త్వాఛన్దసామవతు త్రిణవత్రయస్త్రిగ్ంశౌస్తోమౌశాక్వరరైవతే సామనీబృహస్పతిర్దేవతావర్చో ద్రవి

ణమిా ౩ దృక్చాన్యాదృఙ్ ఙ్సైతాదృఙ్ చప్రతిసృఙ్ చమితశ్చ సంమితశ్చసభరాః శుక్రజ్యోతిశ్చ చిత్రజ్యోతిశ్చ సత్యజ్యోతిశ్చజ్యోతి ష్మాగ్ంశ్చ సత్యశ్చర్తపాశ్చ॥

౧. ఉత్తరదిక్కు నాక్రమించియుందువు. (అటువంటి) నిన్ను ఛన్దస్సులలో ననుష్టుప్ ఛన్దస్సు రక్షించుగాక. (స్తోమములలో) నేకవిగ్ంశస్తోమము రక్షించుఁ గాక. (సామములలో) వైరాజసామ రక్షించుఁగాక. (దేవతలలో) మిత్రావరుణులు రక్షించుదురుగాక. (నీ) ధనమును బలము రక్షించుఁగాక. ౨. ఊర్ధ్వదిక్కు నాక్రమించియుందువు. (అటువంటి) నిన్ను ఛన్దస్సులలో పఙ్క్తిఛన్దస్సు రక్షించుఁ గాక. (స్తోమములలో) త్రిణవములను పేరుకల ముప్పదిమూడు స్తోమములు రక్షిం చుఁగాక. (సామలలో) శాక్వర, రైవత, సామలు రక్షించుఁగాక (దేవతలలో) బృహస్పతి దేవత రక్షించుఁగాక. (నీ) ధనమును వర్చస్సు రక్షించుగాక. ౩. ౧ ఈదృఙ్, ౨ అన్యాదృఙ్, ౩ ఏతాదృఙ్, ౪ ప్రతిదృఙ్, ౫ మితః, ౬ సంమితః, ౭ సభరాః, ౮ శుక్రజ్యోతిః, ౯ చిత్రజ్యోతిః, ౧౦ సత్యజ్యోతిః, ౧౧ జ్యోతి ష్మాన్, ౧౨ సత్యః, ౧౩ ఋతపాః, ౧౪ అత్యంహాః, ఈ పదములు మరుత్తులను తెలుపునవి. కపాలములను మరుత్తులనుగా భావనచేయుటచే నీ పదములు కపాల ములకుఁ గూడ వాచకము లగుచున్నవి. ఓ కపాలమా! నీవు "ఈదృఙ్" అను పేరుకలదాన వగుచున్నావు. మిగిలిన ౧౩ పదములకుఁ గూడ ఈ విధముగానే సం బోధనపూర్వకముగ నన్వయ మూహింపఁ దగినది.

పంచాశత్తు ౩.

౩౨. అత్యగ్ంహాః ౧ అగ్నయేస్వాహా సోమాయస్వాహా సవిత్రేస్వాహా సరస్వ త్యైస్వాహా పూష్ణేస్వాహా బృహస్పతయేస్వాహేన్ద్రాయ స్వాహాఘోషాయ

స్వాహా శ్లోకాయస్వాహాఽగ్ంశాయస్వాహా భగాయస్వాహా క్షేత్రస్య పతయే

స్వాహా పృథివ్యైస్వాహాఽన్తరిక్షాయస్వాహా దివేస్వాహా సూర్యాయస్వాహా

చన్ద్రమసేస్వాహా నక్షత్రేభ్యః స్వాహాఽద్భ్యః స్వాహౌషధీభ్యః స్వాహావనస్ప

తిభ్యఃస్వాహా చరాచరేభ్యఃస్వాహా పరిప్లవేభ్యఃస్వాహా సరీసృపేభ్యఃస్వాహా

౧. "అగ్నయే" ఇత్యాది చతుర్థ్యన్తపదము లాయా దేవతావిశేషములఁ దెలుపునవి. అగ్నిదేవతకొఱకు (ఈహవిస్సు) హుతమగుఁగాక. ఈ విధముగనే పై పదములకుఁ గూడ అర్థమని యెఱుంగవలయును. ఘోషాయ—శ్లోకాయ—అంశాయ—భగాయ—ఈ పదములు ఘోష—శ్లోక—అంశ—భగ—అను దేవతలను తెలుపునవి. క్షేత్రస్యపతయే = క్షేత్రస్వామికొఱకు, చన్ద్రమసే = చంద్రునికొఱకు, పరిప్లవేభ్యః = చంచలములయిన జంతువిశేషములకొఱకు సరీసృపేభ్యః= తేళ్లు మొదలగువాటి కొఱకు, మిగిలిన పదములు ప్రసిద్ధార్థకములు,

త్రయోదశానువాకము సమాప్తము.



అనువాకము. ౧౪.

౩౨౪. ౧ సోమస్యత్విషిరసి తవేవమేత్విషిర్భూయాద ౨ మృతమసిమృత్యోర్మాపాహి

౩ దిద్యోన్మాపాహ్య ౪ వేష్టాదస్త్రశూకా ౫ నిరస్తం నముచేఃశిరః సోమో

రాజావరుణోదేవా ధర్మసువశ్చయే తే తేవాచగ్ం సువన్తాం తే తేప్రాణగ్ం

సువన్నాం తే తేచక్షుః సువన్నాం తే తే శ్రోత్రగ్ంసువన్నాగ్ం ౭ సోమస్యత్వాద్యు
మ్నే నాభిషిఞ్చామ్యగ్నేః ॥౧॥

౧ (ఓ పెద్దపులిచర్మమా! నీవు) సోమమునకుఁ గాంతివగుచున్నావు. నీకువలె నాకుఁగూడఁ గాన్తి కలుగుఁగాక. ౨ (ఓహిరణ్యమా! నీవు) అమృతమగుచున్నావు. మృత్యువునుండి నన్ను రక్షింపుము. (అమృతము=మరణములేనిది.) ౩ (ఇచ్చట శిరస్సునందభిషేకజలముచే తమపుటకై యుంచఁబడిన బంగారుపాత్రను సంబోధించవలయును.) ప్రకాశస్వరూపమగు నోసువర్ణపాత్రా! (నీవు) నన్నురక్షింపుము. ౪ సర్పములు నశింపఁజేయఁబడినవి. ౫ నముచియను రాక్షసునియొక్క (తామ్రము=రాగిరూపమైన) శిరస్సువిడువఁబడుఁగాక. ౬ ఏసోముఁడురాజో! ఏవరుణుడురాజో! ఏఇతర దేవతలు ధర్మమును దెలుసుకొనుచున్నవారలై యుంటున్నారో! వారందరు నీయొక్కవాక్కును దెలిసికొందురుగాక. వారందరు నీయొక్కప్రాణమునుఁ దెలిసికొందురుగాక. వారందరు నీయొక్కదృష్టిఁ దెలిసికొందురుగాక, వారందరు నీయొక్క శ్రోత్రమునుఁ (చెవి) దెలిసికొందురుగాక. ౭ ఈవాక్యార్ధము రెండవపంచాశత్తుతోఁ జేర్చి వ్రాయఁబడును.

పంచాశత్తు. ౨

౩౨౫. తేజసాసూర్యస్యవర్చసే న్ద్రస్యేన్ద్రియేణ మిత్రావరుణయోర్వీర్యేణ మరుతామోజసా ౨ క్షత్రాణాం క్షత్రపతిరస్య ౩ అతిదివస్పాహి ౪ సమావవృత్రన్నధరాగుదీచీరహిం బుధ్నియమనుసంచరన్తీస్తాః పర్వతస్య వృషభస్య పృష్ఠేనావశ్చరన్తి స్వసిచఇయానాః ౫ రుద్రయత్తే క్రయీపరం

నామతస్మై హుతమసి యమేష్టమసి ౬ ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తువయగ్ం స్యామపతయో రయీణామ్॥

(ఓయజమానుడా!) నిన్ను సోమునియొక్క కాంతిచేతఁ దడుపు చున్నాను అగ్నియొక్క తేజస్సుచేఁదడుపుచున్నాను. సూర్యునియొక్క వర్చస్సుచేఁదడుపు-చున్నాను. ఇంద్రునియొక్క యింద్రియముచేఁదడుపు చున్నాను. మిత్రావరుణులయొక్క వీర్యముచేఁదడుపుచున్నాను. మరుద్దేవతలయొక్క యోజస్సుచేఁదడుపుచున్నాను. (ఓజస్సు=కాంతివిశేషము.) ౨ (ఓయజమానుడా! నీవు) క్షత్రియులకుఁ బ్రభువగుచున్నావు. (ఒకక్షత్రియునకుఁగాదు, సమస్తక్షత్రియులకుఁ బ్రభువగుచున్నావను నభిప్రాయము వ్యక్తమగుటకే "క్షత్ర" శబ్దమిచట ద్వియుక్తమైనది.) ౩ (ఓయజమానుఁడా!) ప్రకాశించుచున్న యితరరాజుల నతిక్రమించి (నీవేనమస్తభూమిని) పాలించుము. ౪ ఏయుదకములు (స్వల్పరూపముగా స్రవించుచున్నవై) అధోభాగమును పొందినవో! ఊర్ధ్వభాగమునుఁబొందినవో; శిరస్సుమొదలుపాదాగ్రపర్యన్తము సంచరించుచున్నవో; ఆయుదకములు పర్వతసమానమగు (వర్షించుటకు సమర్థమైన) మేఘముయొక్క పైభాగమున నదియందునావలువలె చరించుచున్నవి. ౫ ఓరుద్రుఁడా! నీయుత్కృష్టమగు (నమశ్శివాయ—పశుపతయే మొదలగుశ్రుతి ప్రసిద్ధమయిన) నామధేయము (జపించువారిని) వశముచేసుకొనుచున్నదో ఆనామమునకొఱకభిషేకముచేయగా మిగిలిన పాత్రయందలి జలము (హుతమగుఁగాక. అదియు యమునకిష్టమగుఁగాక. ౬ ఓప్రజాపతీ! (నీకంటె) నితరుఁడు పుట్టిన నీవిశ్వములనుఁ దిరస్కరించుటకు సమర్థుఁడుకాలేడు. (కావున) మేమేకోరికలనిచ్చుచున్నారమో! ఆఫలముమాకగుఁగాక. మేముధనములకుఁ బ్రభువులమగుదుముగాక.

చతుర్దశానువాకము సమాప్తము.

నందుగమనించునది, నుదకములందుపుట్టిన గుజ్జములతోఁగూడుకొనినది, గోశబ్ద వాచ్యమగు వజ్రమునుండిపుట్టినది, యజ్ఞముకొఱకుఁ బుట్టినది, రాళ్లతోసమానము లగుకాష్ఠములనుండి పుట్టినది, భూమినినలగకొట్టునట్టిదియగు రథమురాజసూయమను యజ్ఞమును సంపాదించుఁగాక.

పంచదశానువాకము సమాప్తము.



## అనువాకము ౧౬.

౩౬౮. ౧ మిత్రోఽసి వరుణోఽసి ౨ సమహంవిశ్వైర్దేవైః ౩ క్షత్రస్యనాభి రసి క్షత్రస్యయోనిరసి ౪ స్యోనామాసీద సుషదామాసీద మాత్వా హిగ్ంసీన్మామాహిగ్ంసీన్ని ౫ షసాదధృతవ్రతో వరుణః పస్త్యాస్వా సామ్రాజ్యాయసు క్రతుర్బ్ర ౬ హ్మా౩ న్త్వగ్ంరాజన్బ్రహ్మాఽసి సవితాఽ సిసత్యసవో బ్రహ్మన్త్వగ్ం రాజన్బ్రహ్మాఽసీన్ద్రోఽసిసత్యౌజాః ॥

౧ (ఓ దక్షిణబాహువా !) నీవు మిత్రుఁడవగుచున్నావు. (మిత్రునివలెభోజ నాదులందిష్టార్థమునుఁ బొందించుననిభావము.) (ఓవామహస్తమా ! నీవు) వరుణ స్వరూపమగుచున్నావు. (ఈశౌచాదులందనిష్ట నివారకమని భావము.) ౨ నేనుసర్వ దేవతలతోఁ గలిసికొందును ౩ (ఓ చర్మవస్త్రమా ! నీవు) రాజసూయయాజియగు యజ మానునికొఱకు బొడ్డువలె మధ్యస్థాన మగుచున్నావు. (ముఖ్యమనితా॥) అట్టియజ మానునకుఁ గారణమగుచున్నావు. ౪ (ఓ నాశరీరమా !) సుఖకరమగు నీయాసన మునుఁగూర్చి సమీపమునందున్న దానవగుము. సుఖముగాకూర్చొనుటకు యోగ్య

మగునాసనమునుఁ బొందుము. ఈ యాసనము నిన్నుహింసింపకుండుఁగాక. (శరీర స్వామివగు) నన్నుఁగూడ హింసింపకుండుఁగాక. ౫ ఈయజమానుఁడు స్వీకరింపఁబడిన యజ్ఞముఁకలవాఁడు, కష్టనివారకుఁడునై (ఆసనమునందుఁ గూర్చుండెను.) అనేకములగు శత్రుగృహములందు (వచ్చి) సామ్రాజ్యమునుఁ జేయుటకు శోభనసంకల్పముకలవాఁడ(గుఁగాక.) ౬ ఈ వాక్యార్థము రెండవ పంచాశత్తుతోఁజేర్చి వివరింపఁబడును.

## పంచాశత్తు ౨.

= ౨౯. బ్రహ్మా3న్త్వగ్ం రాజన్బ్రహ్మాఽసి మిత్రోఽసి సుశేవో బ్రహ్మా3న్త్వగ్ం రాజన్బ్రహ్మాఽసి వరుణోఽసి సత్యధర్మేన్ద్రస్య వజ్రోఽసి వార్త్రఘ్నస్తేన మేరధ్య 3 దిశోఽభ్యయగ్ం రాజాఽభూత్సుశ్లోకాగ్ం3 సుమఙ్గలాగ్ం3 సత్యరాజా3న్ ౫ అపాంనప్త్రే స్వాహోర్జోనప్త్రే స్వాహాఽగ్నయే గృహపతయే స్వాహా॥

౧ ఓరాజా! నీవేబ్రహ్మవగుచున్నావు. బ్రాహ్మణుఁడవగుచున్నావు. (ఏ కారణముచే నీవేబ్రాహ్మణధర్మములనుఁ బాలించుచున్నవాఁడవై మాకనుష్ఠానము కొఱకు) ననుజ్ఞనిచ్చువాఁడవగుచుంటివో! అమోఘమగు ననుజ్ఞకలవాఁడవు. (కావున బ్రాహ్మణవర్ణాశ్రమ ధర్మములు నీయాధీనమగుటచే నీవేబ్రహ్మవని భావము) (ఆ విధముగ) నోరాజా! నీవు పరమైశ్వర్యము కలవాఁడవగుచున్నావు. అమోఘమగు వీర్యముకలవాఁడవు. (ఆవిధముగనే) ఓరాజా! (శిష్టపరిపాలనముకై) మిత్రుఁడను దేవునిపేరుకలవాఁడవగుచున్నావు బాగుగ సేవించుటకు యోగ్యుఁడవగుచున్నావు. (ఆవిధముగనే) ఓరాజా! అనిష్టమును (=కష్టము.) బోగొట్టువాఁడవగుచున్నావు.

శాస్త్రీయమగు ధర్మముకలవాఁడవు. (లోకమునందేవిధముగ పురోహితాదులు శత్రురాష్ట్రములజయించి సింహాసనాధిష్ఠుఁడైనరాజును అనేకములైన యాశీస్సుల చేతను, స్తుతులచేతను, స్తోత్రముచేయుదురో ! ఆవిధముగనే యిచ్చటఁగూడ సేవోపచారము చేయఁబడుచున్నది. అని యెఱుంగవలయును ఈఆశీర్వాదరూపసేవచే బ్రాహ్మణులయందలి శాపానుగ్రహరూపసామర్థ్యము రాజునందు ప్రతిష్ఠాపితమయి యుండుఁనని తాత్పర్యము. ౨ ఓ "స్ఫ్య" అను నాయుధవిశేషమా ! (వజ్రముయొక్క తృతీయాంశమగుటచే) నీవింద్రునియొక్క వజ్రమవగుచున్నావు (ఏకారణము చే నీవు) విరోధులను నశింపఁజేయుదానవో ! ఆకారణముచే నాకార్యమును సాధింపుము. ౩ ఈయజమానుఁడు ఊర్ధ్వదిక్కుతోఁ గలిసినయైదుదిక్కులకు రాజాయెను. ౪ మంచిస్థితి గలిగినట్టి యోకోశాధ్యక్షా ! (ప్రజలయండి కప్పమును (పన్ను) గ్రహించుటయను) మంగళముఁ గలిగినట్టి యోభాగదుఘుడా ! సత్యమయిన యంతఃపురరక్షణమునకు స్వామివగు నోసత్యరాజా ! (మిమ్ముఁ బిలుచుచున్నాను.) (భాగదుఘః=ప్రజలనుండి పన్నును గ్రహించువాఁడు.) ౫ ఉదకములకు వినాశమునుఁ జేయని యగ్నికొఱకు హుతమగుఁగాక. వనములకు వినాశముచేయని యగ్నికొఱకు హుతమగుఁగాక. గృహపతియగు నగ్నికొఱకు హుతమగుఁగాక. (=హోమమొనర్పఁబడుఁగాక.)

షోడశానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౧౭.

౩౩౦. ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతిహిరణ్యం దక్షిణాసారస్వతం చరుంవత్సతరీదక్షిణా సావిత్రం ద్వాదశకపాలముపధ్వస్తోదక్షిణా పౌష్ణం చరుగ్ంశ్యామోదక్షిణా బార్హస్పత్యం చరుగ్ం శితిపృష్ఠోదక్షిణైంద్రమేకాదశకపాలమృ

వత్సోఽదక్షిణా వారుణం దశకపాలం మహానిరష్టోదక్షిణా సౌమ్యాంచరుం బభ్రుర్దక్షిణా త్వాష్ట్రమష్టాకపాలగ్ం శుంఠోఽదక్షిణా వైష్ణవం త్రికపాలం వామనోఽదక్షిణా।

౧ ఈవాక్యార్థము ప్ర౹ అనుగాన వివరింపఁబడినది. (శుంఠః= తెల్లనిశరీరము కలది. వత్సతరీ= పాలుత్రాగుటనుమానినదూడ. వామనః = పొట్టిది.)

సప్తదశానువాకము సమాప్తము.



అనువాకము. ౧౮.

౩౩౧. సద్యోదీక్షయన్తి సద్యః సోమం క్రీణన్తి ౨ పుణ్డరిస్రజాం ప్రయచ్ఛతి ౩ దశభిర్వత్సతరైః సోమం క్రీణాతి ౪ దశపేయోభవతి ౫ శతం బ్రాహ్మణాః పిబన్తి ౬ సప్తదశగ్ం స్తోత్రంభవతి ౭ ప్రాకాశావధ్వర్యవేదదాతి ౮ స్రజముద్గాత్రే ౯ రుక్మగ్ంహోత్రే ౧౦ అశ్వం ప్రస్తోతృప్రతిహర్తృభ్యాం ౧౧ ద్వాదశపష్ఠౌహీర్బ్రహ్మణే ౧౨ వశాంమైత్రావరుణాయ ౧౩ ఋషభం బ్రాహ్మణాచ్ఛగ్ంసినే ౧౪ వాససీనేష్టాపోతృభ్యాగ్ం ౧౫ స్థూరి యవాచితమచ్ఛావాకాయ ౧౬ అనడ్వాహమగ్నీధే ౧౭ భార్గవోహోతా

భవతి శ్రాయన్త్రీయం బ్రహ్మసామంభవతి వారవన్త్రీయమగ్నిష్టోమసామ

గ్ంసారస్వతీ రపోగృహ్ణాతి॥

౧ తత్కాలమునందు దీక్షనారంభించవలయును. ఆ దీక్షాదినమునందే సోమ మును గొనవలయును. ౨ (ద్వాదశ)పుండరీకములుకలమాలికనివ్వవలయును. (పుండరీకము = పద్మము) ౩ పాలునుడుచుటమానిన పదిదూడలచే సోమమును గొన వలయును ౪ పది నైకృతిచమసపాత్రలందు పానముచేయనగిన సోమరసముకల క్రతువు "దశపేయ" మగుచున్నది, లేక- ఒక్కొక్క పాత్రయందు పదిమందిబ్రాహ్మణులచేఁ బానముచేయఁదగిన సోమరసముకల క్రతువు "దశపేయ" మగుచున్నది. ౫ నూర్గురు బ్రాహ్మణులు సోమరసమును బానముచేయుచున్నారు. (అనగాఒక్కొక్క పాత్రయందు సోమరసమును బానముఁజేయగా, పదిపాత్రలందుకలసి నూర్గురు పానముచేయుచున్నారని భావము వ్యక్తమగుచున్నది.) ౬. (ఈ క్రతువునందేయేస్తోత్రముకలదో, అదియంతయు) సప్తదశస్తోమ మగుచున్నది. ౭ అధ్వర్యునికొఱకు సువర్ణదర్పణముల (బంగారపు అద్దములు) నివ్వవలయును. ౮ బంగారుమాలనుద్గాతకొఱకివ్వవలయును. ౯ బంగారుమాలను హోతకొఱకివ్వవలయును. ౧౦ ప్రస్తోత ప్రతిహర్తలకు గుఱ్ఱముల నివ్వవలయును. ప్రస్తోత-ప్రతిహర్త- వీరిద్దరు ఋత్విగ్విశేషులు.) ౧౧ పంన్రెండు లేతచూడావులను బ్రహ్మ(ఋత్విక్కు) కొఱకివ్వవలయును. ౧౨ మైత్రావరుణునికొఱకు వంధ్యయగు (=గొడ్డుది) గోవునివ్వవలయును. ౧౩ ఆబోతెద్దును "బ్రాహ్మణాచ్ఛంసి" యను ఋత్విక్కు కొఱకివ్వవలయును. ౧౪ నేష్ట- పోత- లను ఋత్విక్కులకొఱకు వస్త్రముల నివ్వవలయును. ౧౫ స్థూలమగు యవలతోనిండియున్న బండిని "అచ్ఛావాకుఁడ" ను ఋత్విక్కుకొఱకివ్వవలయును. ౧౬ ఎద్దును "ఆగ్నీధ్రు"ని కొఱకివ్వవలయును. ౧౭ ఇచట "భృగు"గోత్రోత్పన్నుఁడే హోతకావలయును. శ్రాయన్తీయమను బ్రహ్మసామయే కావలయును. "వారవన్తీయము"ను నగ్నిష్టోమసామకావలయును. సరస్వతీనదీగత

ములగు నుదకములనే గ్రహించవలయును. (హిరణ్యసామాన్యాదికము విధివిహితమగుచుండగా తద్విశేషములిచ్చుట విధింపఁబడుచున్నవి.)

అష్టాదశానువాకము సమాప్తము,

—* 0 *—

అనువాకము ౧౯.

౩౬౨. ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతి హిరణ్యం దక్షిణైన్ద్రమేకాదశకపాలమృషభో దక్షిణా వైశ్వదేవం చరుం పిశఙ్గీ పష్ఠౌహీ దక్షిణా మైత్రావరుణీమామిక్షాం వశా దక్షిణా బార్హస్పత్యం చరుం శితిపృష్ఠో దక్షిణాఽఽదిత్యాం మల్హాం గర్భిణీమాలభతే మారుతీం పృశ్నిం పష్ఠౌహీమ ౩ శ్విభ్యాం పూష్ణే పురోడాశం ద్వాదశకపాలం నిర్వపతి సరస్వతే సత్యవాచే చరుగ్ం సవిత్రే సత్యప్రసవాయ పురోడాశం ద్వాదశకపాలం తిసృధన్వగ్ం శుష్కదృతిర్దక్షిణా॥

౧ అగ్నిదేవతాకమగు నెనిమిదికపాలములయందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. హిరణ్యము దక్షిణ. ఇంద్రదేవతాకమగు పదునొకండు కపాలములయందు సంస్కృతమగు పురోడాశము నిర్వాపము చేయవలయును. ఎద్దు దక్షిణ. విశ్వదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. పచ్చని వర్ణముకల లేతచూడియావు దక్షిణ. మిత్రావరుణదేవతాకమగు నామిక్షను

నిర్వాపము చేయవలయును. వంధ్యయగుగోవు దక్షిణ. బృహస్పతి దేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. వెండిదక్షిణ. ౨ అదితిదేవతాకమయినట్టియు, గంతమునందు స్తనములుకల గర్భిణియగు మేక నాలంభనము చేయవలయును. మరుద్దేవతాకమయినట్టియు, తెల్లనివర్ణముకల లేతచూడియావు నాలంభనము చేయవలయును. (ఆలంభనము=మంత్రోచ్చారణ పూర్వకముగ చంపుట. 3 అశ్వినీదేవతల కొఱకును, బూషదేవతల కొఱకును, బండ్రెండు కపాలములయందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. సత్యమును జెప్పునట్టి, "సరస్వత్" అను పేరుకల దేవతకొఱకు జరువును నిర్వాపము చేయవలయును, అమోఘమగు ననుజ్ఞకల సవితృదేవతకొఱకు బండ్రెండు కపాలములయందు సంస్కృతమగు మూడుబాణములతోఁ గూడుకొనిన ధనస్సును నిర్వాపము చేయవలయును. శుష్కదృతి దక్షిణ. (శుష్కదృతి = మూడుబాణములతోఁ గూడిన ధనస్సుగల సంచికిఁ బేరు)

ఏకోనవింశానువాకము సమాప్తము.



అ ను వా క ము ౨౦.

33౬. ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతి సౌమ్యం చరుగం సావిత్రం ద్వాదశకపాలం బార్హస్పత్యం చరుం త్వాష్ట్రమష్టాకపాలం వైశ్వానరం ద్వాదశకపాలం దక్షిణో రథవాహనవాహో దక్షిణా సారస్వతం చరుం నిర్వపతి పౌష్ణం చరుం మైత్రం చరుం వారుణం చరుం క్షైత్రపత్యం చరుమాదిత్యం చరుముత్తరో రథవాహనవాహో దక్షిణా॥

౧ అగ్ని దేవతాకమగు ఎనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. సోమదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. సవితృదేవతాకమగు పండ్రెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. బృహస్పతి దేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. త్వష్టృదేవతాకమగు ఎనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. వైశ్వానర దేవతాకమగు పండ్రెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ఈయిష్టియందు రథమునకు వాహనమగునదియెద్దు దక్షిణ. సరస్వతీ దేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. పూష దేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. మిత్రదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. వరుణదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. క్షేత్రపతిదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. ఆదిత్యదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. పూర్వమువలె నీయుత్తరపక్షమునందుకూడ రథవాహనమైనయెద్దు దక్షిణ.

వింశానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౨౧.

౩౩౮. స్వాద్వీం త్వా స్వాదునా తీవ్రాం తీవ్రేణామృతామమృతేన సృజామి సగ్ం సోమేన
సోమోఽస్యశ్విభ్యాం పచ్యస్వ సరస్వత్యై పచ్యస్వేన్ద్రాయ సుత్రామ్ణే పచ్యస్వ
౨ పునాతు తే పరిస్రుతగ్ం సోమగ్ం సూర్యస్య దుహితా వారేణ శశ్వ
తా తనా వాయుః పూతః పవిత్రేణ ప్రత్యఙ్ సోమో అతిద్రుతః ఇన్ద్రస్య

యుజ్యః సఖా 3 కువిదఙ్గ యవమన్తో యవం చిద్యథా దాన్త్యనుపూర్వం వియూయ ఇహేహైషాం కృణుత భోజనాని॥

౧ (ఓసురా!) రుచికరమైననిన్ను రుచికరమగు సోమస్వరూపమయిన లేతగడ్డితో బాగుగాఁ గలుపుచున్నాను. తీక్ష్ణగంధముకల నిన్నుఁ దీక్ష్ణగంధముకల లేతగడ్డితో బాగుగఁగలుపుచున్నాను. అమృతమువలన (తృప్తిని కలిగించుచున్న) నిన్ను అమృతమువంటి లేతగడ్డితో బాగుగఁగలుపుచున్నాను. ( ఇటువంటి సోమాత్మకమగు లేతగడ్డితో గలియుటచే నీవు ) సోమమగుచున్నావు. ( ఇచట సోమ శబ్దము వ్రీహి, యవాద్యంకురమగు లేతగడ్డికే చెల్లుచున్నది. ) ( కావున ) నశ్వినీ దేవతలకొఱకు పచనమగుము. ( ఉడుకుము ) సరస్వతీదేవతకొఱకుఁ బచనమగుము. బాగుగ రక్షకుఁడగు నింద్రునికొఱకు వండఁబడుము. ౨ ( ఓ యింద్రుఁడా! ) నీకొఱకు సూర్యునియొక్క దుహితృస్థానీయమగు (కూతురు) కాంతి ద్రవించుచున్న సోమముగాఁజేయఁబడిన సురాద్రవ్యమును (కల్లు) శాశ్వతమైనదియు, విస్తీర్ణమయినదియునగు పవిత్రముచే శోధనచేయుఁగాక. పవిత్రముచే శుద్ధముగాఁ జేయఁబడినదియు, నింద్రునకు యోగ్యమిత్రమగు సోమము వాయువువలె (శీఘ్రగామియై) నధోవర్తియై స్రవించినదాయెను. 3 ( లోకమునందేవిధముగ) యవాది ధాన్యములుకల సేద్యగాండ్రు అనేకములయిన యవలు, గోధుమలు మొదలగు ధాన్యములను పరీక్షాపూర్వకముగ ( ఇది పండినది-ఇది పండలేదు అని ) వేఱుచేసి, కోయుచున్నారో ( అవిధముగ ) ఓ ప్రియులయిన యింద్రాదులారా! మీయాగ కర్తలు యాగమునఁబాకము చెడఁగొట్టరో (మిక్కిలి శ్రద్ధకలవారై యాగము చేయుచున్నారో ) ఈయాగకర్తలయొక్క హవీరూపమయిన భోజనములను జేయుఁడు. ( ఈయజమానుఁడు నాస్తికుఁడు, ఈతఁడు శ్రద్ధకలవాఁడు అని సేద్యగాండ్రవలె పరీక్షఁజేసి శ్రద్ధాళువయిన యజమానునియొక్క హవిస్సును భుజింపుడు. అనిభావము )

పంచాశత్తు ౨.

౩౩౫. యేబర్హిషోనమోవృక్తిం నజగ్ముః ౧ ఆశ్వినంధూమ్రమాలభతే సారస్వతం మేషమైన్ద్రమృషభమై ౨ న్ద్రమేకాదశకపాలం నిర్వపతిసావిత్రం ద్వాదశకపాలం వారుణం దశకపాలగ్ం సోమప్రతీకాః పితరస్తృప్ణుత ౩ వడబాదక్షిణా॥

౧ అశ్వినీదేవతాకమగు ధూమ్రమును (=అదొకజంతువు) ఆలంభనము చేయవలయును. సరస్వతీదేవతాకమగు మేక నాలంభనము చేయవలయును. ఇంద్ర దేవతాకమగు నెద్దునాలంభనము చేయవలయును. ౨ ఇంద్రదేవతాకమగు బదునొ కండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. సవితృదేవతాకమగు బండ్రెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. వరుణదేవతాకమగు పది కపాలములందు సంస్కృత మగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. సోమప్రముఖులగు పితరులు తృప్తినిఁ బొందుదురుగాక. ౩ ఆడుగుఱ్ఱము దక్షిణ.

ఏకవింశానువాకము సమాప్తము.

—*—

అనువాకము ౨౨.

౩౩౬. అగ్నావిష్ణూమహితద్వాం మహిత్వం వీతం ఘృతస్యగుహ్యానినామ। దమేదమే సప్తరత్నాదధానా ప్రతివాం జిహ్వాఘృతమాచరణ్యేత్ ౧ అగ్నా

విష్ణూమహిధా ప్రియం వాం వీథోఘృతస్య గుహ్యాజుషాణా దమేదమే

సుష్టుతీర్వావృధానా ప్రతివాం జిహ్వాఘృతముచ్చరణ్యేత్ ౩ ప్రణోదేవీ

సరస్వతీ వాజేభిర్వాజినీవతీ ధీనామవిత్ర్యవతు ౪ ఆనోదివోబృహతః॥

౧ ఓ యజ్ఞవిష్ణుదేవతలారా ! మీయొక్క (చెప్పఁబడఁబోవు) మహిమకలిగియుండుట పూజనీయమైనది. ఆజ్యముయొక్క పేళ్లు (ఆజ్యం- పృషదాజ్యం- సర్పిరిత్యాదులు మంత్రములందు) గోప్యములో ! (=రక్షింపఁదగినవో) (సమస్తయజమానులయొక్క ప్రతిగృహమునందా పేళ్లనువినుడు (మరియు) ఏడురత్న సమానములగు జ్వాలావిశేషములను ధరించుచున్నట్టి మీయొక్క నాలుక ప్రత్యేకముగ నేతినిఁబొంది, భక్షించుఁగాక. ౨ ఓ యజ్ఞవిష్ణుదేవతలారా ! మీయొక్కప్రియమగు యజ్ఞశాలాహవస్థానము పూజనీయము. సమస్తయజమానగృహములందు "ఆయుర్దాఅగ్నే" ఇత్యాదిస్తోత్రములను వృద్ధిఁజేయుచున్నమీరు నేతియొక్కయోగ్యమగు సభిఘారశక్తిగలవారయి పురోడాశమును భక్షించుఁడు. మీయొక్కనాలుక ప్రత్యేకముగ నేతిని భక్షించుఁగాక ౩ అన్నమునిచ్చు యాగక్రియ కలిగినట్టియు, యజ్ఞవిషయములగు బుద్ధులనుఁ బాలించునట్టి సరస్వతీదేవి యన్నములచే మమ్ములనుగొప్పగా రక్షించుఁగాక. ౪ ఈ వాక్యార్థము రెండవ పంచాశత్తుతోఁజేర్చి వివరింపబడును.

పంచాశత్తు ౨.

౩౩౭. పర్వతాదాసరస్వతీ యజతాగన్తుయజ్ఞమ్ హవందేవీజుజుషాణా ఘృతాచీ

శగ్మాం నోవాచముశతీ శృణోతు ౨ బృహస్పతే జుషస్వనోహవ్యాని

విశ్వదేవ్య రాస్వరత్నానిదాశుషే ౩ ఏవాపిత్రే విశ్వదేవాయవృష్ణే

యజ్ఞస్త్వాదేవసాహవిర్భిః బృహస్పతే సుప్రజావీరవన్తోవయగ్ం స్యామ పతయోరయీణామ్ ౮ బృహస్పతే అతియదర్యో అర్హా ద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు యద్దీదయచ్ఛవసా । ౨

౧ మీయాహ్వానమును సేవించుచున్నట్టియు, నాజ్యమును (=నేతిని) పొందుచున్నట్టి యాగము చేయందగిన సరస్వతీదేవి మాయొక్క యజ్ఞమునుఁగూర్చి స్వర్గమునుండి వచ్చుఁగాక. ఈ వచ్చుచున్న సరస్వతీదేవి సుఖమునుఁబొందించు మాయొక్క స్తుతిరూపమగువాక్కును కోరుచువినుఁగాక. ౨ సమస్తదేవతలకు హితుఁడవగు నో బృహస్పతీ! మాయొక్క హవ్యములను భక్షింపుము. హవిస్సునిచ్చు యజమానుని కొఱకు రత్నములనిమ్ము. ౩ మఱియు, నో బృహస్పతీ! తండ్రివలె రక్షకుఁడవైనట్టియు, సర్వదేవతలకు గురువైనట్టియు, నభిమతఫలము నిచ్చునట్టి నీకొఱకు బహువిధయాగముల చేతను, భక్తిపూర్వక నమస్కారముల చేతను, నాజ్య, పురోడాశాది హవిస్సుల చేతనుఁ బరిచర్యఁ జేయుదుము. (నీయనుగ్రహమువలన) మేము మంచి సంతానముతోఁ గూడుకొనిన వారమును, శూరులగు భటులతోఁ గూడుకొనిన వారమును, ధనములకధిపతులమును, కాగలము, ౮ ఓబృహస్పతీ! రాజు ఏ రత్నాదిధనము నితరులకంటె నధికముగా స్వయముగ ననుభవించుటకుఁ దగుచున్నాఁడో! ఏ ధనము మంత్రిమొదలగు జనులందు భూషణములుకలదిగా ప్రకాశించుచున్నదో! ఏ ధనము యజమానరూపజనులందు యాగసాధనమయి ప్రకాశించుచున్నదో! ఏ ధనము (సైన్యరూప) బలము చేఁ బ్రకాశించుచున్నదో! పరమాత్మనుండి దేవగురువుగాఁ బుట్టిన యో బృహస్పతీ! అటువంటి మణి, ముక్తాదిరూపధనమును మాయందు స్థాపించుము.

### పంచాశత్తు ౩.

౩౩౮. ఋతప్రజాతతేదస్మాసు ద్రవిణం ధేహిచిత్రమ్ ౧ అనోమిత్రావరుణా

ఘృతైర్గవ్యూతిముక్షతమ్ మధ్వారజాగ్ంసి సుక్రతూ ౨ ప్రబాహవాసి
సృతం జీవసేనఆనో గవ్యూతిముక్షతం ఘృతేన ఆనోజనే శ్రవయతం
యువానాశ్రుతం మేమిత్రావరుణాహవేమా ౩ అగ్నిం వః పూర్వ్యం గి
రాదేవమీడేవసూనామ్ సపర్యన్తః పురుప్రియం మిత్రం నక్షేత్రసాధసమ్
౪ మక్షూదేవవతోరథః॥

౧ ఓ మిత్రావరుణులారా ! మాయావులమందలను నేతులతో నంతటనుఁ దడుపుడు. శోభనక్రతువులతోఁ గూడుకొనిన మిత్రావరుణులారా! మా క్షేత్రపాంసువులను (=రేణువు) జలముచేఁ దడుపుడు. ౨ ఓమిత్రావరుణులారా! మాయొక్క జీవనముకొఱకు ధనపూర్ణమైన బాహువులు కలిగిరండు. (వచ్చియు) మాయొక్క గోసముదాయము నేతిలోఁ దడుపుడు. పరస్పరముకలసికొనిన మీరు బ్రాహ్మణాది యజమాన సభయందు మమ్ముఁ బ్రఖ్యాతినిఁ బొందించుడు. నాయొక్క యాహ్వాన మువినుఁడు. ౩ వసువులగు వీరాలో మొదటివాఁడగునట్టియు, తండ్రి, యన్న మొదలగు మిత్రులవలె మాపాలముచు సాధించునట్టియగ్నిని, యాగసమాప్తి పర్యన్తముండునట్టి నేను వైదికవాక్కుచే స్తోత్రముచేయుచున్నాను. ౪ ఈ వాక్యార్థము నాల్గవ పంచాశత్తుతోఁ జేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు ౪.

౩౩౯. శూరోవావృత్సుకాసుచిత్ దేవానాం యఇన్మనోయజమాన ఇయక్షత్య
భీదయజ్వనోభువత్ ౨ నయజమానరిష్యసి నసున్వానన దేవయో ౩ అసద

త్రసువీర్యముతత్యదాశ్వశ్వియమ్ ౪ నకిష్టం కర్మణా నశన్నప్రయోషన్న యోషతి ౫ ఉపక్షరన్తి సిన్ధవోమయోభువ ఈజానం చయక్ష్యమాణం చధేనవః పృణన్తం చపపురించ।

౧ ( అత్యంతము పట్టుదలతో ప్రారంభింపబడిన ) కొన్నియుద్ధములందు శూరుఁడగు భటుఁడువలె యక్ష్యమాణ ( ఇకముందు యాగము చేయఁబడు ) దేవతతోఁగూడుకొనిన యజమానునియొక్క రథము శీఘ్రముగా వెళ్లుచున్నది. (అనగా యోధుఁడు యుద్ధమునకుఁ బట్టుదలతో బోవునట్లు యాగకర్త మనస్సు దేవతల యొద్దకుఁబోవుచున్నదని తా॥ ) ఏ యజమానుఁడు దేవతలయొక్క మనస్సునుఁ బూజించుటకుఁ గోరుచున్నాఁడో ( దేవతల మనఃప్రసాదమునుఁ గోరుచున్నాఁడో ) ఆయజమానుఁడీ యాగరహితులగు పురుషులనుఁ దిరస్కరించుచున్నాఁడు.

౨ ఓ యజమానుఁడా ! ( నీవుయాగమునుఁజేసి ) నశించుటలేదు ఓ సోమయాజీ! నీవు నశించుటలేదు. పాకయజ్ఞాదులచే దేవతలనుఁగోరునట్టి యోపాకయాజీ ! నీవు నశించుటలేదు. ( వెనుక మంత్రమునందలి యుత్తరార్ధమిచ్చట యోజన చేసికొనవలయును.) ౩ ఈ యజమానునియందు శోభనమగు సామర్థ్యముకలుగఁగలదు. ఏది శీఘ్రగాములగు గుఱ్ఱముల సంబంధమగు శోభనవీర్యమో, అదియు కలుగుఁగాక. ౪ ఆయజమానుని ( రాక్షసాదికము ) నాశనము జేయకుండుఁగాక. (య విరోధియగు )యజమానునితో రవంతయుం జెందకుండుఁగాక. ( యజమానుఁడు కూడ పాపముతో ) కలిసికొనకుండుఁగాక. ౫ నదీసమానములయినట్టియు, సుఖమునుఁ గలుగఁజేయునట్టియావులు యాగముఁ జేసినవానిని, యాగముఁజేయఁబోవు వానిని జేరి పాలనుస్రవించుచున్నవి. ( ఇచ్చుచున్నవి ) ( ఈకర్మయందుజుహూవును) పూరించునట్టియు ( హవిస్సుకల కర్మలందు ) పూరింపఁబోవునట్టి యజమానుని వినుటకుఁగోరుచున్నవివలె నాజ్యముయొక్క ధారలంతటను సమీపమునకుఁ బోవుచున్నవి.

పంచాశత్తు ౫౫.

౩౮౦. శ్రవస్యవోఘృతస్యధారా ఉపయన్తి విశ్వతః ౧ సోమారుద్రావివృహతం విషూచీమమీవాయానోగయమావివేశ| ఆరేబాధేథాం నిరృతిం పరాచైః కృతం చిదేనః ప్రముముక్తమస్మత్ ౨ సోమారుద్రాయువమేతాన్యస్మే విశ్వాతనూషుభేషజానిధత్తం అవస్యతం ముఞ్చతం యన్నోఅస్తి తనూషుబద్ధం కృతమేనో అస్మత్ ౩ సోమాపూషణా జననారయీణాం జననాదివో జననాపృథివ్యాః జాతౌవిశ్వస్యభువనస్య గోపౌదేవాఅకృణ్వన్నమృతస్యనాభిమ్ ఇమౌదేవౌజాయమానౌజుషన్తే మౌతమాగ్ంసి గూహతామజుష్టా ఆభ్యామిన్ద్రః పక్వమామాస్వన్తః సోమాపూషభ్యాం జనదుస్రియాసు॥

౧ ఏరోగరూపమగు నిర్ఋతిమీయొక్క గృహమును ప్రవేశించెనో! ఓ సోమరుద్రులారా! ఆ నిర్ఋతిని వంకరనడక గలవానినిగాను, (నానాదిక్కులందే విధముగ పరుగిడునో, ఆ విధముగ) విశేషముగఁ బోగొట్టుడు. పరాఙ్ముఖుఁడగు నా నిర్ఋతిని దూరమునందుమీరు బాధించుడు. ఆ నిర్ఋతిచే మావిషయమై చేయఁబడిన రోగరూపపాపమునుఁగూడ మానుండి బోగొట్టుడు. (నిఋర్తి = దుష్కర్మ) ౨ ఓ సోమరుద్రులారా! మీరిద్దరు మాయొక్క శరీరములందు సమస్తములగు నౌషధముల స్థాపించుడు. ఆయౌషధములచే ననిష్టమును నశింపఁజేయుఁడు. నిర్ఋతిచే చేయఁబడినట్టియు, మాయొక్క శరీరములందు బద్ధమైన యేపాపమొకలదో!

దానిని మానుండి బోఁగొట్టుఁడు. 3 ఓ సోమపూషదేవతలారా ! ధనములనుఁబుట్టించునట్టియు, స్వర్గమునుఁబుట్టించునట్టియు, భూమినిఁ బుట్టించునట్టియు , సర్వప్రపంచమునుఁ బుట్టించునట్టియు, సర్వప్రపంచమునకు రక్షకులగునట్టిమీరు దేవతలైకర్మఫలములను ఇవ్వకే నిలిపిరి. ౪ (సర్వదేవతలు) పుట్టుచున్న నీ సోమపూష దేవతలను సేవించుచున్నారు. ఈ సోమపూషదేవతలు అనిష్టములైన బుద్ధిమాద్యములను నశింపఁజేతురుగాత. ఇన్ద్రుఁడీ సోమపూషదేవతలవలన తరుణవచున్నుగల యావులందు పాలనుఁబుట్టించుచున్నాఁడు. (గోవులు బలముగలభూమియందు సోముని చేవృద్ధినొందింపఁబడిన నోషధులనుఁదిని యధికమైనవెన్నతోఁ గూడికొనిన పాలను ధరించుచున్నవని తా॥) సోముఁడు=చంద్రుఁడు, పూషదేవుఁడు = సూర్యుఁడు.)

ఇట్లు కృష్ణయజుర్వేదీయతైత్తిరీయ సంహితయందుఁ బ్రథమాష్టకము ముగిసినది.

శ్రీ శ్రీ శ్రీ

—*0*—

## ద్వితీయాష్టకము

### అనువాకము ౧.

౩౪౧. వాయవ్యగ్ం శ్వేతమాలభేతభూతికామో వాయుర్వై క్షేపిష్ఠా దేవతా
వాయుమేవస్వేనభాగధేయేనోపధావతి సఏవైనం భూతిం గమయతిభవత్యే
వా౭తిక్షిప్రాదేవతే త్యాహుః సైనమీశ్వరాప్రదహ ఇత్యేతమే వస
స్తం వాయవేనియుత్వత ఆలభేతనియుద్వాఅస్యధృతి ర్ధృతఏవభూతిమ్ముపై
త్యప్రదాహాయభవత్యేవ।

౧ ఐశ్వర్యముఁగోరు పురుషుఁడు వాయువు దేవతగాఁగల తెల్లని వర్ణముగల పశువును (బర్హిస్సు (దర్భ) మోదుగకొమ్మలచే యాగముకొఱకు)ఁ దాకవలయును. వాయువైతే శీఘ్రగామియగు దేవత. ఆ పురుషుఁడు (వాయువునకు)ఁ దానిచ్చిన హవిర్భాగముచే వాయువునే పొందుచున్నాఁడు. (సేవించుచున్నాఁడు) ఆవాయువు ఈ పురుషునైశ్వర్యముం బొందించును. (ఆ పురుషుఁడు) నిశ్చయముగ నైశ్వర్యమునుఁ బొందుచున్నాఁడు. (ఇచట శ్వేతవర్ణముగల పశువు వాయువునకత్యన్త ప్రియముగాన స్వకీయభాగముగ వర్ణింపఁ బడినది. ౨ పూర్వోక్తమైన వాయుదేవత మిక్కిలిశీఘ్రముగఁ (బని) చేయునదని (పండితులు) చెప్పుచున్నారు. ఆ యుగ్రమైన దేవత యీ యజమానుని దహించుటకుఁ గూడ సమర్థమైనదని (చెప్పుచున్నారు) అనగా వాయువు శీఘ్రముగావచ్చుచుండగ నగ్ని గృహములనుదహించునదికావున నగ్నిద్వారా వాయువునకు దాహకత్వము వర్ణించఁబడినది. అందులకై బాగుగా రథమునందు గూర్చిన గుఱ్ఱములుకల వాయువుకొఱకు శ్వేతపశువు నాలమ్భనము చేయవలయును.

(ఆ యశ్వజాతి "నియత్" అనుసంజ్ఞకలదై వాయువును ధరించుచున్నది. వాహనములగు గుఱ్ఱములు మెల్లగ నడచుచుండగ వాయువు శీఘ్రముగ నెల్లుటకు సమర్థము గాదు కావున) నీ వాయువుయొక్క ధారణము "నియత్" అను పేరుగలది. (అట్టి వాయువుకొఱకు హవిస్సు నిచ్చుటచే యజమానుఁడుకూడ) నశించనివాడగుచు నైశ్వర్యమునుఁ బొందుచున్నాఁడు. అట్టియైశ్వర్యము బాధలులేకుండ చేయుకొఱకే యగుచున్నది.

## పఞ్చాశత్తు ౨

౩౮ ౨. వాయవే నియుత్వత ఆలభేత గ్రామకామో వాయుర్వా ఇమాః ప్రజానస్యో

తా నేనీయతే వాయుమేవ నియుత్వన్తగ్ం స్వేన భాగధేయేనోపధావతి సఏ

వాస్మై ప్రజానస్యోతా నియచ్ఛతి గ్రామ్యేవ భవతి ౨ నియుత్వతే భవతి

ధృత్యా ఏవాస్మా అనపగాః కరోతి ౩ వాయవే నియుత్వత ఆలభేత ప్రజాకామః

ప్రాణో వై వాయురపానో నియుత్ప్రాణాపానౌ ఖలు వా ఏతస్య ప్రజాయాః

౧ గ్రామాధికారమునుఁగోరు పురుషుఁడు నియుత్వన్తుఁడగు వాయువుకొఱకుఁ బశువునాలంభనము చేయవలయును. (నాసికారన్ధ్రమునందు బన్ధనవిశేషముచే (ముకు-త్రాటిచే) బన్ధింపబడిన వృషభము యజమానునధీనమేవిధముగ నగుచున్నదో! ఆవిధముగ వాయువైతే ఈ ప్రజలను నాసికారన్ధ్రమునందు బంధింపఁబడిన వారలనుగాఁ జేయుచున్నాఁడు. (యజమానుఁడు) నియుత్వన్తుఁడగు వాయువునే తానిచ్చిన పురోడాశభాగముచేఁ బొందుచున్నాఁడు. ఆ వాయువీ యజమానుని కొఱకు నాసికారన్ధ్రమునందుబన్ధితులగు ప్రజలనిచ్చుచున్నాఁడు. (యజమానున కధీ

నులనుగఁ జేయుచున్నాఁడు.) (యజమానుఁడు) గ్రామస్వామి నిశ్చయముగ నగుచున్నాఁడు. ౨ నియుత్వదను గుణముగల వాయువుకొఱకుఁ బశువగుచున్న (దనుకేది కలదో దానిచే గ్రామస్థులందరిని వాయువు) ఈ యజమానునియం దనురాగముగల వారినిగఁ జేయుచున్నాఁడు. అనురాగములేని వారినిగఁ జేయుటలేదు. ౩ ఈ వాక్యమునకర్థము తరువాతి పంచాశత్తులోఁ దెలుపఁబడును.

## పంచాశత్తు ౩.

౩:౩. అపక్రామతో యోఽలం ప్రజాయై సన్ప్రజాం నవిన్దతే వాయుమేవ నియుత్వన్తగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మై ప్రాణాపానాభ్యాం ప్రజాం ప్రజనయతి విన్దతే ప్రజాం ౨ వాయవే నియుత్వత ఆలభేత జ్యోగామయావీ ప్రాణో వై వాయురపానో నియుత్ప్రాణాపానౌ ఖలువా ఏతస్మాదపక్రామతో యస్య జ్యోగామయతి వాయుమేవనియుత్వన్తగ్ం స్వేనభాగధేయేనోప॥

౧ సంతానముఁ గోరు పురుషుఁడు నియుత్వంతుఁడను వాయువుకొఱకుఁ బశువు నాలంభనము చేయవలయును ప్రాణము వాయువు. అపానము నియుత్తను శబ్దార్థము. ఏ పురుషుఁడు సంతానముకొఱకు సమర్థుఁడగుచు (ననుకూల స్త్రీయుక్తుఁడగుచు, యువకుఁడగుచును) సంతానమునుఁ బొందుటలేదో! ఈ పురుషుని సంబంధమగు సంతానముయొక్క సమీపమునుండి ప్రాణాపానములు తొలగిపోవును. (అనగా, సంతానలాభము లేకపోవుటచేఁ బురుషునిచే గర్భాశయమునందుఁ బ్రవేశపెట్టఁబడిన రేతస్సునందు నియుత్వంతుఁడగు వాయువుయొక్క యనుగ్రహము లేకపోవుటవలన ప్రాణాపానయుక్తమగు జీవాంతరము ప్రవేశించదని భావము.) (యజమానుఁడు)

నియుత్వంతుఁడగు వాయువును తానిచ్చిన పురోడాశభాగముచేఁ బొందుచున్నాడు. ఆ వాయువే యీయజమానుని కొఱకుఁ బ్రాణాపానములచే సంతానమునుఁ బుట్టింపఁజేయుచున్నాఁడు. (కావున యజమానుఁడు) సంతానమునుఁ బొందుచున్నాఁడు. ౨ దీర్ఘరోగియగు పురుషుఁడు నియుత్వంతుఁడగు వాయువుకొఱకుఁ బశువునాలంభనము చేయవలయును. ప్రాణమేవాయువు. అపానము నియుచ్ఛబ్దార్థము. ఏ పురుషునిఁ జాలకాలము రోగము బాధించుచున్నదో, ఈ పురుషునుండి ప్రాణాపానములు తొలగిపోవుటకు సిద్ధములగును. (పూర్వోక్తయజమానుఁడు) నియుత్వంతుఁడగు వాయువునే స్వకీయ (వాయు) భాగముచే పొందుచున్నాఁడు. ఆ వాయువే యీ యజమానునియందు ప్రాణాపానములను (చాలకాలము) స్థాపించుచున్నాఁడు ప్రాణముపోయిన వాఁడైనను (వాయువుయొక్క యనుగ్రహమువలన ప్రాణముకలవాఁడై) నిశ్చయముగ జీవించుచున్నాడు.

పంచాశత్తు ౪.

౩౪౪. ధావతి సఏవాస్మిన్ ప్రాణాపానౌదధాత్యుతయదీతా సుర్భవతిజీవత్యేవ ౨

ప్రజాపతిర్వాఇదమేకఆసీ త్సోఽకామయత ప్రజాః పశూన్త్సృజే యేతిసఆ

త్మనోవపాముదక్ఖిదత్తామగ్నౌ ప్రాగృహ్ణాత్తతోఽజస్తూపరః సమభవత్తగ్ం

స్వాయైదేవతాయాఆఽలభత తతోవైసప్రజాః పశూనసృజత ౩ యః

ప్రజాకామః॥

౧ ఈ వాక్యార్థము పై (౩వ) పంచాశత్తుతోఁ జేర్చి వివరింపఁబడినది. ౨ ఈ కనఁబడుచున్న ప్రజాపశురూపమగు ప్రపంచమేదికలదో ! ఈ సృష్టికిఁబూర్వము ప్రజాపతియొక్కఁడే యుండెను. అతను ప్రజలను, బుట్టించుదునని సంకల్పించెను.

ఆకోరికగల యజమానుఁడు లోనుండి (యీ ప్రజా, పశు, సృష్టిసాధనముగ వప్ర్రతు ల్యమగు) వపచుఁ బెళ్లగించెను. ఆవపనగ్నియందు హోమముచేసెను. ఆదగ్ధమైన వపనుండి కొమ్ములులేనిమేక పుట్టెను. ఆ మేకను తనయభీష్టదేవత కాలంభనము చేసెను. ఆ కర్మసామర్థ్యమువలన నాప్రజాపతి ప్రజలను, పశువులను, సృజించెను. 3 ఈ వాక్యార్థము ౫వ పంచాశత్తుతోఁ జేర్చివివరింపఁబడును.

## పంచాశత్తు ౫

3౮౫. పశుకామః స్యాత్సపతం ప్రాజాపత్యమజం తూపరమాలభేత ప్రజాపతిమే వస్వేసభాగధేయే నోపధావతి సఏవాస్మై ప్రజాం పశూన్ప్రజనయతి ౨ యచ్ఛ్మశ్రుణస్తత్పురుషాణాగ్ం రూపం యత్తూపరస్తదశ్వానాం యదన్య తో దన్తద్గవాం యదవ్యాఇవశఫాస్తదవీనాం యదజస్తదజానామేతావ న్తోవైగ్రామ్యాః పశవస్తాన్॥

౧ ఎవఁడు సంతానకాముఁడు, పశుకాముఁడునగునో ఆయజమానుఁడు ప్రజాపతిదేవతాకము, శృంగరహితమునగు మేక నాలంభనము చేయవలయును. (ఆయజమానుఁడు) స్వకీయ (ప్రజాపతి) భాగముచే ప్రజాపతినే పొందుచున్నాడు. ఆ ప్రజాపతియే ఈయజమానునికొఱకు సంతానమును, పశువులనుఁ బుట్టించు చున్నాడు. ౨ మీసములు కలిగియుండుట యేదికలదో అది పురుషులయొక్క రూపము. కొమ్ములులేకుండుట యేదికలదో అది గుఱ్ఱములరూపము. దిగువవరుసలనే దంతములుండుట యేదికలదో అది యావులయొక్క రూపము. గొఱ్ఱెలవలె గిట్ట లుండుట యేదికలదో అది గొఱ్ఱెలయొక్క రూపము. మేకజాతి యేదికలదో అది

మేకలయొక్క రూపము. ఇవియే గ్రామమునందుండు పశువులు. ఆ పురుషుఁడు మొదలగువాటిని వాటిరూపములోనే వాయువు (యజమానునికొఱకు) అధీనము చేయుచున్నాఁడు.

పంచాశత్ ౬.

౩౮౬. రూపేణైవావరున్ధే ౧ సోమాపౌష్ణం త్రైతమాలభేత పశుకామో ద్వే వా
అజాయై స్తనౌ నానైవ ద్వావభిజాయేతే ఊర్జం పుష్టిం తృతీయః సోమా
పూషణావేవ స్వేన భాగధేయేనోప ధావతి తావేవాస్మై పశూన్ప్రజనయతః
సోమో వై రేతోధాః పూషా పశూనాం ప్రజనయితా సోమ ఏవాస్మై రేతో
దధాతి పూషా పశూన్ప్రజనయత్యౌ దుమ్బరో యూపో భవ త్యూర్గ్వా ఉ
దుమ్బర ఊర్క్పశవ ఊర్జైవాస్మా ఊర్జం పశూనవరున్ధే।

౧ పశువులఁగోరు పురుషుఁడు సోమపూష దేవతలు దేవతగాఁగలిగినట్టియు (ఏకకాలమునందు పుట్టినట్టియు) మూఁడు దూడలలో నొకదాని నాలంభనము చేయవలయును. (మూఁడొకపర్యాయము పుట్టుటలోఁ బ్రయోజన మేమనగా) మేకకు స్తనములు రెండేకదా! ఆస్తనములను వేరుగఁ బానము సేయుటకు రెండు పుట్టుచున్నవి. (దానియొక్క) సారమును, పుష్టిని (ప్రకటించుటకయి) మూఁడవది పుట్టుచున్నది. (రెండుదూడలు పుట్టుట లోకసాధారణము. మూఁడవదెక్కడనో యొకచోటనే పుట్టుచున్నది దేనికి మూఁడవది పుట్టునో దానికి శరీరమునందు వీర్యాధిక్యము, నధికమగుపుష్టి యుండునని ఈ మంత్రమువలనఁ దెల్లమగుచున్నది. యజమానుడు సోమ, పూష దేవతలను వారికిఁ దానిచ్చుహవిర్భాగముచేఁ

బొందుచున్నాడు. ఆ దేవతాద్వయమిప్పు యజమానునికొఱకుఁ బశువులఁబుట్టించుచున్నది. సోమదేవత రేతస్సును ధరింపఁజేయునది. పూషదేవత పశువులఁబుట్టించునది. సోమదేవతయే ఈ యజమానునికయి రేతస్సును ధరింపఁజేయుచున్నది, పూషదేవత (భూమిరూపమగుటచే దనయోషధిబలముచే బోషించి) పశువులఁ బుట్టించుచున్నది. ౨ యూపస్తంభము మోదుగసంబంధమైనది గావలయును. మోదుగచెట్టు ఫలముద్వారా సారముకలది. పశువులుకూడ క్షీరముద్వారా సారముగలవి. (కావున వాయువు) మోదుగరూపమగు సారముచే సారరూపములగు పశువులను (యజమానునికొఱకు) సంపాదించుచున్నాడు.

## అనువాకము ౨.

౩౪౭. ప్రజాపతిః ప్రజా అసృజత తా అస్మాత్సృష్టాః పరాచీరాయన్తా వరుణమగచ్ఛన్తా అన్వైత్తాః పునరయాచత తా అస్మై నపునరదదాత్సోఽబ్రవీద్వరం వృణీష్వాథ మేపునర్దేహీతి తాసాం వరమాఽలభత సకృష్ణ ఏకశితిపాదభవ ద్యో వరుణగృహీతః స్యాత్సఏతం వారుణం కృష్ణమేకశితి పాదమాలభేత వరుణమ్॥

౧ ప్రజాపతి ప్రజలను సృజించెను. ఈప్రజాపతివలన సృజింపఁబడిన ప్రజలు పోయిన యనురాగముకలవారై వచ్చిరి. (వచ్చియు) వరుణునిఁబొందిరి. (ఆ ప్రజాపతియు) నాప్రజలను నాకొఱకొసంగు మని వరుణుని యాచించెను. (వరుణుఁడు) ఆప్రజలనుఆప్రజాపతికొఱకివ్వలేదు. (పిమ్మట) నాప్రజాపతి యీప్రజలలో శ్రేష్ఠముగు పశువును గోరుకొనవలయును. మిగిలినవాటిని నాకివ్వవలయును అని వరుణుని మరల యాచించెను. (వరుణుఁడు) ఆప్రజలలో శ్రేష్ఠమగు పశువునుఁబొందెను. ఆప

శువు నల్లనిది, తెల్లనిపాదములుకలదియు నాయెను. ౨ ఏలయన జలజన్యమగు మహో
దరవ్యాధిచే గ్రహింపఁబడిన వాఁడాయెనో, నల్లనైనట్టియు, నొకతెల్లనిపాదముకలిగిన
ట్టియు, వరుణదేవతాకమగు పశువునాలమ్భనము చేయవలయును. (ఆయజమానుఁడు)
వరుణునిచేఁ దన (వరుణుని) భాగమునే బొందుచున్నాఁడు. ఆవరుణుఁడే యీయ
జమానుని వరుణపాశములనుండి విడిపించుచున్నాడు. (జలోదరమను రోగముపేరు)

పంచాశత్తు. ౨

౩౮౮. ఏవస్వేనభాగధేయేనోపధావతి సఏవైనం వరుణపాశాన్ముఞ్చతి కృష్ణఏకశి
తిపాద్భవతి వారుణోహ్యేషదేవతయాసమృద్ధ్యై ౩ సువర్భానురాసురః సూ
ర్యం తమసాఽవిధ్యత్తస్మైదేవాః ప్రాయశ్చిత్తిమైచ్ఛన్తస్య యత్ప్రథమం
తమోఽపాఘ్నన్త్సా కృష్ణావిరభవద్యద్ద్వితీయగ్ం సాఫల్గునీయత్తృతీయగ్ం
సాబలక్షీయదధ్యస్థాదపా కృన్తన్త్సాఽవిర్వశా॥

౧ ఈవాక్యార్థము పైదానిలోవివృతము. ౨ నల్లనిదియు, తెల్లనిపాదములు
కలదియునగు దేవతచే వరుణుఁడు దేవతగాగల యీపశువు (యజమానునియొక్క)
ఆరోగ్యసమృద్ధికొరకగుచున్నది. ౩ ఈవాక్యార్థము తరువాయి (౩వ) పంచాశత్తు
తోఁజేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు ౩.

౩౮౯. ౧ సమభవత్తే దేవా అబ్రువన్దేవపశుర్వా అయగ్ం సమభూత్కస్మా ఇమమా

లప్స్యామహ ఇత్యథ వై తర్హ్యల్పా పృథివ్యాసీదజాతా ఓషధయస్తామవిం వశా
మాదిత్యేభ్యః కామాయాఽలభన్త తతో వా అప్రథత పృథివ్యజాయన్తౌ షధ
యో ౨ యః కామయేత ప్రథేయ పశుభిః ప్రప్రజయా జాయేయేతి స ప
తామవిం వశామాదిత్యేభ్యః కామాయ॥

౧ స్వర్గలోకమునందలి కాంతిని పోగొట్టునట్టి రాక్షసుఁడు సూర్యునిచీకటిచే నావరించెను. ఆదేవతలు సూర్యప్రభనుగప్పివేసిన చీకటినిబోఁగొట్టుటకు పరిహార మునాలోచించి (మణ్యాదులచే నాచీకటిని నాల్గుపర్యాయములు పోగొట్టిరి.) దాని యొక్క యే మొదటితమస్సునుఁబోగొట్టిరో! అది నల్లనికాంతికలపశువాయెను. రెం డవతమస్సు యేదికలదో! అది యెఱ్ఱనివర్ణముకల పశువాయెను. మూఁడవతమస్సు తేదికలదో! అది తెల్లనివర్ణముకల పశువాయెను. ఏనాల్గవతమస్సు ఎముకలసమూ హామునకుఁబైనుండు ప్రకాశమునుఁబోగొట్టెనో! అది గొడ్డువారినపశువాయెను. అప్పుడు దేవతలు పరస్పరమువిచారించి యిట్లు పలికిరి ఈపశువు దైవికమగు నెము కలసముదాయమునుండి పుట్టినదికావున నిది (యుత్తమ) పశువు. ఏయుత్తమ ప్రయోజనముకొఱకు దీనినాలంభనముచేయుదుము! అని (ప్రశ్నించుకొనిరి.) పిమ్మ ట భూమియల్పమైనదనియు, నోషధులుపుట్ట లేదనియు, విచారించి యావంధ్యయగు పశువును కామప్రదులగు నాదిత్యదేవతలకొఱకునాలంభనముచేసిరి. పిమ్మట భూమి విస్తృతమైనది. ఓషధులుఁపుట్టినవి. (కామప్రదులు=కోరికలనిచ్చువారు.) ౨ ఈవా క్యార్థము తరువాతి (౧౨) పంచాశత్తుతోఁజేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు ౮.

3౯౦. ౧ ఆలభేతాఽఽదిత్యానేవ కామగ్ం స్వేన భాగధేయేనో పధావతి త ఏవైనం

ప్రథయన్తి పశుభిః ప్రప్రజయాజనయన్త్య ౨ సావాదిత్యోనవ్య రోచతతస్మై

దేవాః ప్రాయశ్చిత్తిమైచ్ఛన్తస్మా ఏతామల్హా ఆఽలభన్తాఽఽగ్నేయీం కృష్ణ

గ్రీవీగ్ం సగ్ం హితామైన్ద్రీగ్ం శ్వేతాం బార్హస్పత్యాం తాభిరేవాస్మిన్రు

చమదధు ౩ ర్యోబ్రహ్మవర్చసకామః స్యాత్తస్మా ఏతామల్హాఆలభేత।

౧ ఎవఁడు పశువులతో వృద్ధినొందెదను, పుత్ర, పౌత్రాదిరూపసంతానము చే నున్నతుఁడనగుదునని కోరుకొనునో! వాఁడీవంధ్యయగు పశువుఁగామముల నిచ్చు నాదిత్యునికొఱకు (సూర్యుఁడు) ఆలంభనము చేయవలయును. వాఁడు కామ ప్రదులగు నాదిత్యులనే తనభాగముచేఁ బొందును. ఆయాదిత్యులే యీ యజమానుని పశువులచే విస్తరించినవానినిగాఁ జేయుదురు. పుత్రపౌత్రాది సంతానముచే నుత్కృష్టునిగాఁ బుట్టించుదురు. ౨ (పూర్వ మొకానొకప్పుడు) ఈ సూర్యుఁడు ప్రకాశించలేదు. అందుకొఱకు దేవతలుపాయము నాలోచించిరి. ఆ ప్రకాశము కొఱకు కంఠమునందు స్తనములుకల మేకలను మూఁడింటి నాలంభనముచేసిరి. అగ్నిదేవతాకమగు నల్లనికంఠముకలమేకను, ఇంద్రదేవతాకమగు నెఱుపు, తెలుపు నలుపు వర్ణముకలమేకను, బృహస్పతిదేవతాకమగు తెల్లనివర్ణముకలమేకను (ఆలంభనముఁ జేసిరి) ఆ మూఁడు పశువులచేతనే యీ సూర్యునియందు ప్రకాశమునుఁ బుట్టించిరి. ౩ ఈ వాక్యార్థము తరువాతి పంచాశత్తుతోఁజేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు ౫.

౩౫౧. ఆగ్నేయీం కృష్ణగ్రీవీగ్ం సగ్ం హితామైన్ద్రీగ్ం శ్వేతాం బార్హస్పత్యా

మేతా ఏవదేవతాః స్వేనభాగధేయేనోపధావతితా ఏవాస్మిన్బ్రహ్మవర్చ

సందధతి బ్రహ్మవర్చస్యేవభవతి ౨ వసన్తాప్రాతరాగ్నేయీం కృష్ణగ్రీవా మాలభేత గ్రీష్మేమధ్యం దినేసగ్ం హితామైన్ద్రీగ్ం శరద్యపరాహ్ణేశ్వే తాం బార్హస్పత్యాం త్రీణివాఆదిత్యస్యతేజాగ్ంసి వసన్తాప్రాతర్గ్రీష్మేమ ధ్యం దినేశరద్యపరాహ్ణే యావన్త్యేవతేజాగ్ంసి తాన్యేవ॥

౧ (ప్రసిద్ధమగు నధ్యయనసమ్పత్తిరూపమగు తేజస్సు బ్రహ్మవర్చస్సని చెప్పఁబడుచున్నది.) ఎవఁడు బ్రహ్మవర్చస్సుఁగోరువాఁడగునో! ఆబ్రహ్మవర్చస్సుకొఱకే కంఠమునందు వ్రేలాడుచున్న స్తనములుగల మేకనాలమ్భనము చేయవలయును. ఇన్ద్రదేవతాకమగు నెఱుపు, తెలుపు, నలుపుగల పశువును, బృహస్పతిదేవతాకమగు తెల్లనిపశువును (అనిభావము) ఆయజమానుఁడు తన (ఆదేవతా) భాగముచే నీదేవతలనే పొందును. ఆదేవతలే యీయజమానుని యందు బ్రహ్మవర్చస్సును గలుగఁజేయుచున్నారు. ఆయజమానుఁడు బ్రహ్మవర్చస్సుకలవాఁడే యగుచున్నాఁడు. ౨ వసన్తకాలమందుం బ్రాతఃకాలమున నగ్నిదేవతాకమగు నల్లనికంఠముకల పశువు నాలమ్భనము సేయవలయును. గ్రీష్మకాలమునందు మధ్యాహ్నమున నింద్రదేవతాకమగు నలుపు, తెలుపు, ఎఱుపువర్ణములుకల పశువు నాలమ్భనము సేయవలయును. శరత్కాలమునందపరాహ్ణసమయమున (పగలు రెండుజాములతర్వాత) బృహస్పతిదేవతాకమగు తెల్లని పశువు నాలమ్భనము చేయవలయును. ఈమూఁడుకాలము లాదిత్యునియొక్క తేజస్సులు. వసన్తకాలమునందలి ప్రాతఃకాలమునను; గ్రీష్మకాలమునందలి మధ్యాహ్నసమయమునను, శరత్కాలమందలి యపరాహ్ణసమయమునను, ఎన్ని తేజస్సులుకలవో, (ఈయజమానుఁడు) వాటినే పొందుచున్నాఁడు.

పఞ్చాశత్తి ౬.

32౨. ౧ అవరుద్ధే ౨ సంవత్సరం పర్యాలభ్యా వై సంవత్సరోవై బ్రహ్మ వర్చసస్య

ప్రదాతా సంవత్సర ఏవాస్మై బ్రహ్మవర్చసం ప్రయచ్ఛతి బ్రహ్మవర్చస్యేవ భవతి 3 గర్భిణయో భవన్తీన్ద్రియం వై గర్భ ఇన్ద్రియమేవాస్మిన్దధతి ౪ సారస్వతీం మేషీమాలభేతయ ఈశ్వరోవాచో వదితోః సన్వాచం నవదేద్వాగ్వై సరస్వతీ సరస్వతీమేవస్వేన భాగధేయేనోపధావతి సైవాస్మిన్

౧ పై పంచాశత్తులో నీవాక్యముయొక్క యర్థము వివరింపఁబడినది. ౨ ఒక సంవత్సరము వ్రతనియమముగా నాచరించి యాయాకాలములో నాయాపశువుల నాలంభనము చేయవలయును. సంవత్సరమే బ్రహ్మవర్చస్సు నిచ్చునట్టిది. ఒకసంవత్సరమే ఈ యజమానునికొఱకు బ్రహ్మవర్చస్సునొసగును. (అప్పుడా యజమానుఁడు) బ్రహ్మవర్చస్సు కలవాఁడే యగుచున్నాడు. 3 పూర్వోక్త పశువులు గర్భముగలవి గావలయును. ఇంద్రియమే గర్భము. ఇంద్రియమునే ఈ యజమానునియందు గలుగఁజేయుచున్నవి. ౪ ఎవఁడు వాక్కు నుచ్చరించుటకు సమర్థుఁడయినను (సభాకంపాదికముచే) వాక్కు నుచ్చరించుటలేదో, వాడు సరస్వతీదేవతాకమగు మేకనాలంభనము చేయవలయును. వాక్కే సరస్వతి. అయ్యజమానుఁడు సరస్వతినే తన (సరస్వతి) భాగముచేఁ బొందుచున్నాడు. ఆ సరస్వతియే యీ యజమానునియందు వాక్కును గలుగఁ జేయుచున్నది. వాక్కునుచ్చరించుటకు సమర్థుఁడగుచున్నాడు. (ఆలంభనము=దేవతోద్దేశముగాఁ ద్యాగముఁజేయుట చంపుటయని నిశ్చయార్థము.)

పంచాశత్తు ౭.

3౪౩. ౧ వాచం దధాతి ప్రవదితావాచో భవత్య ౨ పన్నదతీ భవతితస్మాన్మను

ష్యా॰ సర్వాం వాచం వదన్త్యా ౩ గ్నేయం కృష్ణగ్రీవమాలభేత సౌమ్యం బభ్రుం జ్యోగామయావ్యగ్నిం వా ఏతస్య శరీరం గచ్ఛతి సోమగ్ం రసో యస్య జ్యోగామయత్యగ్నే రేవాస్య శరీరం నిష్క్రీణాతి సోమాద్ర సముత యదీతా సుర్భవతి జీవత్యేవ ౪ సౌమ్యం బభ్రుమాలభేతాఽఽగ్నేయం కృష్ణగ్రీవం ప్రజాకామస్సోమః

౧ దీనియర్థము పైపనసలో లిఖింపఁబడినది. ౨ వెనుకఁ జెప్పఁబడిన పశువు పడిపోని పల్లుకలదై యుండవలయును. కావున మనుష్యులు సంపూర్ణమైన వాక్కు నుచ్చరించుచున్నారు. ౩ తీవ్రరోగియగువాఁడు అగ్ని దేవతాకమగు నల్లని కంఠముగలపశువును, సోమదేవతాకమగు పచ్చని పశువును నాలంభనము సేయవలయును. ఇయ్యాజమానునియొక్క శరీరమగ్నిని బ్రవేశించును. అన్నరసము సోమునిఁ బ్రవేశించును. ఎవనికిఁ దీవ్రరోగము కలదో, వీనియొక్క శరీరము నగ్ని శుష్కింపఁ జేయును. సోమునినుండి యన్నరసమును లాగుచున్నాఁడు. (పూర్వవిధముగఁ బశ్వాలంభనముఁజేసిన యజమానుఁడు) ప్రాణము పోయినవాఁడయినను జీవించును. ౪ సంతానముఁగోరు పురుషుఁడు సోమదేవతాకమగు పింగళవర్ణముకల (పచ్చని) పశువును, అగ్ని దేవతాకమగు నల్లనికంఠముకల పశువును నాలంభనము చేయవలయును. సోమదేవతయే రేతస్సును ధరింపఁజేయునది అగ్ని ప్రజలకు సంతానమును బుట్టించువాఁడు. సోమదేవతయే యీయజమానుని కొఱకు రేతస్సును ధరింపఁజేయుచున్నాఁడు. అగ్ని సంతానమును బుట్టింపఁజేయుచున్నాఁడు. (ఆ యజమానుఁడు) సంతానమునుఁ బొందుచున్నాఁడు.

పంచాశత్తు ౫

౩౫౫. వై రేతోధాఅగ్నిః ప్రజానాం ప్రజనయితాసోమఏవాస్మై రేతోదధాత్యగ్నిః ప్రజాం ప్రజనయతి విన్దతే ప్రజా ౨ మాగ్నేయం కృష్ణగ్రీవమాలభేత సౌమ్యం బభ్రుం యో బ్రాహ్మణో విద్యామనూచ్య నవిరోచేతయదాగ్నే యోభవతి తేజఏవాస్మిన్తేన దధాతి యత్సౌమ్యో బ్రహ్మవర్చసం తేనకృష్ణ గ్రీవఆగ్నేయోభవతి తమఏవాస్మాదపహన్తి శ్వేతోభవతి॥

౧ దీనియర్థము పూర్వపుపంచాశత్తులోఁ బ్రకటితము. ౨ ఏ బ్రాహ్మణుఁడు విద్యను జదువుకొనియు బ్రజలయందు అనురాగము గలవాఁడగుట లేదో! వాడు పూర్వోక్తమగు పశుద్వయము నాలమ్భనము సేయవలయును. ఏది యగ్ని దేవతాకమగు పశువుకలదో! దానిచే నగ్ని యీయజమానునియందుఁ దేజస్సునే గలుగజేయుచున్నాడు. సోమదేవతాకమగు నేపశువుకలదో! దానిచే సోముఁడీయజమానునియందు బ్రహ్మవర్చస్సు ధరింపఁజేయుచున్నాఁడు. నల్లనికంఠముకల పశువగ్ని దేవతాకము (కావున) నీయజమానునినుండి తమస్సునేపోఁగొట్టును. (ఏది) తెల్లనిపశువుకలదో ఈయజమానునియందది కాన్తి నేకలుగఁజేయుచున్నది. పచ్చనివర్ణముగల పశువు సోమదేవతాకము (కావున) ఈయజమానునియందు బ్రహ్మవర్చసరూపమగు కాన్తింగలుగఁజేయుచున్నవి.

పంచాశత్తు ౬.

౩౫౬. రుచమే వాస్మిన్దధాతి బభ్రుసౌమ్యోభవతి బ్రహ్మవర్చసమేవాస్మిన్త్విషిం

దధా ౨ త్యాగ్నేయం కృష్ణగ్రీవమాలభేతసౌమ్యం బభ్రుమాగ్నేయం కృష్ణగ్రీవం పురోధాయాగ్ం స్పర్ధమానఆగ్నేయోవై బ్రాహ్మణః సౌమ్యో రాజన్యోఽభితః సౌమ్యమాగ్నేయౌభవతస్తేజసైవ బ్రహ్మణోభయతోరాష్ట్రం పరిగృహ్ణాత్యే కధాసమావృఞ్క్తే పురఏనం దధతే॥

౧ ఈవాక్యముయొక్క యర్థము (౨౭) పనసలో బ్రకటితము. ౨ పౌరోహిత్య కర్మయందితరునితో స్పర్ధకలపురుషుఁడు అగ్నిదేవతాకమగు నల్లనికంఠముకల రెండు పశువులను, సోమదేవతాకమగు పచ్చనివర్ణముకలపశువును, నాలంభనముసేయవల యును. బ్రాహ్మణుఁడు అగ్నిదేవతగాఁగల వాఁడుకదా! (బ్రాహ్మణుఁడు, అగ్నియు విరాట్పురుషుని ముఖమునుండి పుట్టిరి. కావున నీసామ్యమువీనికిఁగారణము) రాజు సోమదేవతగాఁగలవాఁడు. సోమదేవతాక పశువున కిరువైపులందగ్ని దేవతాకపశువు లుండవలయును. (ఇట్లుచేసినచో, నిట్టియజమానుఁడు) బ్రాహ్మణోచితమయిన తేజున్సు చేతనే రాష్ట్రమునంతటను వశ్యముచేసికొనును. (అప్పుడు) ప్రతిస్పర్ధిని క్షణమాత్ర ములో జయించును. (పిమ్మట రాజు మొదలగువారు) ఈయజమానునిఁ బౌరోహి త్యస్థానమునందు స్థాపించుదురు.

ద్వితీయానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౩.

౩౭౭. ౧ దేవాసురా ఏషులోకేష్వ స్పర్ధన్త సఏతం విష్ణుర్వా మనమపశ్యత్తగ్ం స్వాయై దేవతాయా ఆఽలభతతతోవైస ఇమాల్లోకాభ్యజయ ౨ ద్వైష్ణవం

వామనమాలభేత స్పర్ధమానో విష్ణురేవభూత్వే మాల్లోకానభిజయతి

౩ విషమఆలభేత విషమాఇవహీమే లోకాస్సమృధ్యా ౪ ఇన్ద్రాయ

మన్యుమతే మనస్వతేలలామం ప్రాశృఙ్గమాలభేత సఙ్గ్రామే॥

౧ దేవదానవులీలోకములవిషయమై పరస్పరము స్పర్ధకలవారైరి. ఆవిష్ణువు పొట్టిదియగు పశువునుఁజూచెను. (చూచి) యాపశువును తన విష్ణురూపదేవతకాలమ్భనముచేసెను. దానివలననే యావిష్ణువీలోకములఁ జయించెను. ౨ స్పర్ధకల యజమానుఁడు విష్ణుదేవతాకమగు పొట్టిపశువు నాలమ్భనముసేయవలయును. అయ్యజమానుఁడు విష్ణువేయై యీలోకములఁజయించును. ౩ సమృద్ధికొఱకు విషమదేశమునందాలమ్భనము చేయవలయును. ఈలోకములు విషమప్రదేశములుగలవికదా! (పృథివ్యాదిలోకములు ఎక్కువభోగము గలవగుటచే విషమములని వర్ణింపఁబడినవి. ౪ ఈవాక్యమున కర్థము తరువాతి పఞ్చాశత్తులో వ్రాయఁబడును.

పఞ్చాశత్తు ౨.

౩౫౭. సంయత్త ఇన్ద్రియేణ వై మన్యునామనసాసఙ్గ్రామం జయతీన్ద్రమేవమన్యు

మన్తం మనస్వన్తగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మిన్నిన్ద్రియం మ

న్యుంమనోదధాతి జయతితగ్ం సఙ్గ్రామ ౨ మిన్ద్రాయమరుత్వతే పృశ్నిసక్థ

మాలభేత గ్రామకామఇన్ద్రమేవమరుత్వన్తగ్ం స్వేనభాగ ధేయేనోపధావ

తి సఏవాస్మైసజాతాన్ప్రయచ్ఛతి గ్రామ్యేవభవతి ౩ యదృషభస్తేన॥

౧ యుద్ధము ప్రాప్తమగుచుండగాఁ గోపముగల్గినట్టియు, ధైర్యముగలిగినట్టియు నింద్రునికొఱకు తెల్లని విభూతిరేఖలుగల లలాటముతోఁ గూడుకొనినట్టియు, ముఖమునకు సమీపించిన కొమ్ములుగలిగిన పురుష గోవు నాలమ్భనము చేయవలయును. ఇన్ద్రియరూపమగు కోపముచేతను, మనస్సుచేతను, (లోకములో జనుఁడు) యుద్ధమున జయించుచున్నాఁడుకదా! కోపముగల్గినట్టియు, ధైర్యముగల యింద్రునిఁదనభాగముచేఁ బొందును. ఆయింద్రుఁడే ఈయజమానునియందు ఇన్ద్రియరూపమగు కోపమును, ధైర్యమునుఁగలుగఁజేయును. ఆయజమానుఁడు యుద్ధమును జయించును. (శ్వేతపుండ్రవాలాంకిత లలాటము=తెల్లని యర్ధచంద్రాకృతికల రేఖచేఁ జిహ్నితమయిన లలాటముకలది ౨ గ్రామముఁగోరు పురుషుఁడు మరుద్దేవతలతోఁగూడుకొనిన యింద్రునికొఱకుఁ దెల్లనితొడలుకల పశువు నాలమ్భనము సేయవలయును. అయ్యజమానుఁడు మరుద్దేవతలతోఁగూడుకొనిన యింద్రునే తన (ఇన్ద్రి) భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆ యింద్రుఁడే ఈ యజమానునికొఱకు సోదరులు మొదలగు స్నేహితులనిచ్చును. (ఆ యజమానుఁడు) గ్రామముగలవాఁడగును. ౩ ఈ వాక్యమునకర్థము తరువాతి పంచాశత్తులోఁ దెలుపఁబడును.

## పంచాశత్తు ౩

౩౫౮. ఐన్ద్రీయత్పృశ్నిస్తేన మారుతస్సమృద్ధ్యై ౨ పశ్చాత్పృశ్ని స్సక్థోభవతి
పశ్చాదన్వవసాయినీమేవాస్మై విశంకరోతి ౩ సౌమ్యం బభ్రుమాలభేతా
న్నకామః సౌమ్యం వా అన్నగ్ం సోమమేవస్వేనభాగధేయేనోపధావతిసఏ
వాస్మాఅన్నం ప్రయచ్ఛత్యన్నాదఏవభవతి ౪ బభ్రుర్భవత్యే తద్వా అన్న
స్యరూపగ్ం సమృద్ధ్యై ౫ సౌమ్యం బభ్రుమాలభేత యమలమ్

౧ ఏదిపురుషగోవ్రుకలదో ! యది యింద్రదేవతాకము. ఏది తెల్లని తొడలు కల పశువుకలదో ! యది మరుద్దేవతాకము. (కావున నీ రెండును) సమృద్ధికొఱకగు చున్నవి. ౨ వెనుకప్రక్కన తెల్లనితొడలుకల పశువు (ఆలంభనయోగ్యమై) యుండ వలయును. (అయినచో నీదేవత) ఈ గ్రామస్వామికొఱకు జనునీదనకనుగుణముగానే కార్యమును చేయునట్లుచేసికొనును. 3 అన్నమునుఁగోరు పురుషుఁడు సోమదేవ తాకమగు పచ్చని వర్ణముకల పశువునాలంభనము చేయవలయును. (సోమము ఓష ధులకురాజుకావున) అన్నము సోమదేవతాకముగదా ! ఆ యజమానుఁడు సోమ మునే తన (సోమ) భాగముచేఁ బొందును. ఆసోమదేవతయే యీ యజమానునికై యన్నము నిచ్చును. (అప్పుడు యజమానుఁడు) అన్నము తినువాఁడగును. ౪ పచ్చని వర్ణముకల యీ యన్నముయొక్క రూపము సమృద్ధికొఱకగుచున్నది. ౫ ఈ వాక్యార్థము తరువాతి (౨౫) పంచాశత్తులో వివరింపఁబడును.

పంచాశత్తు ౪.

3౫౯. రాజ్యాయసన్తగ్ం రాజ్యం నోపనమేత్సౌమ్యం వైరాజ్యగ్ం సోమమేవ స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మైరాజ్యం ప్రయచ్ఛత్యుపైనగ్ం రాజ్యం నమతిబభ్రుర్భవత్యే తద్వైసోమస్యరూపగ్ం సమృద్ధ్యై ౨ ఇన్ద్రా యవృత్రతురేలలామం ప్రాశృఙ్గమాలభేతగతశ్రీః ప్రతిష్ఠాకామః పాప్మాన మేవవృత్రం తీర్త్వాప్రతిష్ఠాంగచ్ఛతి 3 ఇన్ద్రాయాభిమాతిఘ్నేలలామం ప్రా శృఙ్గమా॥

౧ రాజ్యముకొఱకు సమర్థుఁడగుచున్నయే పురుషుని రాజ్యముపొందుట

లేదో ! (ఆ రాజపుత్రుఁడు) సోమదేవతాకమగు పచ్చని వర్ణముకల పశువు నాలంభనము చేయవలయును రాజ్యము సోమదేవతాకముగదా ! ఆ యజమానుఁడు సోమదేవతనే తన (సోమ) భాగముచేఁబొందును. ఆ సోమదేవతయే యీ యజమానునికై రాజ్యము నిచ్చును. ఈ యజమానుఁడీ రాజ్యము పొందును. ఈ పచ్చని వర్ణముకల సోమముయొక్క రూపము సమృద్ధికొఱకగుచున్నది. ౨ పోయిన సంపద కలిగినట్టియుఁ, బ్రతిష్ఠాకాముఁడునగు పురుషుఁడు శత్రుహింసకుఁడగు నింద్రునికై శ్వేతపుండ్రవాలాంకిత లలాటముతోఁ గూడుకొనినట్టి పురుషగోవు నాలంభనము చేయవలయును. (అట్టి యజమానుఁడు) పాపరూపమగు శత్రువునే యతిక్రమించి ప్రతిష్ఠనుఁబొందును. (శ్వేతపుండ్రవాలాంకిత లలాటము = తెల్లని యర్ధచంద్రాకృతిగల రేఖచేఁ జిహ్నితమయిన లలాటము కలది) ౩ ఈ వాక్యార్థము తరువాతి (౯వ) పంచాశత్తుతోఁ జేర్చివివరింపఁబడును.

## పంచాశత్తు ౯.

౩౬౦. లభేతయః పాప్మనాగృహీతః స్యాత్పాప్మావా అభిమాతి రిన్ద్రమేవాభి
మాతిహనగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మాత్పాప్మానమభిమా
తిం ప్రణుదత ౨ ఇన్ద్రాయవజ్రిణేలలామం ప్రాశృఙ్గమాలభేతయమలగ్ం
రాజ్యాయసన్తగ్ం రాజ్యం నోపనమేదిన్ద్రమేవ వజ్రిణగ్ం స్వేనభాగధే
యేనోపధావతి సఏవాస్మై వజ్రంప్రయచ్ఛతి సఏనం వజ్రోభూత్యా ఇన్ధఉ
పైనగ్ం రాజ్యం నమతిలలామః ప్రాశృఙ్గోభవత్యే తద్వైవజ్రస్యరూప
గ్ం సమృద్ధ్యై॥

౧ ఎవఁడు పాపముచే గ్రహింపఁబడినవాఁడగునో, (వాఁడు) పాపమునుఁ బోఁగొట్టునట్టి యింద్రునికై ఎద్దు నాలంభనము చేయవలయును. పాపమే శత్రువు. (ఆయజమానుఁడు) శత్రువును నశింపఁజేయునట్టి యింద్రునే తన (యింద్ర) భాగముచేఁ బొందును. ఆయింద్రుఁడే యీయజమానునుండి పాపరూపమైన శత్రువునుఁ బోఁగొట్టును. ౨ రాజ్యముకొఱకు సమర్థుఁడగుచున్న యేపురుషుని రాజ్యము పొందదో! ఆపురుషుఁడు వజ్రముకల యింద్రునికొఱకు యెద్దునాలంభనము చేయవలయును. ఆ యజమానుఁడు వజ్రియగు నింద్రునే తనభాగముచేఁ బొందును. ఆయింద్రుఁడే యీ యజమానునికై వజ్రసమమగు నాయుధమునిచ్చును. ఆ వజ్రసమమగు నాయుధమిా యజమానుని శత్రుసంతాపముకొఱకుఁ బ్రదీప్తునిగాఁ జేయును. ఈ యజమానునిఁగూర్చి రాజ్యము పొందును. శ్వేతపుండ్రవాలాంకితనుయిన యెద్దు ముఖమున కభిముఖమైన కొమ్ములుకలది యగుచున్నది. వజ్రముయొక్క రూపమై సమృద్ధికొఱకగుచున్నది.

తృతీయానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౪.

౧౬౧. అసావాదిత్యో నవ్యరోచత తస్మై దేవాః ప్రాయశ్చిత్తి మైచ్ఛన్తస్మా
ఏతాం దశర్షభామాఽఽలభన్తయైవాస్మిన్రుచమదధు ౨ ర్యో బ్ర
హ్మవర్చసకామః స్యాత్తస్మా ఏతాం దశర్షభామాలభేతాముమేవాఽఽదిత్య
గ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మిన్బ్రహ్మవర్చసందధాతి బ్రహ్మవ
ర్చస్యేవభవతి ౩ వసన్తా ప్రాతస్త్రీన్లలామానాలభేత గ్రీష్మే మధ్యన్దినే

౧ (పూర్వమొకప్పుడు) ఈసూర్యుఁడు ప్రకాశింపలేదు. ఆప్రకాశముకొఱకు దేవతలుపాయము నాలోచించిరి. ఆప్రకాశముకొఱకే పదివృషభముల సముదాయము నాలంభనముచేసిరి. ఆ పదివృషభముల సముదాయము ఆలంభనముచేయుటచేతనే యీసూర్యునియందు కాంతినిఁ గలుగఁ జేసిరి. ౨ ఎవఁడు బ్రహ్మవర్చస్సుఁ గోరువాఁడగునో! వాఁడాసూర్యునికై పదివృషభములసముదాయము నాలంభనము చేయవలయును. (ఆయజమానుఁడు) ఈసూర్యునే తన (ఆదిత్య) భాగముచేతనే బొందును. ఆసూర్యుఁడే ఈయజమానునియందు బ్రహ్మవర్చస్సునుఁగలుగఁజేయుచున్నాఁడు. (అప్పుడు యజమానుఁడు) బ్రహ్మవర్చస్సు గలవాఁడే యగును. ౩ ఈవాక్యార్థము తరువాతి (౩వ) పంచాశత్తుతోఁ జేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు ౨.

౩౬౨. త్రీఞ్ఛితి పృష్ఠాఞ్ఛరస్య పరాహ్ణే త్రీఞ్ఛితివారా ౨ న్త్రీణివా ఆదిత్యస్య తేజాగ్ంసి వసన్తాప్రాతర్గ్రీష్మేమధ్యం దినేశరద్యపరాహ్ణేయావన్త్యేవ తేజాగ్ంసి తాన్యేవావరున్ధే ౩ త్రయఃప్రయుఆలభ్యన్తేzభి పూర్వమేవాస్మిన్తేజో దధాతి ౪ సంవత్సరం పర్యాలభ్యన్తే సంవత్సరోవై బ్రహ్మవర్చసస్యప్రదాతా సంవత్సరఏవాస్మై బ్రహ్మవర్చసం ప్రయచ్ఛతి బ్రహ్మవర్చస్యేవభవతి ౫ సంవత్సరస్య పరస్తాత్ప్రాజాపత్యం కద్రుమ్॥

౧ వసన్తకాలమునందు ప్రాతఃకాలమునఁ దెల్లనిరేఖలచే చిహ్నితమైన నుదురుగల పశువిశేషముల మూఁడింటినాలంభనము చేయవలయును. గ్రీష్మకాలమునందు మధ్యాహ్నసమయమున మూఁడు తెల్లనివీపుగల పశువులనాలంభనము

చేయవలయును. శరత్కాలమందపరాహ్ణసమయమున తెల్లని తోకగల పశువుల మూటి నాలంభనము చేయవలయును. ౨ ఆదిత్యునికి మూఁడు తేజస్సులు (అకేవ నగా) వసన్తకాలమునందు ప్రాతఃకాలమునను, గ్రీష్మకాలమందు మధ్యాహ్నసమయమందును, శరత్కాలమందపరాహ్ణసమయమునను (ఉన్నవనిభావము) ఎన్ని తేజస్సులుకలవో! వాటినన్నిటిని సేవించవలయును. ౩ (వసంతర్తువునందువలె గ్రీష్మశరదృతువులందుఁగూడ మూఁడు మూఁడు పశువులాలంభనము చేయఁబడుచున్నవి కావున పూర్వసాదృశ్యము ఈఋతువులందుకూడ తగుచున్నది. ఇట్లే) ఈయజమానునందు పూర్వమువలె నుత్తరకాలమునందుఁగూడ తేజస్సు విధింపఁబడుచున్నది అని తాత్పర్యము. ౪ ఒకసంవత్సరము (నియమము నవలంబించి) ఆలంభనము చేయవలయును. సంవత్సరమే బ్రహ్మవర్చస్సు నిచ్చునది. సంవత్సరమే యీయాజమానునికొఱకు బ్రహ్మవర్చస్సు నిచ్చును. (అప్పుడాయజమానుఁడు) బ్రహ్మవర్చస్సు కలవాఁడే యగును. ౫ ఈవాక్యార్థము తరువాతి(౩వ) పంచాశత్తుతోఁజేర్చి వివరింపఁబడును.

## పంచాశత్తు ౩

౩౬౩. ౧ ఆలభేత ప్రజాపతిః సర్వా దేవతా దేవతా స్వేవ ప్రతితిష్ఠతి ౨ యది బిభీయాద్దుశ్చర్మా భవిష్యామీతి సోమాపౌష్ణగ్ం శ్యామమాలభేత సౌమ్యో వై దేవతయా పురుషః పౌష్ణాః పశవః స్వయైవాస్మై దేవతయా పశుభిస్త్వచం కరోతి న దుశ్చర్మా భవతి ౩ దేవాశ్చ వై యమశ్చాస్మిల్లోకే స్పర్ధన్త స యమో దేవానామిన్ద్రియం వీర్యమయువత తద్యమస్య ॥౩॥

౧ సంవత్సరమునకుఁబిమ్మట ప్రజాపతిదేవతాకమగు పిఙ్గళవర్ణము (పసపు

పచ్చ) గల పశువునాలంభనము సేయువలయును. సర్వదేవతా స్వరూపుఁడగు ప్రజాపతియే దేవతలయందుఁ బ్రతిష్ఠావన్తుఁ డగుచున్నాఁడు. ౨ చెడిపోవు కర్మముఁ కలవాఁడనగుదునని (మరద మొదలగు హేతువులచే గుష్ఠురోగము నెవఁడూహించునో) యెవఁడుభయపడునో, వాఁడుసోమపూష దేవతాకమగు నల్లనిపశువు నాలమ్భనము సేయవలయును. పురుషుఁడు సోమదేవతకలవాఁడు. (అనగా సోమదేవత నారాధించువాఁడు) పశువులు పూషదేవతాకములు. సోముఁడు తన దేవతాత్వముచేఁ బశువులచేఁ జర్మమును (బాగుగ) చేయును. చెడుకర్మము కలవాఁడుకాఁడు. ౩ ఈవాక్యార్థము తరువాతి (౪ వ) పంచాశత్తుతోఁ జేర్చి వివరింపఁబడును.

## పంచాశత్తు ౪.

३०४. ౧ యమత్వంతే దేవాఅమన్యన్త యమోవా ఇదమభూద్యద్వయగ్ం స్మఇ
తితే ప్రజాపతిముపాధావన్తస ఏతౌ ప్రజాపతిరాత్మన ఉక్షవశౌ నిరమిమీ
తతేదేవావైష్ణవరుణీం వశామాఽలభన్తైన్ద్రముక్షాణంతం వరుణేనైవ గ్రా
హయిత్వావిష్ణునాయజ్ఞేన ప్రాణుదన్తైన్ద్రేణైవాస్యేన్ద్రియ మవృఞ్జత ౨
యోభ్రాతృవ్య వాన్త్స్యాత్సస్పర్ధమానోవైష్ణా వరుణీమ్ ॥౪॥

౧ దేవతలును, యముఁడును, ఈలోకవిషయమై పరస్పరము స్పర్ధకలవారైరి. ఆయముఁడు దేవతలయొక్క యింద్రియరూపమగు వీర్యమును (దేవతలనుండి) వేరుగాఁజేసెను. (కావున) యమునకు యమత్వము సంపన్నమైనది. అప్పుడు దేవతలీ విషయమునాలోచించిరి. పూర్వము మనమే (భూలోకాధిపత్యముఁ బొంది) యుంటిమో! ఈయాధిపత్యమును యముఁడు పొందినవాఁడాయెనని పిమ్మటనా దేవతలు ప్రజా

పతినిఁబొందిరి. ఆప్రజాపతితననుండి సేచనసమర్థమగు (అనఁగా జూలునిలువఁజేయు) వత్సోత్పాదకమైనదానిని, వంధ్యను సృష్టించెను. ఆదేవతలు, విష్ణువరుణులు, దేవత గాఁగల వంధ్యను యింద్రదేవతాకమగు దూడను బుట్టించు లేక కనునట్టి పశువు నాలంభనముచేసిరి. (పిమ్మటవారు) ఆయముని వరుణపాశముచే గ్రహించి విష్ణురూపమగు యజ్ఞముచే యముని వీర్యమును నశింపఁజేసిరి. యింద్రునియొక్క యనుగ్రహముచేతనే యీయముని వీర్యమును నశింపఁజేసిరి. ౨ ఈవాక్యార్థము తరువాతి పఞ్చాశత్తుతోఁజేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు ౫

౩౬౫. ౧ వశామాలభేతైన్ద్రం ముష్కాణం వరుణేనైవ భ్రాతృవ్యం గ్రాహయిత్వా విష్ణునాయజ్ఞేన ప్రణుదత ఐన్ద్రేణైవాస్యైన్ద్రియంవృఙ్క్తే భవత్యాత్మనాపరాఽస్య భ్రాతృవ్యో భవతీ ౨ న్ద్రోవృత్రమహ_న్తం వృత్రోహతః షోడశభి ర్భోగైరసి నాత్తస్య వృత్రస్య శీర్షతో గావ ఉదాయన్తావై దేహ్యోఽభవన్తా సామ్వృషభోఽజఘనేఽనుదై_త్తమిన్ద్రః

౧ ఎవఁడు శత్రువులుగలవాఁడో, వాఁడు (వారివిషయమై) స్పర్ధకలవాఁడై విష్ణువరుణదేవతలు దేవతగాఁగల వంధ్యాపశువును, ఇన్ద్రదేవతాకమగు వత్సోత్పాదకపశువు నాలంభనము చేయవలయును. (ఇట్టియజ్వ) వరుణపాశము చేతనే శత్రువునుగ్రహించి విష్ణురూపమగు యజ్ఞముచే నశింపచేయుచున్నాఁడు. ఈశత్రువుయొక్క వీర్యము నశించిపోవును. (అప్పుడు యజమానుఁడు) స్వయముగా (విజయముకలవాఁడు) అగును. ఈయజమానునియొక్క శత్రువు తిరస్కృతుఁడగును. ౨ (పూర్వము) ఇంద్రుఁడు వృత్రాసురునిఁజంపెను. ఆయింద్రుని-చచ్చిన వృత్రా

సురుఁడు పదునాఱు సర్పాకారములగు శరీరములచే (తాళ్లచేతవలె) బంధించెను. ఆవృత్రాసురునియొక్క శిరస్సునుండి కొన్నియావులుపుట్టినవి. ఆయావులు విశిష్ట దేహసంబంధులైనవి. ఆగోవులయొక్క పృష్ఠభాగమునఁదు వృషభమనుసరించి వెళ్లెను. ఆవృషభమునుద్దేశించి యింద్రుఁడాత్మను (అహో! నాకార్యముసిద్ధమ యినదిగదా! యని) పూజించెను. (అప్పుడు) ఇంద్రుఁడు ఎవఁడీవృషభము నాలంభనముచేయునో ఈపాపమునుండి వాఁడువిడిపింపఁబడునని యాలోచించెను. (పిమ్మట) ఆయింద్రుఁడు అగ్నిదేవతాకమగు నల్లనికంఠముగల పశువును, ఇంద్ర దేవతాకమగు వృషభమును నాలంభనముచేసెను. ఆ యింద్రునియొక్క స్వభాగముచే సంతుష్టుఁడయినయగ్ని పదునాఱు సర్పాకారములగు శరీరములఁగూడ దహింపఁజేసెను. ఇంద్రుఁడు ఇన్ద్రియభాగముచేతనే యాత్మయందు సామర్థ్యమును ధరించెను.

పంచాశత్తు ౬

౩౬౬. ౧ అచాయతో౽స్మస్యత యోవాఽఇమమాలభేత ముచ్యేతాస్మాత్పాప్మన
ఇతిస ఆగ్నేయం కృష్ణగ్రీవమాఽలభతైన్ద్రం వృషభం తస్యాగ్నిర్దేవస్స్వేన
భాగధేయేనో పసృతః షోడశధావృత్రస్యభోగానప్యదహదైన్ద్రేణేన్ద్రియ మా
త్మన్నధత్త ౨ య ఏవం పాప్మనాగృహీతః స్యాత్స ఆగ్నేయం కృష్ణగ్రీవమాలభే
తైన్ద్రం వృషభమగ్నిర్దేవాస్యస్వేన భాగధేయేనోపసృతః ॥౬॥

౧ ఈవాక్యార్థము పూర్వపు పంచాశత్తునందు వివృతము. ౨ ఎవఁడు పాపముచే గ్రహింపఁబడినవాఁడగునో, వాఁడగ్నిదేవతాకమగు నల్లనికంఠముకల పశువును, ఇంద్రదేవతాకమగు వృషభమును (=ఎద్దు) ఆలంభనము చేయువలయును.

ఈయజమానుని సంబంధమగు తానిచ్చిన హవిర్భాగముచే సంతుష్టుఁడగు నగ్ని పాపమును కూడ దహించును. ఇంద్రయాగముచేతనే ఆత్మయందు సామర్థ్యమును నాత్మయందు ధరించును. (ఇట్టి యజమానుఁడు) పాపమునుండి విడిపింపఁ బడును. పరిశుద్ధుఁడగును.

పంచాశత్తు ౭

3౯ ౭. ౧ పాప్మానమ పిదహాత్యైన్ద్రేణేన్ద్రియ మాత్మన్ధత్తే ముచ్యతేపాప్మనోభ

వత్యేవ ౨ ద్యావాపృథివ్యాం ధేనుమాలభేత జ్యోగపరుద్ధోఽన యోర్హివా

ఏషోఽప్రతిష్ఠితోఽథైషజ్యోగపరుద్ధోద్యావా పృథివీఏవస్వేన భాగధేయేనో

పధావతితే ఏవైనం ప్రతిష్ఠాంగమయతః ప్రత్యేవతిష్ఠతి 3 పర్యారిణీ భవతి

పర్యారీవహ్యేతస్యరాష్ట్రం యోజ్యోగపరుద్ధస్సమృద్ధ్యై ౪ వాయవ్యం ॥౭॥

౧ ఈవాక్యార్థము ౬వ పంచాశత్తునందుఁ దెలుపఁబడినది. ౨ చిరకాలము రాజ్యభ్రష్టుఁడైన వాఁడు ద్యావాపృథివీ దేవతాకమగు నావు నాలంభనము చేయవలయును. ఈపృథివీద్యులోకములందు బ్రతిష్ఠితుఁడు కాని వాఁడుజ్యోగపరుద్ధుఁ (డని చెప్పఁబడును.) (ఈయాలంభనము చేసిన యజమానుఁడు) ద్యావాభూములఁ బొందుచున్నాడు. ఆద్యావాభూములే యీయజమానునిఁ బ్రతిష్ఠనుఁ బొందించుచున్నవి. (అప్పుడతడు) ప్రతిష్ఠావంతుఁడగుచున్నాఁడు. 3 (ఏయావు చూడిదియగుచుఁ బ్రసవకాలము నతిక్రమించి పిమ్మటఁ జాలకాలమునకు బ్రసవించునో ! యది పర్యారణీయనిబిలువఁబడును.) సమృద్ధికొఱకు నట్టి పర్యారిణి యగునావే (యాలంభనమునకు) కావలయును. ఎవఁడు చిరకాలము రాజ్యభ్రష్టుఁడో, వీనియొక్క-

రాష్ట్రిము పర్యాయియగును. (అనగా భోగకాలము నతిక్రమించినతరువాత పొందఁబడునని భావము.) ౪ ఈపదము ౮వ పంచాశత్తులో వివరింపఁ బడును.

పంచాశత్తు ౮

౩౬౮. ౧ వత్సమాలభేత వాయుర్వా అనయోర్వత్స ఇమేవా ఏతస్మైలోకా అప శుష్కా-విడపశుష్కా-z క్షైమజ్యోగ పరుద్ధోవాయుమేవస్వేన భాగధేయేనో పధావతి సఏవాస్మా ఇమాల్లోకాన్వశం ప్రదాపయతి ప్రాస్మాఇమేలోకాః స్నువన్తి భుఞ్జత్యేనం విడుపతిష్ఠతే ॥౮॥

౧ ఎప్పుడు సామంతరాజులు ప్రభువునందనురాగము పోయినవారగుదురో సామాన్యజనముకూడ అనురాగము పోయినదగునో, అప్పుడీరాజ్య భ్రష్టుఁడు వాయుదేవతాకమగు దూడనాలంభనము చేయవలయును ఈద్యావాభూములకువాయువే దూడకదా. అప్పుడీరాజ్యభ్రష్టుఁడు తనభాగముచే వాయువునే బొందును. ఆవాయువే ఈయజమానునికై నీసామంతరాజులను, ఇతరసామాన్యజనులనుకూడ అనురాగము కలవారినిగాఁజేయును. ఆసామంతరాజులు కూడ మణులు మొదలగుధనము నధికముగా నొసగుదురు. ఇతరసామాన్యజనము కూడ ఈప్రభువును సేవించును.

చతుర్థానువాకము సమాప్తము.

—*0*—

## అనువాకము ౫

౩౬౯. ౧ ఇన్ద్రో వలస్య బిలమపౌర్ణోత్సయ ఉత్తమః పశురాసీత్తం పృష్ఠం ప్రతి సంగృహ్యోదక్షిదత్తగ్ం సహస్రం పశవోऽనూదాయ న్స ఉన్నతోऽభవ ౨ ద్యః పశుకామః స్యాత్సవితమైన్ద్రి మున్నతమాలభేతేన్ద్రి మేవస్వేన భాగధేయేనో పధావతి సఏవాస్మై పశూన్ప్రయచ్ఛతి పశుమానేవభవ త్యున్నతః ॥౧॥

౧ (బలుఁడను రాక్షసుఁడు తస్కరుండై యెచ్చటనుండియో కొన్నిపశువులనపహరించి భూబిలమునందు స్థాపించెను. ఆవృత్తాన్తముం దెలిసికొని యింద్రుఁడు బిలముఁదెరచెను. (అనగా బిలమునకుఁ బైనమూయఁబడిన రాతినిఁ బెల్లగించెను. (అందు) ఏదియుత్తమపశువాయెనో దానివీపు నవలమ్బించి యెత్తెను. (అదియా పశుసముదాయమున కధిపతియగుటవలన) దానిననుసరించి వేయిపశువులు బయలు దేరినవి. (పూర్వమేయున్నతమైనను) నాపశువు (ఇంద్రునిచేఁ దీయఁబడుటచే) మిక్కిలి యున్నతమైనది. ౨ ఎవఁడు పశువులఁగోరువాఁడగునో యాపురుషుఁడింద్ర దేవతాకమగు నీ (పూర్వోక్తమైన) యున్నతపశువు నాలమ్భనము సేయవలయును. (అట్టి యజమానుఁడు) ఇంద్రునే తానిచ్చిన హవిర్భాగముచేఁబొందును. ఆయింద్రుఁడేయీయజమానునికొఱకుఁ బశువులనిచ్చును. (యజమానుఁడు పశువులు కలవాఁడగును.) ౩ ఈపదమున కర్థము ౨వ పనసలో మొదటివాక్యముతోఁగూర్చి చెప్పఁబడును.

పఞ్చాశత్తు ౨

౩౭౦. ౧ భవతిసాహస్రీవా ఏషాలక్ష్మీయదున్నతో లక్ష్మ్యైవపశూనవరున్ద్ధే ౨

యదా సహస్రం పశూన్ప్రాప్నుయాదథ వైష్ణవం వామనమాలభేతై తస్మి
న్నేవ తత్సహస్రమధ్యతిష్ఠత్ తస్మాదేవ వామనస్స మీషితః పశుభ్య ఏవ ప్ర
జాతేభ్యః ప్రతిష్ఠాం దధాతి ౩ కోz ర్హతి సహస్రం పశూన్ప్రాప్తుమిత్యాహు
రహోరాత్రాణ్యేవ సహస్రగ్ం సంపాద్యాzzలభేత పశవః ॥ ౨॥

౧ ఉన్నతమగుపశువు (ఆలంభనమునకు యోగ్యమైనది) ఉన్నతమనుటయేది కలదో, ఇది (మిగిలిన) సహస్రమునకు సమృద్ధరూపము. (ఇట్టివాఁడు సమృద్ధి రూపమగు) లక్ష్మితోఁ గూడుకొనినవాఁడై పశువులను బొందుచున్నాఁడు. ౨ ఎప్పుడు యజమానుఁడు వేయిపశువులను బొందునో! అనన్తరము విష్ణుదేవతాకమగు వామనపశువు నాలంభనము సేయవలయును. (ఎందువలన) నీవామన పశువునందే (లీలగా) నాపశుసహస్ర మధిష్ఠించియున్నదో! అందువలన నీవామన పశువు విష్ణుదేవతకు బాగుగ నపేక్షితమైనది. (ఈవామన పశ్వాలమ్భనముచేఁ బూర్వము) గలిగిన పశుసహస్రములకొఱకుఁ బ్రతిష్ఠను (గడ్డి—నీరు సమృద్ధిగాగల నివాసస్థానమును) జేసినవాఁడగును. ౩ ఈవాక్యార్థము ౩ వ పనసలోని మొదటి వాక్యముతోఁ జేర్చి కూర్పఁబడును.

పంచాశత్తు ౩.

౩౭౧, వా అహోరాత్రాణిపశూనేవ ప్రజాతాన్ప్రతిష్ఠాంగమయ ౨ త్యోషధీభ్యో
వేహతమాలభేత ప్రజాకామఽమథ యో వా పతం ప్రజాయైపరిబాధన్తే యో
zలం ప్రజాయైసన్ప్రజాం నవిన్దతేఽమథయః ఖలువా పతస్యైసూ తుమపిఘ్న

న్తియావేహద్భవత్యోషధీ ర్వేవస్వేనభాగధేయేనోపధావతి తాఏవాస్మైన్నస్వా ద్యోనేః ప్రజాం ప్రజనయన్తివిన్దతే।

౧ సహస్రపశువుల (నొక కాలమునందు) ఎవఁడు పొందుటకై సమర్థుఁడగు చున్నాఁడని విజ్ఞులు చెప్పుచున్నారు? వేయిఅహోరాత్రములు (పశువు(గ్రమమున) సంపాదించి యాలమ్భనము సేయవలయును. పశువులే యహోరాత్రములు. (ఇట్లు) ఉత్పన్నములైన పశువులకుం బ్రతిష్ఠనుఁ బొందించును. (అనగా వేయిదినములు క్రమముగ నొకదానిని సంపాదించి యాలంభనముచేసిన పిమ్మట వానినాలమ్భనముచేసినచోఁ బశువులకుఁ బ్రతిష్ఠను సంపాదించఁ బడినదగునని భావము) ౨ ఓషధులకొఱకు మాడలుచచ్చుచున్నవగుగోవు నాలమ్భనము సేయవలయును. ఎవఁడు ప్రజోత్పాదనమునకై సమర్థుఁడైనను సంతానమునుఁ బొందడో వీనివిసంతానము నకై యోషధిదేవతలంతిటను బాధించును. (ఇందులకేగవాలమ్భనము చెప్పఁబడిన ది. ఓషధిదేవతలైతే యీ గర్భమునుచెడఁగొట్టు గోవుయొక్క గర్భమునుఁ గూడ నాశనము చేయును. ఏదిగర్భవినాశకారి యగుచున్నదో! (అనివెనుక కన్వయము) అట్టి యజమానుఁడు ఓషధిదేవతలనే తానిచ్చిన హవిర్భాగముచేఁ బొందును. ఆ యోషధిదేవతలే యీ యజమానుని కొఱకు యజమానుని సమ్బన్ధియగు వీర్యము వలన (తమ రేతస్సుచేతనే) సంతానమునిచ్చును. (అనగా యజమానుఁడౌరసమగు సంతానమునే పొందును. కానిస్త్రీవలన మాత్రముగాదు.) (ఇటుపైన లోకప్రసిద్ధ చేనోషధులు ప్రశంసించఁ బడుచున్నవి.) ఉదకములే (కారణములగుట వలన) ఓషధిస్వరూపములు. (యజమానునకుఁ బుట్టఁబోవు) పురుషుఁడుకూడ నుదకస్వరూపము. (ఆ పురుషుఁడు పుట్టుకకుఁ బూర్వమునత్తనిచెప్పఁ బడుచున్నాఁడు. కావున నుదకరూపముగ నున్నయోషధులే యజమానుని కొఱకు స్పష్టముకాని శరీరాకారముగల రేతస్సువలన స్పష్టమైనశరీరమునిచ్చుచున్నవి. అందువలన నెవఁడు తెలిసికొనుటలేదో ఆ పండితులు పామరులును ఉదకములు ఈ యజమానునికొఱకు స్పష్టముకాని శరీరాకారముగల రేతస్సువలన స్పష్టమగు శరీరమునిచ్చుచున్నవని చెప్పుచున్నారు.

పంచాశత్తు ౪.

౩౭౩. ౧ ప్రజామాపోవా ఓషధయోఽసత్పురుష ఆప ఏవాస్మా అసతః సద్దదతితస్మాదాహుర్యశ్చైవం వేదియశ్చనాఽఽపస్త్వావాసతః సద్దదతీ ౨ త్రైస్త్రీగ్ం సూతవశామాలభేత భూతికామోఽ జాతో వాఏష యోఽలం భూత్యైసన్భూతిం నప్రాప్నోతీన్ద్రం ఖలువాఏషాసూత్యావశాఽ భవత్ ॥ ౪॥

౧ ఈ వాక్యార్థము 3 వ పనసలోఁ జెప్పఁబడినది. ౨ (ఒకపర్యాయముకనిపిమ్మట గొడ్డాలగు గోవు సూతవశయనఁబడును) ఐశ్వర్యమును గోరుపురుషుఁడు ఇన్ద్రదేవతాకమగు సూతవశయగు పశువునాలమ్భనము సేయవలయును. ఎవఁడు ఐశ్వర్యము (పొందుట) కై సమర్థుఁడైనను ఐశ్వర్యమును పొందుటలేదో వాఁడుపుట్టినవాఁడైనను పుట్టనివానితో సమానుఁడు. ఈ సూతవశయగు గోవుకూడ (మొదట) నింద్రసమానమగు వత్సముఁగని (పిమ్మట) వన్ధ్యయైనది. (ఈ యాలమ్భనము చేసిన యజమానుఁడు ఇంద్రునకై తానిచ్చిన హవిర్భాగముచేఁ బొందును. ఆ యింద్రుఁడే యీ యజమానునైశ్వర్యముం బొందించుచున్నాఁడు. (అప్పుడు) అతఁడైశ్వర్యవన్తుఁడగుచున్నాఁడు.

పఞ్చాశత్తు ౫

౨౭3. ౧ ఇన్ద్రమేవ స్వేనభాగధేయేనోపధావతి సఏవైనం భూతిం గమయతిభవత్యేవ ౨ యఃగ్ం సూత్యావశాస్యామైన్ద్ర మేవాఽఽలభేతై తద్వావతదిన్ద్రియగ్ం

సాక్షాదేవేన్ద్రియమవరున్ధే ౨ ఐన్ద్రాగ్నం పునరుత్సృష్టమాలభేతయ ఆ తృతీయాత్పురుషాత్సోమం న పిబేద్విచ్ఛిన్నో వా ఏతస్య సోమపీథో యో బ్రాహ్మణః . సన్నా।

౧ ఈ వాక్యార్థము పూర్వపుపఞ్చాశత్తున వివృతము. ౨ ఏ మాడుఁగనిక పిమ్మట (ఆవు) వంధ్యయగునో, (అనఁగాఁదరువాత సంతానము కలుగదని తా॥) ఇంద్రదేవతాకమయిన యాదూడను (పూర్వమంత్రోక్తమగు సూతవశాలంభనము నకుఁబిమ్మట) నాలంభనము సేయవలయును. ఇదియే యా ముఖ్యమయిన వీర్యము. (కావున నీ యజమానుఁడు) ముఖ్యమయిన యింద్రియమునే పొందుచున్నాఁడు (ఈ సూతవశయొక్క దూడ యింద్రసమానమనియు, నట్టిదూడను ఇంద్రదేవతాకముగానే యాలంభనము సేయవలయుననియు, దూడ యింద్రియకార్యము కావునను, ఇంద్రదేవతాకమగుటచే ముఖ్యమయిన యింద్రియమునే పొందునని భావము.) ౩ ఎవఁడు మూఁడవ పురుషునినుండి సోమము పానముచేయుటలేదో (ఇట్టివిచ్ఛిన్న సోమపీథుఁడు) ఇన్ద్రాగ్నిదేవతాకమగు నాఁబోతుగావిడిచిన అనఁగా దుక్కి, బండిలాగుట మొదలగుపనులలోనుంచని ఎద్దునాలమ్భనము చేయవలయును. ఎవఁడు బ్రాహ్మణుఁడగుచు మూఁడవ పురుషునినుండి సోమమున్రాద్రాగుటలేదో వీనియొక్క సోమపీథము విచ్ఛిన్నము (అనిభావము) (ఇయ్యాలమ్భనము చేసినయజమానుఁడు) తానిచ్చిన హవిర్భాగముచే నిన్ద్రాగ్నులనే పొందుచున్నాఁడు. ఆయింద్రాగ్నులే యాయజమానునికై సోమపీథము నొసఁగుదురు. ఇయ్యజమానుని సోమపీథము పొందును. (సోమపీథము = సోమయాగము.)

పంచాశత్తు ౬.

౩౭౪. తృతీయాత్పురుషాత్సోమం న పిబతీన్ద్రాగ్నీ ఏవ స్వేన భాగధేయేనోపధావతి

తావేవాస్మై సోమపీథం ప్రయచ్ఛతఉపైనగ్ం సోమపీథో నమతి ౨ య

దైన్ద్రో భవతీన్ద్రియం వై సోమపీథ ఇన్ద్రియమేవ సోమపీథమవరున్ధే యదాగ్నే

యో భవత్యాగ్నేయో వై బ్రాహ్మణః స్వామేవ దేవతామనుసంతనోతి 3 పున

రుత్సృష్టో భవతి పునరుత్సృష్ట ఇవ హ్యేతస్య॥

౧ ఈ వాక్యార్థము పూర్వపు పంచాశత్తులో వివరింపఁబడెను. ౨ (పూర్వ మంత్రముచే నింద్రాగ్ని దేవతాకమగు పశువువిధింపఁ బడినది. ఇచ్చట యింద్రా గ్నుల ప్రశంస చెప్పఁబడుచున్నది.) (ఆలంభనము చేయఁబడిన పశువు) ఇంద్రదేవతా కమయినచో, నింద్రియమే సోమపీథము (కావున యజమానుఁడు) ఇంద్రియరూపమగు సోమపీథమునే పొందుచున్నాఁడు. (ఆ యాలంభితపశువు) అగ్నిదేవతాకమయినచో, బ్రాహ్మణుఁడగ్ని దేవతాకుఁడు (సదృశుఁడు కావున యజమానుఁడు) తనదేవతనే వృద్ధిఁబొందించుచున్నాఁడు. (సోమపీథము=సోమయాగము) (సోమపాన మిన్ద్రియవృద్ధి హేతువు కావున సోమయాగము ఇంద్రియరూపముగా వర్ణింపఁబడినది.)

పంచాశత్తు ౭.

౩౭౫. సోమపీథః సమృద్ధ్యై ౨ బ్రాహ్మణస్పత్యం తూపరమాలభేతాభి చరన్బ్రా

హ్మణస్పతిమేవ స్వేనభాగధేయేనోపధావతి తస్మా ఏవైనమావృశ్చతి తాజగా

ర్తిమార్ఛతి 3 తూపరో భవతి క్షురపవిర్వా ఏషా లక్ష్మీర్యత్తూపరః సమృద్ధ్యై

౪ స్ఫ్యోయూపోభవతి వజ్రోవైస్ఫ్యోవజ్రమేవాస్మై ప్రహరతి ౫ శరమ

యం బర్హిః శృణాత్యేవైనం ౬ వైభీదక ఇధ్మో భినత్త్యేవైనమ్॥

౧ పూర్వోక్తమగు నాంబోత్తెద్దు (ఆలమ్భన యోగ్యమగుచున్నది.) అటు వంటి యాంబోత్తెద్దువలె నీయజమానునియొక్క సోమయాగముగూడ సమృద్ధమగుచున్నది. ౨ బ్రహ్మణస్పతి దేవతగాగల తూపరమును ఆలమ్భనము సేయవలయును. (అట్టివాడు శత్రువధనుఁగోరుచు) బ్రహ్మణస్పతినే తనభాగముచే బొందుచున్నాఁడు. బ్రహ్మణస్పతియు నాయజమానుని కొఱకు నీశత్రువుల సంతతను భేదించును. (శత్రువు పిమ్మట మరణమునొందును. తూపరః = కొమ్ములురాదగిన కాలమందుఁ గూడ కొమ్ములురాని యెద్దు.) ౩ కొమ్ములురానియెద్దు (పూర్వపు యిష్టియందాలంభనయోగ్యమై) యున్నది. కత్తివలెఁ దీక్ష్ణమయిన యంచులుకల వజ్రతుల్యమయిన యిది శత్రుమారణము కొఱకగుచున్నది. (ఈ) తూపరమయిన యెద్దు ఏదికలదో, ఇది సమృద్ధికొఱకగుచున్నది. (కొమ్ములు లేకపోయినను మేకవలె యుద్ధమునందు సాహసముగా శత్రువుల నాశనముజేయును కావుననీయెద్దునకు వజ్రసామ్యముచెప్పఁబడినది.) ౪ యూపస్తంభము "స్ఫ్య" మను నాయుధ సమానాకారము కలిగి యుండవలయును. స్ఫ్యయను నాయుధము వజ్రతుల్యమే (కావున నీయాగమునందు దేవత) ఈ యజమానుని కొఱకు వజ్రమునే యిచ్చుచున్నాఁడు. ౫ (ఈ యిష్టియందు) బర్హిస్సు రెల్లుదై యుండవలయును. (ఇట్టిబర్హిస్సుచే యజమానుఁడు) ఈశత్రువును హింసించుచున్నాఁడు. ౬ (ఈ యిష్టియందు) సమిధ = కట్టెలమోపు ఇధ్మమని పేరు) తాండ్రచెట్టు సంబంధియై యుండవలయును. (అట్టియిధ్మ) శత్రువును భేదించుచునే యున్నాఁడు.

పంచమానువాకము సమాప్తము.

—*0*—

## అనువాకము ౬.

౩౯౬. ౧ బార్హస్పత్యగ్ం శితిపృష్ఠమాలభేత గ్రామకామో యః కామయేత పృష్ఠగ్ం సమానానాగ్ం స్యామితి బృహస్పతి మేవ స్వేన భాగధేయేనోపధావతి స ఏవైనం పృష్ఠగ్ం సమానానాం కరోతి గ్రామ్యేవ భవతి ౨ శితిపృష్ఠో భవతి బార్హస్పత్యో హ్యేష దేవతయా సమృద్ధ్యై ౩ పౌష్ణగ్ం శ్యామమాలభేతాన్నకామోఽన్నం వై పూషా పూషణమేవ స్వేనభాగధేయేనో పధావతి స ఏవాస్మై

౧ గ్రామము తనకుఁగావలయుననియు, సమానులగు ఇతరగ్రామస్వాముల లోఁ దానొకఁడుకావలయుననియు, నెవఁడు కోరుకొనునో, అట్టియజమానుఁడు బృహస్పతిదేవతాకమగు తెల్లని వీపుభాగముగల పశువు నాలమ్భనము చేయవలయు ను. (అట్టి యజమానుఁడు) తానిచ్చుహవిర్భాగముచే బృహస్పతినే పొందును. ఆబృహస్పతియే యీయజమానుని సమానులగు నితరగ్రామస్వాములలో నగ్రవర్తి నిగఁ జేయును. (అప్పుడా యజమానుఁడు) గ్రామస్వామియే యగును. ౨ బృహస్ప తిదేవతాకమగు తెల్లనివీపు పశువు (బృహస్పతి) దేవతచే సమృద్ధికొఱకు నగుచున్నది. ౩ అన్నమునుఁ గోరుపురుషుఁడు పూషదేవతాకమగు పశువు నాలమ్భనము సేయ వలయును. అన్నము (పోషకము కావున) పూషదేవతాస్వరూపము. (ఇట్టి యజమా నుఁడు)పూషదేవతనే తానిచ్చినహవిర్భాగముచేఁబొందుచున్నాఁడు. ఆపూషదేవతయే యీ యజమానునికై యన్నమునిచ్చును. (అప్పుడు యజమానుఁడ) న్నముగలవాఁ డగుచున్నాఁడు.

## పంచాశత్తు ౨

౩౭౭. ౧ అన్నం ప్రయచ్ఛత్యన్నాద ఏవ భవతి ౨ శ్యామో భవత్యేతద్వా అన్న
స్యరూపగ్ం సమృద్ధ్యై ౩ మారుతం పృశ్నిమాలభేతాన్నకామోఽన్నం
వై మరుతో మరుత ఏవ స్వేన భాగధేయేనోపధావతి త ఏవాస్మా అన్నం ప్రయచ్ఛ
న్త్యన్నాద ఏవ భవతి ౪ పృశ్నిర్భవత్యేతద్వా అన్నస్యరూపగ్ం సమృద్ధ్యై ౫
ఐన్ద్రమరుణమాలభేతేన్ద్రియకామ ఇన్ద్రమేవ॥

౧ ఈ వాక్యార్థము క్రిందటి పనసలో విస్పష్టము. ౨ నల్లని పశువు (ఆలమ్భనయోగ్యమగుచున్నది.) ఇదియే యన్నముయొక్క రూపమగుచు సమృద్ధి కొఱకగుచున్నది. ౩ అన్నముఁ గోరు పురుషుఁడు మరుద్దేవతాకమగు తెల్లని పశువు నాలమ్భనము చేయవలయును. అన్నమే మరుద్దేవతా స్వరూపము. (ఇట్టి యజమానుఁడు) తానిచ్చిన పురోడాశభాగముచే మరుద్దేవతలనే పొందుచున్నాఁడు. ఆ మరుద్దేవతలే యీ యజమానునకు నన్నము నిచ్చుచున్నారు. (అప్పుడు యజమానుఁడు) అన్నముఁ దినువాఁడేయగుచున్నాఁడు. అన్నసంపాదకులగుటచే మరుత్తులన్నస్వరూపముగా వర్ణింపఁబడిరి.) ౪ పృశ్నిపశువు (ఆలమ్భనయోగ్యమైనది) ఇదియే యన్నముయొక్క స్వరూపమై సమృద్ధికొఱకునగుచున్నది. (పృశ్నిః=తెల్లనిపశువు.) ౫ ఈవాక్యార్థము తరువాతి (౩వ) పనసలో వ్రాయఁబడును.

## పంచాశత్తు ౩

౩౭౮. ౧ స్వేనభాగధేయేనోపధావతి స ఏవాస్మిన్నిన్ద్రియం దధాతీన్ద్రియావ్యేవ భవ

౨ త్యారుణోభ్రూమాన్స్యాత్తదా ఇన్ద్రస్యరూపగ్ం సమృద్ధ్యై ౩ సావి
త్రముపధ్వస్తమాలభేతసనికామస్సవితా వై ప్రసవానామీశే సవితారమేవ
స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మై సనిం ప్రసువతి దానకామా అస్మై
ప్రజాభవ ౪ న్త్యుపధ్వస్తోభవతి సావిత్రో హ్యేషః॥

౧ ఇన్ద్రియమును (సామర్థ్యమును) గోరుపురుషుఁడింద్ర దేవతాకమగు నెఱ్ఱని పశువు నాలమ్భనము చేయవలయును. (అట్టి యజమానుఁడు)ఇంద్రునే తానిచ్చుహవిర్భాగముచేఁ బొందును. ఆయింద్రుడే యజమానునియందు యింద్రియమునుఁగలుగఁ జేయుచున్నాఁడు. (అప్పుడు యజమానుఁడు) ఇన్ద్రియ వన్తుఁడగుచున్నాఁడు. ౨ (గొప్ప) కనుబొమ్మకల యెఱ్ఱని పశువు (ఆలంభనయోగ్య) మగుచున్నది. ఇదియే యింద్రునియొక్క రూపమగుచు సంపద గల్గుటకుఁ గారణమగును. ౩ ఇతరులవల్ల దానమునుఁగోరు పురుషుఁడు సవితృదేవతాకమగు సంకరవర్ణముకల పశువు నాలంభనము చేయవలయును. ప్రేరణములలో, దేవతాహ్వానములో సవితృదేవత సమర్థమగుచున్నది. (ఇట్టి యజమానుఁడు) సవితృదేవతనే తానిచ్చినహవిర్ భాగముచేఁ బొందును. ఆ సవితృదేవతయే యీ యజమానునికై పరకర్తృక దానమునుఁ బ్రేరణచేయును. దానకాములగు ప్రజలీయజమానుని యధీను లగుచున్నారు. (పరకర్తృకము = ఇతరులు చేయునది.) ౪ సంకీర్ణవర్ణముకల పశువు ఆలంభనయోగ్యమగుచున్నది. సవితృదేవతాకమగు నీపశువు దేవతల ప్రేరణచే సంపదనిచ్చుచున్నది.

పంచాశత్తు ౪.

౩౯౯. దేవతయాసమృద్ధ్యై వైశ్వదేవం బహురూపమాలభేతాన్నకామో వైశ్వదేవం

వాఅన్నం విశ్వానేవదేవాన్త్స్వేనభాగధేయేనోపధావతి తఏవాస్మాఅన్నం ప్రయచ్ఛన్త్యన్నాదఏవభవతి ౨ బహురూపో భవతి బహురూపగ్ం హ్య న్నగ్ం సమృద్ధ్యై ౩ వైశ్వదేవం బహురూపమాలభేత గ్రామకామోవై శ్వదేవావై సజాతావిశ్వానేవదేవాన్త్స్వేన భాగధేయే నోపధావతి తఏ వాస్మై॥

౧ అన్నకాముఁడు విశ్వేదేవ దేవతాకమగు రంగులొకదానిలో నొకటి కలియక బహువర్ణములుగల పశువునాలంభనము చేయవలయును. అన్నము విశ్వేదేవదేవ తాకముగదా! అట్టియజమానుఁడు సమస్తదేవతలను తానిచ్చిన హవిర్భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆ విశ్వేదేవతలే యీ యజమానునికై యన్నము నొసగుదురు. (అప్పుడు యజమానుఁడు) అన్నమునుఁ దినువాఁ డగును. (విశ్వేదేవులు = దేవతావి శేషులు.) ౨ బహురూపములుగలపశువు ఆలంభన యోగ్యమగుచున్నది. (భక్ష్య, భోజ్య, చోష్య, భేదములచే) బహురూపములుకల యన్నము సమృద్ధిని గలిగించు చున్నది. (చోష్యము = త్రాగుటకుపయోగ్యమయిన ద్రవపదార్థము.) ౩ గ్రామ మునుఁగోరు పురుషుఁడు విశ్వేదేవ దేవతాకమగు బహురూపములుకల పశువునాలం భనముచేయవలయును. సోదరభృత్యాదులు విశ్వేదేవ దేవతలు గలవారుగదా! అట్టియజమానుఁడు సమస్తదేవతలను తానిచ్చిన హవిర్భాగముచేఁ బొందును. ఆ సర్వ దేవతలీ యజమానునికై సోదరభృత్యాదుల నొసగుదురు. (అప్పుడు యజమా నుఁడు) గ్రామస్వామియగును.

పంచాశత్తు ౫.

౩౮౦. సజాతాన్ప్రయచ్ఛన్తి గ్రామ్యేవభవతి ౪ బహురూపో భవతి బహుదేవ

త్యో హ్యేష సమృద్ధ్యై ౩ ప్రాజాపత్యం తూపరమాలభేత యస్యానాజ్ఞా

తమివజ్యోగామయేత్ప్రాజాపత్యో వై పురుషః ప్రజాపతిః ఖలు వై తస్య వేద

యస్యానాజ్ఞాతమివ జ్యోగామయతి ప్రజాపతిమేవ స్వేన భాగధేయేనో పధా

వతి స ఏవైనం తస్మాత్స్రామాన్ముఞ్చతి ౪ తూపరో భవతి ప్రాజాపత్యో

హ్యేష దేవతయా సమృద్ధ్యై ॥౫॥

౧ ఈవాక్యార్థము పై(రవ) పంచాశత్తుతోఁజేర్చి వివరింపఁబడినది. ౨ బహురూపములు కలిగినట్టియు, బహుదేవతలు దేవతగాఁగల పశువు సమృద్ధినిచ్చుచున్నది. ఎవఁడు తెలియఁబడని రోగముచేఁ బీడింపఁబడునో, (అనఁగా రోగవిషయము తెలియకున్నను, బలముక్షీణించుట మొదలగునవి కన్పట్టుచుండునో, వాఁడు) ప్రజాపతి దేవతాకమగు సకాలమునందుఁగూడ కొమ్ములురాని యెద్దు నాలంభనము చేయవలయును. పురుషుఁడు ప్రజాపతిదేవతాకుఁడుకదా! (వైద్యులచే) తెలియఁబడనిదైన రోగము ఎవనిని భాధించుచున్నదో, దానిని ప్రజాపతి తెలిసి కొనుచున్నాఁడు. (ఈయజమానుఁడు) తానిచ్చిన పురోడాశభాగముచేఁ బ్రజాపతినే పొందుచున్నాఁడు. ఆ ప్రజాపతియే యాదీర్ఘ రోగమునుండి యీయజమానుని విడిపించుచున్నాడు. (స్రామః = దీర్ఘరోగము) ౪ ఈ కర్మయందు సకాలమునందుఁ గూడ కొమ్ములు రానియెద్దు ఆలంభనయోగ్యమై యున్నది. ఈ పశువు దేవతాంశముచేఁ బ్రజాపతి సంబంధియై (ప్రజాపతిదేవతాకమని తా॥) సమృద్ధికలిగించుచున్నది.

షష్ఠానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ౭.

౩౭౧. ౧ వషట్కారో వై గాయత్రియై శిరోఽచ్ఛినత్తస్యై రసః పరాఽపతత్తం బృహస్పతిరుపాగృహ్ణాత్సా శితిపృష్ఠా వశాఽభవద్యో ద్వితీయః పరాపతత్తం మిత్రావరుణా వుపాగృహ్ణీతాగ్ం సా ద్విరూపా వశాఽభవద్యస్తృతీయః పరాపతత్తం విశ్వేదేవా ఉపాగృహ్ణన్త్సా బహురూపా వశాఽభవద్యశ్చతుర్థః పరాపతత్స పృథివీం ప్రావిశత్తం బృహస్పతిరభి ॥

౧ ఈ వాక్యమునకర్థము తరువాతి (౨వ) పంచాశత్తులో జెప్పి వివరింపబడును.

### పంచాశత్తు ౨.

౩౭౨. ౨ అగృహ్ణాదస్త్వేవ వాయం భోగాయేతిస ఉక్షవశః సమభవద్యల్లోహితం పరాపతత్తద్రుద్ర ఉపాగృహ్ణాత్సా రౌద్రీరోహిణీవశాఽభవద్బా ౨ ర్హస్పత్యాగ్ం శితిపృష్ఠామాలభేత బ్రహ్మవర్చస కామో బృహస్పతిమేవ స్వేన భాగధేయేనోపధావతి సవవాస్మై బ్రహ్మవర్చసం దధాతి బ్రహ్మవర్చస్యేవ భవతి 3 ఛన్దసాం వా ఏష రసో యద్వశా రస ఇవఖలు ॥

౧ "(వౌషట్" అను మన్త్రమున కభిమానదేవత వషట్కారము) వషట్కారము గాయత్రియొక్క శిరస్సును ఛేదించెను. దానినుండి రసముపడెను. ఆ రసమును బృహస్పతి గ్రహించెను. ఆ రసము తెల్లని వీపుగల్గిన గొడ్డగు గోవాయెను. ఏ రెండవరసముపడెనో దానిని మిత్రావరుణదేవతలు గ్రహించిరి. ఆ రసము రెండు రూపములుగల వన్ధ్యయాయెను. ఏ మూడవ రసము పడెనో, దానిని సర్వదేవతలు గ్రహించిరి. అది బహువర్ణములుగల గొడ్డుటావు ఆయెను. ఏ నాల్గవ రసముపడెనో అది భూమినిఁ బ్రవేశించెను. అది తనయొక్క భోగముకొఱకు నగుఁగాక యని బృహస్పతి దానిని గ్రహించెను. అది వ్యర్థవీర్యముగల వృషభమాయెను. ఏది యెఱ్ఱనిదై పడెనో, దానిని రుద్రుఁడు గ్రహించెను. అది రుద్రసంబంధమయినదయి రోహిణి యను వన్ధ్యయాయెను. ౨ బ్రహ్మవర్చస్సునుఁ గోరుపురుషుఁడు బృహస్పతిదేవతాకమగు శితిపృష్ఠము నాలంభనము చేయవలయును. అట్టియజమానుఁడు బృహస్పతినే తానిచ్చిన హవిర్భాగముచే పొందును. ఆ బృహస్పతియే యజమానుని యందు బ్రహ్మవర్చస్సు నుంచును. (అప్పుడు యజమానుఁడు) బ్రహ్మవర్చస్వి యగును. ౩ ఏది వన్ధ్యయగు గోవృశకలదో ఈరసము ఛందస్సులకు సంబంధమయినదియే. బ్రహ్మవర్చస్సు రసమువంటిదికదా. ఛందస్సుయొక్క రసముచేతనే రసరూపమగు బ్రహ్మవర్చస్సును సేవించవలయును.

పంచాశత్తు ౩.

౩౫౩. ౧ వై బ్రహ్మవర్చసం ఛన్దసామేవ రసేనరసం బ్రహ్మవర్చ సమవరున్ధే ౨ మైత్రావరుణీం ద్విరూపామాలభేత వృష్టికామో మైత్రం వాఅహర్వారుణీరాత్రిరహోరాత్రాభ్యాం ఖలువై పర్జన్యో వర్షతిమిత్రావరుణా వేవస్వేనభాగధేయేనో పధావతి తావేవాస్మా అహోరాత్రాభ్యాం పర్జన్యం వర్షయతశ్ఛన్ద

సాం వావేషరసో యద్వైశారస ఇవఖలువై వృష్టిశ్ఛన్దసామేవరసేన ॥

౧ ఈవాక్యార్థము పూర్వము వివృతము. ౨ వర్షమునుఁగోరు పురుషుఁడు మిత్ర, వరుణదేవతాకమగు ద్విరూప పశువు నాలంభనము చేయవలయును. పగలు మిత్రదేవతాకము. రాత్రి వరుణదేవతాకము. మేఘుఁడహోరాత్రములచే వర్షించుచున్నాఁడుకదా. (ఇట్టి యజమానుఁడు) మిత్ర, వరుణదేవతలనే తానిచ్చిన హవిర్భాగముచేఁబొందును ఆ మిత్ర, వరుణదేవతలే యీయజమానునికయి యహో రాత్రులచే మేఘుని వర్షింపఁజేయుదురు. ఏది వంధ్యయగుగోవు కలదో ఈ రసము ఛందస్సులకు సంబంధమయినదే. వర్షము రసమునంటిదికదా. ( ఇట్టి యజమానుఁడు ) ఛందస్సులయొక్కరసముచే రసరూపమగువర్షమును పొందుచున్నాఁడు.

పంచాశత్తు ౪.

౩౮౪. ౧ రసం వృష్టిమవరున్ధే ౨ మైత్రావరుణీం ద్విరూపామాలభేత ప్రజాకామో

మైత్రం వాఅహర్వారుణీ రాత్రిరహోరాత్రాభ్యాం ఖలువై ప్రజాః ప్రజా

యన్తే మిత్రావరుణావేవ స్వేనభాగధేయేనో పధావతి తావేవాస్మా అహో

రాత్రాభ్యాం ప్రజాం ప్రజనయతశ్ఛన్దసాం వావేషరసో యద్వైశారస ఇవఖ

లువై ప్రజాఛన్దసామేవ రసేవరసం ప్రజామవ ॥

౧ పూర్వము విస్తరింపఁబడినది (౩వ పనసలో) ౨ పూర్వమువలెనే.

పంచాశత్తు ౫

౩౯౫. ౧ రుద్రైవైశ్వదేవీం బహురూపా మాలభేతాన్న కామోవైశ్వదేవం వాఅ న్నం విశ్వానేవ దేవాన్త్స్వేన భాగధేయేనోపధావతి తఏవాస్మా అన్నం ప్రయచ్ఛన్త్యన్నాదఏవ భవతి ఛన్దసాంవా ఏషరసోయద్వైశారసఇవ ఖలు వాఅన్నం ఛన్దసామేవరసేన రసమన్నమవరున్ధే ౩ వైశ్వదేవీం బహు రూపామాలభేత గ్రామకామో వైశ్వదేవావై ॥

౧ ఈపదమునకు పూర్వపుపనసలోని చివరవాక్యముతో నేకవాక్యత కల్పించఁబడినది. ౨ గ్రామముఁగోరువాఁడు సర్వదేవ దేవతాకమగు బహువర్ణములుగల పశువు నాలమ్భనము సేయవలయును. సోదరభృత్యాదులు విశ్వేదేవసంబన్ధులుగదా. (ఇట్టియజమానుఁడు) సర్వదేవతలను తానిచ్చిన హవిర్భాగముతోఁ బొందును. ఆసర్వదేవతలే యీయజమానునికై సోదరభృత్యాదుల నొసంగుదురు. (అప్పుడు యజమానుఁడు) గ్రామస్వామియే యగును. ఏది వంధ్యయగుగోవుకలదో ఈరసము ఛన్దస్సులకు సమ్బన్ధించినదే. సోదరభృత్యాదులు రసమువంటివారుకదా ! (ఈయజ్వ) ఛన్దస్సులయొక్క రసముచేతనే రసరూపముగు సోదరభృత్యాదులను పొందుచున్నాఁడు. ౩ ఈవాక్యార్థము తరువాతి పనసలోఁ జెప్పఁబడును.

పంచాశత్తు ౬.

౩౯౬. ౧ సజాతావిశ్వానేవ దేవాన్త్స్వేన భాగధేయేనోపధావతి తఏవాస్మై సజాతాన్ప్రయచ్ఛన్తి గ్రామ్యేవభవతి ఛన్దసాంవా ఏషరసోయద్వైశారస

ఇవ ఖలు వై సజాతాశ్ఛన్దసామేవ రసేనరసగ్ం సజాతానవరున్ధే ౨ బార్హస్పత్యముక్షవశ మాలభేత బ్రహ్మవర్చసకామో బృహస్పతిమేవ స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మిన్బ్రహ్మవర్చసమ్।

౧ తనతోఁబుట్టినవారు లేనివాఁడు విశ్వేదేవతాకమైన యాగముచేసితే తనవిధివల్లనే తోఁబుట్టువులఁబొందును. విశ్వేదేవతలే యాతనికిఁ దోఁబుట్టువులనిచ్చెదరు. దానివల్ల గ్రామస్వామియగును. గొడ్డుదగు ఆవురసము ఛందస్సులరసమే. ఆ సోదరభృత్యాదులు ఆరసమువంటివారుకదా! ఆరసముచేతనే సోదరభృత్యాదులు యాగకర్తకుఁగల్గుదురు. ౨ బ్రహ్మవర్చస్సుఁగోరు పురుషుఁడు బృహస్పతి దేవతాకమగు వ్యర్థవీర్యముగల పశువునాలమ్భనము చేయవలయును. ఇట్టియజమానుఁడు బృహస్పతినే తానిచ్చిన హవిర్భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆబృహస్పతియే యీయజమానునియందు బ్రహ్మవర్చస్సును స్థాపించును. (అప్పుడు యజమానుఁడు బ్రహ్మవర్చస్సు కలవాడే యగుచున్నాఁడు. (వ్యర్థవీర్యముకలపశువు=ఎద్దు)

పంచాశత్తు ౭

౩౮౭. ౧ దధాతిబ్రహ్మవర్చస్యేవభవతి ౨ వశంవాఏషచరతి యదుక్షావశఇవ ఖలు వై బ్రహ్మవర్చసం వశేనైవవశంబ్రహ్మవర్చ సమవరున్ధే ౩ రౌద్రీగ్ం రోహిణీమాలభేతాభి చరన్రుద్రమేవ స్వేనభాగధేయే నోపధావతి తస్మాఏవైనమావృశ్చతి తాజగార్తిమార్ఛతి రోహిణీభవతి రౌద్రీహ్యే

షా దేవతయా సమృద్ధ్యై ౪ స్ఫ్యయూపో భవతి వజ్రో వై స్ఫ్యో వజ్రమే

వాస్మై ప్రహరతి శరమయం బర్హిః శృణాత్యై వైనం వైభీదక ఇధ్మో భినత్త్యే

వైనమ్ ॥

౧ ఈవాక్యార్థము పయిపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ఎద్దు యేది కలదో ఇదిగో కలిసికొనుచున్నది. ఎద్దు గోవులతో నరణ్యమునకుఁబోయి మఱల వాటివెనుకనే యింటికి వచ్చుచుండుట ప్రసిద్ధము. (అనగా నింద్రియ నియమము కలదని తాత్పర్యము.) బ్రహ్మవర్చస్సు అట్టియెద్దువంటిదే (ఇన్ద్రియ నియమముకల వానికి స్వాధీన పదార్థమని తా॥) (కావున నీ యెద్దు నాలంభనము చేసిన యజమానుఁడు) ఇంద్రియనియమముచేతనే స్వాధీనమైన బ్రహ్మవర్చస్సును బొందుచున్నాడు. ౩ శత్రువధనుఁగోరు పురుషుఁడు రుద్రదేవతాకమగు రోహిణీ పశువు నాలంభనము చేయవలయును. (అట్టి యజమానుఁడు) రుద్రునే తానిచ్చిన హావిర్భాగముచేఁ బొందును. ఆ యజమానునకై (రుద్రుఁడు) ఈశత్రువునంతటను భేదించును. (అప్పుడే శత్రువు) మరణముఁబొందును. రుద్రదేవతాకమయిన యీ రోహిణీ పశువు దేవతచే సమృద్ధి కొఱకగుచున్నది. (రోహిణీ = పశువిశేషము.) ౪ (అ ౨, అను ౫, పం ౭ లోని ౪-౫-౬ వాక్యములే యిచ్చట ఒకవాక్యముగాఁ గూర్చఁబడినవి. అర్థమచ్చటనే వ్రాయఁబడినది. కావున నచ్చట చూచుకొనవలయును.)

సప్తమానువాకము సమాప్తము.

— * —

అనువాకము ౮.

౫౮. ౧ ఆసావాదిత్యో న్వ్యరోచత తస్మై దేవాః ప్రాయశ్చిత్తిమైచ్ఛన్ త స్మా ఏతా

గం సౌరీగం శ్వేతాం వశామాఽలభన్త తయై వాస్మిన్రుచమదధు ౨
ర్యో బ్రహ్మవర్చసకామః స్యాత్తస్మా ఏతాగం సౌరీగం శ్వేతాం వశామా
లభేతాముమేవాఽఽదిత్యగం స్వేన భాగధేయేనోపధావతి స ఏవాస్మిన్బ్రహ్మ
వర్చసం దధాతి బ్రహ్మవర్చస్యేవ భవతి ౩ బైల్వో యూపో భవత్యసౌ।

౧ ఈ సూర్యుఁడు (పూర్వమొకప్పుడు) ప్రకాశించలేదు. ఆ ప్రకాశము కొఱకు దేవతలుపాయము నాలోచించిరి. ఆ సూర్యునికై సూర్యదేవతాకమైనట్టియు తెల్లనిదియునగు నీ వంధ్యగోవు నాలమ్భనము చేయఁబూనిరి. ఆ గోవుచేతనే (దేవతలు) ఈ సూర్యునియందుఁ గాంతినిఁ బోషింపఁ జేసిరి. ౨ ఎవఁడు బ్రహ్మవర్చస్సునుఁ గోరువాఁడగునో (వాఁడా) సూర్యునికై యీ సూర్యదేవతాకమైన తెల్లని వంధ్యగోవు నాలమ్భనము చేయవలయును. (ఇట్టి యజమానుఁడు) ఈ సూర్యునే తానిచ్చిన హవిర్భాగముతోఁ బొందును. ఆ సూర్యుఁడే యీ యజమానునియందు బ్రహ్మవర్చస్సును బోషింపఁ జేయుచున్నాఁడు. (అప్పుడా యజమానుఁడు బ్రహ్మవర్చస్వియగును.) ౩ దీనియర్థము ౨వ పంచాశత్తులో వివరింపఁబడును.

పంచాశత్తు ౨

౩౮౯. ౧ వాఽఽదిత్యో యతోఽజాయత తతో బిల్వ ఉదతిష్ఠత్సయోన్యేవ బ్రహ్మ
వర్చసమవరున్ధే ౨ బ్రాహ్మణస్పత్యాం బభ్రుకర్ణీమాలభేతాభిచరన్వా
౩ రుణం దశకపాలం పురస్తాన్నిర్వపేద్వరుణేనైవ భ్రాతృవ్యం

గ్రాహయిత్వా బ్రహ్మణాస్తృణుతే ౪ బభ్రుకర్ణీభవత్యై తద్వైబ్రహ్మ ణోరూపగ్ంసమృద్ధ్యై ౫ స్ఫ్యోయూపోభవతి వజ్రోవై స్ఫ్యో వజ్రమే వాస్మైప్రహరతి శరమయంబర్హిశ్శృణాతి ॥

౧ యూపము బిల్వవృక్షము (మారేడుచెట్టు) సమ్బన్ధమైనది. కావలయును. ఈ సూర్యుఁడెచ్చట పుట్టెనో! దానినుండియే బిల్వము పుట్టెను. (ఇప్పుడు సూర్య బిల్వములు రెండు నొకయోనినుండి పుట్టుటవలన నీ రెండును సమానయోని కలవ గుచున్నవి. (కావున యజమానుఁడు) సయోనియగు బ్రహ్మవర్చస్సునుఁ బొందు చున్నాఁడు. ౨ శత్రువధఁగోరు పురుషుఁడు బృహస్పతి దేవతాకమైనట్టియుఁ బింగళ వర్ణముగల చెవులతోఁ గూడిన పశువు నాలమ్భనము చేయవలయును. ౩ వరుణదేవ తాకము, పదికపాలములందు సంస్కృతమునగు పురోడాశమును, ముందుగసమర్పింప వలయును. (ఇట్టివాఁడు) వరుణపాశముచేతనే శత్రువులను గ్రహింపఁజేసి బృహస్ప తిదేవతాకమగు కర్మచే (శత్రువును) హింసించు చున్నాఁడు. ౪ పింగళవర్ణముగల చెవులుగలపశువు (ఆలమ్భనయోగ్య) మగుచున్నది. ఇదియే బృహస్పతియొక్క రూప మై సంపద నొసఁగుచున్నది. ౫ (అ౨ అను౫ పం ౨ లోని ౪, ౫, ౬, వాక్యములే యిచ్చట ఒకవాక్యముగాఁ గూర్చఁబడినవి. అర్థమచ్చటనే వ్రాయఁబడినది. కావున నచ్చట చూచుకొన వలయును. యూపస్తంభము స్ఫ్య అను నాయుధతుల్య ముగా నుండవలెను. స్ఫ్యయే వజ్రాయుధము వంటిది.)

పంచాశత్తు ౩.

తై౦. ౧ ఏవైనంవైభీదక ఇధ్మోభినత్త్యేవైనం ౨ వైష్ణవంవామనమాలభేత

యం యజ్ఞో నోపనమేద్విష్ణుర్వై యజ్ఞో విష్ణుమేవ స్వేనభాగధేయే నోపధా

వతిసఏవాస్మై యజ్ఞం ప్రయచ్ఛత్యుపైనం యజ్ఞోనమతివామనో భవతి

వైష్ణవో హ్యేషదేవతయాసమృద్ధ్యై 3 త్వాష్ట్రింవడబ మాలభేతపశు

కామస్త్వష్టావైపశూనాం మిథునానామ్ ।

౧ ఈవాక్యార్థము పూర్వపుపనసలోని 3వవాక్యములోనిదే ౨ ఎవనికి యజ్ఞముపొందదో ! వాఁడు విష్ణుదేవతాకమగు పొట్టిపశువు నాలమ్భనము చేయవల యును విష్ణువే యజ్ఞము. ఇట్టియజమానుఁడు విష్ణునే తానిచ్చిన హవిర్భాగము చేఁ బొందును. ఆవిష్ణువే యీయజమానునికై యజ్ఞము నొసఁగును. (అప్పుడే) యజ మానునియజ్ఞముపొందును. వామనపశువు విష్ణుదేవతాకమగుచున్నది. ఇది దేవత చే సమృద్ధికలిగించుచున్నది. 3 ఈవాక్యార్థము ౪వ పంచాశత్తులో వివరింపఁబడును.

పంచాశత్తు ౪.

3౯౧. ౧ ప్రజనయితా త్వష్టారమేవ స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మై

పశూన్మిథునాన్ప్రజనయతి ౨ ప్రజాహివా ఏతస్మిన్పశవః ప్రవిష్టాఅథై

షపుమాన్త్సన్వడబస్సాక్షాదేవప్రజాం పశూనవరున్ధే 3 మైత్రగ్ంశ్వేత

మాలభేతసఙ్గ్రామే సంయత్తే సమయకామో మిత్రమేవస్వేనభాగధేయే

నోపధావతి సఏవైనం మిత్రేణసంనయతి ।

౧ పశువులఁగోరు పురుషుఁడు త్వష్టృదేవతాకమగు బడబము (గుఱ్ఱము) నాలంభనము సేయవలయును. త్వష్టృదేవతయే మిథునములగు (జంటలగు) పశువులనుఁ బుట్టించునది. ఇట్టి యజమానుఁడు తానిచ్చిన పురోడాశభాగముచేఁ ద్వష్టృదేవునే పొందుచున్నాఁడు. ఆ త్వష్టయే యీ యజమానునకు మిథునములగు పశువులనుఁ బుట్టించుచున్నాఁడు. (లోకములోఁ బురుషునకు స్తనవృద్ధిచే నితరులు స్త్రీత్వము నెట్లూహింతురో, అట్లే గుఱ్ఱమునందుఁ గూడ నేదో యొకస్త్రీత్వలక్షణముండుటచే నితరములైన గుఱ్ఱములు దానిని ఆడగుఱ్ఱమను భ్రాన్తిచేఁ బొందుచుండును. ఆ గుఱ్ఱమునకు బడబమని పేరు.) ౨ ఈబడబమునందు (స్త్రీత్వలక్షణములుండుటచేఁ) బ్రజలు, పశువులు ప్రవేశించుచున్నారు. (అనఁగా దానియందు సంతానమునుఁ బుట్టించుటకు మఱియొక మొగగుఱ్ఱమునుఁ జేర్చుటకునై ప్రజలకుఁ బ్రవృత్తియనియు, ఆడగుఱ్ఱమనే భ్రాన్తిచే నితర పశువుల ప్రవృత్తియనియు భావము.) ఇట్టి మొగగుఱ్ఱమే బడబమగుచున్నది. (ఇట్టి బడబము నాలంభనము చేయుటచే యజమానుఁడు) శీఘ్రముగానే ప్రజలను, పశువులనుఁ బొందుచున్నాఁడు. ౩ యుద్ధము సన్నద్ధమగుచుండఁగా సంధినిఁగోరు పురుషుఁడు మిత్రదేవతాకమగు శ్వేతపశువు నాలంభనము చేయవలయును. (ఇట్టివాఁడు) తానిచ్చిన పురోడాశభాగముచే మిత్రదేవతను పొందుచున్నాఁడు. ఆ మిత్రదేవుఁడీ యజమానుని శత్రువునకు మిత్రత్వమునుఁ గల్పించి మిత్రునితోఁ గలుపును.

పఞ్చాశత్తు ౫.

౫౦ ౨. ౧ విశాలోభవతివ్యవసాయ యత్యేనైనం ౨ ప్రాజాపత్యం కృష్ణమాలభేతవృష్టికామః ప్రజాపతిర్వైవృష్ట్యా ఈశేప్రజాపతిమేవ స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మైపర్జన్యంవర్షయతి ౩ కృష్ణోభవత్యేతద్వైవృష్ట్యై

రూపగ్ం రూపేణైవవృష్టిమవరున్ధే ౪ శబలోభవతి విద్యుతమేవాస్మై

జనయిత్వావర్షయ ౫ త్యవాశృఙ్గోభవతి వృష్టిమేవాస్మైనియచ్ఛతి।

౧ ఈయుష్టియందు (యూపస్తంభము) విశాలమైయుండవలయును. (ఈపూర్వోక్త విధముగ సంధిని గోరుపురుషుని) నితరరాజు మిత్రునిగానే నిశ్చయించుచున్నాడు. ౨ వర్షముఁగోరుపురుషుఁడు ప్రజాపతిదేవతాకమగు కృష్ణపశువు నాలమ్భనము సేయవలెను. ప్రజాపతియేవర్షమునకు సమర్థుఁడగుచున్నాఁడు. (ఇట్టి యజమానుఁడు ప్రజాపతినే పొందును. ఆప్రజాపతియే యీయజమానునికై మేఘము వర్షింపఁజేయును. 3 నల్లనిపశువాలమ్భనయోగ్యమగుచున్నది. ఇదియే వర్షముయొక్క-రూపము. ఈరూపముచేతనే (యజమానుఁడు) వర్షముఁ బొందుచున్నాఁడు. ౪ చిత్రవర్ణముగల పశువాలమ్భనయోగ్యమగుచున్నది. (కాని యిది) మెఱుపును యజమానునికై పుట్టించి వర్షింపఁజేయును. ౫ క్రిందవైపునకు గొమ్ములుగల పశువు నాలమ్భనము చేయవలెను ఇది వర్షమునే యీ యజమానునకై యిచ్చును. (ఈ పశువధోముఖమగుటచే వర్షధారకు సమానమని వర్ణన)

అష్టమానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము ౯

౯౯౩. ౧ వరుణగ్ంసుషువాణ మన్నాద్యంనోపానమత్సఏతాం వారుణీంకృష్ణాం

వశామపశ్యత్తాగ్ం స్వాయై దేవతాయాఆऽలభతతతోవై తమన్నాద్యము

పానమ ౨ ద్యమలమస్మా ద్యాయసన్త మన్నాద్యం నోపనమేత్సఏతాం

వారుణీం కృష్ణాం వశామాలభేత వరుణమేవ స్వేనభాగధేయేనోపధావతి

సఏవాస్మాఅన్నం ప్రయచ్ఛత్యన్నాదః॥

౧ సోమాభిషవము (రసముపిండుట) జేసినవరుణుని నన్నాద్యము పొందలేదు. ఆవరుణుఁడు ఈవరుణదేవతాకమగు నల్లని వన్ధ్య (గొడ్డుది)పశువుఁజూచెను. దానిని తనదేవత కొఱకాలమ్భనముచేసెను. దానివలన (వరుణుఁడు) అన్నాద్యము నొందెను. ౨ అన్నముకొఱకు సమర్థుఁడగుచున్న నెవరినన్నాద్యము పొందదో! అతనీవరుణ దేవతాకమగు కృష్ణవన్ధ్య పశువు నాలమ్భనము సేయవలెను. (ఇట్టి యజమానుఁడు) అన్నాదుఁ డగును. వరుణదేవతాకమగు కృష్ణపశువు దేవతచే సమృద్ధి కొఱకునగుచున్నది. (అన్నాద్యము=అన్నభక్షణశక్తి.)

షణ్ణావింశత్తు ౨

౩-౪. ౧ ఏవభవతి కృష్ణాభవతి వారుణీహ్యేషా దేవతయా సమృధ్యై ౨ మైత్రం శ్వేతమాలభేత వారుణం కృష్ణమపాం చౌషధీనాం చసన్ధా వన్నకామో మైత్రీర్వా ఓషధయో వారుణీరాపోऽపాం చఖలువా ఓషధీనాం చరసముపజీవామో మిత్రావరుణావేవ స్వేన భాగధేయేనో పధావతి తావేవాస్మా అన్నం ప్రయచ్ఛతోऽన్నాద ఏవభవతి॥

౧ ఈవాక్యార్థమొకటవ పనసలో వివరింపబడినది. ౨ అన్నముఁగోరు పురుషుఁడు ఋతువుల యొక్కయు, నదీక్షేత్రముల యొక్కయు మధ్యయందు మిత్ర దేవతాకమగు శ్వేత (తెల్లని) పశువును, వరుణదేవతాకమగు నల్లనిపశువును ఆల మ్భనము సేయవలయును. ఓషధులు మిత్రదేవతాకములు. ఉదకములు వరుణదేవ తాకములు. ఆమిత్రావరుణదేవతలే యీయజమానునికై యన్నము నొసఁగుదురు. అప్పుడు యజమానుఁడన్నాదుఁడగును. (అన్నాదుఁడు=అన్నముఁ దినువాఁడు)

పంచాశత్తు ౩.

౩౯౭. అపాం చౌషధీనాం చసంధావాలభేత ఉభయస్యావరుద్ధ్యై ౧ విశాఖో యూపోభవతి ద్వేహ్యేతే దేవతే సమృద్ధ్యై ౨ మైత్రగ్ం శ్వేత మాలభేత వారుణం కృష్ణం జ్యోగామయావీ యన్మైత్రో భవతి మిత్రేణైవాస్మై వరు ణగ్ం శమయతి యద్వారుణ స్సాక్షాదేవైనం వరుణపాశాన్ముఞ్చత్యుత యదీతాసుర్భవతి జీవత్యేవ ౪ దేవావై పుష్టిం నావిన్దన్ ।

౧ ఉదకముల యొక్కయు, నోషధుల యొక్కయు,సంధి (వర్షాకాలమందు) యందు నాయుభయరసమును బొందుటకై (పూర్వోక్తమయిన పశువు) నాలంభన ము చేయవలయును. ౨ ఈపూర్వోక్త కర్మయందు యూపస్తంభము ద్వివిధము లైన కొమ్మలుకలదై యుండఁదగినది. (ద్వివిధమనగా నిచ్చట రెండని భావము) దేవ తా స్వరూపమైన యీరెండుశాఖలు సమృద్ధి కలిగించుచున్నవి. ౩ దీర్ఘరోగియ గు పురుషుఁడు మిత్రదేవతాకమగు తెల్లనిపశువును, వరుణదేవతాకమగు నల్లని

పశువును ఆలమ్భనము సేయవలయును. ఏదిమిత్రదేవతాకమో! అది మిత్రుని చేతనే యీ యజమానునికై (క్రూరుడగు) వరుణుని శమింపజేయును. ఏది వరుణ దేవతాకమో (అది) శీఘ్రముగనే యీ యజమానుని వరుణపాశములనుండి విడుచును. ప్రాణము పోయినవాడయ్యును మరలజీవించును. ౪ ఈవాక్యార్థము తరువాతిపనసలో వివరింపబడును.

పంచాశత్తు ౪.

౩౯౬. తాంమిథునేzపశ్యన్తస్యాం నసమరాధయన్తావశ్వినావబ్రూతామావయోర్వాఏషామైతస్యాం వదధ్వమిత్రిసాzశ్వినోరేవాభవ ౨ద్యః పుష్టికామస్యాత్సఏతా మాశ్వినీం యమీాం వశామాలభేతాశ్వినావేవ స్వేన భాగధేయేనోపధావతి తావేవాస్మిన్ పుష్టిం ధత్తః పుష్యతి ప్రజయాపశుభిః ॥

౧ దేవతలు (ప్రజాసమృద్ధి రూపమగు) పుష్టిని (బొందకపోయిరి.) (ఆ పుష్టి) మనుష్యమిథునమునందును, పశుమిథునమునందును (సంభవించునని యుపాయమును) జూచిరి. (కాని) యాపుష్టియందు సమర్థులుకారైరి. అప్పుడశ్వినీ దేవతలు ఈపుష్టిమాసంబన్ధమైనది. ఈపుష్టియందు మేము లేనప్పుడు మాట్లాడనే కూడదు. అనిపలికిరి. (కావున) నాపుష్టి యశ్వినీదేవతల యాధీనమైనది. ౨ పుష్టిని, గోరువాడు ఈయశ్వినీదేవతాకమగు కవలలో నొకటైన వన్ధ్యాపశువు నాలమ్భనము సేయవలయును. (ఇట్టియజమానుడు) అశ్వినీదేవతలనే తానిచ్చినహవిచే బొందును. అయ్యశ్వినీ దేవతలే యీయజమానునియందు పుష్టినిధరింపజేయుదురు. (అప్పుడు యజమానుడు) సంతానము చేతను పశువులచేతను సమృద్ధిబొందును.

ఏవమాద వాకము సమాప్తము.

అనువాకము ౧౦.

౬౯౭. ఆశ్వినం ధూమ్రలలామ మాలభేతయో దుర్బ్రాహ్మణస్సోమం పిపాసే దశ్వినౌహి దేవానామ సోమపావాస్తాం తౌపశ్చాసోమపీథం ప్రాప్నుతాం తావ శ్వినావేతస్య దేవతాయో దుర్బ్రాహ్మణస్సోమం పిపాసత్యశ్వి నావేవస్వే నభాగధేయే నోపధావతి తావేవాస్మై సోమపీథం ప్రయచ్ఛత ఉపైనగ్ం సోమపీథో నమతి యద్ధూమ్రో భవతి ధూమ్రిమాణమేవాస్మాదపహన్తి లలామః

౧ ఎవఁడు దుర్బ్రాహ్మణుఁడై సోమమును త్రాగనిచ్ఛకలవాఁడగునో (వాఁడు) అశ్వినీదేవ దేవతాక మలినమైన తెల్లరంగుగల పశువు నాలమ్భనము సేయవలయును. దేవతలలో నశ్వినీదేవతలే సోమపానముఁ జేయనివారైరి. అయ్యశ్వినీ దేవతలుపిమ్మట సోమపీథముంబొందిరి. ఈసోమపీథమున కశ్వినీదేవతలు దేవతలు. ఎవఁడు దుర్బ్రాహ్మణుఁడై సోమమును త్రావనిచ్ఛగలవాఁడగునో (వాఁడు) అశ్వినీదేవతలనే తా నిచ్చిన హవిర్భాగముచేతఁ బొందును. అయ్యశ్వినీ దేవతలే యీయజమానునకై సోమపీథమునిత్తురు. (అప్పుడు) ఈయజమానుని సోమపీథము పొందును. పశువు కేది పొగవంటిరంగు కలదో అది యీ యజమానునినుండి మాలిన్యమునే పోగొట్టును. శ్వేతవర్ణమేదికలదో (అది) ఈయజమానునియందు ముఖ్యమైన తేజస్సును పోషించును.

పంచాశత్తు ౨

౬౯౮. భవతిముఖత ఏవాస్మిన్తేజో దధాతి ౨ వాయవ్యం గోమృగమాలభేతయః

మజఘ్నివాగ్ం సమభిశగ్ం సేయురపూతావావేతం వాగృచ్ఛతి యమ
జఘ్నివాగ్ం సమభిశగ్ం సంతినైవగ్రామ్యాః పశురాన్నారణ్యా యద్గోమృగో
నైవగ్రామేనారణ్యే యమజఘ్నివాగ్ం సమభిశగ్ం సంతివాయుర్వై
దేవానాం పవిత్రం వాయుమేవ స్వేనభాగధేయేనోపధావతి సపవ ॥

౧ ఈ వాక్యార్థము పూర్వపు పఞ్చాశత్తులో విస్తృతము. ౨ హింస చేయనట్టి పురుషుని (హింసచేసినవానినిగ) నిందింతురో వాడు వాయుదేవతాకమగు అడవిగోవును ఆలమ్భనము సేయవలయును. ఏహింసచేయనివానిని (వ్యర్థముగ) నిందింతురో ఇట్టివానిని నిందారూపమగు వాక్కువొందును. ఏపశువు గోమృగమో ఇదిగ్రామ్యము (గ్రామమునందలిది) కాదు (ఆరణ్యకమృగమునందు పుట్టుటయే దీనికి గారణము) ఇదియారణ్యకముగాదు. (గ్రామ్యవృషభమువలనఁబుట్టుటయే దీనికికారణము) హింసఁజేయనట్టి యేపురుషునివ్యర్థముగ నిందింతురో ఇయ్యపనిన్దితుఁడు (లేని నిందపడినవాఁడు) గ్రామమునందు నివసించుట కర్హుఁడు) కాడు. (బంధువులతోఁగూడ వ్యవహారము లేక పోవుటయే దీనికికారణము. (వాన ప్రస్థాదులవలె) అరణ్యమునందు నివసించుట కర్హుఁడుకాఁడు. వాయుదేవతయే దేవతలలోఁబవిత్రమైనది. (ఈపూర్వోక్త యజమానుఁడు) వాయువునే తనభాగముచేఁబొందును. ఆవాయువు యీయజమానునిఁబవిత్రుఁ జేయును. (ఇచ్చట గోమృగమనగా - ఆవుతోఁగూఁడ నరణ్యమందు సంచరించుటకు వెళ్ళినవృషభమువలన నొకానొక యరణ్యగోవునందు పుట్టినమృగవిశేషమని భావము. ఒకానొక పురుషుఁడు బ్రాహ్మణునిచంపని వాఁడైనను వీనిని బ్రహ్మహన్తయని వ్యర్థముగ జనులు నిందించినప్పుడు వీనికీ పశువు విధించఁబడినది) కొన్ని విషయములలో వీనికి బూర్వోక్తములకుంగూడ సామ్యము చెప్పఁబడినది..

పంచాశత్తు ౩.

౩౮౯. ఏనంపవయతి ౨ పరాచీవా ఏతస్మై వ్యుచ్ఛన్తీ వ్యుచ్ఛతితమః పాప్మానం ప్రవిశతియస్యాఽఽశ్వినేశస్యమానే సూర్యోనాఽఽవిర్భవతిసౌర్యం బహురూప మాలభేతామమేవాఽఽదిత్యగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మాత్తమః పాప్మానమపహన్తి ప్రతీచ్యస్మై వ్యుచ్ఛన్తీ వ్యుచ్ఛత్యపతమః పాప్మానగ్ంహతే॥

౧ ఈవాక్యార్థము పూర్వపుపనసలో వివరింపఁబడె. ౨ (అగ్నిర్హోతాగృహపతిః సరాజేత్యాది సహస్రసంఖ్యల ఋక్కులతోఁగూడుకొనిన శస్త్రము (మంత్రము) ఆశ్వినమనఁబడును.) అది అతిరాత్రియాగమునందు రాత్రియను నామాంతరముగల శస్త్రములు పఠించినపిమ్మట నుషఃకాలమునకుఁబూర్వము నారంభించవలయును. ఆశస్త్రమారంభించఁబడినదగుచుండగా సూర్యుఁడుదయించి మేఘావరణములేకుండగనే ఎపుడుకనఁబడునో యజమానుఁడు ఈపశువు నాలమ్భనము సేయనవసరములేదు) (ఏయజమానునికప్పుడు సూర్యుఁడుదయించడో) ఈయజమానునికై యనురాగములేనిదై రాత్రి ప్రాతఃకాలముంబొందుచున్నది. (అప్పుడు) యజమానుఁడు (ప్రకాశవిరుద్ధమగు) చీఁకటిని, స్వర్గవిరుద్ధమగు పాపమును బొందును. ఎవని కశ్వినము (ఆశ్వినమని గురించినయాగము) ప్రయోగింపఁబడినదగుచుండగా సూర్యుఁడావిర్భవించఁడో (అట్టి పూర్వోక్త యజమానుఁడు సూర్యదేవతాకమగు బహువర్ణము లుకల పశువు నాలమ్భనము చేయవలయును. (ఈయజమానుఁడు) ఈసూర్యునే తానిచ్చిన హవిర్భాగముచేఁబొందును. ఆసూర్యుఁడే ఈయజమానునుండి తమస్సును. పాపమునుఁబోఁగొట్టును. ఈయజమానునికొఱకు రాత్రియనురాగముకలదై తమస్సును పాపమును, బోఁగొట్టును.

దశమానువాకము సమాప్తము.

అనువాకము ౧౧.

४०० ౧ ఇన్ద్రంవో విశ్వతస్పరీన్ద్రం నరో మరుతో యద్వో దివో యావః శర్మ
౨ భగేష్విన్ద్రగ్ం సుహవగ్ం హవామహేఽగ్ంహో ముచగ్ం సుకృతం
దైవ్యంజనమ్। అగ్నింమిత్రం వరుణగ్ంసాతయే భగంద్యావాపృథివీమరు
తః స్వస్తయే। ౩ మమత్తునః పర్జన్యోవసర్వా మమత్తువాతో అపాంవృష
ణ్వాన్। శిశీతమిన్ద్రాపర్వతా యువం నస్తన్నోవిశ్వేవరివస్యన్తుదేవాః। ४
ప్రియావోనామ॥

౧ ("ఇంద్రంవో విశ్వతస్పరీంద్రం నరో మరుతః" ఈభాగము ౬వ ప్రపా
ఠకమునందలి యంత్యానువాకమున జెప్పఁబడినది. "యద్వోదివోయావఃశర్మ"
ఈభాగము ౫వ ప్రపాఠకమునందలి యంత్యానువాకమునందుఁ జెప్పఁబడినది.
పీటికర్థమచ్చటనే వ్రాయఁబడినది.) ౨ సుఖముగనాహ్వానించుటకై శక్యమై
నట్టియు, బాపమునుండి విడిపింపఁజేయు నట్టియు, శోభనమైన హితమునుఁజే
యునట్టియు, స్వర్గమునందున్నట్టియు, సస్యాదులను (వర్షముద్వారా) బుట్టించు నట్టి
యు, నగ్నిని, నింద్రుని, మిత్రదేవుని, వరుణుని, భగదేవుని, ద్యావాభూములను, మరు
ద్దేవతలను (నావిస్సులు) సంపాదించఁబడినవగుచుండగా (యజమానునియొక్క)
శ్రేయస్సుకొఱకు (దేవతలకయి, హవిస్సు నిచ్చుటకొఱకునుఁ బిలుచుచున్నారము.
౩ సర్వమును భక్షించునట్టియగ్నిదేవుడు మమ్ము సంతోషింపఁ జేయుగాక. పగ
టిని గలిగించునట్టి సూర్యదేవుడు మమ్ము సంతోషింపఁజేయుగాక. వాయుదేవుడు
మమ్ము సంతోషింపఁజేయుగాక. ఉదకములకు వర్షకుడగు మేఘుడు మమ్ము

సంతోషింపజేయుగాక. ఓ యింద్ర, హిమవత్పర్వతములారా! మీరు మమ్ము సూక్ష్మముగఁ జేయుడు. ( అనగా పాపభూయిష్ఠులమగు మాకు పాపక్షయమును చేయుడని భావము. ) ఆ హవిస్సు నిచ్చుటచే సమస్తదేవతలును మమ్ముఁ బరిచర్య చేయు సమయమందు కృపతోఁ జూతురుగాక.

పంచాశత్తు ౨.

౮౦౧. హవేతురాణామ్। ఆయత్తృపన్నరుతో వావశానాః ౨ శ్రియసేకంభానుభిస్సంమిమిక్షిరేతే రశ్మిభిస్తఋక్వభిస్సుఖాదయః। తేవాశీమంతఇష్మిణో అభీరవో విద్రే ప్రియస్యమారుతస్యధామ్నః ౩ అగ్నిః ప్రథమోవసుభిర్నో వ్యాత్సోమో రుద్రేభిరభిరక్షతుత్మనా। ఇన్ద్రోమరుద్భిరృతుధాకృణోత్వాదిత్యైర్నో వరుణః సగ్ం శిశాతు ४ సంనోదేవోవసుభిరగ్నిస్సమ్॥

౧వ పనసలోని ४వ వాక్యమునకుఁగూడ నీపనసయందలి మొదటివాక్యముతోఁ గలిపి అర్థము వ్రాయఁబడుచున్నది.

౧ ఓ మరుద్దేవతలారా! హవిస్సును స్వీకరించుటనుగూర్చి త్వరపడుచున్న మీయొక్క నామధేయములను పిలుచుచున్నాను. ఏకారణముచే మీరు తృప్తిని గోరుచున్న వారలయియుంటిరో ( ఆకారణముచే పిలుచుచున్నాను. )

౨ ఆవాయువులు (పురోవాతరూపులగుచు) సుఖము నాశ్రయించుటకయి ప్రకాశకములగు సూర్యకిరణములతో కూడుకొనినవయి ( వృష్టిచే భూమిని ) తడుపుటకుఁ గోరుచున్నవి ౩ వాయువులు యాజ్యాపురోను వాక్యరూపములగు ఋక్కుచేస్తోత్రముచేయఁబడిన వగుచు శోభనమగు హవిస్సును భక్షించినవి. పిమ్మట నా వాయువులు తోహములవల్లఁ గలిగిన వ్రోత రూపములైన బహువిధశబ్దములు కల

వగుచు (స్వగృహములఁ గూర్చి) గమనము కలవియు, (తమకార్యము సిద్ధమగుటచే రాక్షసులనుండి) భయము లేనివియునై ప్రియమైన మరుద్దేవతల సమ్బన్ధమగు స్థానముఁ బొందినవి. 3 వసువులతోఁ గూడుకొనిన యగ్నిదేవుఁడు మమ్ము రక్షించుగాక। రుద్రులతోఁ గూడుకొనినసోముఁడు స్వయముగానే (ప్రీతిపురస్సరముగా) రక్షించుగాక! మరుద్దేవతలతో (గూడుకొనిన) యింద్రుఁడాయా ఋతువుల కుచితములగు భోగముల ననుభవించుచున్న మమ్ము రక్షించుగాక. అదిత్యులతో (గూడు కొనిన వరుణదేవుఁడు) మమ్ము బాగుగననుష్ఠించిన వ్రతముగల వారినిగఁ జేయుఁగాక ! ర ఈ వాక్యమున కర్థము తరువాతి (3వ) పంచాశత్తుతోఁ జేర్చి వివరింపఁబడును.

పంచాశత్తు 3.

ర౦౨. ౧ సోమ స్త్వనూభీ రుద్రియాభిః సమిన్ద్రో మరుద్భి రృజ్ఞియైగ సమాదిత్త్యైర్నో వరుణో అజ్ఞ్షిపత్ ౨ యథాzzదిత్యా వసుభిః సంబభూవుర్మరుద్భి రుద్రాః సమజానతాభి ఏవాత్రిణామన్నహృణీయ మానావిశ్వేదేవాః సమనసోభవన్తు 3 కుత్రాచిస్యస్య సమృతౌరణ్వావ రోన్నృషదనే అర్హంతాశ్చిద్యమిన్ధతే సంజనయన్తి జన్తవః ర సంయదిషో వనామహేసగ్ం హవ్యామానుషాణామ్ ఉతద్యుమ్నస్య శవసః॥

౧ వసువులతోఁ (గూడుకొనిన) అగ్నిదేవుఁడు మాకు బాగుగ ననుష్ఠానము ను దెలియఁజేయుఁగాక. రుద్రసంబంధములగు శరీరములతోఁ (గూడుకొనిన) సోముఁడు మాకు బాగుగ ననుష్ఠానమును దెలియఁజేయుఁగాక. యజ్ఞమునకు యోగ్యులగు మరుత్తులతోఁ గూడుకొనిన యింద్రుఁడు మమ్ముఁ గూర్చి బాగుగననుష్ఠానమును

దెలియఁజేయుఁగాక. ఆదిత్యులతోఁ గూడఁ గొనిన వరుణుఁడు మమ్ముఁ గూర్చి బాగుగ ననుష్ఠానమును దెలియఁజేయుఁగాక. ౨ (పూర్వోక్తసంఘ చతుష్టయ మధ్యవర్తులగు దేవతలలో) ఏ విధముగ (వరుణసమీప వర్తులగు) నాదిత్యులు (అగ్నిసమీపము నందున్న) వసువులతో కలిసికొని (ప్రీతియుక్తులైరో!) ఏ విధముగ (నింద్రసమీప మందున్న) మరుత్తులతో (సోమసమీపమందున్న) రుద్రులు (జ్యేష్ఠత్వమును) బాగుగఁ దెలిసికొనిరో! ఆహవనీయ, గార్హపత్య, దాక్షిణాత్యముల రూపములుకాని) హవ్యవాహన, కవ్యవాహన, సహరక్షో రూపములుకాని, కలిగిన యో యగ్నీ! (రుద్రాదు లేవిధముగానో) ఈ విధముగానే (రుద్రాదుల సమీపమందున్న యితర సర్వదేవతలు (శత్రువులచే) నపహరింపఁబడని యైశ్వర్యము కలవారలు, పరస్పర సమాన మనస్సుకలవారును నగుదురుగాక. ౩ ఏ స్విష్టకృద్దేవతయొక్క సంగతి కలుగుచుండగా మనుష్యస్థానము నందెచ్చటనైనను మనుజులు క్రీడించుచున్నవారలై యుంటున్నారో, (మఱియు) నే స్విష్టకృద్దేవతనుఁ బూజించుచున్నవారలే యగుచు నగ్నినిఁ బ్రజ్వలింపఁ జేయుచున్నారో, (ప్రజ్వలింపఁ జేసియు) యజమానులు ఫలమును పుట్టించుచున్నారో, (అటువంటి స్విష్టకృద్దేవత యనుగ్రహించుఁగాక.) ౪ ఏ కారణమువలనఁ గోరబడుచున్నములను (స్విష్టకృద్దేవతానుగ్రహముచే) బాగుగ సేవించుచున్నారమో! యజమానులయొక్క హోమయోగ్యములగు ద్రవ్యమును సేవించుచున్నారమో! మఱియు ధనముయొక్కయు, బలముయొక్కయు, యజ్ఞముల యొక్కయు, సత్కర్మను స్వీకరించుచున్నారమో, (ఆ కారణమువలన నీ విధముగనను గృహీతయగు స్విష్టకృద్దేవతను సేవించుచున్నారము.)

పంచాశత్తు ౪.

౪౦౩. ఋతస్య॑ క్షిప్రమాద॑దే ౧ యజ్ఞో దేవానాం ప్రత్యే॑తిసుమ్న మాది॑త్యాసో
భవ॑తా మృడయ॑న్తః అవో॑ z ర్వాచీసుమ॑తిర్వ వృత్యాద॑గ్ం హోశ్చిద్వ్యోరి

వో వి త్రరాऽసత్ ౨ శుచిరపః సూయవసా అదబ్ధఉపక్షేతి వృద్ధవయాః సువీరః నకిష్టం ఘ్నన్త్యన్తితో నదూరాద్య ఆదిత్యానాం భవతిప్రణీతౌ ౩ ధారయన్త ఆదిత్యాసో జగత్స్థాదేవా విశ్వస్య భువనస్యగోపాః దీర్ఘాధియో రక్షమాణాః ॥౪॥

౧ ఈయజ్ఞము దేవతలయొక్క సుఖమునుగలిగించుటకు ప్రవర్తించుచున్నది. ఓ యాదిత్యులారా! మీరు మమ్ము సుఖింపఁజేయువారలై యుండుఁడు. మీయొక్క యనుగ్రహబుద్ధి మాయందు ప్రవర్తించుచున్నదగు నావృత్తినిఁ (మఱలవచ్చుట) బొందుఁగాక. ఏయనుగ్రహబుద్ధి మాపాపమునుగూడ నశింపఁజేయునో, ఆయనుగ్రహ బుద్ధి గొప్పసేవను గుఱ్తెఱింగినదై యుండుఁగాక. ౨ శోభనమగు నన్నాదిభోగ్యము కలిగినట్టియు, నెవరిచేతనుఁ దిరస్కృతుఁడుకానట్టియు, దీర్ఘమగు నాయుస్సుకలిగినట్టియు, శోభనములగుపుత్ర, భృత్యాదులు కలిగినట్టి, యీయజమానుఁడు శుచియగుచు ననుష్ఠింపఁబడు కర్మసమీపమునుఁ బొందుచున్నాఁడు. ఏయిటువంటియజమానుఁడు ఆదిత్యులయొక్క (ప్రణయన) కర్మయందు ప్రవర్తించుచున్నాఁడో! ఆయజమానుని శత్రువులు సమీపమునందు నశింపఁజేయఁజాలరు. దూరమునుండియు నశింపఁ జేయఁజాలరు. ౩ (యజమానుని స్వర్రాష్ట్రమునందు) స్థాపించుచున్నట్టియు, సమస్త ప్రపంచము ననుగ్రహించుటకు (అచ్చటచ్చట) యుంటున్నట్టియు ప్రకాశించుచున్నట్టియు, బ్రపంచమునకు పాలకులైనట్టియు, (జగత్తును ధరింపఁజేయుట) దీర్ఘమగుబుద్ధి కలిగినట్టియు, యజమానునిహితమునకైనకర్మను రక్షించుచున్నట్టియు, సత్యవాక్కుతోఁగూడుకొనినట్టియు, (శత్రువునకు దారిద్ర్యమును సంపాదింపఁజేయుటకై) ననేక ఋణములు సంపాదింపఁజేయుచున్న యాదిత్యులు (మాకభిమతేముఁ జేయుదురుగాక.

పంచాశత్తు ౫

౪౦౪. ౧ అసుర్యమృతా వానశ్చ్యయమానా బుణాని ౨ త్రిస్రోభూమిర్ధారయ
గ్ం రుతద్యూంత్రీణి వ్రతావిదథేఅన్తరేషామ్ బుతేనాzzదిత్యా మహివోమ
హిత్వం తదర్య మన్వరుణ మిత్రచారు ౩ త్యాన్నుక్షత్రియాగ్ం అవఆది
త్యాన్యాచిషామహే సుమృడీకాగ్ం అభిష్టయే ౪ నదక్షిణా విచికితేనస
వ్యానప్రాచీన మాదిత్యానోతపశ్చాపాక్యాచిద్వసవోధీర్యాచిత్ ॥౫॥

౧ ఈవాక్యమునకర్థము పై (౧౮) పంచాశత్తులోని ౩వవాక్యముతోఁజేర్చి వివరింపఁబడినది. ౨ ఓసూర్య, వరుణ, మిత్రదేవతలారా ! మీయొక్క యీమహిమత్వము రమణీయమైనదియు, గొప్పదియు (నగుచున్నది) (ఎట్లనగా ! మీరు; స్వర్గ మర్త్య, పాతాళ, రూపములగు మూఁడుభూములనుధరించువారలును, సూర్య, చంద్ర, వహ్నిగతములగు మూఁడు ప్రకాశములను ధరించువారలును, (నగుచున్నారు.) (మఱియు) యజమానులయొక్క యజ్ఞములం దేమూఁడువ్రతములు లోపలనున్నవో! (మనో, వాక్కాయ. నిష్పాద్యములు కాని, నిత్య, నైమిత్తిక, కామ్యరూపములు కాని) ఆసర్వకర్మలను సత్యవచనముచే ధరించుచున్నవారలు. ౩ (ఎవరియొక్క మాహాత్మ్య ము పూర్వమంత్రమునందు విస్తరింపఁబడినదో ! )వారేమైనట్టియు, క్షత్రియులవలె ప్రబలులైనట్టియు, బాగుగ సుఖముఁజేయునట్టి యాదిత్యులను నిష్టసిద్ధికొఱకుఁ బ్రార్థించుచున్నారము. ౪ ఓనివసింపఁజేయునట్టి యాదిత్యులారా ! (శత్రుకృతమైన యపరాధముచే మిక్కిలి మూఢచిత్తుఁడగు నేను) పరిపక్వముకాని బుద్ధికలిగినట్టియు, భయముకల బాలునివలె యిది సవ్యమని తెలుసుకొనుట లేదు. ఇదిప్రాచీన (తూర్పు) మనియు తెలుసుకొనుటలేదు. ఇది దక్షిణమనియు తెలుసుకొనుటలేదు ఇది ప్రతీచీన (పడమర) మనియు తెలిసికొనుటలేదు. మిమ్ము స్వకీయమగు నేకర్మసమూహము

కలదో దానిని మీాకే పొందించినవాఁడనగుచు శత్రుభయరహితుఁగు వివేక జ్ఞానమును పొందుదును.

పంచాశత్తు ౬.

౪౦౫. యుష్మానీతో అభయం జ్యోతిరశ్యామ్। ౨ ఆదిత్యానామవసానూతనేనసక్షీ మహిశర్మణా శంతమేన। అనాగాస్త్వే అదితిత్వేతురాసఇమం యజ్ఞం దధతుశ్రోషమాణాః। 3 ఇమంమేవరుణ శ్రుధీహావమద్యాచమృడయ త్వామవస్యురాచకే ౪ తత్త్వాయామిబ్రహ్మణా వందమానస్త దాశాస్తే యజమానోహవిర్భిః। అహేడమానోవరుణేహ బోధ్యురుశగ్ం సమాన ఆయుః ప్రమోషీః ॥

౧ ఈవాక్యమునకర్థము పై (౩౯౪) పంచాశత్తులోని నాల్గవవాక్యముతోఁ జేర్చివివరింపఁబడినది. ౨ (యజమానులమగు మేము) ఆదిత్యులసంబంధమగు నూతనరక్షణముతోఁ గూడుకొనినవారలమై, మిక్కిలిశాంతమైన గుణముతో కలుసుకొందుము. ఓయాదిత్యులారా ! (మీారు) మీాయొక్క అపరాధశూన్యత యెల్లప్పుడు వదలకుండుట లేకవిడువకుండుట నిమిత్తములగుచుండగా మాస్మృతిని వినుచున్నవారలు, త్వరపడుచున్నవారలునై ఈయజ్ఞమునుధరింపఁజేయుదురుగాక. 3 ఓ వరుణుడా ! నాసంబంధమయిన యాహ్వానమును వినుము. వినియు నిప్పుడు మమ్ములను సుఖపెట్టుము. నేనును పరిపాలించుబుద్ధికలవాఁడనై నిన్నంతటను ప్రార్థించుచున్నాను.

౪ ఆరక్షణమునకై మంత్రముచే నినుఁబొందుచున్నాను. ఈయజమానుఁడు హవి

స్సులచేఁ బూజించి యారక్షణముఁ గోరుచున్నాఁడు. ఓవరుణుఁడా ! కోపము లేని వాడవై యీకర్మయందు మావిజ్ఞాపనమునుఁ దెలిసికొనుము. ఓగొప్పస్తోత్రముకలవాఁడా! మాయొక్కయాయువును నాశనము చేయకుము.

ఏకాదశానువాకము సమాప్తము.

ప్రథమప్రపాఠకము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

—*—

## ద్వితీయప్రపాఠకము.

### అనువాకము ౧.

౪౦౬. ౧ ప్రజాపతిః ప్రజా అసృజత తాః సృష్టా ఇన్ద్రాగ్నీ అపాగూహతాగ్ం సోఽ
చాయత్ప్రజాపతి రిన్ద్రాగ్నీ వై మే ప్రజా అపాఘుక్షతామితి స ఏతమైన్ద్రాగ్నమే
కాదశకపాల మపశ్యత్తం నిరవపత్తావస్మై ప్రజాః ప్రాసాధయతా ౨ మిన్ద్రా
గ్నీ వా ఏతస్య ప్రజామప గూహతో యోఽలం ప్రజాయై సన్ప్రజాం నవిన్దత
ఐన్ద్రాగ్న మేకాదశకపాలం నిర్వపేత్ప్రజాకామ ఇన్ద్రాగ్నీ॥

౧ ప్రజాపతిప్రజలను సృజించెను. సృజింపఁబడిన యాప్రజల నింద్రాగ్నులా చ్ఛాదనము (కప్పుట) చేసిరి. నాప్రజల నింద్రాగ్ను లాచ్ఛాదనము చేసిరని యా ప్రజాపతి చింతించెను. (పిమ్మట) ఆప్రజాపతి యింద్రాగ్ని దేవతాకమును, పదు నొకండు కపాలములందు (=పెంకులందు) సంస్కృతము (మంత్రములు చదివి శుద్ధిచేయుట) నగుపురోడాశమును (ఇంద్రాగ్నులను వ్యక్తముచేయుటకు సాధన ముగా) జూచెను. ఆపురోడాశమను నిర్వాపము (దేవతార్పణము) చేసెను. (ఆనిర్వాపముచేనా) ప్రజలను ప్రజాపతికొఱ కింద్రాగ్నులు వ్యక్తముచేసిరి. (ఆచ్ఛాదనము=దాచుట) ౨ ఏపురుషుఁడు సంతానము (నుఁబుట్టించుట) కొఱకు సమర్థుఁడగుచు సంతానమును బొందుటలేదో, వీనియొక్క సంతానము నింద్రాగ్ను లే దాచుచున్నారు. (కావున) సంతానముఁ బడయఁగోరువాఁడు ఇంద్రాగ్నులు దేవ తలుగాఁగలదియు, బదునొకండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టి యజమానుఁడు) ఇంద్రాగ్నులనే తానిచ్చినహవి

ర్భాగముచేఁ బొందుచున్నాఁడు. వారే యీయజమానునికొఱకు సంతానము నిచ్చుచున్నారు. (అప్పుడు యజమానుఁడు) సంతానముఁ బొందుచున్నాఁడు.

పంచాశత్తు ౨

౪౦౭. ఏవస్వేనభాగధేయేనోపధావతి తావేవాస్మైప్రజాం ప్రసాధయతో విన్ద తేప్రజా ౨ మైన్ద్రాగ్నమేకాదశకపాలం నిర్వపేత్స్పర్ధమానః క్షేత్రేవా సజాతేషువేన్ద్రాగ్నీ ఏవస్వేనభాగధేయే నోపధావతి తాభ్యామే విన్ద్రియం వీర్యం భ్రాతృవ్యస్యవృఙ్క్తే విపాప్మనాభ్రాతృవ్యేణ జయతే ౩ ఽపవావేత స్మాదిన్ద్రియం వీర్యం క్రామతియః సఙ్గ్రామముపప్రయాత్యైన్ద్రాగ్న మేకాదశకపాలం ని౪॥

౧ దీనియర్థము ౧వ పంచాశత్తులోని ౨వ వాక్యార్థముతోఁ జేర్చి వ్రాయఁబడినది. ౨ భూమివిషయమైకాని, బంధువులవిషయమైకాని, స్పర్ధ(అసూయ) కల పురుషుఁడు ఇంద్రాగ్నులు దేవతలుగాఁగలదియుఁ, బదునొకండు కపాలము (=పెంకు) లందుసంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము (దేవతార్పణము) సేయవలయును. (ఇటులఁ జేసిన యజమానుఁడు) తానిచ్చినహవిర్భాగముచే నింద్రాగ్నులనే పొందుచున్నాఁడు. వారిద్దరిచేతనే శత్రువుయొక్క సామర్థ్యమును నాశనము చేయుచున్నాఁడు. (స్వయముగాఁ) బాపిష్ఠియగుశత్రువుచే (విరోధింపఁబడినవాఁడై) విజయము నొందుచున్నాడు. ౩ ఏపురుషుఁడు యుద్ధమునందుఁ జేరుచున్నాఁడో, వీని నుండి యింద్రియగతమైన శక్తి తొలఁగిపోవుచున్నది. (కావున) యుద్ధమునుఁగూర్చి

పోవువాఁడు ఇంద్రాగ్నిదేవతాకమును, పదునొకండు కపాలములందు సంస్కృతము నగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (అట్టివాఁడు) తానిచ్చినహవి ర్భాగముచే నింద్రాగ్నులనే పొందుచున్నాఁడు. ఆయింద్రాగ్నులే ఈయజమానుని యందింద్రియగతమగు సామర్థ్యమునుంచుచున్నారు. (ఇట్టి యజమానుఁడు) ఇం ద్రియగత శక్తితోఁ (గూడుకొనినవాఁడై యుద్ధమునఁగూర్చి) పోవుచున్నాఁడు. (పోయి) ఆయుద్ధమునజయించుచున్నాఁడు.

పఞ్చాశత్తు ౩

౧౦౭. ౧ య ఏవ స్సఙ్గ్రామ ముప ప్రయాస్యన్థ్సాద్గ్ని ఏవ స్వేన భాగధేయే నోపధావతి తావేవాస్మిన్నిన్ద్రియం వీర్యందధత్తః సహేన్ద్రియేణ వీర్యేణోపప్రయాతిజయతి తగ్ం సంగ్రామం ౨ వివా ఏష ఇంద్రియేణ వీర్యేణర్ధ్యతే యః సంగ్రామం జయత్యైన్ద్రాగ్న మేకాదశకపాలం నిర్వపేత్సఙ్గ్రామం జిత్వేన్ద్రాగ్నీ ఏవ స్వేన భాగధేయే నోపధావతి తావేవాస్మిన్నిన్ద్రియంవీర్యమ్॥

౧ దీనియర్థము ౨౬ పంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ఏపురుషుఁడు యుద్ధమున జయించుచున్నాఁడో, వాఁడు (యుద్ధశ్రమవలన) ఇంద్రియగత సామర్థ్యముచే వియుక్తుఁడగుచున్నాఁడు (కావున) ఇంద్రాగ్ని దేవతాకమును, పదునొకండుకపాలము (లను) లందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము (దేవతార్పణము) సేయవలయును. (ఇట్లు చేయఁగానతఁడు) యుద్ధమును జయించి యింద్రాగ్నులను తానిచ్చిన హవిర్భాగముచే పొందుచున్నాఁడు. ఆయింద్రాగ్నులే యీయజమానునియం దింద్రియగతమగు సామర్థ్యము నుంచుచున్నారు. (అప్పుడు యజమానుఁడు, ఇంద్రియగతమగు శక్తిలేనివాఁడు గానేరఁడు.

పంచాశత్తు ౪.

౪౦౯. ౧ ధత్తో నేన్ద్రియేణ వీర్యేణావ్యృధ్యతే ౨ ఽప వా ఏతస్మాదిన్ద్రియం వీర్యం
క్రామతి య ఏతి జనతామైన్ద్రాగ్న మేకాదశకపాలం నిర్వపేజ్జనతామేష్య
న్నింద్రాగ్నీ ఏవ స్వేన భాగధేయే నోపధావతి తావేవాస్మిన్నింద్రియంవీర్యం
ధత్తః సహేంద్రియేణ వీర్యేణజనతామేతి ౩ పౌష్ణంచరు మనునిర్వపే
త్పూషా వా ఇంద్రియస్య వీర్యస్యానుప్రదాతా పూషణమేవ ॥

౧ దీనియర్థము ౩వ పంచాశత్తులో వ్రాయఁబడినది ౨ జయముసూచించు కథలలోఁ దనవిద్యనుఁ బ్రకటించుట కొఱకు సభను జయించవలెనని యిచ్ఛకల ఏ యజమానుఁడు సభనుఁ బొందునో, వీనినుండి యింద్రియగతమగు సామర్థ్యము తొలగిపోవుచున్నది. (కావున) సభనుఁ బొందనిచ్ఛకలవాఁడు ఇంద్రాగ్ని దేవతాక మును, పదునొకండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (అట్టి యజమానుఁడు) తానిచ్చిన హవిర్భాగముచే నింద్రాగ్నులనే పొందుచున్నాఁడు. ఆ యింద్రాగ్నులే యీ యజమానునియం దింద్రియగతమగు సామర్థ్యము నుంచుచున్నారు. (అప్పుడాతఁడు) ఇంద్రియగతమగు సామర్థ్యముతో సభను జేరుచున్నాఁడు (అనఁగా సభలో జయమందునని తా॥) ౩ (మఱియు) పూషదేవతాకమగు చరువును నిర్వాపము చేయవలయును. పూషదేవతయే యిం ద్రియ గతమగు వీర్యమునకు దాత. (ఇట్టి యజమానుఁడు) తానిచ్చిన హవిర్భాగ ముచేఁ బూషదేవతనే పొందుచున్నాఁడు. ఆపూషదేవుఁడే యీయజమానుని కొఱకు నింద్రియగతమగు వీర్యము నిచ్చుచున్నాఁడు. (చరువు = హవిర్విశేషము.)

పఞ్చాశత్ ౫.

౪.౧౦. ౧ స్వేనభాగధేయేనోపధావతి స ఏవాస్మా ఇన్ద్రియం వీర్యమనుప్రయచ్ఛతి ౨ క్షేత్రపత్యంచరుం నిర్వపేజ్జనతామాగత్యేయం వై క్షేత్రస్య పతిరస్యామేవ ప్రతితిష్ఠత్యై ౩ న్ద్రాగ్నమేకాదశ కపాల ముపరిష్టాన్నిర్వపేదస్యామేవ ప్రతిష్ఠాయేన్ద్రియం వీర్యముపరిష్టాదాత్మన్ధత్తే॥

౧ దీనియర్థము పూర్వపు పంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ సభనుఁ బొంది భూదేవతాకమగు చరువు నిర్వాపము సేయవలయును. ఈభూమియే క్షేత్రముల (భూభాగముల) కుఁబతి(కావున నిట్టి యజమానుఁడు) ఈభూమియందే ప్రతిష్ఠితుఁడగుచున్నాఁడు. ౩ పూర్వోక్తమగు చరునిర్వాపమునకుఁ బిమ్మట ఇంద్రాగ్ని దేవతాకమును, పదునొండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టి యజమానుఁడు) ఇంద్రియగతమగు సామర్థ్యము నీభూమియందేయుంచి పిమ్మట తనయందు ధరించుచున్నాఁడు.

ప్రథమానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము ౨.

౧.౧. అగ్నయేఽధికృతే పురోడాశ మష్టాకపాలం నిర్వపేద్యో దర్శపూర్ణమాస యాజీ సన్నమావాస్యాం వా పౌర్ణమాసీం వాఽతిపాదయేత్పథో వా ఏషోఽ

ధ్యపథేనైతి యోదర్శపూర్ణమాసయాజీసన్నమావాస్యాం వాపౌర్ణమా

సీం వాఽతిపాదయత్యగ్నిమేవ పథికృతగ్ం స్వేనభాగధేయేనోపధావతి

సఏవైన మపథాత్పన్థామపినయత్యనడ్వాన్దక్షిణా వహీహ్యేషసమృద్ధ్యై ౨

అగ్నయేవ్రతపతయే॥

౧ ఏయజమానుఁడు దర్శపూర్ణమాస యాగములనుఁ జేసినవాఁడగుచు నమావాస్యనాటి యిష్టిని (కర్మవిశేషమును ) కాని, పూర్ణమాసేష్టినిగాని, చేయక మానివేయునో, (అట్టి యజమానుఁడు ప్రాయశ్చిత్తముకై) పథికృత్తగు (ఆయగ్నికిఁ బేరు) నగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. ఏయజమానుఁడు దర్శపూర్ణమాసయాగములనుఁ జేసినవాఁడై దర్శేష్టినిగాని, పూర్ణమాసేష్టినిగాని, యుల్లంఘించుచున్నాఁడో, ఈతఁడపమార్గముచేతనే పోవుచున్నాఁడు. (కావున పూర్వోక్తవిధముగాఁ బ్రాయశ్చిత్తము ననుష్ఠించినయజమానుఁడు తానిచ్చినహావిర్భాగముచేఁ బథికృత్తగు నగ్నినే పొందుచున్నాఁడు. ఆయగ్నియే యీయజమానుని నపమార్గమునుండి సన్మార్గముఁ బొందించుచున్నాఁడు. (ఈప్రాయశ్చిత్తేష్టియందు) భారమును వహించునట్టి యెద్దు దక్షిణ. (కావున ఈయాగము సమృద్ధికొఱకగుచున్నది. (పన్థాః=మార్గము అనఁగా ప్రతిపర్వమునందుఁ బ్రమాదములేకుండగ నిష్టినిచేయుటయనియు, నపన్థయనఁగాఅపమార్గము ఒకానొక పర్వమునందుఁ బ్రమాదమున నిష్టిని మానివేయుటయనియు భావము కావున నగ్నిపథికృత్తుగావర్ణింపఁబడినాఁడు. పథికృత్ = మార్గమునుఁజేయువాఁడు.) ౨ దీనియర్థము ౨వ పంచాశత్తులో వివరింపఁబడును.

పంచాశత్తు ౨.

౪౧౨. ౧ పురోడాశమష్టాకపాలం నిర్వపేద్య ఆహితాగ్నిః సన్నవ్రత్యమివ చరేద
గ్నిమేవ వ్రతపతిగ్ం స్వేనభాగధేయేనో పధావతి సఏవైనం వ్రతమాలమ్భ
యతి వ్రత్యోభవత్య ౨ గ్నయే రక్షోఘ్నే పురోడాశమష్టాకపాలం నిర్వ
పేద్యగ్ం రక్షాగ్ంసిసచేరన్నగ్ని మేవరక్షోహణగ్ం స్వేనభాగధేయేనో పధా
వతి సఏవాస్మాద్రక్షాగ్ం స్యపహన్తి ౩ నిశితాయాం నిర్వపేత్ ।

౧ ఏ యజమానుఁడాహితాగ్ని (అగ్నులను ఇంటనిల్పుకొనువాఁడు) యగుచు యాగవ్రత విరోధియగు నసత్యమును బల్కునో, అతఁడు వ్రతమునకుఁ బ్రభువగు యజమానుని కొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టి యజమానుఁడు) తానిచ్చిన హవిర్భాగముచే వ్రతపతియగునగ్నినే పొందుచున్నాఁడు. ఆ యగ్నియే యీ యజమానుని వ్రతమునుఁ బొందించుచున్నాఁడు. (ఇటుపైనఁ జేయఁబోవు యాగములలో) యోగ్యుఁడగుచున్నాఁడు. ౨ ఏ పురుషుని రాక్షసులు బాధించుదురో, అతఁడు రక్షస్సులఁజంపునట్టి యగ్నికొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. ఇట్టి యజమానుఁడు రాక్షసహన్తయగు నగ్నిని తానిచ్చిన హవిర్భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆ యగ్నియే యీ యజమానునుండి రాక్షసులనుఁ బోగొట్టుచున్నాఁడు. (సంస్కృతము= సంస్కరింపఁబడినది మంత్రించిదానిలోఁ గలుపవలసిన వన్నికఁ౨ పుట) ౩ దీనియర్థము ౩వ పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౩.

౪౧౩. నిశితాయాగ్ం హిరణ్యాగ్ం స్విష్టేరతేనం ప్రేణాన్యైవైనానిహన్తి ౨ పరి

త్రితే యాజయేద్రక్షసామనన్వవచారాయ ౩ రక్షోఘ్నీయాజ్యానువాక్యే
భవతో రక్షసాగ్ం స్తృత్యా ౪ అగ్నయే రుద్రవతే పురోడాశమష్టా
కపాలం నిర్వపేదభిచరన్నేషా వా అస్య ఘోరా తనూర్యద్రుద్రస్తస్మా ఏవై
నమావృశ్చతి తాజగార్తిమార్ఛ ౫ త్యగ్నయే సురభిమతే పురోడాశమష్టా
కపాలం నిర్వపేద్యస్య గావో వా పురుషాః॥

౧ రాత్రియందు (పూర్వోక్తమగు) నిర్వాపము చేయవలయును, రాక్షసులు రాత్రియందు సంచరించుచున్నారుకదా! (కావున నాయజమానుఁడు) (రాత్రియందు) ప్రచారము కలవారేయగు నీరాక్షసులను జంపుచున్నాఁడు. ౨ రాక్షసులు ప్రవేశించకుండుటకై యంతటను నాచ్ఛాదనముకల యాగభూమియందు యాగము సేయవలయును. ౩ రాక్షసహంతకములగు "రక్షోహణంవాజనం" "విజ్యోతిషా" అను మంత్రములు రాక్షసుల హింసించుచున్నవి. ౪ శత్రువును నశింపఁజేయఁబోవువాఁడగుచు భయంకరమగు (వెఱపించునట్టి) శరీరముకల్గిన యగ్ని కొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ఏది (శత్రువులను) దుఃఖింపఁజేయునదో, ఇదియే యీయగ్ని యొక్క ఘోర (భయంకర) శరీరము. (ఇట్టి యజమానుఁడు) ఆఘోరతనువుకల యగ్నికొఱకే శత్రువు నంతటను నశింపఁజేసి ఇచ్చుచున్నాఁడు. అప్పుడే (శత్రువు) నాశనము నొందుచున్నాఁడు. ౫ దీనియర్థము ౪వ పంచాశత్తులో విస్తృతము.

## పంచాశత్తు ౪.

౪౧౪. వా ప్రమీయేరన్యో వా బిభీయాదేషా వా అస్య భేషజ్యా తనూర్యత్సురభిమతీ

తయైవాస్మై భేషజంకరోతి సురభిమతే భవతి పూతీగంధస్యాపహాత్యా

౨ అగ్నయేక్షామవతే పురోడాశమష్టాకపాలం నిర్వపేత్సంగ్రామే సంయ

త్తే భాగధేయేనైవైనగ్ం శమయిత్వా పరానభినిర్దిశతి యమవరేషాం

విధ్యంతి జీవతి సయంపరేషాం ప్రసమీయతే జయతితగ్ం సంగ్రామమ్॥

౧ ఏయజమానుని గోవులుకాని, భృత్యాదులుకాని (దైవిక రోగబాహుళ్య ముచే) జనిపోవునో! లేక తానే యపమృత్యువువలన భయపడునో అట్టి యజమానుఁడు భేషజ్య (ఆరోగ్యవన్తమైన లేక సుగంధయుక్తమయిన) శరీరముకల యగ్ని కొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. సుగంధముకలదేదికలదో ఇదియే యీ యగ్నియొక్క భేజష్య, (ఆరోగ్యవంతమయిన) శరీరము. ఆ శరీరముచేతనే (యగ్ని) యీయజమానున కారోగ్యమును జేయుచున్నాఁడు. సువాసన కలవాఁడగు నగ్నికి (జేసిన నిర్వాపము) శవ గంధముపోవుట కొఱకగుచున్నది. ౨ యుద్ధముసన్నద్ధమగు చుండఁగా జయార్థియగు యజమానుఁడు ఆకలిగొన్న యగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమయిన పురోడాశమును నిర్వాపము సేయవలయును. (తనచే నివ్వఁబడినయగ్ని) భాగముచేతనే యీ యగ్నిని శాన్తునిగాఁజేసి (ఇట్టి యజమానుఁడు) శత్రువులనగ్ని కభిముఖముగా (జంపుటకై) చూపుచున్నాఁడు. (ఇట్లుకాగా) తనసేనలలో నెవనిని శత్రువులు బాణములచే గ్రుచ్చుచున్నారో, వాఁడుజీవించు చున్నాఁడు. శత్రుసేనలలో నెవని నితరులుబాణములచే గ్రుచ్చుచున్నారో, వాఁడుచనిపోవుచున్నాఁడు. (అప్పుడు యజమానుడా) యుద్ధమును జయించుచున్నాఁడు.

పంచాశత్తు ౫

[illegible] అభివాపహ ఏతానుచ్యతి ఏషాం పూర్వాపరా అన్వంచః ప్రమీయంతే

పురుషాహుతిర్హ్యస్య ప్రియతమాఽగ్నయే క్షామవతే పురోడాశమష్టాకపాలం నిర్వపేద్భాగధేయేనైవైనగ్ం శమయతి నైషాం పురాఽయుషోఽపరః ప్రమీయతే ౨ ఽభివా ఏష ఏతస్య గృహాన్నుచ్యతి యస్య గృహాన్ దహత్యగ్నయే క్షామవతే పురోడాశమష్టాకపాలం నిర్వపేద్భాగధేయేనైవైనగ్ం శమయతి నాస్యాపరం గృహాన్దహతి ॥

౧ ఎవరియొక్క జ్యేష్ఠులును, కనిష్ఠులును, (తనకంటె పెద్దవారు, చిన్నవారు) విచ్ఛేదము లేకుండగనే నశించుచున్నారో, వీరినీయగ్నియే కలిసికొనుచున్నాఁడు. ఈ యగ్నికిఁ బురుషాహుతియే యిష్టమయినది. (కావున బహుబంధుమరణ నివారణమునుఁ గోరుయజమానుఁడు) ఆకలిగొన్న యగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమయిన పురోడాశమును నిర్వాపము సేయవలయును (తనచే నివ్వఁబడిన పురోడాశ) భాగముచే (నీ యజమానుఁడ) గ్నిని శమింపఁజేయుచున్నాఁడు. ఇట్టి వారిలో నాయువునకు జ్యేష్ఠుఁడుకాని, కనిష్ఠుఁడుకాని, మరణించడు. (పురుషాహుతిః పురుషులు హావిస్సుగానను౦ట) ౨ ఎవనియొక్క గృహములనగ్ని దహించుచున్నదో, వీనిగృహముల నీయగ్నియే కలిసికొనుచున్నది. (కావున తచ్ఛాంతికై) యాకలిగొన్న యగ్నికొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఈ యజమానుఁడు తనచే నివ్వఁబడినయగ్ని యొక్క) పురోడాశ భాగముచే నగ్నిని శమింపఁ జేయుచున్నాఁడు. (ఇట్టియగ్ని) యీ యజమానుని గృహములను మఱల దహించుటలేదు.

ద్వితీయానువాకము సమాప్తము.

— * —

## అనువాకము 3.

౪౧౬. అగ్నయే కామాయపురోడాశమష్టాకపాలం నిర్వపేద్యం కామోనోపన మేదగ్నిమేవకామగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవైనం కామేనసమ ర్ధయత్యుపైనం కామోనమత్య ౨ గ్నయేయవిష్ఠాయ పురోడాశమష్టా కపాలం నిర్వపేత్స్పర్ధమానః క్షేత్రేవాసజాతేషు వాఽగ్నిమేవయవిష్ఠ గ్ం స్వేనభాగధేయేనోపధావతి తేనైవేన్ద్రియం వీర్యం భ్రాతృవ్యస్య ॥

౧ తానుగోరినఫలము ఏయజమానుని పొందుటలేదో, అతఁడు కోరికలనిచ్చునట్టి యగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టి యజమానుఁడు తనచేనివ్వఁబడిన పురోడాశ) భాగముచేఁ గామప్రదుండగు నగ్నినే పొందుచున్నాఁడు. ఆయగ్నియే యీయజమానునిఁ గోరిన ఫలముచే సంతృప్తునిగాఁ జేయుచున్నాఁడు. (అప్పుడీ) యజమానునిఁ దనకామితార్థము పొందుచున్నది. ౨ భూమివిషమైకాని, జ్ఞాతులవిషయమైకాని స్పర్ధకల యజమానుఁడు అతిశయముగ నాస్పర్ధను నివారణముఁజేయునట్టి యగ్ని కొఱకెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇయ్యజమానుఁడు) తనచేనివ్వఁబడిన పురోడాశభాగముచే నతిశయముగ వియోగకారియగు నగ్నినే పొందుచున్నాడు. ఆనిర్వాపముచేతనే (యగ్ని) శత్రువుయొక్క యింద్రియగత సామర్థ్యమును వియోగముచేయు (పోగొట్టు) చున్నాడు. (పిమ్మట నీయజమానుడు) పాపియగు శత్రువులులేనివాఁడగుచున్నాఁడు.

పంచాశత్తు ౨.

౪౧౭ యువతేవిపాప్మనా భ్రాతృవ్యేణజయతే ౧ ఽగ్నయేయవిష్ఠాయ పురోడాశ

మష్టాకపాలం నిర్వపేదభిచర్య మాణోऽగ్నిమేవ యవిష్ఠగ్ం స్వేనభాగధే యేనో పధావతి. సఏవాస్మాద్రక్షాగ్ంసి యవయతినైన మభిచరం స్తృణు తే ౨ ऽగ్నయ ఆయుష్మతే పురోడాశమష్టా కపాలం నిర్వపేద్యః కామయే తసర్వమాయురి యామిత్యగ్ని మేవాऽऽయుష్మన్తగ్ం స్వేనభాగధేయేనోప ధావతి సఏవాస్మిన్ ॥

౧ ఇతరులచే నభిచారహోమము చేయఁబడు యజమానుఁడు అతిశయముగ జ్ఞాతి, శత్రుభాధ లేనివాఁడగును. ఇత్యాది పూర్వవత్ ॥ యవయతి=వియోగమునుఁ జేయుచున్నాఁడు. నస్తృణుతే=హింసించుటకు సమర్థుఁడగుటలేదు. ౨ సమస్త మగు నాయువునొందుదునని యెవఁడు కోరుకొనునో, వాఁడు ఆయువునిచ్చునట్టి యగ్నికొఱకు ఇత్యాదిపూర్వవత్. అగ్నియే యీయజమానుని యందాయువునుంచు చున్నాఁడు. (అప్పుడీయాగకర్త) సమస్తాయువు నొందుచున్నాఁడు.

పంచాశత్తు 3.

౪౧౮. ఆయుర్దధాతి సర్వమాయు రే ౧ త్యగ్నయే జాతవేదసే పురోడాశమష్టా కపా లం నిర్వపేద్భూతి కామోऽగ్ని మేవజాతవేదసగ్ం స్వేనభాగధేయేనోప ధావతి సఏవైనం భూతిం గమయతి భవత్యేవా ౨గ్నయేరుక్మతే పురోడాశ మష్టా కపాలం నిర్వపేద్రుక్కామోऽగ్ని మేవరుక్మన్తగ్ం స్వేనభాగధేయేనో పధావతి సఏవాస్మిన్రుచం దధాతిరోచతఏవా 3 గ్నయే తేజస్వతే పురోడాశమ్

౧ ఐశ్వర్యమునుఁ గోరుపురుషుఁడు ధనములను బుట్టించు నగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టి యజమానుఁడు) ధనవంతుఁడగు నగ్నినే తనచే నివ్వఁబడిన పురోడాశ భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆ యగ్నియే యీ యజమాను నైశ్వర్యమునుఁ బొందించు చున్నాఁడు. (అప్పుడు యజమానుఁడు) నిశ్చయముగ (ధనవన్తుఁడ) గుచున్నాఁడు. ౨ కాంతినిఁ గోరుపురుషుఁడు కాంతిమన్తుఁడగు నగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టి యజమానుఁడు) తనచేనివ్వఁ బడినపురోడాశ భాగముచేఁ గాంతిమంతుఁడగు నగ్నినేపొందుచున్నాఁడు. ఆ యగ్నియే యీ యజమానునియందుఁ గాంతినుంచు చున్నాడు. (అప్పుడు యజమానుఁడు) నిశ్చయముగఁ బ్రకాశించుచున్నాఁడు. ౩ దీనియర్థము ౪౨ పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౪.

౪౧౯. అష్టాకపాలం నిర్వపేత్తేజస్కామోఽగ్నిమేవ తేజస్వన్తగ్ం స్వేనభాగధే యేనోపధావతి సఏవాస్మిన్తేజోదధాతి తేజస్వ్యేవభవత్య గ్నయేసాహ న్త్యాయ పురోడాశమష్టాకపాలం నిర్వపేత్సీక్షమాణోఽగ్నిమేవ సాహన్త్య గ్ం స్వేనభాగధేయేనోపధావతి తేనైవసహతేయగ్ం సీక్షతే॥

౧ తేజస్సునుఁగోరు పురుషుడు తేజోవన్తుఁడగు నగ్నికొఱకు తానిచ్చిన హవిర్భాగముతో నాయగ్నిని బొందును. అట్టి యజమానుఁడు తనచేనివ్వఁబడిన పురోడాశభాగముచేఁ దేజోవన్తుఁడగు నగ్నినేపొందుచున్నాఁడు ఆయగ్నియే యీయజమానునియందుఁ దేజస్సునుంచుచున్నాఁడు. (అప్పుడు యజమానుఁడు) నిశ్చయముగ దేజోవన్తుఁడగుచున్నాడు. ౨ శత్రువుఁ దిరస్కరించుట కిచ్ఛయించు

చున్న యజమానుఁడు శత్రువును దిరస్కరించునట్టి యగ్నికొఱకిచ్చునో తానిచ్చిన హవిర్భాగముతో నగ్నినే పొందును. (అని మున్నుందు) (ఇట్టి యజమానుఁడు) తనచే, నివ్వఁబడిన పురోడాశభాగముచే శత్రుతిరస్కారియగు నగ్నినే పొందు చున్నాఁడు. ఏశత్రువుఁ దిరస్కరింప నిచ్ఛయించుచున్నాఁడో, (ఈయజమానుఁడా) శత్రువు నాయగ్నిచే ననుగృహీతుఁడై తిరస్కరించుచున్నాఁడు.

తృతీయానువాకము సమాప్తము.

—*—

## అనువాకము ४.

౭౨౦. అగ్నయేఽన్నవతే పురోడాశమష్టాకపాలం నిర్వపేద్యః కామయేతాన్నవాన్త్స్యా మిత్యగ్నిమేవాన్నవన్త గ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవైనమన్నవన్తం కరోత్యన్నవానేవభవత్య ౨ గ్నయేఽన్నాదాయ పురోడాశమష్టాకపాలం నిర్వపేద్యః కామయేతాన్నాదః స్యామిత్యగ్నిమేవాన్నాదగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవైనమన్నాదం కరోత్యన్నాదః ।

౧ ఏయజమానుఁడు తాను అన్నవన్తుఁడనగుదునని కోరుకొనునో, (ఆతడు) అధికమైన యన్నవంతుఁడగు నగ్నికొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టివాఁడు) తనచేనివ్వఁబడిన పురోడాశభాగముచే నన్నవన్తుఁడగు నగ్నినే పొందుచున్నాఁడు. ఆయగ్నియే యా

యజమాను నన్నవన్తునిగాఁ జేయుచున్నాఁడు. (అప్పుడు యజమానుఁడ) న్నవన్తు డేయగుచున్నాఁడు. ౨ తాను అన్నముందినుదుఁగాకని యేయజమానుఁడు కోరు కొనునో, అతఁడన్నముఁదినుశక్తికల నగ్నికొఱకెనిమిది కపాలముల సంస్కరించిన పురోడాశ నిర్వాపము చేయవలయును. ఇట్టి యజమానుఁడన్నాదుఁడేయగు చున్నాఁడ (నిచివరవాక్యమున కర్థము. అన్నాదః = అన్నమునుఁ దినువాఁడు. తీవ్ర జఠరాగ్ని యుక్తుఁడని తా॥) మఱియు నన్నమునకు స్వామికావలయునని యెవఁడు కోరుకొనునో, ఆ యజమానుఁడన్న స్వామియగు నగ్నికొఱకెనిమిది కపాలములందు ఇత్యాదికము పూర్వమువలె నూహ్యము. (ఇచట ౨వ పంచాశత్తులోని ౧వ వాక్యా ర్థముకూడ వ్రాయఁబడినది.)

పంచాశత్తు ౨

౪.౨౧. ౧ ఏవభవత్యగ్నయే ఽన్నపతయే పురోడాశమష్టాకపాలం నిర్వపేద్యః కామయేతాన్నపతిః స్యామిత్యగ్నిమేవాన్నపతిగ్ం స్వేనభాగధేయే నోప ధావతి సఏవైనమన్నపతిం కరోత్యన్నపతిరేవభవత్య ౨ గ్నయేపవమా నాయ పురోడాశమష్టాకపాలం నిర్వపేదగ్నయే పావకాయాగ్నయేశుచ యేజ్యోగా మయావీయదగ్నయే పవమానాయనిర్వపతి ప్రాణమేవాస్మి న్తేన దధాతియదగ్నయే ॥

౧ దీనియర్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ దీర్ఘరోగయుక్తుఁడగు యజమానుఁడు పాపములను శోధించునట్టి యగ్నికొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్లే) పాపములకు

శుద్ధిహేతువగు నగ్నికొఱకు పూర్వోక్త పురోడాశము నిర్వాపము సేయువలయును. మఱియు దీప్తిగలిగించు నగ్నికొఱకుఁ బూర్వోక్త పురోడాశము నిర్వాపము సేయ వలయును. (ఈ మూఁడువాక్యములచే పురోడాశ ఇత్యాదికము ననువృత్తి (మీఁదఁ జెప్పినవిషయము ప్రస్తుతమునకుఁ దెచ్చుట) చేయవలెను. ఇచ్చటమూఁడుహవిస్సులు విధింపఁబడినవి. పాపశోధకుఁడగు నగ్నికొఱకేహవిస్సు నిర్వాపము చేయఁబడినదో, ఆ నిర్వాపముచే (నగ్ని) ఈ యజమానునియందుఁ బ్రాహ్మణమునే యుంచు చున్నాఁడు. పాపశుద్ధికి హేతువగు నగ్నికొఱకేహవిస్సు (నిర్వాపముచేయఁబడినదో,) ఆ నిర్వాపముచే నీ యజమానునియందు (అగ్ని) వాక్కునుంచుచున్నాఁడు. జాజ్వ ల్యహేతువగు నగ్నికొఱకేహవిస్సు (నిర్వాపము చేయఁబడినదో,) ఆ నిర్వాపముచే నీ యజమానునియందు (అగ్ని) ఆయువునే యుంచుచున్నాఁడు. మఱియు విగతప్రాణు డైనను, (ఈ నిర్వాపముచే) జీవించుచునే యున్నాఁడు. (ఇక రోగములేనివాఁడగు చున్నాఁడని వేఱుగఁజెప్పవలయునా !)

పఞ్చాశత్తు 5

౪౨౨. ౧ పావకాయవాచ మేవాస్మిన్నేన దధాతియదగ్నయే శుచయఆయు రేవా స్మిన్నేన దధాత్యుతయదీ తాసుర్భవతి జీవత్యేవై ౨ తామేవనిర్వపేచ్చ క్షుష్కామోయ దగ్నయేపవమానాయ నిర్వపతిప్రాణమేవా స్మిన్నేనదధా తియదగ్నయే పావకాయవాచమేవా స్మిన్నేన దధాతియదగ్నయే శుచయే చక్షురేవాస్మిన్నే నదధాతి॥

౧ దీనియర్థము పయి పంచాశత్తులో వ్రాయబడినది. ౨ (పయిపంచాశ

త్తులో ౨వ వాక్యముచే జెప్పబడిన హవిస్త్రయమే యిచ్చట మరొకఫలముకొఱకు విధింపబడుచున్నది. ) దృష్టినిగోరు పురుషుడీ పూర్వోక్తమయిన యిష్టినే (హవిస్త్రయమునే) యాచరింపవలయును. శేషము పూర్వోక్తము. మూడవ హవిర్నిర్వాపముచే నగ్ని యీయజమానునియందుఁ జక్షుస్సు (దృష్టి) నుంచుచున్నాడు. (గ్రుడ్డి వాడయినను ఈ నిర్వాప సామర్థ్యముచే) బాగుగనే జూచుచున్నాడు. (అని చివరి వాక్యమునకర్థము.)

పంచాశత్తు ౪

౪౨౩. ౧ ఉతయద్వ్యర్ధో భవతి ప్రైవపశ్యత్యగ్నయే పుత్రవతే పురోడాశమష్టాకపాలం నిర్వపేదిన్ద్రాయపుత్రిణే పురోడాశమేకాదశకపాలం ప్రజాకామోఽగ్నిరేవాస్మై ప్రజాం ప్రజనయతి వృద్ధామింద్రః ప్రయచ్ఛత్యగ్నయేరసవతేఽజక్షీరేచరుం నిర్వపేద్యః కామయేత రసవాన్త్స్యామిత్యగ్నిమేవ రసవంతగ్ం స్వేనభాగధేయే నోపధావతి సఏవైనగ్ం రసవన్తం కరోతి ॥

౧ సంతానమును బడయఁగోరు పురుషుడు పుత్రవంతుడగు నగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. ( మరియు ) పుత్రులుకల యింద్రునికొఱకు పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. అగ్నియే యిట్టియజమానునికొఱకు సంతానమును బుట్టించుచున్నాడు. పుత్రపౌత్రాదియుక్తమగు సంతా

నము నింద్రు డిచ్చుచున్నాడు. ౨ ఏయజమానుడు క్షీరాదిరసము కలవాడనగుదు నని కోరుకొనునో (ఆతడు) పాలు, పెరుగు మొదలగు రసముతో గూడుకొనిన యగ్నికొఱకు మేకపాలలో గలిపిన చరువును నిర్వాపము చేయవలయును. (ఇట్టి యజమానుడు) తానిచ్చిన హావిర్భాగముచే రసవంతుడగు నగ్నినే పొందు చున్నాడు. అప్పుడు యజమానుడు రసవంతుడే యగుచున్నాడు. ఆయగ్నియే యీ యజమానుని క్షీరాదిరసములతోఁ గూడుచున్నాడు. (ఈచరువు) మేకపాలయందు మిళితమయి యుండవలయును. మేక ఏదికలదో యగ్నిసంబంధి యగుచున్నది (అగ్ని వలె మేకకూడ ప్రజాపతి ముఖమునుండిపుట్టినది కావున మేకకు అగ్నిసంబంధము చెప్పబడినది.)

పంచాశత్తు ౫౫

౪౨౪. రసవానేవభవత్య జక్షీరేభవత్యాగ్నే యీవావేషాయదజాసాక్షాదేవరసమ

వరున్ద్ధే ౨ zగ్నయే వసుమతే పురోడాశమష్టాకపాలం నిర్వపేద్యఃకామవే

తవసుమాన్త్స్యా మిత్యగ్నిమేవవసుమన్తగ్ం స్వేనభాగధేయేనోపధావతి సవే

వైనం వసుమన్తంకరోతి వసుమానేవభవత్య 3 గ్నయేవాజసృతే పురో

డాశమష్టాకపాలం నిర్వపేత్సఙ్గ్రామేసం యత్తేవాజమ్॥

౧ దీనియర్థము పయి పంచాశత్తులో వివరింపబడినది. ౨ ధనవంతుడను కావలయునని ఏయజమానుడు కోరుకొనునో వాడు ధనవంతుడగు (ధనము నిచ్చువాడనియుఁ జెప్పఁదగును) నగ్నికొఱకు నెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (ఇట్టి యజమానుడు)

తనభాగముచే ధనవంతుడగు నగ్నినే పొందుచున్నాడు. ఆయగ్నియే యీయజమానుని ధనవంతునిగాఁ జేయుచున్నాడు. ( అప్పుడాయజమానుడు ) ధనవంతుడే యగుచున్నాడు,

3 యుద్ధము సంప్రాప్తమగుచుండగా ( శత్రుసంబంధియగు ) నన్నమునుబొందునట్టి యగ్నికొఱకెనిమిది కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. ఎవడు యుద్ధమును జయించవలయునని యిచ్ఛయించుచున్నాడో వీడు ( శత్రుసంబంధియగు) నన్నమును బొందవలయునని కోరుచున్నాడు. దేవతలలో నగ్నియేకదా శత్రువులయన్నము నొందువాడు! ( ఈయిష్టికర్త) తానిచ్చినహవిర్భాగముచే వాజసృత్తగు (దానిపేరు) నగ్నినే పొందుచున్నాఁడు. (ఇట్టి యజమానుఁడు) అన్నము నొందుచున్నాఁడు. (ఆఅన్నమునకై) శత్రువునుఁ జంపుచున్నాఁడు. యుద్ధమును జయించుచున్నాఁడు. మఱియు నగ్నివలె (నితరునిచేఁ) దిరస్కరింపఁబడుటకు సమర్థుఁడగుట లేదు. (యుద్ధమును జయించుటకిచ్ఛకలవాఁడు జయమునకుఁ బిమ్మట శత్రుసంబంధియగు నన్నము నొందవలయునని యిచ్ఛయించుట లోకములోఁ బ్రసిద్ధము. అట్లేయిచ్చుట నగ్నికూడవర్ణింపఁ బడినాఁడు. వాజసృత్ =శత్రుసంబంధియగు యన్నమునుఁ బొందువాఁడని యర్థము.)

పంచాశత్తు ౬.

౪౨౫. వాపమసి స్సీర్థతియః సంగ్రామం జిగీషత్యగ్నిః ఖలు వై దేవానాం వాజ
స్సృదగ్నిమేవవాజసృతగ్ం స్వేనభాగధేయేనోపధావతి ధావతివాజగ్ం హన్తి
వృత్రం జయతితగ్ం సంగ్రామమథోఅగ్నిరి వనప్రతిధృషే భవత్యా ౨
గ్నయేఽగ్నివతే పురోడాశమష్టాకపాలం నిర్వపేద్యస్యాగ్నా వగ్నిమభ్యుద్ధ

రేయుర్నిర్దిష్టభాగోవావేత యోరన్యోఽనిర్దిష్టభాగోఽన్యస్తౌ సంభవన్తౌ యజమానమ్॥

౧ దీనియర్థము పై పంచాశత్తులో వివరింపఁబడును. ౨ ఏయజమానుని యాహవనీయాగ్నియందు మఱొకయగ్నిని (ఇతరములు) ప్రతిష్ఠాపన చేయుదురో, ఆ యజమానుఁడు (పూర్వవిధముగా) నగ్నిమంతుఁడగు నగ్నికొఱకెనిమిది కపాలము లందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. ఈ రెండగ్ను లలో విశేష్యరూపమగు నగ్నినిర్దిష్ట భాగము (నిర్దేశించిన ఇదిగోనీదియని చూపుట నిర్దేశము) రెండవది (విశేషణరూపము) అనిర్దిష్టభాగము. ఆ రెండగ్నులు పరస్ప రము కలిసికొనినవై యజమానుని (భక్షించుటకు) ద్దేశించియుంటున్నవి. అప్పుడా యజమానుఁడు నాశమునొందు చున్నాఁడు. (పూర్వోక్తవిధముగా) నగ్నివంతమను నగ్నికొఱకు హవిస్సును నిర్వాపముచేసినచో (నాయజమానుఁడు) తానిచ్చిన హవి ర్భాగముచే నీయగ్నులను శాంతిపఱచు చున్నాఁడు. (అప్పుడు)యజమానుఁడు నాశము నొందుట లేదు.

పంచాశత్తు ౭

౪౨౯. అభిసంభవతః స ఈశ్వరఆర్తిమార్తోర్య దగ్నయేఽగ్నివతే నిర్వపతిభాగ ధేయేనైవై నౌశమయతినాఽఽర్తిమార్ఛతియజమానో ౨ ఽగ్నయే జ్యో తిష్మతే పురోడాశమష్టాకపాలం నిర్వపేద్యస్యాగ్నిరుద్ధృతో ఽహుతేఽగ్ని హోత్రఉద్వాయే 3 దపరఆదీప్యానూద్ధృత్యఇత్యాహు స్తత్తథానకార్య య్యద్భాగధేయమభిపూర్వ ఉద్ధ్రియతే కిమపరోఽభ్యుత్॥

౧ దీనియర్థము పైపంచాశత్తులో వివరింపఁబడె. ౨ ఎవసియగ్ని (అగ్ని హోత్రకర్మకై) యుద్ధరింపఁబడినదో యగ్నిహోత్రకర్మ సమాప్తముకానిదగుచుండఁగా నుద్వాసన చేయఁబడునో, (ఆయజమానుఁడు) జ్యోతిష్మన్తుఁడగు నగ్నికొఱకు నెనిమిదికపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. ౩ రెండవయగ్ని (గార్హపత్యమునందు) ప్రజ్వలింపఁజేసి పూర్వోద్ధరణముననుసరించి మఱల నుద్ధరింపఁదగినది. అని పూర్వపక్షము. ౪ ఒకయగ్నికొఱకుఁగా నిర్ణయించుకొన్న హవిస్సునింకొకదాని కిచ్చుటతగదని పూర్వపక్షము ఖండింపఁబడెను.

## పంచాశత్తు ౮

౫౭. హ్రియేతేతి ౧ తాన్యేవావక్షాణానిసం నిధాయమన్థే ౨ దితః ప్రథమం జజ్ఞేఅగ్నిః స్వాద్యోనేరధిజాతవేదాః సగాయత్రియాత్రిష్టుభాజగత్యాదేవేభ్యోహవ్యం వహతుప్రజానన్నితి ౩ ఛన్దోభిరేవైనగ్ం స్వాద్యోనేః ప్రజనయత్యే ౪ షవావసోఽగ్నిరిత్యాహు ౫ ర్జ్యోతిస్త్వాఅస్యపరాపతితమితి యదగ్నయే జ్యోతిష్మతే నిర్వపతియదేవాస్యజ్యోతిః పరాపతితం తదేవావరున్ధే॥

౧ చల్లారిన యీ కొఱవులనే (క్రిందనుంచి యరణులచే నగ్నిని) మథింపవలయునని సిద్ధాంతము. ౨ అగ్నిపూర్వమీ దగ్ధకాష్ఠము (కొఱవి) వలనఁబుట్టినవాఁడు (ఇప్పుడుకూడ) ఆ యగ్ని గాయత్రి, త్రిష్టుప్, జగతీఛందస్సులచే ననుగ్రహింపఁ బడినవాఁడై తనపుట్టుకకుఁగారణమగు కొఱవినుండియే పుట్టుగాక. (పిమ్మట నాయా దేవ

తను) తెలిసికొనిన వాఁడై దేవతలకొఱకు హవిస్సును మోయుఁగాక. 3 ఈ యగ్నిని గాయత్ర్యాదిఛందో మంత్రములచే (ఉచ్చరించుచు నని తా॥) తనపూర్వపుపుట్టిన స్థానమునుండియే పుట్టించవలయును. ४ తనపూర్వపు స్థానమునుండి పుట్టిన యీ యగ్ని యాపూర్వాగ్నియే. (భేదములేదని సిద్ధాంతులు) చెప్పుచున్నారు. ౫ ఈ పూర్వాగ్నియొక్క జ్యోతిస్సునష్టమయినది. (కావున) జ్యోతిష్మంతుఁడగు నగ్నికొఱకుహవిస్సును నిర్వాపము చేసినచో, నీయగ్నియొక్క జ్వాలారూపమయిన తేజోజ్యోతిస్సునష్టమయినదో, (ఇయ్యజమానుఁడు) ఆజ్యోతిస్సునే పొందుచున్నాఁడు.

చతుర్థానువాకము సమాప్తము.

—*0*—

అనువాకము ౫.

४౨౮. వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేద్వారుణం చరుందధిక్రావ్ణే చరుమభిశస్యమానోయద్వైశ్వానరో ద్వాదశకపాలోభవతి సంవత్సరోవాఅగ్నిర్వైశ్వానరః సంవత్సరేణైవనగ్ం స్వదయత్యపపాపం వర్ణగ్ంహతే వారుణేనైవైనం వరుణపాశాన్ముఞ్చతి దధిక్రావ్ణాపునాతి ౨ హిరణ్యాం దక్షిణా పవిత్రం వైహిరణ్యం పునాత్యేవైనమాద్యమస్యాన్నం భవత్యే 3 తామేవనిర్వపేత్ప్రజాకామః సంవత్సరః॥

౧ పాపము లేకపోయినను ఉన్నట్లుగా దూషింపఁబడుపురుషుఁడు వైశ్వానరా

గ్ని దేవతాకమును, పంద్రెండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును వరుణదేవతాకమగు చరువును "దధిక్రావ" అను దేవతకొఱకు నిర్వాపము సేయవలయును వైశ్వానరాగ్ని సంవత్సరాభిమాని దేవత (కావున) వైశ్వానరాగ్నిదేవతాకము పంద్రెండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశము నిర్వాపము చేయఁబడినదైనచో, (ఈయజమానుఁడు) సంవత్సరమంతయును తనయాత్మను (తన బంధువులకి) ష్టునిగాఁ జేసికొనుచున్నాఁడు. ఆరోపింపఁబడు పాపమునుఁబోగొట్టుకొనుచున్నాఁడు. వరుణయాగముచే నీయజమానుని వరుణపాశమునుండి విడిపించుకొనుచున్నాఁడు. దధిక్రావదేవతగల యాగముచే దనయాత్మను పవిత్రముగాఁ జేసికొనుచున్నాఁడు. ౨ ఈపూర్వోక్త కర్మయందు బంగారము దక్షిణ. బంగారము పవిత్రమైనదికదా ! ఈదక్షిణగానివ్వఁబడిన బంగారమీయజమానుని బవిత్రునిగాఁ జేయుచున్నది. (అప్పుడు) ఈయజమానునకు భుజించుటకు యోగ్యమయిన యన్నము కలుగుచున్నది. 3 దీనియర్థము రెండవ పంచాశత్తులో వ్రాయఁబడును.

పంచాశత్తు ౨.

౭౨౯. వావితస్యాశ్నాత్యోనిం ప్రజాయైపశూనాం నిర్దహతి యోఽలం ప్రజాయైసన్ప్రజాం నవిన్దతే యద్వైశ్వానరో ద్వాదశకపాలోభవతి సంవత్సరోఽగ్నిర్వైశ్వానరః సంవత్సరమేవ భాగధేయేనశమయతి సోఽస్మైశాన్తః స్వాద్యోనేః ప్రజాం ప్రజనయతి వారుణేనైవైనం వరుణపాశాన్ముఞ్చతి దధిక్రాణ్ణాపునాతి హిరణ్యం దక్షిణా పవిత్రం వైహిరణ్యం పునాత్యేవైనమ్॥

౧ సంతానమునుఁ గోరుపురుషుఁడు పూర్వోక్తమయిన హవిస్సును నిర్వాపము చేయువలయును. ఏ పురుషుఁడు సంతానముఁ బొందుటకు సమర్థుఁడై యుండియు సంతానమునుఁ బొందుటలేదో, వీనికి సంవత్సరాభిమానిదేవత (అగ్ని) శాంతినొందినదై సంతానమునకుఁ బళువు (బ్రభువు) బీజశక్తిని నిశ్శేషముగా గ్రహించుచున్నది. వైశ్వానరాగ్నియే సంవత్సరాభిమాని దేవత. వైశ్వానరాగ్ని పంౘ్రెండు కపాలములందు సంస్కృతమగుపురోడాశము కలవాఁడయినచో (యజమానుఁడప్పుడు) అగ్నికిఁదానిచ్చిన హవిర్భాగముచే సంవత్సరాభిమానియగు దేవునే శాంతినొందించుచున్నాఁడు. ఆ యగ్ని యీ యజమానునికొఱకు శాంతుఁడై తన బీజముండు స్థానమునుండి సంతానమునుఁ బుట్టించుచున్నాఁడు. మిగిలిన మంత్రార్థము ౧వ పంచాశత్తులోఁ జెప్పఁబడినదే. విన్దతే ప్రజామ్=సంతానమునుఁ బొందుచున్నాఁడు. అనిచివర పదముల కర్థము.

## పంచాశత్తు ౩.

४३౬. విన్దతే ప్రజాం ౧ వైశ్వానరంద్వాదశకపాలం నిర్వపేత్పుత్రే జాతేయదష్టాకపాలోభవతి గాయత్రియైవైనం బ్రహ్మవర్చసేన పునాతియన్నవకపాలస్త్రివృతైవాస్మిన్తేజో దధాతియద్దశకపాలో విరాజైవాస్మిన్నన్నాద్యం దధాతియదేకాదశకపాలస్త్రిష్టుభైవాస్మిన్నిన్ద్రియం దధాతి యద్ద్వాదశకపాలోజగత్యైవాస్మిన్పశూన్దధాతి యస్మిఞ్జాతఏతామిష్టిం నిర్వపతిపూతః ॥

౧ పుత్రుఁడు పుట్టగా (తండ్రి) వైశ్వానర దేవతాకమును, పంౘ్రెండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము చేయువలయును. ఎనిమిది

కపాలములందు సంస్కృతమయిన పురోడాశమయినచో, (ఎనిమిది అక్షరములు కలది కావున) గాయత్రిఛందస్సుతో సామ్యము చెప్పఁబడినది. (అగ్ని) ఈ పుత్రుని బ్రహ్మవర్చస్సుచేతఁ బవిత్రునిగాఁ జేయుచున్నాఁడు. తొమ్మిది కపాలములందు సంస్కృతమయిన పురోడాశమయినచో, (తొమ్మిది అక్షరముల సామ్యమువలన) త్రివృత్ ఛందస్సుచే నీ పుత్రునియందుఁ దేజస్సునుంచు చున్నాఁడు. పది కపాలములందు సంస్కృతమగు పురోడాశమయినచో, (పది యక్షరముల సామ్యము వలన) విరాట్ ఛందస్సుచే నీ పుత్రుని యందన్నముఁదిను శక్తినిఁగలిగింపఁజేయుచున్నాఁడు. పదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమయినచో (పదునొకండక్షరముల సామ్యమువలన) త్రిష్టుప్ ఛందస్సుచే నీపుత్రునియం దింద్రియశక్తి నుంచుచున్నాఁడు. పండ్రెండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమయినచో, (౧౨ అక్షరముల సామ్యమువలన) జగతీఛందస్సుచే నీ పుత్రునియందుఁ బశువుల నుంచుచున్నాఁడు. ఏపుత్రుఁడు పుట్టగా (తండ్రి) ఈయిష్టిని (హవిస్సును) నిర్వాపము చేయుచున్నాఁడో, ఆ పుత్రుఁడు, పవిత్రుడు, తేజోవంతుఁడు, అన్నముఁదిను శక్తికలవాఁడును, ఇంద్రియవంతుఁడును, పశువంతుఁడునగుచున్నాఁడు.

## పంచాశత్తు ౪.

౪౩౧, ఏవ తేజస్వ్యన్నాద ఇన్ద్రియావీ పశుమాన్భవత్య ౧ వవా ఏష సువర్గాల్లో కాచ్ఛిద్యతే యోదర్శపూర్ణమాసయాజీ సన్నమావాస్యాంవా పౌర్ణమాసీంవాzతి పాదయతిసువర్గాయ హిలోకాయ దర్శపూర్ణమాసా విజ్యేతే వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేదమావాస్యాంవా పౌర్ణమాసీంవాz తిపాద్య సంవత్సరోవా అగ్నిర్వైశ్వానరః సంవత్సరమేవ ప్రీణాత్యథో సంవత్సరమేవాస్మా ఉపదధాతిసువర్గస్య లోకస్య సమష్ట్యై॥

౧ ఏపురుషుఁడు దర్శపూర్ణమాస యాగములఁ జేసినవాఁడై దర్శను (అమావాస్యనాటియిష్టిని) కాని, పౌర్ణమాసిని (పూర్ణిమనాటియిష్టిని) కాని యతిక్రమించునో, (చేయఁడో, అని తా ॥) ఈతఁడు స్వర్గలోకము నుండి భ్రష్టుఁడగును దర్శపూర్ణమాసేష్టులు స్వర్గలోకముకొఱకు గదా! అనుష్ఠించఁ బడుచున్నవి. అమావాస్యనుగాని, పూర్ణిమనుగాని, యుల్లంఘించి (నప్పుడు) వైశ్వానరాగ్ని దేవతాకము—పన్రెండుకపాలములందు సంస్కృతమునగు, పురోడాశమును నిర్వాపము సేయవలయును. సంవత్సరాభిమాని దేవతయే వైశ్వానరాగ్ని కావున (ఇట్టి యజమానుఁడు) సంవత్సరమునే సంతోషపెట్టుచున్నాఁడు. స్వర్గలోకముయొక్క ప్రాప్తికై సంవత్సరము (నెప్పుడు) విచ్ఛేదరహితముగాఁ జేయుచున్నాఁడో, అప్పుడుఁ సర్వదేవతలనాశ్రయించి (యజమానుఁడు) స్వర్గలోకమునొందుచున్నాఁడు. (అనఁగా—అమావాస్య—పూర్ణిమ, దినములు సంవత్సరమున కవయవము లగుటంబట్టియు, నట్టియవయవములయిన దర్శపూర్ణమాసదినములలో నిష్టులను పూర్వోక్తవిధముగా ననుష్ఠించిననాడు సంవత్సరమునకు విచ్ఛేదము లేదు కావునను, మఱియుఁ సంవత్సరాభిమానియగు నగ్నికై పూర్వోక్త పురోడాశమును నిర్వాపము చేసినచో, సంవత్సరమునకే ప్రీతియగుట చేతను, సంవత్సరము సంతుష్టిఁ జెందిననాఁడు సర్వదేవతలు సంతోషింతురు కావునను, ఇట్టియజమానుఁడా దేవతలనాశ్రయించి వారియనుగ్రహముచే స్వర్గమునొందునని తాత్పర్యము.)

పంచాశత్తు ౫

౪౩౨. అథోదేవతా ఏవాన్వారభ్యసువర్గం లోకమేతి ౧ వీరహావాఏష దేవానాం

యోఽగ్నిముద్వాసయతే నవాఏతస్య బ్రాహ్మణా ఋతాయవః పురాఽన

మక్షన్నాగ్నేయమష్టాకపాలం నిర్వపేద్వైశ్వానరం ద్వాదశకపాలమగ్ని

ముద్వాసయిష్యన్న్యదష్టాకపాలోభవత్యష్టాక్షరాగాయత్రీ గాయత్రోఽగ్ని ర్వ్యావానేవాగ్నిస్తస్మా ఆతిథ్యం కరోత్యథోయథాజనం యతేఽవసం కరో తితాదృక్॥

౧ ఎవడు దేవతలలో నగ్నిని ఉద్వాసనము చేయునో, వీఁడు వీరహత్యా దోషము కలవాఁడగు చున్నాఁడు. సత్యమే స్థానముగాఁగల బ్రాహ్మణులీయజమా నుని యన్నమును భుజించరు. అగ్ని నుద్వాసనము చేసినవాఁడు వైశ్వానరాగ్ని దేవతాకము, పంద్రెండుకపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వా పము చేయవలయును. గాయత్రీఛందస్సు ఎనిమిదక్షరములు కలది. ఎనిమిది కపాలములందు సంస్కృతమయిన పురోడాశము (నిర్వాపము చేయఁబడిన) దైనచో నగ్ని గాయత్రీసహాయాఁడగుఁడు. (కావున) ఎంతయగ్నికలదో, ఆసమస్తాగ్నికాతి థ్యము. (అతిథిసత్కారము) చేసినవాఁడగుచున్నాఁడు. (యజమానుఁడనితా॥) మఱియు లోకమునందు దూరదేశమునందుండు జనునిఁగూర్చి పోవుచున్న వానికి మార్గమందునేవిధముగా నాప్తుడు రక్షించునో అట్లే యీయగ్నికొసఁగబడిన పురోడా శముకూడ స్వర్గమునకుబోవుదారిలో సాయపడుచున్నది. వైశ్వానరాగ్నిదేవతాకము, పంద్రెండుకపాలములందు సంస్కృతమునగు పురోడాశము (నిర్వాపముసేయఁబడిన) నైనచో, పంద్రెండుమాసములు సంవత్సరము, సంవత్సరము అగ్నికి స్థానము కావున నీనిర్వాపముచేసిన యజమానుఁడు) యీయగ్నినీదన స్థానమునుఁగూర్చి పొందించుచున్నాఁడు (ఇట్టియగ్నియొక్క యనుగ్రహముచే) నీయజమానునకు దినుటకు యోగ్యమయిన యన్నము కలుగుచున్నది.

పంచాశత్తు ౬.

౮౩౩. ఏవశద్ద్వాదశ కపాలోవైశ్వానరో భవతి ద్వాదశమాసాః సంవత్సరః సంవ

త్సరః ఖలువా అగ్నేర్యోనిః స్వాదేవైనం యోనిం గమయత్యా

ద్యమస్యాన్నం భవతి వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేన్మారుతగ్ం సప్త

కపాలం గ్రామకామ ౩ ఆహవనీయే వైశ్వానర మధిశ్రయతి గార్హపత్యే మా

రుతం పాపవస్యసస్య విధృత్యై ద్వాదశ కపాలో వైశ్వానరో భవతి ద్వాద

శమాసాః సంవత్సరః సంవత్సరేణై వాస్మై సజాతాగ్ం శ్చ్యావయతి ౫

మారుతో భవతి ॥

౧ దీనియర్థము పైపంచాశత్తులోఁ జేర్చి వ్రాయఁబడినది. ౨ గ్రామముఁ గోరుపురుషుఁడు వైశ్వానరాగ్ని దేవతాకము, పండ్రెండుకపాలములందు సంస్కృతమునగు పురోడాశమును, మరుత్తులు దేవతలుగాఁగలదియు నేడుకపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. ౩ గ్రామమునుఁ బొందుటకు (ప్రతిబన్ధకమగు) బలవత్తమమయినపాపము నశించుటకై వైశ్వానరాగ్ని దేవతాకమయినపురోడాశము నాహవనీయాగ్నియందు, మరుద్దేవతాకమగు పురోడాశము ను గార్హపత్యాగ్నియందు వండవలయును. ౪ వైశ్వానరాగ్ని దేవతాకమయిన పురోడాశము పండ్రెండుకపాలములందు సంస్కృతమయినచో, పండ్రెండుమాసములు సంవత్సరము (కావున) సంవత్సరముచేతనే యగ్ని యీయజమానునికై తన కులమునందుఁబుట్టిన మనుజులను నమ్రులను (విధేయులను) గాఁజేయుచున్నాఁడు. ౫ దీనియర్థము ౭ వపంచాశత్తులోఁ జేర్చి వ్రాయఁబడును.

## పంచాశత్తు ౭.

౪౩౪. మరుతోవై దేవానాం విశో దేవవిశేనై వాస్మై మనుష్యవిశ మవరున్ధే ౨ సప్త

కపాలోభవతి సప్తగణావై మరుతో గణశఏ వాస్మై సజాతానవరున్ధే ఽనూ
చ్యమాన ఆసాదయతి విశమేవాస్మా అనువర్త్మానం కరోతి ॥

౧ (పురోడాశము) మరుద్దేవతాకమయినచో, మరుత్తులు దేవతల యొక్క ప్రజలు (కావున నీపురోడాశము) దేవతలయనుగ్రహముచే నీయజమానునికొఱకు మానుష ప్రజాసమృద్ధిని సంపాదించుచున్నది (విశః=కప్పమును చెల్లించుప్రజలు.) ౨ మరుద్దేవతాకమయిన పురోడాశము ఏడుకపాలములందు సంస్కృతమయినచో, మరుద్దేవతలేమః గణములుకలవారు (కావున) మరుద్గణముల యనుగ్రహమువలన (నీపురోడాశ) మీాయజమానుని కొఱకనేక జ్ఞాతిగణములను సంపాదించుచున్నది. ౩ సామిధేనీబుక్కుల నుచ్చరించుకాలమునందు మరుద్దేవతాకమగు పురోడాశము నాసాదనము (ఉంచుట) చేయవలయును! (ఇట్టిపురోడాశము) పూర్వోక్తములయిన ప్రజలను యజమానుని ననుసరించునట్లుగాఁజేయుచున్నది.

పంచమానువాకము సమాప్తము.



## అనువాకము ౬.

౪౩౫. ౧ ఆదిత్యంచరుం నిర్వపేత్సంగ్రామముప ప్రయాస్యన్నియంవా అదితిర
స్యామేవ పూర్వే ప్రతితిష్ఠన్తి ౨ వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేదా
యతనంగత్వా సంవత్సరోవా అగ్నిర్వైశ్వానరః సంవత్సరః ఖలువై దేవా
నామాయతనమే తస్మాద్వా ఆయతనాద్దేవా అసురానజయన్య ద్వైశ్వా

నరంద్వాదశకపాలం నిర్వపతిదేవానామేవా ZZయతనే యతతేజయతిత

గ్ం సగ్గ్రామమే 3 తస్మిన్వాఏతౌమృజాతే॥

౧ యుద్ధమును జయించవలయునని కోరుపురుషుఁడు అదితిదేవతాకమయిన చరువును నిర్వాపముసేవలయును. ఈభూమియేయదితి. ఈభూమియందే యుద్ధమును జయించిన పూర్వపురుషులు ప్రతిష్ఠావన్తులయిరి. (కావున నీయిష్టిచే నీయజమానుఁడుకూడ ప్రతిష్ఠావంతుఁడగునని తా॥) ౨ యుద్ధభూమినిఁబొంది (యచ్చట) వైశ్వానరాగ్ని దేవతాకము, పంన్ద్రెండుకపాలములందు సంస్కరించిన పురోడాశమును నిర్వాపముసేయవలయును. సంవత్సరాభిమాని దేవతయే వైశ్వానరాగ్ని! సంవత్సరమే దేవతలకుస్థానముకదా! ఈయుద్ధస్థానమునుండియే దేవతలురాక్షసులను జయించిరి. (కావున) వైశ్వానరాగ్ని దేవతాకము—పంన్ద్రెండుకపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపముచేసినచో, (నాయజమానుఁడు దేవతలస్థానమునందే ప్రయత్నించుచున్నాఁడు. ఆయుద్ధమును జయించుచున్నాఁడు. 3 దీనియర్థము ౨వ పంచాశత్తులోఁ జేర్చి వ్రాయఁబడును.

పంచాశత్తు ౨.

౪౩౬. యోవిద్విషాణయోరన్నమత్తి వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేద్విద్వి

షాణయోరన్నం జగ్ధ్వాసంవత్సరోవా అగ్నిర్వైశ్వానరః సంవత్సరస్వదిత

మేవాత్తినాస్మిన్మృజాతే ౨ సంవత్సరాయవాఏతౌ సమమాతేయాసమ

మాతేతయోర్యః పూర్వోZభిద్రుహ్యతితం వరుణోగృహ్ణాతి వైశ్వానరం ద్వా

దశకపాలం నిర్వపేత్సనుమానయోః పురోఽభిద్రుహ్య సంవత్సరో అగ్నిర్వైశ్వానరః సంవత్సరమేవాఽఽప్త్వా నిర్వరుణమ్॥

౧ ఒండొరుల మారణమునందుద్యుక్తులయిన యిద్దరు పాపుల యన్నము నెవఁడు భుజించుచున్నాఁడో వారిద్దఱు వానియందు తమపాపమును సంక్రమింపఁ జేయుచున్నారు. అట్టి పాపుల యన్నమును భుజించి (నచో॥) వైశ్వానరాగ్ని దేవతాకము, పండ్రెండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. సంవత్సరాభిమానదేవతయే వైశ్వానరాగ్ని. సంవత్సరదేవునిచే భుజింపఁబడిన యన్నమునే (ఇట్టియజమానుఁడు)భుజించుచున్నాఁడు. (ఆపాపులప్పుడీ) యజమానుని యందుఁ బాపమును సంక్రమింపఁజేయుట లేదు. ౨ ఏపురుషులు సంవత్సరదేవుని సాక్షినిగాఁ జేసికొని (పరస్పరము బాధకలుగ కుండుటకై) శపథమునుఁ జేసికొందురో, (ఒట్టుఁబెట్టుకొందురో, అని తా॥) వారిలో నెవఁడు మొదట ద్రోహముఁ జేయునో, వారిని వరుణుఁడుగ్రహించుచున్నాఁడు. (అనగా రోగముకలుగునని తా॥) ప్రతిజ్ఞచేసిన వారిలో మొదటివాఁడు వైశ్వానరాగ్ని దేవతాకము పండ్రెండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. వైశ్వానరాగ్ని సంవత్సరాభిమాన దేవతయే (కావున నట్టి యజమానుఁడు) రోగనివారకుఁడయిన సంవత్సర దేవునేపొంది, (ఆతనిబలముతోఁ గూడుకొనినవాఁడై) పిమ్మట తనకష్టమును నివారించు కొనుచున్నాఁడు. ఇయ్యజమానుని రోగము బాధింపదు.

## పంచాశత్తు ౩.

౪౩౭. పరస్తాదభి ద్రుహ్యతినైనం వరుణో గృహ్ణాత్యా ౧ వ్యం పాపస్య ప్రతిగృహ్ణాతి

యోఽవిం ప్రతిగృహ్ణాతి వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేదవిం ప్రతిగృహ్య సంవత్సరో వా అగ్నిర్వైశ్వానరః సంవత్సరస్వదితామేవ ప్రతిగృహ్ణాతి నాఽఽవ్యం ప్రతిగృహ్ణాత్యా ౨ త్మనో వా ఏష మాత్రామాప్నోతి య ఉభయాదత్ప్రతిగృహ్ణాత్యశ్వం వా పురుషం వా వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేదుభయాదత్ ॥

౧ ఎవఁడు గొఱ్ఱెను ప్రతిగ్రహించు (దానముచేసిన దానినిఁ దీసికొను)చున్నాఁడో, వీఁడు శ్లేష్మరోగమును బొందుచున్నాఁడు. (కావున) గొఱ్ఱెను ప్రతిగ్రహించి (నచో) వైశ్వానరాగ్ని దేవతాకము పండ్రెండు కపాలములందు సంస్కృతమునగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. సంవత్సరాభిమాన దేవతయే వైశ్వానరాగ్ని. కావున నీయిష్టి నాచరించిన యజమానుఁడు సంవత్సర దేవునిచే నిర్దోషముగాఁ జేయఁబడినదానినే ప్రతిగ్రహించుచున్నాఁడు. (పూర్వోక్త పాపమును గ్రహించుట లేదు. ౨ రెండు వైపులందు దంతములుకల గుఱ్ఱమును కాని, పురుషునిగాని, యెవఁడు ప్రతిగ్రహించునో, వీఁడు తనయాత్మయొక్క హింసను బొందుచున్నాఁడు. ఇట్టి యుభయభాగములందు దంతములుకల ప్రాణిని ప్రతిగ్రహించి (నచో) పూర్వోక్త పురోడాశమును నిర్వాపము సేయవలయును. సంవత్సరాభిమాన దేవతయే వైశ్వానరాగ్ని. కావున నీయజమానుఁడు సంవత్సరదేవునిచే నిర్దోషునిగాఁ జేయఁబడిన పురుషుని-లేక-గుఱ్ఱమును బొందుచున్నాఁడు. ఆత్మహింస నొందుట లేదు.

పంచాశత్తు ౪

౪౩౭. ప్రతిగృహ్య సంవత్సరో వా అగ్నిర్వైశ్వానరః సంవత్సరస్వదితమేవ ప్రతి

గృహ్ణాతినాఽఽత్మనోమాత్రామాప్నోతి ౨ వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్సనిమేష్యన్త్సం వత్సరోవాఅగ్నిర్వైశ్వానరోయదాఖలువై సంవత్సరం జనతాయాం చరత్యథసధనార్ఘోభవతి యద్వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపతిసంవత్సరసాతామేవసనిమభిప్రచ్యవతే దానకామాఅస్మై ప్రజాభవన్తి 3 యోవై సంవత్సరమ్॥

౧ దీనియర్థము పై పంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ధనముఁబొ దనిచ్ఛయించువాఁడై యజమానుఁడు పూర్వోక్త పురోడాశమును నిర్వాపము సేయవలయును. సంవత్సరాభిమాన దేవతయే వైశ్వానరాగ్ని. (లోకమునం) దే యాచకుఁడు దాతలసముదాయమునందు సంవత్సర కాలముండునో, వాఁడుధనసమృద్ధి కలవాఁడగుచున్నాఁడు. పూర్వోక్త పురోడాశమును నిర్వాపము చేసినచో సంవత్సరదేవునిచే నివ్వఁబడినదియే యగుధనము నొందుచున్నాఁడు. ఇతనికి దానముచేయు స్వభావము కల సంతానములు కలుగుచున్నవి. : దీనియర్థము ౫౨ పంచాశత్తులో జేర్చివ్రాయఁబడును.

పఞ్చాశత్తు ౫౧

౪౬౯. ౧ ప్రయుజ్యనవిముఞ్చత్య ప్రతిష్ఠానోవైసభవత్యేతమేవ వైశ్వానరం పునరాగత్య నిర్వపేద్యమేవ ప్రయుఙ్క్తే తంభాగధేయేన విముఞ్చతిప్రతిష్ఠి

త్యై ౨ యద్యూరజ్వోత్తమాం గామాజేత్తాం భ్రాతృవ్యాయ ప్రహిణు

యాన్నిర్బుతిమేవాస్మై ప్రహిణోతి ॥

౧ ఏయజమానుఁడు (ధనలాభముపక్తై) సంవత్సర రూప వైశ్వానరాగ్నిని బ్రతిష్ఠాపనము చేసి (ఇష్టిచే నారాధించి ధనమునొందిన పిమ్మట మఱలఁబురోడాశ భాగము) నొసఁగఁడో వాఁడు ప్రతిష్ఠ లేనివాఁడగుచున్నాఁడు. (అట్టి యజమానుండు ధనము నొందినపిమ్మట దాతృసముదాయమునుండి తనయింటికి) మఱల వచ్చి పూర్వోక్తమయిన పురోడాశము నిర్వాపము చేయవలయును. (ఇట్లుమఱల నిర్వాపముచేసిన యజమానుఁడు ప్రథమమున) ఏయగ్నినిఁ బ్రతిష్ఠాపనము చేసినాఁడో, ఆయగ్నిని (మఱలనిచ్చినహవి) ర్భాగముచే స్వప్రతిష్ఠకొఱకు విడచుచున్నాఁడు. ౨ (దాతలవలనఁ బొందఁబడిన గోవులలో) నుత్తమమయిన గోవు నేత్రాటిచే బంధించి తీసుకొని వచ్చుచున్నాఁడో, ఆత్రాటిని శత్రువినాశముకొఱకు (ఆగోశాలయందే) ఉంచవలయును. (అటులఁ జేయఁగా నాయజమానుఁడు) శత్రువుకొఱకు దారిద్ర్యరూపరాక్షసుచే పంపుచున్నాఁడు.

షష్ఠానువాకము సమాప్తము.



అనువాకము ౭.

౨౪౦. ఐన్ద్రం చరుం నిర్వపేత్పశుకామ ఐన్ద్రా వై పశవ ఇన్ద్రమేవ స్వేన భాగధేయే నోపధావతి స వా అస్మై పశూన్ప్రయచ్ఛతి పశుమానేవ భవతి ౨ చరుర్భవతి స్వాదేవాస్మై యోనేః పశూన్ప్రజనయతి ౩ ఇన్ద్రాయేన్ద్రియావతే

పురోడాశమేకాదశకపాలం నిర్వపేత్పశుకామఇన్ద్రియం వైపశవ ఇన్ద్రమేవేం
ద్రియావన్తగ్ం స్వేనభాగధేయేనోపధావతిసః

౧ పశువులను కోరునట్టి పురుషుఁడు ఇంద్రదేవతాకమయిన చరువును నిర్వాపము చేయవలయును. పశువులింద్ర సంబంధములయినవి (ఇంద్రస్వామికములని తా) (ఇట్టి యజమానుఁడు) తానింద్రున కిచ్చిన హవిర్భాగముచేత నింద్రునే పొందుచున్నాఁడు ౼ యింద్రుఁడే యీ యజమానుని కొఱకుఁ బశువులనిచ్చుచున్నాఁడు. (అప్పుఁడు యజమానుఁడు) పశువులు కలవాఁడే యగుచున్నాఁడు. ౨ (ఈయిష్టియందు) చరువు విధేయమగు చున్నది. (ఇంద్రుఁడే) యజమానుని కొఱకుఁ పశువులకుఁ గారణ మగు చరువునుండియే పశువులనుఁ బుట్టించు చున్నాఁడు. (వాజపేయక్రతువు నందు నీవారధాన్య సంబంధ మయిన చరువును గుఱ్ఱములచే వాసన చూపింతురు కావునను, అశ్వమేధక్రతువునందు గుఱ్ఱముచేనన్నము తినుపింతురు కావునను, అభక్షితమయినయన్నము పుట్టఁబోవుగుఱ్ఱములకు రేతోరూపముగాఁ గారణమగుచున్నది, కనుకచరువిచ్చుట పశువులఁబుట్టించునదిగా వర్ణింపఁబడినది. 3 పశువులనుఁగోరు వాఁడు గొప్పబలముగల్గిన యింద్రునికొఱకుఁబదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపముచేయవలయును. ఇంద్రియమేపశువులు. (నేయి-పాలు, మొదలగువాటిచే నింద్రియమును వృద్ధినిఁ చేయుచున్నవి. కావునపశువులు ఇంద్రియరూపముగా వర్ణింపఁబడినవి.) ఈ యాగకర్త తానిచ్చిన హవిర్భాగముతో నింద్రియవృద్ధిని బొందుచున్నాడు. (ఇంద్రియవంతమ్=గొప్పబలముకలవాఁడు.)

పంచాశత్తు ౨.

౪౪౧. ఐవాన్నాఇన్ద్రియం పశూన్ప్రియచ్ఛతి పశుమానేవభవతి ౧. ద్వాదియఘుర్న

వతే పురోడాశమేకాదశకపాలం నిర్వపేద్బ్రహ్మవర్చసకామో బ్రహ్మవర్చసం వై ఘర్మఇన్ద్రమేవఘర్మవన్తగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మిన్బ్రహ్మవర్చసందధాతి బ్రహ్మవర్చస్యేవభవతి ౨ ఇన్ద్రాయార్కవతే పురోడాశమేకాదశకపాలం నిర్వపేదన్నకామోఽర్కోవై దేవానామన్నమిన్ద్రమేవార్కవన్తగ్ం స్వేనభాగధేయేన॥

౧ (వేదశాస్త్రాదులవల్లఁగలిగిన) బ్రహ్మతేజస్సుగల యింద్రునికొఱకు బ్రహ్మవర్చస్సును గోరుపురుషుఁడు పదునొకండుకపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము సేయవలయును. (వేదశాస్త్రాదులవల్లఁగలిగిన బ్రహ్మవర్చస్సే ఘర్మశబ్దార్థము. (ఈ యిష్టినాచరించిన పురుషుఁడు) తానిచ్చిన పురోడాశభాగముచే బ్రహ్మతేజోవంతుఁడగు నింద్రునిఁబొందుచున్నాఁడు. ఆయింద్రుఁడే యీ యజమానునియందు బ్రహ్మతేజస్సునుంచుచున్నాఁడు. (అప్పుఁడు యాగకర్త) బ్రహ్మవర్చస్వియగుచున్నాఁడు. ౨ అన్నమునుఁగోరు పురుషుఁడు అన్నవంతుఁడగు నింద్రునికొఱకు పదనొకండుకపాలములందు సంస్కృతమగుపురోడాశమును నిర్వాపముచేయవలయును. అర్కశబ్దార్థమే దేవతలకన్నము. (ఇట్టి యాగకర్త) అన్నవంతుఁడయిన యింద్రుని తానిచ్చినహవిర్భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆ యింద్రుఁడే యీ యజమానుని కొఱకన్నము నిచ్చుచున్నాఁడు. (అప్పుఁడుయజమానుఁడు) అన్నాదుఁడగుచున్నాఁడు. (అన్నాదుఁడు=అన్నముతినువాఁడు.)

పఞ్చాశత్తు ౩

౪౪౨. ఉపధావతి సఏవాస్మాఅన్నం ప్రయచ్ఛత్యన్నాదఏవభవత్ ౨ ఇన్ద్రాయ

ఘర్మవతే పురోడాశమేకాదశకపాలం నిర్వపేదిన్ద్రాయేన్ద్రియావత ఇన్ద్రా
యార్కవతే భూతికామో యదిన్ద్రాయ ఘర్మవతే నిర్వపతి శిర ఏవాస్య తేన
కరోతి యదిన్ద్రాయేన్ద్రియావత ఆత్మాన మేవాస్య తేన కరోతి యదిన్ద్రా
యార్కవతే భూత ఏవాన్నాద్యే ప్రతితిష్ఠతి భవత్యేవే ౩ న్ద్రాయ॥

౧ దీనియర్థము పైపంచాశత్తులో వ్రాయఁబడినది. ౨ ఐశ్వర్యమునుఁగోరు పురుషుఁడు బ్రహ్మతేజోయుక్తుఁడగు నింద్రునికొఱకుఁ బదునొకండు కపాలములందు సంస్కృతమగు పురోడాశమును నిర్వాపము చేయవలయును. (ఇట్లే) ఇంద్రియవన్తుఁడగు నింద్రునికొఱకును, అన్నవన్తుఁడగు నింద్రునికొఱకును, పూర్వోక్తపురోడాశమును నిర్వాపము సేయవలెను. బ్రహ్మవర్చస్వియగు నింద్రునికొఱకే పురోడాశము నిర్వాపము చేయఁబడినదో, ఆనిర్వాపముచే (నధ్వర్యుఁడీ) యజమానుని శిరస్సును (జేయుచున్నాఁడు. (అనఁగా ఐశ్వర్యాదులచే సభయందు తలయెత్తుకొని తిరుగునట్లు చేయుచున్నాఁడని భావము.) ఇంద్రియవన్తుఁడయిన యింద్రునికొఱకే హవిస్సు నిర్వాపము చేయఁబడినదో, ఆనిర్వాపముచే (నధ్వర్యుఁడీ) యజమానుని యాత్మను (దృఢశరీరముకలవానినిగాఁ) జేయుచున్నాఁడు. అన్నవన్తుఁడగు నింద్రునికొఱకే పురోడాశము నిర్వాపము చేయఁబడినదో, ఆనిర్వాపముచే (యజమానుఁడైశ్వర్యమునుఁ) బొందుచు దినుటకు యోగ్యమయిన యన్నమునందుఁ బ్రతిష్ఠితుఁడగుచున్నాఁడు. ౩ ఈ పదము ౪వపంచాశత్తులోని ౧వవాక్యముతోఁ జేర్చి వివరింపబడును.

## పంచాశత్తు ౪

౪౩. అగ్నయే౽ంహోముచే పురోడాశమేకాదశకపాలం నిర్వపేద్యః పాప్మనా

తః స్యాత్పాప్మనావా అగ్ం హసేన్ద్రమేవాగ్ం హోముచగ్ం స్వేనభాగధే

యేనోపధావతి సఏవైనం పాప్మనోఽగ్ం హసోముఞ్చతీ న్ద్రాయవైమృధా

యపురోడాశమేకాదశకపాలం నిర్వపేద్యంమృధోఽభిప్రవేపేరన్ రాష్ట్రాణివా

భిసమియు రిన్ద్రమేవవైమృధగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవాస్మా

న్మృధః॥

౧ ఏపురుషుఁడు పాపముచే గ్రహింపఁబడునో (పాపియగునో, అనితా॥) ఆపురుషుఁడు పాపమును బోఁగొట్టునట్టి యింద్రునికొఱకుఁ బూర్వోక్తపురోడాశమును నిర్వాపము చేయవలయును. నరకహేతువు నిషిద్ధకర్మనాచరించుటవలన వచ్చినదియునగు పాపమే అంహస్సు. (అంహః పదమునకర్థమనితా॥) (ఇట్టి యిష్టికర్త) పాపమునుఁ బోఁగొట్టునట్టి యింద్రునే తానిచ్చినపురోడాశభాగముచేఁ బొందుచున్నాఁడు. ఆయింద్రుఁడే యీయజమానునత్యధికమయిన పాపమునుండి విడిపించుచున్నాఁడు. ౨ ఏపురుషుని శత్రువులు బాగుగా భయపెట్టుదురో, లేక దేశములంతటను నాశనము చేయుటకు సన్నద్ధులగుదురో, ఆ పురుషుఁడు శత్రునాశకుఁడగు నింద్రునికొఱకుఁ బూర్వోక్తపురోడాశమును నిర్వాపము చేయవలయును. (అప్పుఁడీయజమానుఁడు తానిచ్చిన హవిర్భాగముచే శత్రునాశకుఁడగు నింద్రునే పొందుచున్నాఁడు. ఆ యింద్రుఁడే యీ యజమానునినుండి శత్రువులనుఁ బోఁగొట్టుచున్నాఁడు (నశింపఁ జేయుచున్నాఁడని తా॥)

పంచాశత్తు ౫

౪౪౪. అపహన్తి ౧ ఇన్ద్రాయత్రాత్రే పురోడాశమేకాదశకపాలం నిర్వపేద్బద్ధో

వా పరియత్తో వేన్ద్రమేవత్రాతారగ్ం స్వేనభాగధేయేనోపధావతి సఏవై

సం త్రాయత ౨ ఇన్ద్రా యార్కాశ్వమేధవతే పురోడాశమేకాదశకపాలం

నిర్వపేద్యం మహాయజ్ఞో నోపనమేదేతే వై మహాయజ్ఞస్యాన్త్యే తనూ యద

ర్కాశ్వమేధావిన్ద్రమేవార్కాశ్వమేధవన్తగ్ం స్వేనభాగధేయేనోపధావతి

సఏవాస్మా అన్తతో మహాయజ్ఞం చ్యావయత్యుపైనం మహాయజ్ఞో

నమతి॥

౧ ఎవఁడు సంకెళ్లచే బద్ధుఁడుకాని, భటులచేనడ్డగింపఁ బడినవాఁడుకాని యగునో, వాఁడు రక్షకుఁడగు నింద్రునికొఱకుఁ బూర్వోక్త పురోడాశమును నిర్వాపము సేయవలయును. (అప్పుడు) తానిచ్చినపురోడాశ భాగముచే నింద్రునే పొందుచున్నాఁడు, ఆ యింద్రుఁడే యీ యజమానుని రక్షించుచున్నాఁడు. ౨ మహాయజ్ఞము (అశ్వమేధముకాని, లేక రాజసూయముకాని, అని తా॥) ఏయజమానునిపొందదో ఆతఁడు అగ్నిసూర్యులుకల యింద్రునికొఱకుఁ బూర్వోక్తపురోడాశమును నిర్వాపము చేయవలయును. అగ్నిసూర్యులెవరుకఁరో, వీరే పూర్వోక్తమగు మహాయజ్ఞమునకు (ప్రారంభ=సమాప్తులందుండు) శరీరములు. (అనఁగా అగ్ని ప్రారంభము నందుండునది. సూర్యుఁడు ఫలరూపుఁడుగా సమాప్తియందుండునని తా॥) (ఇట్టి యిష్టినాచరించినవాఁడు అగ్న్యాదిత్యులస్వామియగు నింద్రునిఁ దానిచ్చినహవిర్భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆయింద్రుఁడేయీయజమానుని సమీపమునందు మహాయజ్ఞమునుఁ బ్రేరణచేయుచున్నాఁడు. ఆమహాయజ్ఞమీయజమానుని బొందుచున్నది, (అర్కః=అశ్వమేధయజ్ఞమునకు సాధనమయినయగ్ని, అశ్వమేధః=ఆక్రతువునకు ఫలమగు నాదిత్యుఁడు. అర్కాశ్వమేధవతే=ఇట్టి యగ్న్యాదిత్యులకు స్వామి యగుని భావము)

ఇట్లు కృష్ణయజుర్వేదమునందు ద్వితీయాష్టకము ద్వితీయ ప్రపాఠకమునందు సప్తమానువాకము సమాప్తము.

—*—

సం త్రాయత ౨ ఇన్ద్రాయార్కాశ్వమేధవతే పురోడాశమేకాదశకపాలం

నిర్వపేద్యం మహాయజ్ఞో నోపనమేదేతే వై మహాయజ్ఞస్యాన్త్యే తనూ య

దర్కాశ్వమేధావిన్ద్రమేవార్కాశ్వమేధవన్తగ్ం స్వేనభాగధేయేనోపధావతి

స ఏవాస్మా అన్తతో మహాయజ్ఞం చ్యావయత్యుపైనం మహాయజ్ఞో

నమతి॥

౧ ఎవఁడు సంకెళ్లచే బద్ధుఁడుకాని, భటులచేనడ్డగింపఁ బడినవాఁడుకాని యగునో, వాఁడు రక్షకుఁడగు నింద్రునికొఱకుఁ బూర్వోక్త పురోడాశమును నిర్వాపము సేయవలయును. (అప్పుడు) తానిచ్చినపురోడాశ భాగముచే నింద్రునే పొందు చున్నాఁడు, ఆ యింద్రుఁడే యీ యజమానుని రక్షించుచున్నాఁడు. ౨ మహాయజ్ఞము (అశ్వమేధముకాని, లేక రాజసూయముకాని, అని తా॥) ఏయజమానునిపొందదో ఆతఁడు అగ్నిసూర్యులుకల యింద్రునికొఱకుఁ బూర్వోక్తపురోడాశమును నిర్వాపము చేయవలయును. అగ్ని సూర్యులెవరుకలరో, వీరే పూర్వోక్తమగు మహాయజ్ఞమునకు (ప్రారంభ=సమాప్తులందుండు) శరీరములు. (అనఁగా అగ్ని ప్రారంభమునందుండునది. సూర్యుఁడు ఫలరూపుఁడుగా సమాప్తియందుండునని తా-) (ఇట్టి యిష్టినాచరించినవాఁడు అగ్న్యాదిత్యులస్వామియగు నింద్రునిఁ దానిచ్చినహవిర్భాగముచేఁ బొందుచున్నాఁడు. ఆయింద్రుఁడేయీయజమానుని సమీపమునందు మహాయజ్ఞమునుఁ బ్రేరణచేయుచున్నాఁడు. ఆమహాయజ్ఞమీయజమానుని బొందుచున్నది, (అర్కః=అశ్వమేధయజ్ఞమునకు సాధనమయినయగ్ని, అశ్వమేధః=ఆక్రతువునకు ఫలమగు నాదిత్యుఁడు. అర్కాశ్వమేధవతే=ఇట్టి యగ్న్యాదిత్యులకు స్వామి యగుని భావము)

ఇట్లు కృష్ణయజుర్వేదము నందు ద్వితీయాష్టకము ద్వితీయ ప్రపాఠకమునందు సప్తమానువాకము సమాప్తము.

— * —